# సాహితీ వైజయంతి

(ప్రసిద్ధ రచయితల ప్రశస్త వ్యాస సంపుటి)



సంపాదకుడు

**అక్కిరాజు రమాపతిరావు**

ప్రచురణ

**అజో-విభొ పబ్లికేషన్స్**

# సాహితీ వైజయంతి

( ప్రసిద్ధ రచయితల ప్రశస్త వ్యాస సంపుటి )

సంపాదకుడు

**అక్కిరాజు రమాపతిరావు**



AJO-VIBHO Publications
1-9-286/3, Vidyanagar
Hyderabad-500 044.

# సాహితీ వైజయంతి

(ప్రసిద్ధ వ్యాస రచయితల ప్రశస్త వ్యాస సంపుటి)

సంపాదకుడు: అక్కిరాజు రమాపతిరావు

ముఖచిత్రం: 'భావాంబర వీధి విశ్రుత విహారి భారతి'

ప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ కొండపల్లి శేషగిరిరావు

ప్రధమ ప్రచురణ: జనవరి, 2003

ప్రతులు: వెయ్యి (1000)

పుటలు: 400 మూల్యం: 200

డి.టి.పి: శ్రీరామా గ్రాఫిక్స్

డి.టి.పి ఆపరేటర్స్: భాస్కర్ రావు, రాజేశ్వర్ రావు

ముద్రణ: కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, విద్యానగర్, హైదరాబాదు - 500 044.

*For Copies.*
Visalandhra Book H0ouse, Bank Street, Hyderabad & Other Branches
Navodaya Publishers, Governorpet, Vijayawada
Navodaya Book House,Opp Arya Samaj Mandir,
Badi Chowdi, Hyderabad.
Navayuga Book House ,Sultan Bazar, Hyderabad.
Vahini Book Trust, 1-9-286/3, Vidyanagar, Hyderabad - 500 044



ప్రచురణ: అజో-విభో ప్రచురణలు

1-9-286/3, విద్యానగర్ (రాంనగర్ గుండుదగ్గర)

హైదరాబాదు-500 044.

# అజో-విభో ప్రచురణలు

పుస్తక ప్రచురణ సంస్థలలో, వ్యవస్థలలో మన సంస్కృతి- సంప్రదాయాలను; ఆధునికతను, సామాజికాదర్శాలను; ఈ రెండింటినీ రెండు కళ్ళుగా చేసుకునే, చూసుకునే ప్రచురణ సంస్థ ఇప్పుడు తెలుగు వారికి ఒక్కటీ కూడా లేదు ఇది ఎంత విచారకరం!

నిన్న నుంచి నేడు ఉద్భవిస్తుంది. నేటి నుంచి రేపు ఉద్గమిస్తుంది. మన తాతతండ్రులు మనకు సొత్తునో, ఆస్తినో, సువ్యవస్థనో ఆశించి అందుకోసం ఏర్పాటు చేసి ఉంటే వాళ్ళ పట్ల ద్రోహబుద్ధితో ప్రవర్తించడం తప్పుకదా! మన తాత తండ్రులు మనంత నాగరకులు కారనుకోవడం, విజ్ఞానులు కారనుకోవడం మన అవివేకం.

ఏ దేశానికైనా, ఏ జాతికైనా, ఏ భాషా సాహిత్యాలకైనా పరంపరాయాతమైన కొన్ని విశ్వాసాలు, ఒక జీవన విధానం, కొన్ని విలువలు, కొన్ని ఆదర్శాలు, కొన్ని ఆశయాలు ఉంటాయి. అవి ఏమిటో, సమాజానికి అవి ఎంతవరకు ప్రయోజనమో, ఎంతవరకు ఆటంకమో తెలుసుకోకుండా గతాన్ని నిరసించకూడదు. దానిని వర్తమానా వసరాలకు తగినట్లు జీవన పద్ధతులకు ఒద్దికగా దిద్దుకోవాలి. ఈ శతాబ్ది ప్రారంభమే, సహస్రాబ్ది ఆగమనమే, గొప్ప ఆశలతో, ఆకర్షణలతో, ఆగామి శుభాపాదక శాంతి సుఖ సాధ్య వాగ్దానాలతో మన ముంగిట వచ్చి నిలిచాయి. అయినా ఆందోళనకరమైన పరిస్థి తులు, అసహనం, అశాంతి, క్రౌర్యం, హింస ప్రపంచ వ్యాప్తంగాను, మన దేశంలోనూ తమ పొడుగు నీడలను ప్రసరింప చేస్తూనే ఉన్నాయి. కాబట్టి మన యువతరం, మన విద్యారంగం, మన పౌరజీవనం, మన కుటుంబ జీవనం, మన ఉత్సాహోల్లాసాలు, ఏ విధంగా ఆదర్శీకరించుకోవాలో మనం గాఢంగా సమాలోచనలు చేయవలసిన సమయమిది.

స్వాతంత్ర్యానంతరం దేశ సర్వతోముఖ ప్రగతిని ఆశించాం. కాని స్వాతంత్ర్య స్వర్ణజయంతి జరుపుకున్న తర్వాత కూడా ఆశలు అడియాసలైనాయి. ఎన్నో పెను సవాళ్ళను ఎదుర్కోవలసి వస్తున్నది. రాజకీయ వివిధ పక్షాల మధ్య కీచులాటలు, సిద్ధాంత సంఘర్షణలు, పేదరికం; ప్రజలందరికీ విద్యా, ఉద్యోగావకాశాలలో అసమానతలు, భీతావహమైన అవినీతి, మంచిమాట కరువు, మంచి నీటి కరవు, దేశాన్ని బాధ పెడుతున్నాయి. ధర్మం బోధించగల పెద్దలు, హితవునుపదేశించగల సమర్థులు ఉపేక్షా

నిస్సహాయులుగా ఉన్నారేమో తెలియదు.

కాబట్టి ప్రజలలో ఇంకోసారి సాంస్కృతిక అవగాహన ప్రబోధితం కావాలి. ప్రచోదితం కావాలి. ఈ పని పుస్తకాపేక్షితం కాక అన్యసాధనాల వల్ల జరగ నేరదు కదా! ప్రసారమాధ్యాలు ఈ తక్షణ కర్తవ్యాన్ని సమర్థంగా నిర్వహించే సవాలును స్వీకరిస్తున్నట్లుగా కనపడదు. స్వచ్ఛంద సేవాసంస్థలు కూడా ఇందు కోసం ఆర్తితో పూనుకోవడం లేదు. అందువల్ల నిన్నటి మంచి ఏమిటో, రేపటి ప్రాప్యం ఏమిటో, తెలిపే పుస్తకాలు తేవాలని, అజో-విభొ అభిలాష. పుస్తక పఠనాభిలాషులలో ఉత్తమాభి రుచులను ప్రోది చేయాలని ఆకాంక్ష. దేశంలో ఎంత సంపద ఉన్నా, కట్టుదిట్టమైన వ్యవస్థ ఉన్నా, మానవ వనరులపైనే ఆ దేశపు పతిష్ఠత ఆధారపడి ఉంటుంది. ఆ చైతన్యశక్తితోనే వెయ్యేళ్ళనాటి అస్వాతంత్ర్యాన్ని ధిక్కరించి వదిలించుకున్నాము. ఆ స్వాతంత్ర్యాన్ని మరే దేశపు ధాష్టీకానికి, బెల్లింపులకు, బెదిరింపులకు, పన్నుగడలకు ఎరగాకుండా, లోనుగాకుండా బలంగా రక్షించు కోగలగాలి. ఇందుకు ముఖ్యంగా యువతరంలో భావోద్విగ్న ఐకమత్యం అవసరం.

సమాజంలోని అవాంఛనీయ శక్తులతో ఘర్షిస్తూనే సువాంఛనీయ సంప్ర దాయాలను బలంగా పెంపొందించుకోవలసి ఉంది. అందుకు పుస్తకాలు గొప్ప సాధనం. మంచి పుస్తకాలు ఎంతో అవసరం. ఇటువంటి మంచి పుస్తకాలు ప్రచురించడమే అజో-విభొ ధ్యేయం. భాషలో అభివ్యక్తిని, భావంలో సమాజానురక్తిని ప్రవర్తనలో దేశహితాన్ని పెంపొందింపజేసే పుస్తక పఠనం నేడెంతో అవసరం. ఈ దృష్ట్యానే సమాజాన్ని పట్టి పీడిస్తున్న రుజలను చూపి వాటిని అధిగమించే భావజాలాన్ని బోధించే నాటికలను ప్రదర్శింపజేస్తూ ఈ నాటికలను పుస్తక రూపంలో కూడా తేవడానికి పూనుకొన్నది అజో-విభొ. చేయవలసింది కొండంత. చేసింది, చేస్తున్నది ఇందుపగింజంత. అయితే నేం కలుషిత జలాన్ని శుభ్రం చేస్తుంది ఇందుపగింజ. మా ప్రచురణలకు తెలుగు పాఠకుల నుంచి ఇతోధిక ఆదరణ లభించగలదనే మా ఆశ్వాసం. విశ్వాసం. మా ఆశ.

**అజో-విభొ**



# ఈ వ్యాస తారావళి

తెలుగు సాహిత్య పరిణతి, ప్రౌఢి, గభీరత, అగాధత, ప్రగాఢత, తెలుగు సాహిత్యపు ఆధునికప్రక్రియ అయిన ఈ సాహితీ విభాగానికి 'వ్యాసం' అన్న పేరు పెట్టడమే తెలియజేస్తున్నది. భారతీయ భాషలలో ఏ భాషలోనూ ఈ ప్రక్రియకు ఈ పేరులేదు ఈ పేరు ఎవరికి ఎప్పుడు స్ఫురించిందో, ఎప్పుడు వ్యాప్తిలోకి ఎవరు తెచ్చారో, ఈ ప్రక్రియ సర్వ విజ్ఞానాన్ని సమర్ధంగా బోధించగలదన్న ఊహ ఎవరు చేశారో నికరంగా ప్రతిపాదించలేము.

అయితే నూట యాభై సంవత్సరాల నుంచి ఈ ప్రక్రియ కీ పేరు బాగుంటుందన్న ఆలోచనా, అప్పట్లో విరళంగానైనా వినియోగమూ కనపడుతుంది. ఇప్పుడిక ఈ ప్రక్రియకు పర్యాయపదం లేదు. 'స్థిరోభవ, వరదోభవ'లాగా నిలిచిపోయింది.

నూటయాభై ఏళ్ళనాటి బ్రౌన్ నిఘంటువులు, నూట ఎనిమిదేళ్ళ నాటి బహుజనపల్లివారి శబ్దరత్నాకరమూ 'వ్యాస'మనే పదాన్ని ప్రసక్తం చేసి ఈ పదం స్వరూప స్వభావాన్ని, పరిధిని నిర్వచించాయి. ఈ నిఘంటు నిర్వచనాలను బట్టి ఏం తెలుసుకోవచ్చునంటే విస్తరించి చెప్పవలసిన ఒక విషయాన్ని సంగ్రహ సాకల్యంగానూ, పర్యాప్తంగాను, ఉపక్రమోప సంహార సమన్వితితోనూ రూపొందించే రచన అని అర్థం చేసుకోవచ్చు. తెలియని విషయాన్ని తెలిసేట్లు చెప్పడం, తెలిసిన విషయాన్నే అయినా అందచందాలతో సూటిగా స్పష్టంగా సూత్రబద్ధంగా విన్యసింపచేయడం ఈ ప్రక్రియ లక్ష్యం.

ఈ రచన ప్రక్రియ రూపరేఖల విషయ వైఖరీ విన్యాసం, శాస్త్రీయత, కళాత్మకతల మేలుకలయిక. అంటే వ్యుత్పత్తి, ప్రతిభల సమాహారం. విషయ పరిజ్ఞానం, సృజనాత్మక ప్రతిభల సమ్యగ్ సమ్మేళనం. ఈ ప్రక్రియ శాస్త్రమూ, కళకూడాను. తక్కిన ప్రక్రియలు ఈ రెండింటిలో ఏదో ఒకటి ఆకర్షణీయంగా ఉంటే నెగ్గుకొని వస్తాయి. కాని 'వ్యాసం' ఉత్తమోత్తమ శ్రేణి రచనగా నిలవాలంటే శాస్త్ర నిబద్ధత, కళావిదగ్ధత కూడా ఆ రచనలో రాణించాలి.

'అసలు 'వ్యాస'మనే పేరే పరమోదార భారతీయ విజ్ఞాన సర్వస్వానికి ప్రతీకగా ఉంది. పరమ పూజ్యంగా ఉంది. తత్త్వచింతన పరంగా భాసిస్తున్నది. సుందరంగా, సురుచిరంగా, వాగర్థరమణీయంగా ఉంది. సమస్త భారతీయ వాఙ్మయం, సంస్కృతి, సృజన ప్రతిభ, జీవనా దర్శాలు ప్రతిష్ఠించినవాడు వ్యాసభగవానుడే. ఈయనతోనే వేదాలు పుట్టాయి. లేదా వేదాలతో ఈయన పుట్టాడు. వేదాలను విషయ విభాగ నిర్ణయం చేసి విశదపరచాడు కాబట్టి వేదవ్యాసుడైనాడాయన. వ్యాసించటమంటే విడమరచి చెప్పడం. చూపడం.

భూమ్యాకాశాల మధ్య క్షరాక్షరాత్మకమైన విజ్ఞానమంతా, సారస్వత మంతా వ్యాసోపదిష్టమే. 'విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతమ్ము' అని నన్నయ భట్టారకులవారు చెప్పినట్లే విశ్వవిజ్ఞానం లోకానుగ్రహీతం కావడం వ్యాసుల వారివల్లనే సంభవించింది. పద్దెనిమిది పురాణాలు, పద్దెనిమిది ఉపపురాణాలు వ్యాస భగవానుడే లోకాని కిచ్చి నట్లు భారతీయుల నమ్మకం. మనువులు, మన్వంతరాలు, కల్పాలు, సృష్టి చక్ర చలనం, చాలనం గూర్చిన యెరుక లోకానికి వ్యాస భగవానుడే అనుగ్రహించిందే.

భారతీయ విజ్ఞానానికి సూర్యుడు వ్యాసుడు. కవితా సంపత్తికి వేద్యుడు వాల్మీకి. ఆయన సారస్వత విహాయసంలో పున్నమి చంద్రుడు. ఇంత రమణీయ ప్రతిపాదకార్థం ఉంది, కమనీయమైన అవగాహన ఉంది 'వ్యాస'ం అని ఈ ప్రక్రియకు నామకరణం చేయడంలో. ఎవరు చేస్తే ఏమి? గిడుగు రామమూర్తి పంతులుగారొక సందర్భంగా ఇట్లా అన్నారు. 'మానవ జీవన వికాసంలో జ్ఞానం, విజ్ఞానగవేషణలో 'లిపి'సాధనాన్ని కనుక్కొన్నదెవరో తెలియదుకాని ఆ మహానుభావుడు ఎంత పూజ్యుడు?' అని.

తెలుగులో 'వ్యాసం' పుట్టుక ఈ విధంగా జరిగి ఉంటుందని ఊహించవచ్చు. సాహిత్య భాషగా తెలుగు రూపుదిద్దుకొన్న తొమ్మిది వందల ఏళ్ల తర్వాత ఈ ప్రక్రియ పుట్టింది. అసలు పూర్తి వచనకావ్య రచనే తెలుగులో ఆది కావ్యావిర్భావం తర్వాత ఐదారు వందల ఏళ్లకు గాని ఒక వ్యవస్థా స్వరూపం పొందలేదు. హృద్య పద్యానికి శ్రీకారం చుట్టినట్లే విశద రమ్యమైన వచన రచనకు కూడా ఆద్యుడు నన్నయ భట్టారకులవారే. ఆ తర్వాత వారిలా పద్యం రాయగలిగినవారు కనపడ నట్లే వచనం నిర్వహించగలవాళ్ళూ కూడా లేకపోయినారు. ఆంధ్ర మహాభారతం చంపూరచనగా రూపొందింది కాబట్టి తెలుగు గద్య పద్య హృద్య రచనకు నన్నయగారే ఆద్యులైనారు. అవిచ్ఛిన్నంగా నన్నయగారి వరవడే ఎనిమిది వందల ఏళ్ళు కొనసాగింది. పద్యమైతేనేం, గద్యమైతేనేం నన్నపార్యునిలా రాయగలిగినవాళ్ళు అప్పుడూ లేరు, ఇప్పుడూ లేరు.

పంథొమ్మిదో శతాబ్ది మూడు దశాబ్దాలు గడిచేసరికి తెలుగు వారికి కూడా ముద్రణ యంత్రాలు, అచ్చుపుస్తకాలు పరిచయమైనాయి. వాళ్ళు కూడా అచ్చులో తమ పుస్తకాలు చూసుకోవచ్చని మురిసిపోయినారు. ఇక ఎక్కడ లేని హడావుడి ప్రారంభమైంది. మొదట్లో చెన్నపట్నం వెళ్ళి తమ పుస్తకాలక్కడ అచ్చువేయించుకొనేవారు. ఆ తర్వాత కొద్దికాలానికే రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్నం, బందరు లాంటి చోట్ల ముద్రణాలయాలు వచ్చాయి తాటాకు పుస్తకాలు సేకరించే తాపత్రయం బయలుదేరింది. ఆ పుస్తకాలను అచ్చుకెక్కించాలని ఆరాటం. అందువల్ల ప్రసిద్ధ కవి, పండితుడు ప్రతివారున్నూ తమ సొంత పత్రిక ఒకటి పెట్టుకుని తమ దగ్గరున్న తాటాకు గ్రంథాలు ప్రకటించసాగారు. ఇందుకూ వరవడి పెట్టింది వీరేశలింగంపంతులుగారే. అప్పట్లో ఛత్రపురం నుంచి చిత్తూరు దాకా, బందరు నుంచి బళ్ళారిదాకా ప్రతి ఊరి నుంచి ఒక పత్రిక వచ్చేది.

తాటాకు గ్రంథాల నుంచి పత్రికలలో కావ్యాలు సంచికలు సంచికలుగా అచ్చు వేస్తూ వచ్చారు సరే! వాటిని పుస్తక రూపంగా తేవాలని, చూసుకోవాలని, మురిపంగా నలుగురికీ చూపుకోవాలనీ ఉబలాటం ఉండదా! మోజు ఉండదా? అదీ ప్రారంభమైంది. 1940లలోనే పురాణం హయగ్రీవ శాస్త్రిగారు భాగవతం అచ్చువేశారు. 1850లలోనే చిన్నయసూరి, రేకం రామానుజసూరి, కరాలపాటి రంగయ్య ప్రభృతులు భారతాన్నే అచ్చు వేశారు. ఇందుకోసం ప్రతి పండితుడూ, కాస్త ఉపపన్నుడైన ప్రతి కవీ ఒక ముద్రాలయం నెలకొల్పుకున్నాడు.

అప్పుడు పుట్టింది వ్యాసం. ఎట్లా?

తాటాకు గ్రంథాల నుంచి మిలమిల మెరిసే అక్షరాల అచ్చుకూర్పు పుస్తకాలు వెలువడజేస్తున్నప్పుడు ఆ గ్రంథం గొప్పతనం ఏమిటి? ఆ కవి ఎంత మహానుభావుడు? మహితాత్ముడు. ఆయన ఈ గ్రంథం ఎందుకు వ్రాశాడు? అసలాయన ఏకాలంవాడు? ఈ కావ్యంలో కథ ఏమిటి? ఆ మహనీయుడు దాన్ని ఎంత గొప్పగా నిర్వహించాడు? ఎవరికైనా తన కావ్యాన్ని అంకితమిచ్చాడా? ఆ రాజెటువంటివాడు? ఏ కాలంవాడు? అని ఇటువంటివన్నీ తమ తోటి పండితులకు, కవులకు తెలపాలనే ఉత్సుకతతో, ఉల్లాసంతో, ఉపజ్ఞతో ఈ విషయాలన్నీ పరిష్కర్త లకు, గ్రంథ ప్రకాశకులకు రాయవలసిన అగత్యం ఏర్పడింది? ఈ విషయాలు పద్యాలలో రాయకూడదుకదా! రాస్తే బాగుండదుకదా! అందు వల్ల వచనం వద్దికగా రాయాల్సి వచ్చింది. ఈ విధంగా ఉపోద్ఘాతం, పీఠిక, గ్రంథప్రశస్తి, కవికాలాదులు, అంటూ శీర్షికలు రూపుదిద్దు కున్నాయి. వ్యాస రచనావిర్భావం ఈ విధంగా

రూపుదిద్దుకొంది.

ఆ రోజుల్లో ఇవన్నీ పండితులకూ, కవులకేకదా! వాళ్ళ మధ్యనే కదా 'స్పర్ధయావర్ధతే విద్యా'?!, అప్పట్లో సాధారణ పాఠకులు తక్కువ. ఈ విధంగా మొట్టమొదట రోజుల్లో వెలువడ్డ పుస్తకాల గూర్చి తమ తమ పత్రికలలో పరస్పర విమర్శలు, ప్రశంసలు, సమీక్షలు, ఖండన మండనలు వెలువరచుకోవడం సహజమే. ఈ విధంగా వ్యాసం ప్రాచుర్యం పొందింది. క్రమక్రమంగా కొన్ని ప్రమాణాలు, ఇదమిత్థమైన రూపురేఖలు ఈ ప్రక్రియకు అగత్యమైనాయి. ఏంరాయాలన్నా, ఏం చెప్పాలన్నా, లోకవార్తలు, విజ్ఞాన విషయాలు, సమాజప్రబోధం, కవి పండితుల మాత్సర్యగ్రస పరస్పర కలహాలు, వ్యాసవే నిర్వహించవలసి వచ్చింది. తొలితరం తెలుగు పత్రికలవల్ల ఈ విషయం స్పష్టపడుతుంది. పత్రికలు బయలుదేరిన తర్వాత ఇంచుమించు అర్ధశతాబ్దంవరకు నూటికి తొంభై తొమ్మిది సాహిత్య పత్రికలే. కాబట్టి వ్యాసాలన్నీ సాహిత్య విషయకంగానే ఉండేవి

తెలుగులో మొట్టమొదటి వ్యాస సంకలనం లేదా సంపుటి నూట నలభై ఏళ్ళ కిందట వచ్చింది. దానిపేరు 'హితసూచని'. దీన్ని రచించిన వారు సామినేని ముద్దు నరసింహులునాయుడు. అప్పట్లో న్యాయ పరిపాలన శాఖలో వీరు ఉద్యోగి. ఈ వ్యాస సంపుటి పేరునుబట్టే ఇది సామాజిక ప్రబోధ విషయకమని తెలుస్తూనే ఉంది. సామినేని ముద్దు నరసింహులునాయుడుగారు గొప్పవారే. అందుకు సందేహం లేదు. కాని ఆయన్ను ప్రశంసించడంలో ముందు వెనుకలు చూసుకోకుండా ఆయన వీరేశలింగానికి స్ఫూర్తిప్రదాత అని, తెలుగు సాహిత్యంలో హేతువాద యుగం నరసింహులునాయుడుగారితోనే ప్రారంభమైందని కైవారాలు చేయటం పొరపాటు. చాలా భాగం తన రచనకు ఒక తమిళ గ్రంథం ఆధారమని ఆయనే చెప్పుకున్నా ముద్దువారి వీరాభిమానులు ఆ విషయం ఎవరికి తెలియబోయిందిలే అని వ్యవహరిస్తారు. ఏమైనా తెలుగులో వచ్చిన వ్యాస సంపుటులలో ఇదే మొదటిది. ఆశ్చర్యమేమంటే వ్యాసం సాహిత్య విషయకంగా మొదలైనా, సంపుటీకరణగా సామాజికం గా తొలుత ఆవిర్భవించింది.

ఇటు తర్వాత ఐదేళ్ళకు బెంగుళూరులో ఒక బాలికా పాఠశాల తెలుగు ఉపాధ్యాయుడు 'స్త్రీ కళా కల్లోలిని' అనే పేరుతో రెండు మూడు భాగాలుగా ఒక వ్యాస సంపుటిని ప్రకటించారు. పేరునుబట్టే మహిళా ప్రబోధ విషయకమైనవి ఈ వ్యాసాలని స్పష్టపడుతునే ఉన్నది. ఈ వ్యాస రచయిత పేరు జియ్యరు సూరి. దీన్నిబట్టి ఒక ఆశ్చర్యకరమైన విషయ మేమంటే చెన్నపట్నంలో చిన్నయసూరి, బెంగుళూరులో జియ్యరు సూరి తెలుగువారికి వచన రచనా

విశారదత్వానికి దారి చూపారన్న మాట. అప్పట్లో చెన్నపట్నంలోనూ, బెంగుళూరులోనూ కూడా తెలుగు తనానికి మన్నన సాగుతూనే ఉండేదన్నమాట. ఈ తన వ్యాసాలను వ్యాసాలుగా పేర్కొనక గ్రంధమన్నాడుట. 'ఎంతవరకొచ్చింది గ్రంథం, గ్రంథం విప్పకు, ఏమిటా ఉద్గ్రంధం, మహాగ్రంధసాంగుడివే లేవోయ్' అనే నుడికారాలకు అనుగుణంగా ఏదైనా ఒక విషయాన్ని నిర్ణయాత్మకం గా, వైశద్య స్ఫూర్తితో ప్రతిపాదించడాన్ని జియ్యర్‌సూరిగారు 'గ్రంధం'గా సంభావించి ఉండవచ్చు. అన్నట్లు తొలిదశలలో ఈ ప్రక్రియకు వ్యాసమనే పేరు అంత ప్రచురంకాదు. కాని నిఘంటువులలో వ్యాసమనే ప్రసక్తమైంది.

ఇక మరి ప్రసిద్ధ రచయితలు ఈ ప్రక్రియను మొదట్లో ఏమని వ్యవహరించేవారు? అంటే సామినేని ముద్దు నరసింహులునాయుడు గారు తన రచనను ప్రమేయమన్నాడు. ప్రమేయమంటే ఏమిటి? ఏదైనా ఒక విషయానికి సంబంధించిన భోగట్టా, జోక్యం, సమాచార నిర్ధారణ. తీర్పు. సంబంధిత విషయాల కూర్పు అని ఆయన భావించి ఉండవచ్చు. మరి ఆ కాలంలోనే పరవస్తు వేంకటరంగాచార్యులవారనే మహా పండితు లుండేవారు. సర్వతంత్ర స్వతంత్ర, మహామహోపాధ్యాయ, షడ్దర్శనీపారగ అని ఈ విద్వత్ప్రభువు బిరుదులు. వీరు ఆంధ్రదేశంలో ఆకాలంలో ఒక్క వెలుగు వెలిగారు. 1887వ సంవత్సరంలో విక్టోరియా మహారాణి తన గొప్ప అదృష్టానికి స్వర్ణోత్సవం జరుపుకుంటూ ఉండగా భారతదేశం లో లోకవిశ్రుతులైన పండితులను సత్కరించాలని ఆమెకు సద్బుద్ధి కలిగిందట. వారికి 'మహామహోపాధ్యాయ' అనే బిరుదివ్వాలనే ఘనత వహించిన బ్రిటీషు ప్రభుత్వంవారికి మనసైందట. అప్పుడు భారతదేశ మంతా విచారణ జరపగా బ్రిటీషు ప్రభుత్వంవారికి నలుగురు మహా మహులు లభించారు. అందులో పరవస్తు వేంకటరంగాచార్యుల వారు ఒకరు. ఆధునిక కాలాన తెలుగువారిలో వీరు మొట్టమొదటి మహా మహోపాధ్యాయులన్నమాట. ఏ రాజైనా, సంస్థానాధిపతి అయినా, పరమ సంపన్నుడైనా వీరిని సత్కరించాలని కోరితే సమ్మానస్థలిదాకా పల్లకిలోనే వెళ్ళడం ఈ మహానుభావుడి పాండిత్యాభిజాత్యం. ఆ షరతునంగీకరించిన వారే వారిని సత్కరించారు. తక్కినవారు, వారు సంస్థానాధిపతులైనా సరే, వారి దేవిడి ముందు, ప్రాసాద బహిప్రాంగణం ముందు వారు పల్లకి దిగేవారుకారుట. భారతీయ భాషలలో మొట్టమొదటిసారి విజ్ఞాన సర్వస్వ నిర్మితికి పూనిక వహించినవాడీ మహానుభావుడే. ఈ మహామహో పాధ్యాయుడు చక్కని తెలుగు వచన రచన చేసేవారు. ఉదార, విశాల సామాజిక సంస్కరణాభిముఖ్యభావాలు వెల్లడించేవారు. ఈ పండిత చక్రవర్తి వీరేశలింగం పంతులుగారికీ సంఘ సంస్కరణ భావాల మార్గదర్శి అంటే వీరి గొప్పతనం ఎటువంటిదో తెలుసుకోవచ్చు. అంతే కాదు. సకలాంధ్ర

దేశ విశ్రుత కవిలోక మూర్ధన్యులైన తిరుపతి వేంకట కవుల గురువులైన చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గురువరేణ్యులకు పరవస్తువారు గురువులు. శ్రీ రంగాచార్యులవారు మాకు పరమ గురువులని చెళ్ళపిళ్ళ వారు తమ కథలు - గాథలలో ప్రస్తావించారు.

ఇంతకూ ఈ మహానుభావుడు తెలుగులో వ్యాస రచయితల మొదటి తరంవారిలో ఒకరు. ఆ రోజుల్లోని పత్రికలలో కూడా వీరి వ్యాసాలు వెలువడుతుండేవి అయితే వీరీ ప్రక్రియను వ్యాసమని అనలేదు. అంటే శంఖున బోసిన తీర్థమే అయ్యేది. అప్పటి నుంచే అందరూ కళ్ళకద్దుకొని పుచ్చుకునేవారు. ఆయన ఏమన్నారూ ఇటువంటి రచనలను? 'సంగ్రహం' అన్నారు! అంటే ఎన్నో ఆకరాల నుంచి విషయాన్ని సంగ్రహించి చెప్పడం అని శ్రీవారి భావమై ఉండవచ్చు. తర్కసంగ్రహం మొదలైన వాడుక ఉందికదా! వీరు ఎంతటి మహాప్రతిభా ప్రజ్ఞానసంపన్నులు అంటే, మహావక్త అంటే, ఏదైనా ఒక విషయం గూర్చి ఉపన్యసించి తిరుగు లేకుండా తమ అభిమతాన్నో, మతాన్నో స్థాపించి చమత్కారం కోసం, వావదూకతా ప్రతిభ కోసం తద్విరుద్ధంగా మళ్ళీ ఎవరూ ప్రశ్నించటానికి కూడా లేకుండా ప్రతిపక్షం సిద్ధపరచేవారట. అదంతా విద్యావినోదం. అటువంటిది వారికే చెల్లింది. ఇంచుమించు నూరేళ్ళకు తక్కువగా జీవించి ఆ తరవాత శతాబ్దం తనను భరించలేదేమోనని వెళ్ళిపోయినారు వీరు.

ఆ తరవాత అధునిక తెలుగు వ్యాస రచన వ్యాసుడు కందుకూరి వీరేశలింగంపంతులు.

ఎవరి జన్మచేత ఆంధ్రదేశం భారతీయ స్మృతికర్తల పరంపరలో మరొకరిని చేర్చిందో, ఎవరి దివ్యసంస్మరణం చేత తెలుగువారి హృద యాలు ఉద్రేక, ఉద్వేగ, ఉత్సాహ, ఉత్తేజ, ఉల్లాసాలు పొందుతాయో, చైతన్యదీప్తిమంతమవుతాయో, ఆ మహనీయుడైన ఏ వీరేశలింగం తెలుగు వారికి రామమోహనరాయ్, ఈశ్వర్‌చంద్ర విద్యాసాగర్, మహదేవ గోవిందరానడేల మూర్తిత్రయాత్మకుడో ఆ వీరేశలింగం పరశ్శతంగా వ్యాసాలు తన పత్రికలలో ప్రకటించాడు. అయితే ఆయన కూడా మొదట్లో వీటిని వ్యాసాలనలేదు. ఉపన్యాసాలన్నాడు. ఏమంటే ఆయన రాసిందల్లా ఉపన్యసించేవాడు. ఉపన్యసించిందల్లా తన పత్రికలలో వెలువరించేవాడు. కాని తర్వాత తర్వాత ఈ ప్రక్రియా రచనను వ్యాసమనే ఆయన కూడా సంభావించాడు. వారిదిప్రబోధకశైలి. అప్పుడప్పుడు వడగండ్ల వానలా దడదడలాడవచ్చు. ఆయన రచనలన్నిటా విషయ వైశద్యమూ, విజ్ఞాన వైవిధ్యమూ కనపడతాయి. ఆయన చిట్టచివరి రచన కూడా వ్యాసమే. 1919వ సంవత్సరం ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో శ్రీ వీరేశలింగం పంతులు పోతన మహాకవి జన్మస్థల వివాదం గూర్చి

తన సంవాద రచన ప్రకటించాడు ఆ తర్వాత నెల తిరగకుండానే ఆయన పరమ పదించాడు

ఇరవయ్యో శతాబ్దం ఆగమించినప్పటి నుంచీ తెలుగువారి జీవన రంగాలన్నిటా బహుముఖ వికాసం ప్రవేశించింది. ముందు కృష్ణాపత్రిక, ఆ తర్వాత దేశాభిమాని, ఆంధ్రకేసరి (బహుశః తిలక్ మహాశయుడి కేసరి స్ఫూర్తినిచ్చి ఉంటుంది) పత్రికలు బయలుదేరాయి. ఇప్పటికి నూరేళ్ళ కిందటే శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారంతటి వేద పండితుడు, కవికులాలంకారుడు దినపత్రికను ప్రారంబించాడు (గౌతమి). ఇక ఆంధ్రపత్రిక వచ్చిన తరువాత తెలుగువారి దేశభక్తి, సామాజికావగాహన, సాంస్కృతిక, సాహిత్య, విద్యా, వైజ్ఞానిక, లలిత కళాసక్తి వ్యవస్థిత స్వరూపం పొందాయి. ఆంధ్ర దినపత్రిక ప్రారంభమైన రెండేళ్ళలోనే విజ్ఞాన సర్వస్వాలుగా ఉగాది సంచికలు వచ్చాయి. ఆపై పదిహేనేళ్ళకు భారతి బయలుదేరింది. ఇలాగే ఎన్నో పత్రికలు పందొమ్మిదో శతాబ్ది పూర్వార్ధంలో సారస్వత సేవ చేశాయి. అప్పట్లో వెలువడిన ఏ ప్రసిద్ధ పత్రిక చూసినా అందులో వ్యాసాలే ఎక్కువ ఉండేవి.

కవిత్వమో, నాటకమో, నవలో, చరిత్రో, దేనినిగూర్చి వివరించాలన్నా, విశదపరచాలన్నా అందుకు అనువైన రచన వ్యాసమేకదా! ఇక విమర్శ ప్రక్రియకు వ్యాసమే ఆలంబనం. ఈ విధంగా అనుకున్నప్పుడు ఇరవయ్యో శతాబ్దంలో కొన్ని వేల సంఖ్యలో వ్యాసాలు వెలువడి ఉండవచ్చు. ప్రధానం గా సాహిత్య పత్రికలైన త్రిలింగ, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ప్రబుద్ధాంధ్ర, రెడ్డిరాణి, ప్రతిభ, జయంతిలాంటి పత్రికలు ఎక్కువగా వ్యాసాలనే ప్రచురించేవి. బహుశః తక్కిన సృజనాత్మక ప్రక్రియల రచయితలందరికంటె సంఖ్యా బాహుళ్యంలో వ్యాస రచయితలే ఎక్కువ మంది ఉంటారు.

20వ శతాబ్ద తెలుగు సాహిత్య వికాసానికి 'వ్యాసం' నిర్వహించిన పాత్ర గొప్పది. చెప్పుకోదగిన వ్యాస రచయితలెందరో ఉన్నారు. ఒక 50 మందినైనా ప్రథమశ్రేణి గణ్యులైన వ్యాస రచయితలను పట్టికీ కరించవచ్చు. పందొమ్మిదో శతాబ్దంలో పుట్టి ఆ శతాబ్దంలో గొప్ప సారస్వత సేవచేసినవారిని మినహాయించి ఇరవయ్యో శతాబ్దిలో వ్యాస రచనకు ప్రథితులైనవారిలో శ్రీ తిరుపతి వేంకటకవులు, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, వేలూరి శివరామశాస్త్రి, విశ్వనాధ, నోరి, నిడదవోలు, మల్లంపల్లి, బందారు తమ్మయ్య, వేటూరి, భావరాజు వెంకటకృష్ణారావు, వంటి మహనీయులెందరో ఉన్నారు.

తెలుగు వ్యాసరచనకొక పరిణతినీ, ప్రామాణిక స్థాయినీ సమకూర్చిన వారు కొమర్రాజు వేంకటలక్ష్మణరావు. గిడుగు రామమూర్తిపంతులు సాహిత్య కృషి అంతా వ్యాసరూపమే.

అత్యంతాధునికులలో వ్యాస రచనకు పేరు పొందినవారు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు. తెలుగు వారికి తెలివిడికూర్చిన అత్యంత ప్రతిభావంతులైన వ్యాస రచయిత లెందరో ఉన్నారు. అవి సంపుటాలుగా వస్తే ఈతరంవారికీ, రాబోయే తరాలవారికీ ఎంతో విజ్ఞానదాయకాలు అవుతాయి.

నూరు నూట యాభై ఏళ్ళ తెలుగు వ్యాసం ఉద్భవ వికాసపరిణామ ప్రాతినిధ్యంగా నూరు చక్కటి వ్యాసాలనైనా ప్రచురించాలని అజో–విభొ ఫౌండేషన్ అభిలాష. ఆశయం. తహతహ. తమకం. అయితే ఇందుకు చాలా పరిశ్రమ, పరిశోధన అవసరమవుతాయి. అలాటి సంపుటాలే వస్తే గిస్తే అంతకన్న కావాల్సిందేముంది?

మానవల్లి రామకృష్ణ కవి నుంచి మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి వరకు 20వ శతాబ్దంలో వచ్చిన అత్యుత్తమ వ్యాసాలను శతాధిక సంఖ్యలో సంపుటీకరించాలనే ఫౌండేషన్ సంకల్పం. అయితే ఇప్పుడు ప్రచురిస్తున్న ఈ వ్యాస సంకలనం ఆ సరస్వతీ పూజలో అవసర నైవేద్యం వంటిది.

ఈ వ్యాస సంకలనానికి 'సాహితీ వైజయంతి' అని పేరు పెట్టడంలో ప్రాగల్భ్య సూచన ఏమీలేదు. ఈ వ్యాసాలు చదివినవారు ఈ పేరు అన్ని విధాలా అన్వర్థమని ఉల్లసిల్లుతారు. తెలుగులో వ్యాస రచన ప్రతిభ కిది ఒక దివ్యపతాక. వ్యాస విష్ణువక్షస్థల దివ్యశోభితాలంకారం. నూటికి నూరుపాళ్ళు ఇది వైజయంతి.

ఇందులో 27 వ్యాసాలున్నాయి. అందువల్ల చమత్కారంగా ఈ ఉపోద్ఘాతానికి 'వ్యాసతారావళి' అని పేరు పెట్టడం జరిగింది. భారతీయ సంస్కృతికి ఆకాశమే అన్నిటికీ ఆధారం. అంతేకాక 'శబ్దగుణ' మాకాశం కూడాను. కాలనిరూపణం, కాలం కొలమానం. కాలగణనం అన్నీ ఖగోళంపై ఆధారపడ్డవేకదా! అదీకాక తెలుగువారిది చాంద్రమాన పరిగణనం. దివోలోకమే భువిమానవులను నడుపుతున్నది, నడుపు తుంది అని భారతీయుల విశ్వాసం.

రోహిణి, ఆర్ద్ర, ధనిష్ఠ, జ్యేష్ఠ, స్వాతి, విశాఖ వంటి నక్షత్రాలు మనం ఇప్పుడు జీవించి ఉండే సౌరమండల అధిదేవత అయిన సూర్యుడి కన్నా ఊహించ లేనంత లక్షల లక్షల మైళ్ళ దూరంలో ఉన్నాయనీ, వాటి కాంతి భూమిమీద ప్రసరించటానికి కొన్ని వేల నక్షత్ర సంవత్సరాలు పడుతుందనీ, అటువంటి మహానక్షత్రాల ముందు మన మెరిగిన సూర్యుడు మన పిల్లలాడుకునే 'గోలీ'కి కూడా పోలడని 20వ శతాబ్ది భారతీయ జ్యోతిర్విద్యావేత్తలలో అగ్రగణ్యులైన శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు తమ 'చుక్కలసుద్ది' 'నక్షత్రాలు'

'జ్యోతిర్వేదం' వంటి గ్రంథాలలో బహురోచకంగా చెప్పారు. చిత్రపట సంశోభితంగా కూడా వివరించారు. తెలుగువారు చెప్పుకొని తమ గొప్ప భాగధేయంగా ఎంచుకోవలసిన మహామేధావులలో, అమేయ ప్రతిభాశాలురలో వేలూరి శివరామశాస్త్రి, కోట వేంకటాచలం, గొబ్బూరి వేంకటానందరాఘవరావు ముందుగా చెప్పవలసినవారని విశ్వనాథ సత్యనారాయణ గారనేవారట. ఈ తారతోరణంలో తారతమ్య స్థాయికమైన మహానక్షత్రాలు, మనకు దగ్గరైన మిలమిల మెరసే దివ్యకాంతి పరిశోభితాలైన నక్షత్రాలవంటి వ్యాసాలు ఉండవచ్చు.

సౌరశక్తితో, చాంద్రగమనంతో, మన జీవితమంతా ముడిపడి ఉన్నది.

చంద్రుడు మనఃకారకుడు. 'రరాజ చంద్రో భగవాన్ శశాంకః' అన్నాడు వాల్మీకి రామాయణంలో. శ్రీమద్రామాయణంలో వర్ణితమైన వెన్నెలలే వెన్నెలలు. 'లోకస్య పాపాని వినాశయుతం, మహోదధించాపి సమేధ యంతం' అని చంద్రుణ్ణి వర్ణించా డామహాకవులలో మహాకవి వాల్మీకి. చంద్రుడు ఇరవై ఏడు నక్షత్రాలతో కూడి ఉండటం ఖగోళ దివ్య వైభవం. మన నెలల పేర్లన్నీ వెన్నెల రేడు నుంచే వచ్చాయి. ఓషధులకు చంద్రుడే విభుడు.

రామచంద్రుడు తెలుగు వారందరికీ ఇష్టదైవమన్నాడు త్యాగరాజ స్వామి. రాముణ్ణి ఇష్టదైవం చేశాడు. అందువల్ల ఆయన తారావిహార శోభితంగా ఇందులో సంకతమైన 27 వ్యాసాలు పాఠకులలో ఆహ్లాదాన్ని సంధించగలవని అజో-విభొ ప్రచురణల వారి ఆకాంక్ష ఆశ. ఇవి పరమాద్భుతమైన వ్యాసాలు. ఒక శతాబ్ది తెలుగు వ్యాసపూర్ణిమా చంద్రుడి రోచులు. చదివి చూడండి మీకే తెలుస్తుంది అని విన్నవిస్తూ, దైవానుగ్రహం వల్ల ఇటువంటి వ్యాస సంపుటులు మరిన్ని అజో-విభొ ప్రచురించగలదని హామీ ఇస్తూ ఉత్తమ సాహిత్యాభిరుచిగల తెలుగు పాఠకులకు దీన్ని సమర్పిస్తున్నాను.

అక్కిరాజు రమాపతిరావు

కొసమెరుపు: అజో-విభొ సంస్థాపకులైన అప్పాజోస్యుల సత్య నారాయణగారికి వాల్మీకి ఎంతో ఇష్టుడో వ్యాసభగవానుడు అంతకన్న ప్రాణపదుడు. అన్ని సాహిత్య ప్రక్రియలలోనూ శ్రీ సత్యనారాయణ 'వ్యాస' రచననే ఎక్కువ అభిమానిస్తారు. 'వ్యాస'ప్రియుడాయన. కాబట్టి వారి మనోరథం మనందరినీ అలరించగలదనే ఆశిస్తున్నాను.

మీ.

అ.ర.

హైదరాబాద్

01.01.2003

# ఈ వ్యాస తారావళి రచయితలు

## 20వ శతాబ్దాన్నే ప్రభావితం చేసిన

## వ్యాసప్రజ్ఞామూర్తులు వీరు

❀ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు ❀ అక్కిరాజు ఉమాకాంతం ❀ రాయప్రోలు సుబ్బారావు ❀ గిడుగు రామమూర్తి ❀ తాతా సుబ్బారాయశాస్త్రి ❀ పింగళి లక్ష్మీకాంతం ❀ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ ❀ విశ్వనాధ ❀ శ్రీశ్రీ ❀ నోరి ❀ టేకుమళ్ళ అచ్యుతరావు ❀ కట్టమంచి రామలింగారెడ్డి ❀ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు ❀ వేలూరి శివరామశాస్త్రి ❀ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి ❀ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి ❀ నార్లవెంకటేశ్వరరావు ❀ వేదం వేంకటాచలం ❀ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి ❀ గడియారం రామకృష్ణశర్మ ❀ గంగాధరం ❀ సర్దేశాయి తిరుమలరావు ❀ తిరుమల రామచంద్ర ❀ పుట్టపర్తి నారాయణాచార్యులు ❀ రత్నాకరం బాలరాజుల కమనీయ వ్యాస విన్యాసరీతులు రమణీయ భావుక రచనాశైలుల్లో ఈ గ్రంథంలో ఆస్వాదించవచ్చు. ఆనందించవచ్చు.



ఇది అజో-విభొ ప్రచురణ-2003

5, జనవరి 2003, విజయనగరంలో ఆవిష్కృతం

సంపాదకుడు : అక్కిరాజు రమాపతిరావు



"అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారదచంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుటభూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్తి వివిక్త నిజ ప్రభావ భా
వాంబర వీధి విశ్రుత విహారి ననుం గృప జూడు భారతీ!"

– శంభుదాసుడు –ప్రబంధ పరమేశ్వరుడు

– కవిత్రయ మహితాత్ముడు – ఎఱ్ఱాప్రగడ!

('సరస్వతీ గీత'–ఆంధ్ర మహాభారతం; అరణ్యపర్వం – చతుర్థాశ్వాసం)

# విషయ సూచిక

# వేదసూక్తులు

శ్రీ నూకల సత్యనారాయణ శాస్త్రి

శ్లోకం॥ యస్య నిశ్వసితం వేదాః, యోవేదేభ్యో ఖిలం జగత్ !

నిర్మమే త మహం వందే విద్యాతీర్థ మహేశ్వరం !

తా॥ ఏ పరమేశ్వరుని నిశ్వాస వాయువులే వేదములో, ఎవడు వేదములనుండియే సమస్త జగత్తులను నిర్మించెనో, అట్టి పరమేశ్వరునకు నమస్కరించుచున్నాను.

వేదములు వైదిక కర్మలను ప్రతిపాదించుచు కర్మలను విధించుటకు గాని, లేక నిషేధించుటకుగాని కొన్ని అర్థాంతరన్యాసములనో, ఉపమానములనో, నిదర్శనములనో, రూపక వాక్యములనో బోధించును. వానిని మనము "వేదసూక్తుల"నిగాని వైదిక లోకోక్తులని గాని వచింపవచ్చును, వాని నుండి మనకు ఆనాటి సాంఘికాచారము లును, హిందూ సభ్యత మొదలగునవి గోచరించును.

ఆయా సందర్భములలో సృష్టివిషయము, జ్యోతిష విషయము, వైద్యవిషయము, కృషిశాస్త్రము, జంతుశాస్త్రము, వేదాంత విషయము, సామాన్యశాస్త్రము (సైన్సు), రాజకీయ వ్యవస్థ, మనోరంజకములగు కథానికలు, నేడు మనము చూచుచున్న రన్నింగు రేసు, ఓటింగు సిస్టము, బాడ్జి (ఇత్తడిబిళ్లలు గుర్తునకు ధరించుట), బ్యాంకింగు పద్ధతి మొదలగునవెన్నియో విషయములు వేదములందు కలవు. వానిని మనము తెలిసికొన్నచో వేదముల మహిమ మనకు గోచరించును. ప్రస్తుతము మన మానవులనుగూర్చి వేదమాత యేమి బోధించు చున్నదో శ్రవణానందముగా నాకర్ణింపుడు.

## మానవ ప్రకరణము

ప్రశ్న: మానవుల కానామ మెట్లు సార్థక మగుచున్నది?

సమాధానము: మనుజులందరును మను సంతతిలోని వారగుటచే మానవుల

కానామము సార్ధకమగుచున్నది.

ప్రమాణము

తస్మా న్మా నవ్యః ప్రజా ఉచ్యంతే.

(కృష్ణ యజుర్వేద బ్రాహ్మణము! 1వ అష్టము, 5వ ప్రశ్న, 1వ అనువాకము)

మరియొక ప్రమాణము:- ప్రజాపతి అర్యమాది పితృదేవతలను సృజించి పిమ్మట దేనిని సృజింపవలెనని మనస్సునందు మననము చేయుటచేతను గూడ మానవశబ్దము సార్ధకమైనది.

ప్రమాణము

పితౄ న్సృష్ట్వా ఽ మన్యత. తదను మనుష్యా అన్వసృజ్యంత త న్మనుష్యాణాం మనుష్యత్వం. (కృ, య; బ్రా. అ. 2. ప్ర 3. అ 8)

ప్రశ్న: గర్భధారణమునందు స్త్రీ లక్షణములేవి?

సమాధానము: గర్భవతియగు స్త్రీ ముఖము పాండువర్ణము కలది గను, నేత్రములు శ్యావ వర్ణము (నలుపు) కలదిగనుండును. ముఖము నందలి శ్యామ వర్ణము మనకు గోచరము కాకున్నను వక్షోజములందలి శ్యామల వర్ణము గోచరించును.

ప్రమాణము

స్త్ర్యం తర్వత్నీ హరిణీ సతీ శ్యావా భవతి. (కృ, య.బ్రా 2-3-8)

ప్రశ్న: గర్భము ఎట్లు వృద్ధిపొందును?

సమాధానము: గర్భమునకు ప్రత్యేకముగ నాహారము లేకుండగనే తల్లి భుజించిన ఆహారముతో నది వృద్ధినందును. అట్టి సమయము లందు తల్లి సాత్త్వికాహారమును భుజించుచు, క్షారపదార్ధములను విసర్జింపవలెను. క్షీరపానము చేసినచో గర్భము క్రమ వికాసమునంది తేజస్వంతమగు సంతానము కలుగును.

ప్రమాణము

...... గర్భా అనశ్నంతో వర్ధంతే. (కృ. య.బ్రా. 2-1-5)

పయసా వై గర్భా వర్ధంతే. (కృ, య, సంహిత 6-2-5)

ప్రశ్న: ఋతువునకును గర్భమునకును సంబంధమేమైనను కలదా?

సమాధానము: ఋతువనగా వసంతాది ఋతువులు. మరియు రజస్వలా స్త్రీకి ఋతుమతి యను నామము కలదు. ఋతు సంబంధము కలది 'ఆర్తవ'మని స్త్రీ రజస్సునకును నామముకలదు. మరియు అయిదు ఋతువుల వరకు గర్భస్థ శిశువు ఋతు రక్తము నందు వృద్ధినందించుటచే ప్రజలకు 'ఆర్తవు'లను నామము సార్ధకమై వేదమునందు ప్రసిద్ధముగా నున్నది.

ప్రమాణము

పంచ వా ఋతువ ఆర్తవాః పంచ ఋతుష్వే వార్త వేషు

ప్రతిష్ఠాయ ప్రజా మవరుంధతే... ఆర్తవాః ప్రజా ఉచ్యంతే.

(కృ. య. సం. 7-2-6)

ప్రశ్న: గర్భమునందు శిశు వెట్లుండును? ఎట్లు జన్మించును?

సమాధానము: మాతృగర్భమునందు శిశువు జరాయువుచే(మావి) ఆవరింపబడియుండును. జన్మించునపుడు కూడ జరాయువుచే నావరింపబడియే జన్మించును. అందుకే జరాయువువలన జన్మించిన జీవులకు జరాయుజములను నామము కలిగినది.

ప్రమాణము

గర్భోజరాయుణా ౨_౨_ వృతః గర్భాః ప్రావృతా జాయంతే.

(కృ, య, సం. 6-1-3)

ప్రశ్న: జరాయువునకు అస్థిసంబంధము కలదా?

సమాధానము: జరాయువునకు అస్థికలతో నేమియును సంబంధము లేదు. అస్థికలతో గూడిన శిశువు అస్థికావిహీనమగు జరాయువుచే నావరింపబడి జన్మించును.

అవస్థికేన ప్రజాః ప్రవీయంతే. అస్థన్వతీ ర్జాయంతే.

(కృ, య, సం. 6-1-7)

ప్రశ్న: శిశువు ఎంతకాలము వరకు గర్భకోశమున వృద్ధినందును?

సమాధానము: గర్భమందు నిహితమగు రేతస్సు ఒక సంవత్సరమువరకు గర్భమునందు వృద్ధినంది పిమ్మట జనించును. ఈ సంవత్సర మానము చాంద్ర, సౌర, నాక్షత్ర, సావన, బార్హస్పత్యము లను నయిదు మాసములలో నేదైనను కావచ్చును.

సాధారణముగా పదవ మాసమున జనించును.

ప్రమాణము

సంవత్సర మేవ త ద్రేతో హి తం వర్ధయతే,

సంవత్సర మేవ త ద్రేతో హి తం ప్రజనయతి.

దశమే మాసి సూతవే. (కృ, య. బ్రా. 1-1-9)

ప్రశ్న: జన్మించునపుడు శిశువునకు చైతన్యముండునా?

సమాధానము: శిశువు ప్రసవ సమయమున చైతన్యము కలిగియుండును, ఆ శిశువు ఉచ్ఛ్వాస నిశ్వాసలను విడుచుచు జనించును.

ప్రమాణము

ప్రాణా ప్ర్పజా అనుజాయంతే. (కృ. య. సం. 6-5-8)

ప్రశ్న: మానవుడు ఏయే ఋణములతో జన్మించును?

సమాధానము: ఋషి ఋణము, దేవ ఋణము, పితౄణము అను మూడు ఋణములతో మానవుడు జనించును.

ప్రమాణము

త్రిభిర్ ఋణవా జాయతే. (కృ. య. సం. 6-3-10)

ప్రశ్న: ఋషి ఋణమనగానేమి? అది యెట్లు తీరును?

సమాధానము: పూర్వము మహర్షులు తమ భావి సంతతికొరకై వేదశాస్త్ర పురాణ ధర్మశాస్త్రాదులను తపోదృష్టిచే కనుగొని, గ్రంథ రూపమున మానవుల కందజేసియున్నారు. మానవ కల్యాణమునకై కష్టించి వ్రాసిన వేదశాస్త్రాదుల నభ్యసించుటయే బ్రహ్మచర్యము. అనగా విద్యాభ్యాసము, అట్టి ఆర్షగ్రంధముల నభ్యసించినచో ఋషి ఋణము నుండి మానవుడు విముక్తినందును. ఆ విద్యాధనము మానవునకు ఇహపరసౌఖ్యములను చేకూర్చును. ఆ విద్యను చక్కగ నభ్యసింపకుండు నంతవరకు మానవునకు అన్నవస్త్రాదులకు లోపము తప్పదు.

ఉదాహరణము: ఒక జనకుడు తనకు పరుల నుండి రావలసిన ధనమును, తాను ఇతరులకీయవలసిన ఋణమును కొన్ని ఆరోగ్య విధులు,

శత్రుసంహారకప్రయోగములును తన గ్రంథములో వ్రాసి మరణించెననుకొనుడు. ఇతరులు వచ్చి వారి ఋణములను, వాని కుమారుని నుండి వసూలు చేసికొనిపోయిరి. కుమారుడు తాను తన తండ్రి వ్రాసియుంచిన గ్రంథమును చూడనైననులేదు. పరుల నుండి తాను ధనమును వసూలు చేసికొనలేదు. కనుక తాను అన్నవస్త్ర విహీనుడై భిక్షాటనము చేయువాడై యుండును. వాస్తవములో తనకు పరుల నుండి రావలసిన ధనము అసంఖ్యాకముగా నుండెను. నేడు మన గతి కూడా నట్లేయున్నది. మన ఆర్షగ్రంథములను చదివినచో మనము సుఖపడవచ్చును.

### ప్రమాణము

బ్రహ్మ చర్యేణ ర్షిభ (కృ, య, సం. 6-3-10)

ప్రశ్న: దేవ ఋణమననేమి? అది యెట్లు తీరును?

సమాధానము: వేదోక్తములగు కర్మలను, ధర్మములను సాత్విక భావముతో లోకకల్యాణార్థ మాచరించినచో మానవుడు దేవ ఋణము నుండి విముక్తినందును. తాను స్వయముగా ఆచరింపక, పరులకు దానినుండి లాభమును చేకూర్చజాలని విద్యవలన నెట్టి లాభమును లేదు. లోక కల్యాణమే వైదిక కర్మానుష్ఠానమునకు ఫలము.

### ప్రమాణము

యజ్ఞేన దేవేభ్యః! (కృ, య. సం. 6-3-10)

ప్రశ్న: పితౄణమనగానేమి? దాని నుండి యెట్లు విముక్తి కలుగును?

సమాధానము: పుత్రుడు తన మాతాపితరుల కెంతేని ఋణపడి యున్నాడు. గృహస్థాశ్రమమును స్వీకరించి వార్షిక శ్రాద్ధాదులు, కన్యాదానము, గయాశ్రాద్ధము, నిత్యపితృతర్పణము మొదలగునవి చేయుటచే పితౄణము నుండి పుత్రుడు విముక్తినందును.

### ప్రమాణము

ప్రజయా పితృభ్య ఏవ వా అనృణో యఃపుత్రీ

(కృ, య, సం. 6-3-10)

ప్రశ్న: వేదకాలమునందు పుత్రుని నధికముగా ప్రేమించు చుండిరా? పుత్రికను

ప్రేమించుచుండిరా?

సమాధానము: అన్ని కాలములందును పుత్రునే అధికముగా ప్రేమించుచుండిరి.

**ప్రమాణము**

స్త్రియం జాతాం పరాస్యంతి! ఉత్పుమాగ్సం సంహరంతి.

(కృ.య.సం. 5.5-10)

ప్రశ్న: పుత్రునధికముగా ప్రేమించుటకు కారణమేమి?

సమాధానము: స్త్రీలు ఇంద్రియ విహీనలు (శుక్లధాతు విరహితులు) అందుచే వారికి సోదరులతో దాయభాగములేదు. కన్యక యెన్నటికైనను పరకీయద్రవ్యమే. కనుక స్త్రీకి మాతాపితరుల నుద్దేశించి పారలౌకికము లగు పైతృక కర్మలు చేయుటకు అధికారములేదు.

'యో ౭ర్ధహర స్స పిండదాయీ" అనగా ధనమునందు అధికారము కలవానికే పిండదానమునందును కర్తృత్వముండును. ఇదియే పుత్రునధికముగా ప్రేమించుటకు కారణము.

ప్రమాణము: స్త్రియో నిరింద్రియా అదాయాదీ రపి పాపా త్పుంస ఉపస్తితరం వదంతి. (కృ, య. సం. 6-5-8)

ప్రశ్న: పురుషుడైనంత మాత్రముననే పూజార్హుడగునా?

సమాధానము: పురుష చిహ్నములగు శ్మశ్రువులు (గడ్డము మీసము)న్నంత మాత్రముచే యోగ్యుడనరాదు. తన జ్ఞానేంద్రియము లతోను, కర్మేంద్రియములతోను సత్కర్మానుష్ఠానము చేయుచు ధర్మావిరుద్ధములగు కామములననుభవించు పుత్రుడే గౌరవార్హుడగును.

**ప్రమాణము**

న వా ఏతేన సర్వః పురుషః, య దిత ఇతో లోమాని దతో నఖాన్ (కృ.య.బ్రా 1-2-6)

ప్రశ్న: శిశువున కాహారాపేక్ష యెప్పటి నుండి కలుగును?

సమాధానము: శిశువున కాహారపేక్ష జన్మించిన తరుణము నుండియే కలుగును. జాతకర్మయనగా పిల్లవానికి స్తన్యమునొసగుటకు ప్రారంభ సంస్కారము. నేడు దీనిని

ఉపనయనముతో కలిపిచేయుట ఆచారముగా నున్నది.

ప్రమాణము: జాతో ఉ న్న మత్తి (కృ. య, సం. 5-3-2)

దక్షిణగ్గ్ స్తనం ప్రతిధాప్య. (ఆపస్తంబ గృహ్యాసూత్రము)

ప్రశ్న: మానవున కాహార మెప్పుడెప్పుడు నిర్ణయింపబడినది?

సమాధానము: మానవున కాహారము అహస్సునందొక పర్యాయ మును, రాత్రి భాగమునందొక పర్యాయమును నిర్ణయింప బడినది. అది వైశ్వానరాగ్ని యందుచేయు నగ్నిహోత్రఫలము నొసగును. ఆ నియమము నుల్లంఘించి భుజించినవాడు ఆరోగ్య విహీనుడై రోగగ్రస్తుడగును.

**ప్రమాణము**

... ద్వి రహ్నో మనుష్యేభ్య ఉపహ్రియతే.

ప్రాత శ్చ సాయం చ. (కృ, య, బ్రా. 2-5-6)

ప్రశ్న: క్షుత్తు మానవున కేవిధముగా సహకరించును?

సమాధానము: ఆకలివేసిననే గాని మానవు డాహారమును భుజింపడు. భుజించిన ఆహారము వలననే శరీరమునకు బలము, పుష్టి, ఇంద్రియ వృద్ధి కలుగుచున్నవి. కాని అదియే మానవునకు ప్రాణశత్రువై అనేక దుష్కార్యములను చేయించుచున్నది. ఆ క్షున్ని వారణార్ధమే మన ప్రయత్నములన్నియు వినియోగపడుచున్నవి. (కోటి విద్యలు కూటికొరకు) అను లోకోక్తికి ఇదియే మూలసూత్రము.

**ప్రమాణము**

క్షు త్ఖలు వై మనుష్యస్య భ్రాతృవ్యః (కృ, య, సంహిత)

ప్రశ్న: ఆహారమునకు ప్రమాణమేమైనను నిర్ణయింపబడినదా?

సమాధానము: న్యూనాధికములుగాక మధ్యమ ప్రమాణముతో భుజించిన అన్నము శరీరమునకు ఆరోగ్యమును, పుష్టిని, సంతృప్తిని కలిగించును. "యుక్తాహార విహారస్య" అను గీతావచనమునకు కూడా నిదియే మూలాధారము.

**ప్రమాణము**

మధ్యతో హ్యన్న మశితం ధినోతి (కృ, య, బ్రా, 1-2-6)

ప్రశ్న: శిశువునకు నామకరణము చేయుటకును అది ప్రత్యేక మైన నియమములతో

గూడియుండుటకును కారణమేమి?

సమాధానము: కుంభకారుడు ఘటములను నిర్మించుచు ప్రథమమున నన్నిటిని, భేదరహితముగను, ఏకాకారముగను చేసి పిమ్మట వానికి ఘటము, ఉదకుంభము, ఘృతకుంభము, శరావము, దధిస్థాలి, యని వాని రూపములను బట్టి నామములను నిర్ణయించును. అట్లే భగవంతుడును జీవరాసులను ప్రథమమున నామరూపరహితము గా సృష్టించి పిమ్మట నామరూపకల్పనముచేయును. ఆ నామ రూపములు ప్రజాపతివలెనే సర్వవ్యాపకమైనవి. నామభేదముగాని రూపభేదముగాని లేనిచో వ్యవహారమే దుర్ఘటము. అందుచే నామకరణము సద్వ్యవహారార్థము చేయబడవలెను. ఈ నామము స్థిరపరచుటలో అనేక సమస్యలు తలయెత్తును. వానిని పరిష్కరింప జాలని వారు ఆ నామకరణమును తాత్కాలికము ఆపివేసి రాయుడు, గుండప్ప, పుల్లయ్య, చిట్టి, చిన్న, బుచ్చి, మొదలగు నామములతో వ్యవహరించుచుందురు.

పురుషునికి సమాక్షరము (2-4-6) లుండవలెను. స్త్రీకి విషమాక్ష రము లుం(3-5-7)డవలెను. ఏ అక్షరము మొదట నుండవలెనను నియమము కూడ ఆపస్తంబ సూత్రమున విస్తరించి చెప్పబడినది. నక్షత్ర నామములగు రోహిణి, ఆర్ద్ర, మృగశిర, అనూరాధ మొదలగునవియును, నదీ నామములగు గంగ, యమున, కృష్ణవేణి, నర్మద మొదలగునవియును, కల్పలత, సంతానము, పారిజాతము మొదలగు వృక్షనామములును నిషేధింపబడినవి.

మహాకవియగు షేక్స్పియరు తన నాటకమునకు యుక్తమగు నామకరణమును చేసికొనజాలక (As you like it) మీ ఇష్టము వచ్చిన నామము పెట్టుకొనవచ్చునని పాఠకులకే వదిలివేసెను. నేటి కవులకు నదియొక సమస్యయే! మన ఆంధ్రరాష్ట్ర నిర్ణయమునందు నామ నిర్వచనమునకు జరిగిన కల్లోలమును మనము చూచియేయున్నాముగదా! ప్రజాపతివలెనే సర్వవ్యాపకములగు రూపమును మనసా ధ్యానించుచు నామమును జపించువారికి భగవంతుడు పరమమిత్రుడగును. ఈ వేదప్రమాణమే హిందువులకును, మహమ్మదీయులకును, క్రైస్తవులకును క్రమముగా నామజప, సంకీర్తన మునకును, నమాజునకును, ప్రార్థనమునకు నాధారభూతమగు చున్నది. ఇద్దరు శత్రువులు మార్గమున పరస్పర నామములతో నాహ్వానించుకొని

సంభాషించినచో మిత్రులగుదురు. "సఖ్యం సాప్తపదీన" మనుటకును ఇదియే ప్రమాణము.

ప్రమాణము

రూపం వై ప్రజాపతి రితి, తస్మా దాహుః నామ వై ప్రజాపతి

రితి.... నామ్నా చే ఉ_ద్ధ్వయేతే, మిత్ర మేవ భవతః

(కృ, య, బ్రా. 2-2-7)

నక్షత్రనామా నదీనామా వృక్షనామా శ్చ గర్హితాః

(ఆ. సూత్రం)

ప్రశ్న: నామము లెన్నివిధములు? వానిలో నేది శ్రేష్ఠము?

సమాధానము: జన్మనామమొకటి, పౌరుష నామము వేరొకటి. బి.ఎ, ఎం.ఏ, కవిసమ్రాట్, మంత్రి, సేనాపతి మొదలగునవి పౌరుష నామములు. ఇవి కలవారు గౌరవనీయులును ఆర్థికముగా నభివృద్ధి నందువారు నగుదురు.

ప్రమాణము

.... ద్వినామాబ్రాహ్మణః ఉ_ ర్ధుకః (కృ, య, సం. 6-3-1)

ప్రశ్న: మావన దేహముననే యవయవము ప్రధానమైనది?

సమాధానము: మానవ శరీరము ఆరు భాగములుగా విభజింప బడినది. హస్తద్వయము, పాదద్వయము, ఉదరము, శిరస్సు. వీనిలో శిరస్సు ముఖ్యమైనది. శ్రోత్రద్వయము, నేత్రద్వయము, నాసాద్వయము, రసనేంద్రియము ఈ సప్తవిధములగు ప్రధానేంద్రియములును శిరస్సునందుంటచే శిరస్సు ప్రధానమగుటకు ప్రబల కారణము. (సర్వస్య గాత్రస్య శిరఃప్రధానం) అను సూక్తికిదియే ఆధారము. కనుకనే శిరస్సున కుత్తమాంగమను నామము సార్థకము.

ప్రమాణము

షోఢా విహీతో వై పురుషః సప్త శీర్షణ్యాః ప్రాణాః

(కృ, య, బ్రా, 1-2-3)

ప్రశ్న: కర్మేంద్రియములను గాని హృదయమునుగాని ప్రధానమైనదిగా నేలచెప్పరాదు?

సమాధానము: వాక్కు, పాణి, పాదము, పాయువు, గుహ్యేంద్రియము నను నీ పంచ కర్మేంద్రియములలో వాగింద్రియము మాత్రమే ముఖమునందు (శిరస్సునందు)

ఉన్నది. కనుకనే మిగిలిన వానికంటే వాక్కు ప్రధానమైనదిగా ప్రమాణమున్నది. ఇదియే ఏకత్వములో భిన్నత్వము. మనజాతి నిర్మాణమునకుగూడ నిదియే మూలసూత్రమేమో! జ్ఞానేంద్రియ సహాయముననే కర్మేంద్రియములు తమ కార్యములను నిర్వహింపగలుగుచున్నవి. కనుక కర్మేంద్రియ ములు గాని హృదయముగాని ప్రధానమైన వని చెప్పవీలులేదు. అదియునుగాక మానవుడు తన ప్రతిభను వీర్యమును శీర్షస్థములగు జ్ఞానేంద్రియ సహాయముననే ప్రదర్శింపగలుగుచున్నాడు. కనుక ముఖము ప్రజాపతి సమ్మితము. కనుకనే దేవతాదర్శనము చేయునపుడు ప్రధానముగా ముఖమునే సందర్శించెదము. ముఖమును కప్పివుచ్చినచో శరీరమును (కబంధమును) గురుతుపట్టుటకు వలనుపడదు.

**ప్రమాణము**

ప్రాణానాం వా గ్జ్యోతి రుత్తమా. (కృ. య. సం. 6-6-8)

ఏతావ ద్వై పురుషే వీర్యం, యత్ప్రాణాః!

(కృ, య,బ్రా, 2-2-1)

ప్రశ్న: శిశువునుగన్న తల్లి మరల యెంతకాలమునకు గర్భవతి కావచ్చును?

సమాధానము: శిశువు జనించిన యొక సంవత్సరమునకు తల్లి మరల గర్భవతి కావచ్చును.

**ప్రమాణము**

సంవత్సరం ప్రజా అనుప్రజాయంతే. (కృ, య, సం. 6-3-7)

ప్రశ్న: జన్మించిన శిశువెంతకాలమునకు మాటలాడగలుగును?

సమాధానము: జన్మించిన యొక సంవత్సరమునకు శిశువు కొలదిగ మాటలాడదొడగును.

ఏకహాయనా మనుష్యావాచం వదంతి (కృ, య, సం. 6--7)

ప్రశ్న: ఆదిమానవుడు తన సంతానమునకేవిద్యను నేర్పించు చుండెను? దానికి కారణమేమి?

సమాధానము: సర్వవిద్యలకును వేదమే మూలకందము. దాని యందన్ని శాస్త్రముల

సారము నిమిడియున్నది. అది ఐహికాముష్మిక ఫలముల నొసగును. ఎన్నటికిని నాశరహితమైనది. చోరాదులకు నసాధ్యము. దానముచేసిన కొలది అది వృద్ధినొందును. అందుచే నాదిమానవుడు తన సంతతికి వేద విద్యను నేర్పుచుండెను. "విద్యా నామనరస్య" "న చోరహార్యం" అను సూక్తులకిదియే యాధారము.

**ప్రమాణము**

ఋచో యజూగ్ంషి సామాని, సా హి శ్రీ రమృతా సతాం.

(కృ.య.బ్రా 1-2-1)

ప్రశ్న: తండ్రి యెట్టి కుమారునధికముగా ప్రేమించును?

సమాధానము: తనకు సేవాశుశ్రూషలు చేయుచు నాజ్ఞావర్తియగు కుమారునే తండ్రి యధికముగా ప్రేమించును. మరియు దూరము నందున్న కుమారునికంటె తన సమీపమున నున్న కుమారునిగూడ నధికముగా ప్రేమించును.

**ప్రమాణము**

.... శుశ్రూషః పుత్రాణాగ్ హృద్యతమః నేదిష్ఠో హృద్యతమః

(కృ, య, బ్రా. 2-3-11)

ప్రశ్న: తండ్రి పుత్ర ప్రేమను వదలజాలక పరలోకమునకు గూడ పోవనిచ్ఛగింపక పోవుటకు కారణమేమి?

సమాధానము: పుత్రుడనగా మాతాపితరుల హృదయ ఖండముల యొక్క అఖండాకారమే. ఆ పుత్రుడే వారి హృదయ ఖండమగుటచే హృదయ విహీనమగు శరీరముతో వారు పరలోక సౌఖ్యములనంద నొల్లకుందురు.

**ప్రమాణము**

తస్మా దస్మా దముం లోకం నా ౨ భి కామయంతే.

పుత్రో హి హృదయం. (కృ. య. బ్రా. 2-2-7)

ప్రశ్న: అందరికిని ప్రియమగు వారెవరు?

సమాధానము: పశుపక్షి మానవ దేవదానవాదులలో నందరికిని మిక్కిలి ప్రియమగు నది భార్యయే!

"పెండ్లాము బెల్లం ముక్క" అను లోకోక్తి ఈ వేద ప్రమాణము నుండియే జనించినది.

**ప్రమాణము**

పత్నీ హి సర్వస్య మిత్రం. (కృ. య. సం. 6-2-9)

ప్రశ్న: స్త్రీలు ఎవరిని ఎక్కువగా కామింతురు?

సమాధానము: సాధారణముగా స్త్రీలు గాయకుని హెచ్చుగా ప్రేమింతురు. లోకమున నాటకములలో నటించుచు, మధురముగా గానము చేయు గాయకుని విశేషముగా ప్రేమించి వరించిన సంఘటనములు మనకు దృగ్గోచరమగును.

**ప్రమాణము**

గాయంతగ్గ్ స్త్రియః కామయంతే. (కృ.య.సం. 6-1-7)

ప్రశ్న: ఎట్టి అతిథిని ముందుగా పూజింపవలయును?

సమాధానము: రధారూఢుడైగాని శకటారూఢుడైగాని వచ్చిన అతిధిని ముందుగా పూజించి సాధారణులగు నతిధులను తదనంతరమున పూజింపవలయును. నేడును మనమంతే చేయుచున్నాము.

**ప్రమాణము**

అనశ్వీ చ రధీ చా ఽఽ తిథీనా మపచిత తమౌ

(కృ. య. సం. 5-2-2)

ప్రశ్న: పర్వతవాసులును పట్టణ నివాసులును వ్యాపారము నేవిధముగా చేయుచుందురు?

సమాధానము: పర్వతమున వ్యాపారము చేయువారు నెత్తిపై తట్టలలో సామానులు పెట్టుకొని వ్యాపారమును చేయుదురు. అట్లే సమ ప్రదేములగు పట్టణములందును పల్లెటూళ్లయందును వ్యాపారమును చేయువారు శకటములమీద వస్తువులను వేసికొని వర్తకమును చేయుచు జీవింతురు.

(కృ.య.సం. 6-1-7)

**ప్రమాణము**

శిరోవాహ్యం గిరౌజీవనం. అనోవాహ్యగ్ సమేజీవనం

(కృ.య.సం. 6-1-7)



# ఆంధ్ర పరిశోధక మహామండలి

## పంచమ వార్షికోత్సవము - అధ్యక్షోపన్యాసము

- శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు

(**80** సం.ల నాటి వ్యాసమిది. పుస్తక రూపంలో ఎక్కడా ప్రకటితం కాలేదు. అప్పట్లో చెలికాని లచ్చారావు గారనే వదాన్యుడు, జమీందారు, సాహిత్యాభిమాని పరిశోధక మహామండలి అనే సంస్థను స్థాపించి కొన్ని ప్రాచీన కావ్యాలు అచ్చు వేశారు. ప్రతి సంవత్సరం కవి పండిత పరిశోధక సమావేశం నిర్వహించే వారు ఆయన. **1922**లో జరిగిన ఐదో వార్షికోత్సవానికి అధ్యక్షత వహించి శ్రీ లక్ష్మణరావు చేసిన ఉత్తేజకర ప్రసంగమిది. ఈ ప్రసంగంలో కొన్ని శాసన పాఠాలు లక్ష్మణరావు ప్రసక్తం చేశారు. ఆ శాసన పాఠాలు, కాలచర్చలు ఇప్పుడీ ప్రకటితమవుతున్న వ్యాసం నుంచి పరిహరించడం జరిగింది. సం.॥)

**పం**డితోత్తములకు సవినయ దండ ప్రణామములాచరించి కథా క్రమమునకుఁ బూనుకొనియెదను. నేను ఈ యగ్రాసనమును అధిష్ఠించుటకు మీ యకారణ ప్రేమయే కారణము గాని నా యోగ్యత కాదని నే నెఱుంగుదును. కావున ఈ మీ ఆజ్ఞకు లోనై యిచ్చుటఁ గూర్చుంటినే కాని వేఱుకాదు. ప్రభువుల యాజ్ఞయు, పెద్దల యాజ్ఞయు అనుల్లంఘనీయము లనియెదరు. రాజకీయ సాంఘిక విషయములలో నీ నియమమునకుఁ గాలానుసరమున నపవాదములు కలిగినను, విద్యా విషయికములైన యిష్టాగోష్ఠులందు నీ నియమమును పాటించుట విధియని తలంచియు, మీరొసంగెడి వ్యాసరూపమయిన జ్ఞానామృతము ఈ వీలయిన స్థలము

నుండి ఏకాగ్రచిత్తముతోఁ గ్రోలి నా యోగ్యతను హెచ్చించుకొందునను నమ్మకము తోడను నన్ను మించిన యీ యున్నత పదవికి నంగీకరించితిని.

స్థలాంతరముగా నున్న యాంధ్ర పండితోత్తములును, కవి పుంగవులును, పరిశోధక శ్రేష్ఠులును, ఒక్క చోటఁ గుమిగూడి విద్యా గోష్ఠింగాలము గడుపునట్లు చేసి, మనలకు స్వాగతమొసంగిన, ఆంధ్ర పరిశోధక మహామండలి స్థాపకులగు శ్రీయుత చెలికాని లచ్చారావు గారి యెడ మనమెంతయు గృతజ్ఞులము. ఇట్టి యుత్సవ నెపమున నైనను జ్ఞాన సంపన్నుల సహవాసము, రెండు దినములయినను లభించిన యెడల భాషా వికాసమునకును, నూతన పరిశోధనలకును మార్గము కల్గుననుటకు సందేహము లేదు.

ఆంధ్ర పరిశోధక మహామండలి వారైదు సంవత్సరముల నుండియుఁ జేయుచున్న పని వారి రిపోర్టుల వలన మీకు విశదమే. ముఖ్యముగాఁ గ్రిందటి యేట వారు చేసిన పని యిప్పుడు చదువబడిన నివేదిక వలనఁ దెలియగలదు. చేసిన పనికి మనము వారిని అభినందించుటయుఁ గృతజ్ఞత చూపుటయు సహజము. వీరింతకంటె నెక్కుడు పని చేయవలసి యుండెను – అని కొందఱు నాతో సూచించి యుండిరి. కాని యిట్టి యాక్షేపణము అనవస్థా ప్రసంగములో జేరును! ఎంత పనిచేసినను అంతకంటె నెక్కుడు పని జరిగి యుండవలసినది అని యాక్షేపించు వారుండకపోరు. ఇట్టి యాక్షేపణమునకు లోబడని సంఘమొక్కటి యైనను లేదు. ముప్పది గ్రంథములను ప్రకటించిన విజ్ఞాన చంద్రికా మండలి వారును (బాగుగ పనిచేయు దినములలో) రాజమహారాజాధిరాజుల యనుగ్రహమును, అభిమానమును గలిగిన ఆంధ్రభాషా పరిషత్తును, ఎడతెగక పుస్తకములను ప్రకటించుచున్న ఆంధ్ర ప్రచారిణి వారును, ఒక రెక్క మీదనో రెండు రెక్కల మీదనో మూడు పెద్ద సంపుటములు ప్రకటించిన విజ్ఞాన సర్వస్వము వారును ఈ యాక్షేపణమునకు గుఱియైరి. కొన్ని యెడల నిజముగా గుఱియైరి యనియుఁ జెప్పవలయును. కావున నిట్టి యాక్షేపణములను పాటింపక, ఎవరిచేతనైన పని

వారు చేయుచునుండుటయే మంచిదని నా తాత్పర్యము. ఒక్కొక్కరు విడివిడిగాఁ బని చేయుట కంటె నందఱును గలసి సంఘీభావముతో బనిచేయుట మంచిది కాదా? యని కొందఱడుగ వచ్చును. మంచిదే. కాని యే కారణము చేతనో తెలుఁగు దేశమున నిట్లు చేయుట యిప్పుడు సాధ్యము గాక యున్నది. అందుకుఁ గారణములు చర్చించుటకు నిది సమయము కాదు. సంఘముగాఁ బని జరుగుటకు వీలు లేనప్పుడు, ఎవరికి జేతనైన పని వారేల చేయగూడదు? అట్లు చేయకుండుట తప్పని నా తాత్పర్యము. కావున మహామండలి వారింకను ఎక్కువ పని చేయుదురు గాక యని కోరుచు వారు చేసిన పనికి సంతసించి వారిని గౌరవింతము.

## పరిశోధనపై సంకురుమయ్య

ఈ మహామండలి వారిని మనము గౌరవించుటకు మఱియొక విశేష కారణము కలదు. ఎందుచేతనో రెండుమూఁడు సంవత్సరముల నుండి సంకురుమయ్య ఆంధ్ర దేశమున వాఙ్మయపరిశోధనము మీది నుంచి పోవుచున్నట్టు కానవచ్చుచున్నది. అందువలననే పరిశోధన మెచ్చుటిదచ్చుట నిల్చిపోయినది. ముఖ్యముగా నిదివఱకు దేశదేశములకుఁ బండితులను బంపి తెలుఁగు తాటాకు గ్రంథములను సంపాదించుచున్న వారిద్దఱు. దొరతనము వారి పక్షమున చెన్నపట్టణమందలి మ్యాన్యుస్క్రిప్టు లైబ్రరీ వారు, తెలుఁగు పరిషత్తు వారు. వీరిద్దరును రెండేండ్ల నుండియు పురాతన గ్రంథ సంపాదనమును మానుకొనిరి. కారణము ధనాభావము, దరిద్రత, ఆదాయము భరణమునకే చాలక సాహుకారు నింటికిఁ బోయి పత్రము వ్రాసి అప్పు తెచ్చుకొనవలసి వచ్చుట. దొరతనము వారికి కొన్ని యేండ్ల నుండి ఆదాయమున కంటెఁ గర్చు అధికమగుటయు, వారెక్కువ వడ్డీ యిచ్చి పత్రములను జారీచేసి అప్పు పుచ్చుకొనుటయు 'బడ్జెట్ల'లో మీరు చూచుచునే యున్నారు. అందుకుఁ గొంత ఖర్చు తగ్గించుమనిరి! 'పట్టరా! దేవతార్చన బ్రాహ్మణుని' అన్నట్లు ఈ దెబ్బ మొదటఁ దాటాకు గ్రంథముల మీదఁ బడినది. మొదటనే యవి ముసలితనముచే శిథిలములై యుండుటతో పప్పు పప్పు అయినవనుటకు

సందేహము లేదు. అన్ని భాషల గ్రంథ సంగ్రహమునకు దొరతనము వారు సంవత్సరమునకు 10, 12 వేల కంటె నెక్కుడు ఖర్చు పెట్టుట లేదు. ఇదివఱకే దేశమందలి తాటాకు గ్రంథములన్నియు నశించినవి. ఇంకొక తరమూరకుంటిమా! దేశము నందుఁ దాటాకు పొడిని ఏరుకొన వలసినదేగాని గ్రంథములు మాత్రము దొరకనేరవు. అట్టి స్థితిలో పదిపండ్రెండు వేలకు లోభించి, యిట్టి భాషా ద్రోహమును చేసిన మహానుభావుని గాని, మహానుభావుల గాని ఏమనవలయును? అంతగా ధనము లేని యెడల, ఒకరి ద్దరిని పైఅధికారులను దీసివేయగూడదా? నెలకు వేలకొలది జీతములను కొల్లఁగొట్టుచు, యోగ్యత గాని, ఆవశ్యకత గాని లేని యధికారులెందఱు లేరు? అందునొకరిద్దరిని ఊడఁబెరికిన గాని, వారి జీతములు తగ్గించిన గాని ఎంత ధనమైనను మిగిలి యావశ్యకములయిన విద్యావిషయము లెన్నియో బాగుపడును? విద్యా శాఖ యందే వేలకొలది - లేదు లక్షల కొలఁది- ధనమును అపహరించుచు అజాగళ స్థనముల వలెనున్న వారు లేరా? అట్టి వారెవరైనది, ప్రజల ప్రయత్నము వలన వారెనెట్లు తొలఁగింపవలసినది యను విషయములు రాజకీయ సభలలోఁ జర్చింపఁదగినవి కాని విద్యాసభల విషయములు కావు. కాన నధికముఁ జెప్పనొల్ల.

దొరతనము వారికి వలెనే పరిషత్తు వారి యార్థిక స్థితియు సమాధానకరముగ లేదు. కావునఁ దాటాకు గ్రంథములను సంపాదించు పని వారును మానిరి. ఇట్లు ఆంధ్రదేశమునందు, గ్రంథ సంపాదన పని పూర్తిగా నాగిపోయిన కాలమందుఁ గొంతవఱకైనను ఆ పనిని సాగించుచుఁ జావకుండ నిలవఁ బెట్టిన శ్రీయుత లచ్చారావు గారి విద్యాభిమానమును, వాఙ్మయ ప్రీతియుఁ గొనియాడఁ దగిన వనియే చెప్పవలెను.

విద్యా క్షేత్రమంతయు మనకు నిచ్చట మీమాంస్యమైన విషయమైనను, ఇతర విషయములను పండితులకు విడిచి పరిశోధక మహా మండలి వారి యాతిధ్యమందున్నందున, పరిశోధనమును గుఱించియు, పరిశోధకులను

గుఱించియుఁ గొంత ముచ్చటింప దలఁచితిని.

## పరిశోధనలో దృష్టి భేదము

చరిత్ర సంబంధమైనట్టియు, వాఙ్మయ సంబంధమైనట్టియునగు పరిశోధన అధునికాంగ్ల భాషా సంస్కార ఫలమని చెప్పక తప్పదు. వారి పూర్వుల చరిత్రమును తెలిసికొనవలయుననిన యిచ్ఛ మన పూర్వులకును గలదు. కాని పూర్వ చరిత్రమును గుఱించిన వారి దృష్టికిని మన దృష్టికిని, భేదము గలదు. చరిత్ర తెల్పుటకునై వ్రాయఁబడిన గ్రంథములే - పురాణములు మొదలయినవియే- పూర్వ చరిత్ర సాధనములని పూర్వుల యభిప్రాయము. ఇప్పుడు చరిత్రోద్దేశముతో వ్రాయఁ బడకపోయినను కావ్యములు, నాటకములు, పద్యములు, పాటలు, శాసనములు మొదలయిన ప్రతి గ్రంథమును చరిత్ర విషయకమగు నేదో అంశమును బోధించును. ఇట్టి యూహచే ప్రతి గ్రంథమును, ప్రతి కాగితపు తునకయు, ఉత్తరమును సంగ్రాహ్యముగా, దోఁచుచున్నవి. పూర్వ కాలము నందును శాసనములను, సనదులను జాగ్రత్త చేసి యుంచుచుండిరి. కాని వారియుద్దేశము వేఱు. తమ తమ హక్కులను, ఈనాములను, అగ్రహారములను కాపాడుట వారి యుద్దేశము.

ఇప్పుడు పరిశోధకులు శాసనములను ఆ దృష్టితోఁ జూచుట లేదు. పూర్వ కాలపు సంగతులు వాని వలన నెంత వఱకుఁ దెలిసికొనఁ గలమన్నదియే మనకుఁ గావలసిన విషయము. పదునైదు వందల సంవత్సరముల క్రింద వేంగిలో రాజ్యము చేసిన శాలంకాయనుల తామ్ర శాసనములు నాకు దొరికినవి. అందలి ప్రతిగ్రహీతల వంశము వారిప్పుడెవ్వరును లేరు. అందు దానము చేయఁబడిన గ్రామము లెవ్వియో నిశ్చయముగఁ జెప్పలేము. అయినను చరిత్ర విషయమై అవి గొప్పప్రమాణములుగ నున్నవి. ఇంతియకాదు. లిపి విషయమైన యొక విశేషముఁ గూడ నాకందుఁ గాన్పించినది. ఇప్పుడు మనము బండి 'ఱ'గ వాఁడు గుర్తు పూర్వము -మిక్కిలి పురాతన కాలమున - ఉపధ్మానీయమునకు గుర్తుగ నుండెను. ఉపధ్మానీయమనగా పకారమునకుఁ బూర్వము వచ్చు విసర్గము. పోనుపోను అన్ని విసర్గలకును ఒక్క గుర్తే యుపయోగింపసాగిరి. అందువలన నీ గుర్తుకు సంస్కృత లేఖనములలోఁ

జోటు లేకపోయెను. తెలుఁగు – కర్ణాటకులకు సంస్కృతము నందున లేని బండి 'ఱ'కు గుర్తు కావలసి వచ్చినప్పుడు ఖాళీగానున్న యీ సంస్కృతాక్షరమును తీసుకొని బండి 'ఱ' చేసిరి – అని తోఁచుచున్నది. ఇట్లు ఎందుండి యేనూతన విషయము తెలియునో మనము చెప్పఁజాలము. అన్ని విషయముల గ్రంథములును ఆధునిక పరిశోధకులకుఁ గావలసినవే. గ్రంథ శబ్దము వ్యాపకార్థము నందుఁ దీసికొనవలెను. గ్రంథితమైన దంతయు గ్రంథము. అది కాగితముల మీఁద నుండనిండు, తాటాకు మీఁద నుండనిండు, రాతిపై నుండనిండు. అది పెద్దదియైనను సరే, చిన్నదియైనను సరే, ఒక పంక్తియైనను సరే. అది మన మతము వారు వ్రాసినది కానిండు, పరమతము వారు వ్రాసినది కానిండు. పరిశోధకులు భేదభావముతోఁ జూడరు. ఇఁక వాఙ్మయ విషయమును అట్లే. రసవంతములయిన కావ్యములందఱకుఁ గావలసినవే. రసికులు వానిని మరల మరలఁ జదివి సంతసింతురు గాత. పరిశోధకునకు రసవంతములు, అరసవంతములు, లక్షణయుక్తములు, లక్షణ విరుద్ధములు, కాసటలు, బీసటలు అన్నియు గావలసినవే. నన్నయ కాలపు లక్షణమునకు విరుద్ధమైన వానిని జూడను గూడఁ గూడదని మనవారు పెట్టుకొనిన నియమము వలన నన్నయ్యకుఁ బూర్వపు సత్కావ్యములెన్నియో నశించుటయేగాక, యప్పటి భాషా స్వరూపము కనుఁగొనుటయు దుస్సాధ్యమైనది. నన్నయ్యకుఁ బూర్వము తెలుఁగు కవిత్వమే లేదన్నంత వఱకు వచ్చితిమి! కావున నీ నూతన దృక్పథము ననుసరించి పరిశోధకులన్ని విధములయిన సాధనములను సేకరింతురు గాక.

## కృతజ్ఞత

నూతన పరిశోధనలఁ జేయఁ బూనుకొన్న వారిదివఱకు నీ మార్గమునఁ బోయి మనకు మార్గదర్శకులయిన వారి పరిశ్రమను స్మరించి కృతజ్ఞతఁ జూపుట యావశ్యకము. కావున నాంధ్రదేశ చరిత్రమును గుఱించియు, వాఙ్మయమును గుఱించియు, బరిశోధనలు చేసిన వారిం గొందఱిం బేర్కొందును. వీరిలోఁ గొందఱు పరదేశీయులు, కొందరు స్వదేశీయులు. ఎవరైనను వారి నిరపేక్ష విద్యాసేవచే

వారు మనకు వంద్యులే. రాజకీయాది విషయములలో నన్యాయము చేయు వారు స్వదేశీయులయినను మనమెట్లు నిర్భయముగ వారి నిరసింపవలయునో, అట్లే విద్యావిషయములందు – అందును హైందవ విద్యావిషయములందు బరదేశీయులు చేసిన నిరపేక్ష కృషికి వారి యెడఁ గృతజ్ఞత తప్పక చూపవలెను.

## కర్నల్ కాలిన్ మెకన్జీ

ఇట్టి పరిశోధకులలో మెకంజీ మొదటి వాఁడని చెప్పవలసి యున్నది. ఈతఁడు 1783లో ఇంజినీయరుగా చెన్నరాజధానికి వచ్చెను. 1790–92 సంవత్సరములలో టిప్పుతో జరిగిన యుద్ధములలో నుండెను. తరువాత దత్తమండలములను, హైదరాబాదు ఇలాకాలో కొంతభాగమును సర్వేచేయు నిమిత్తము పంపఁబడెను. 1798లో పాండిచేరి ముట్టడిలో నుండెను. 1796లో ఇంగ్లీషు వారు సింహళమును స్వాధీనపఱుచుకొన్నప్పు డచ్చట ఇంజనీయరులకు నాయకుఁడుగ నుండెను. 1799లో ఇంగ్లీషు వారు శ్రీరంగ పట్టణమును వశపఱుచుకొన్నప్పుడచ్చట నుండి, 1810వ సంవత్సరము వఱకు మైసూరు దేశము సర్వే చేయుచుండెను. 1816లో హిందూ దేశమున కంతకు సర్వేయర్ జనరల్ అయి కలకత్తాలో 1821లో మరణము నొందెను. ఈతఁడు చెన్నపురికి వచ్చినప్పటి నుండియు హిందూదేశపు చరిత్రమును, వాఙ్మయమును చక్కగఁ దెలిసికొనవలెనన్న కోర్కె ఈతనికి జనించెను. ఈతఁడు చేయుచున్న ఇంజినీయర్ పనికిగాని, సర్వే పనికిగాని సంబంధము లేని ఈ చరిత్ర జిజ్ఞాస యాతనికి నిర్వ్యాజముగఁ గలిగె ననుటకు సందియము లేదు. ఈ పనికై యితఁడు వేలకొలఁది స్వంత ధనము వెచ్చించెను. తెనుఁగు, కన్నడము, అఱవము, మహారాష్ట్రము, పారసియను వేఱువేఱు భాషల కొక్కొక్క పండితుని తగు జీతభత్యమిచ్చి యేర్పాటు చేసి దేశదేశములకుం బంపి, చరిత్ర సంగ్రహింప సాగెను. ఈ పండితులు చేయవలసి పనియేమన, ఒక గ్రామమునకుఁబోయి యచ్చటి మునసబు, కరణములను గాని, ఇతరులను గాని కలసికొని, ఆ గ్రామ సంబంధమయిన చరిత్రయంతయు వ్రాసికొనుట. వీనినే

కైఫీయతులందురు. తరువాత ఆ గ్రామమునందు దొరికెడి తాటియాకు గ్రంథములను సంపాదించుట. ఈ గ్రంథసంపాదనమునకు మెకన్జీ యెంతయు ధనము వెచ్చించెను. శాసనములేమైన నాగ్రామమందున్న యెడలఁ దెలిసి నంతవఱకు వాని నకళ్లు వ్రాసికొనుట. శిల్ప కళానిపుణతను జూపు మందిరము లేవియైనఁ గలవేని వాని పటములను వ్రాయుట. మత సంబంధమయిన మఠములు గాని గుహలు గాని చుట్టుపట్ల అరణ్యాది ప్రదేశములందున్న యెడల వానిని స్వయముగ జూచి వాని యప్పటి స్థితిని దెల్పు వర్ణనలు వ్రాయుట. ఈ పనులన్నియుఁ జేయుటకు బంపఁ బడిన పండితులు, మున్షీలు, గుమాస్తాలు తనను మోసము చేయకుండ వారు వారము వారము తనకు 'దినచర్య' పంపునట్లేర్పాటు చేసెను. అట్టి దినచర్యల సంపుటములు కొన్ని చెన్నపట్టణమందలి మెకన్‌జీ సంగ్రహములు జూచి చదివి యానందింపవచ్చును. ఈతఁడు పెక్కుభాషల కైఫీయతులను గ్రంథములను సంపాదించినను వానిలోఁ దెనుఁగు భాషకు సంబంధించినవి మాత్ర మితరముల కంటె నెక్కుడుగ నున్నవి. ఇట్లు సంపాదించిన నూతన జ్ఞానము నాతఁడు వేఱువేఱు పత్రికలలో వ్యాసములను వ్రాసి ప్రపంచమునకుఁ దెలుపుచుండెను. ఈతఁడీ సంగ్రహము కెంత ధనము వెచ్చించెనో మనము నిశ్చయముగఁ జెప్పలేము. కాని వేలకొలఁది వెచ్చించెనని యూహించుటకు మాత్రమొక యాధారము కలదు. మెకన్‌జీ చనిపోయిన తరువాత నాతని సంగ్రహము యొక్క యోగ్యతను దెలిసికొని, "ఈస్టు ఇండియా కంపెనీ" వారు ఆతని భార్యకొక లక్ష రూపాయలిచ్చి, యా సంగ్రహమును కొనిరి. దొరతనము వారు లక్ష యిచ్చి కొన్నప్పుడు మెకన్‌జీ తప్పక యిరువదియైదు వేలైనను వెచ్చించి యుండునని మనమనుకొనవచ్చును. ఏమీ యీ నిర్వ్యాజ జిజ్ఞాస! పరదేశీయులు మన దేశపు తాటి యాకులకు, కొండపల్లి ముతుక కాగితములకు ఇరువదియైదువే లేల వెచ్చించవలయును? జ్ఞానానంద మద్భుతము గదా!

ఈ మెకన్‌జీ దొరగారు మన యాంధ్రుల కొనర్చిన మహోపకార మింకొకటి చెప్పవలసియే యున్నది. అది అమరావతిలో శిల్ప చాతుర్య సీమావధిని జూపు బౌద్ధ స్తూపమొకటి యున్నదని మన యాంధ్రులకు దెల్పుటయే. అమరావతి

స్తూపమిప్పుడు ప్రపంచమందంతటను విఖ్యాతిం జెందియున్నది. యూరోపు ఖండమందలి ప్రతి చిత్రవస్తు ప్రదర్శనాలయమందును, ప్లాస్టర్ ఆఫ్ పారిసుతోఁ జేయబడిన అమరావతీ శిల్ప ప్రతిమలు గలవు. ఈ విఖ్యాతి కంతకును మెకన్‌జీయే కారకుఁడు. పదునెనిమిదవ శతాబ్దాంతమున చింతపల్లి జమీందారుఁడైన వాసిరెడ్డి వెంకటాద్రి నాయుఁడు అమరావతిలోఁ దన మేడఁ గట్టుకొనుటకును, అమరేశ్వరాలయమును నిర్మించుటకును, దీపాలదిన్నెయను ఈ దిబ్బను కొంత త్రవ్వించి అచ్చట దొరికిన గొప్ప నాప బండలను, పెద్ద పెద్ద యిటుకలను ఉపయోగించుకొనెను. చుట్టుపట్టు వారు నాపబండలు కావలసి వచ్చినప్పుడెల్లను ఈ దిబ్బలలోని చక్కని చెక్కడపు బండలను తీసుకొని వెళ్లుచుండిరి. సున్నము కాల్చుటకుఁ గొన్ని బండలు దగ్ధము చేయబడెను. ఇట్లీ యమూల్యమైన శిల్పసంపద నాశము చెందుచుండగా నాంధ్రుల అదృష్టవశమున మెకన్‌జీ యచ్చటికి వచ్చుట సంభవించెను (1792). ఆతఁ డచ్చటి కట్టడముల చక్కదనమును జూచి యచ్చెరువంది, చింతపల్లి జమీందారుఁ డంతమీద దానిని పగులఁగొట్టకుండఁ దగిన యేర్పాటు చేయుటయు గాక, యీ స్తూపముయొక్క వర్ణనము వ్రాసి ఏషియాటిక్ సొసైటీ వారి పత్రికలోఁ బ్రకటించెను. (Vol. IX, 1807) అప్పటి నుండియు నీ స్తూపము యొక్క ఖ్యాతి ద్వీపద్వీపాంతరములందు వ్యాపించెను. మెకన్‌జీ మరల 1816లో అమరావతికిఁబోయి సర్వేచేసి యా స్తూపము యొక్క ఆకారాదుల పటము వ్రాసెను. కొందరు చిత్రకారులను వెంట దీసికొని వెళ్లి, యచ్చటి శిలల మీదఁగల చెక్కడపుఁ బనుల ప్రతిమల వ్రాయించి, యొక గ్రంథమును సిద్ధపఱిచెను. అది యిప్పుడు ఇండియా ఆఫీసులో నున్నది.

వ్యాసుల వారు మహాభారతమును మూడు భాగములు చేసి, యొకటి స్వర్గమందును, మఱియొకటి పాతాళమందును, మిగిలిన దానిని భూలోకమందును దాచినట్లు మెకంజీ సంగ్రహమును దొరతనము వారు మూడు భాగములు చేసి, కొంత లండన్ పట్టణమున ఇండియా హౌస్‌లోను, కొంత కలకత్తాలోని ఏషియాటిక్

సొసైటీలోను, కొంత చెన్నపట్టణములోని కాలేజీలోను ఉంచిరి. చెన్నపట్టణములోనున్న భాగమే యిప్పుడు దొరతనము వారి అముద్రిత గ్రంథాలయము నందున్నది. చెన్నపట్టణములోని కాగితములు జీర్ణమగుచు రాగా వానిలోఁ జాల భాగములను మరల వ్రాయించి బ్రౌన్ దొరగారు 70 సంపుటములు గట్టించిరి. వానికే యిప్పుడు లోకల్ రికార్డ్సు (స్థానిక చరిత్రలు) అని పేరు. ఈ సంపుటములిదివఱకుఁ చెన్నపట్టణమునకుఁ బోయిన గాని మనకు లభింపకుండెను. శ్రీయుత నాగేశ్వరరావుగారి యౌదార్యము వలన వీనికిప్పుడు నకళ్లు వ్రాయుచున్నారు. అవి త్వరలోనే రాజమండ్రి గౌతమీ గ్రంథాలయమును అలంకరింపఁ గలవు. కలకత్తాలోను, లండన్‌లోను ఉన్న గ్రంథముల నకళ్లు వ్రాయించి తెప్పించు సుబుద్ధి ఏ శ్రీమంతునికైనను గల్గుఁగాక. ఇంకొక వింత సమాచారము. లండన్ పట్టణములోని ఇండియా హౌస్‌లో మెకన్జీ సంగ్రహమునకు సంబంధించిన తెలుఁగు గ్రంథాదులు పెక్కులు గలవనియు, వానికి నన్నిటికిఁ గ్యాటలాగు చేయించుటకుఁ బూనునెడల వానిని బంపెదననియు లైబ్రేరియన్ అయిన మిస్టర్ థామస్‌గారు కొంతకాలము క్రిందట మద్రాస్ యూనివర్సిటీ వారికిఁ దెల్పిరఁట. అందుపై దమకు ధనము లేదు గనుక నా పని చేయించుటకుఁ జేతకాదని వీరు జవాబు పంపిరట! చూచితిరా? మన యూనివర్సిటీ యొక్క యోగ్యత? ఇట్టి విశ్వవిద్యాలయాలు జ్ఞాన సంబంధమైన నేతి బీరకాయలు సుఁడీ!

## కావలి వెంకట బొర్రయ్య

ఈతఁడు మెకన్జి యెద్ద నున్న ప్రధాన పండితుడు, దుబాషి. దక్షిణ హిందూదేశమునందుఁ బుట్టిన మొదటి 'ఎపిగ్రఫిస్టు' అని యీతనిఁ జెప్పవలయును. ఎపిగ్రఫిస్టు అనగా పురాతన శాసనములు చదువు వాఁడనుట. ఉత్తర దేశమునందలి శాసనములు చదువుటకుఁ బ్రథమమునఁ బ్రయత్నించినందుకు ప్రిన్స్‌సెస్ అనుదొరకెట్టి గౌరవమును, ఖ్యాతియుఁ గలదో అట్టి గౌరవమును ఖ్యాతియు నీ యాంధ్రదేశపు పండితునకు నుండవలసినది. కాని యీతఁడు హిందువు అగుట

చేతను, ఆంధ్రులకుఁ జరిత్రాసక్తి లేనందునను నూటయిరువది సంవత్సరముల క్రింద నుండిన యీ ఆంధ్రమహాపరిశోధకుని మనము మఱచిపోయితిమి. ఈతని సవిస్తరమైన చరిత్రము నేను మొదట "అర్వాచీన ఇతిహాసిక కోశ" అనఁబడు మరాటీ పుస్తకములోఁ జదివితిని. ఇందుమూలముననే మహారాష్ట్రుల పరిశోధనా విధానములకును మన విధానములకును గల భేదము తేటపడగలదు. ఈ కావలి బొఱ్ఱయ్య గారిది మొదటఁగాపుర స్థలము ఏలూరు. అచ్చట నాతఁడు తెలుగు, సంస్కృతము, ఫారసీ నేర్చుకొనెను. అచ్చటి నుండి బందరుకుఁపోయి మార్గన్‌దొర పాఠశాలలో నింగ్లీషు నేర్చెను. మొదట సైన్యములో జీతములు పంచు గుమాస్తాగా నుండి, తరువాత మెకన్జి యొద్ద దుబాషుగాఁ గుదిరెను. పరిశోధకత మెకంజీ వలన నీతఁడు నేర్చెనో, లేక యీతని వలన మెకంజీ నేర్చెనో కాని, యప్పటి నుండియు 1803లో నితఁడు మరణించు వఱకును చరిత్ర వాఙ్మయ విషయక శోధనల కన్నిటికిని ఇతఁడె నాయకుఁడుగ నుండెను. ఇతనికిఁ దెలుగు, హిందుస్తాని, పారసీ, ఇంగ్లీషు, కన్నడము, అఱవము, మహారాష్ట్రము అను నేడు భాషలు వచ్చును. ఇంతియ కాదు. ఈతఁడు వచ్చు వరకును మెకంజి గాని, ఆతని యొద్ద నున్న ఇతరులు గాని ఈ దేశపు శాసనములలో నొక్కదానిని గూడఁ జదువలేదు, అర్థము చేసికొనలేదు. ఈతఁడు వచ్చిన తరువాతఁ గ్రమముగా నైదాఱు భాషలలోని శాసనములను చదువుటకును, అర్థము చేసికొనుటకును వారందఱును సమర్థులైరని, హైందవ జ్ఞానమందిరమునఁ బ్రవేశించుటకు బొఱ్ఱయ్య యను ద్వారము నాకు దొరకెననియు, బొఱ్ఱయ్య మరణము గుఱించి "The connection then formed with one person, a native, and brahmin (the lamented C.V.Boraiah, then almost a youth of the quickest genius and disposition, possessing the conciliatory turn of mind, soon reconciled all sects and all sribes to the course of enquiry followed in his surveys) was the first step in my introducion in to the portal of Indian knowledge. Devoid of any knowledge of the languages, myself, I owe to the happy genius of this individual the encouragement and the means of obtainings what I had so

long sought. On the reduction of Srirang patnam not one of our people could translate from canarese alone; at present we have translations made not only from the modern characters but the more obscure, I had almost said obsolete charecters of the sasanas (or inscriptions in Canarese and Tamil; besides what have been made from the Sanskrit, of which in may first years in India, I could scarcely obtain any information. From the moment the talents of the lamented Boraih were applied a new avenue to Hindu knowledge was opened and though was deprived of him at an early age his example and instructions were so happily followed up by his brotheren and deciples that an establishment was gradually formed, by which the whole of our provinces might be analysed on the method thus fortuitously and scuccesfully followed."(As quoted in "THE DEKKAN POETS") ని చెప్పునప్పుడు మెకంజీ స్వయముగ వ్రాసియున్నాఁడు. అనగా నీతడు పురాతన శాసనములను చదువుట సత్ప్రయత్నముచే నభ్యసించి, అందు నాఱితేరి యితరులకును ఆ విద్య బోధించెను. ఇది యంతయు నెప్పుడు? ఉత్తర హిందూ దేశమున ప్రిన్‌సెప్ ఇంకను శాసనములఁ జదువఁ బ్రారంభింపనప్పుడు! ఈతఁడొక హళ కన్నడ శాసనమును జదివి యర్థము చెప్పగ మెకంజీ మిక్కిలి సంతసించి యా రాతిపై నీతని పేరు వేయించి ఏషియాటిక్ సొసైటీ వారి భవనమునందుంచెనఁట. ఈ సమాచారము మన యాంధ్రుల కెంతయు భూషణాస్పదము గదా! 1799లో శ్రీ రంగపట్టణము కోటను ఇంగ్లీషు వారు సాధించినప్పుడు బొఱ్ఱయ్య యచ్చట నుండెను. ఆ ప్రసంగమును వర్ణించుచుఁ దెనుగున రసభరితమైన కావ్యముఁ జెప్పెను. 1800 సంవత్సరమునందు సర్ ఆర్థర్ వెల్లస్లీ, ధుండీ యను నొక వీరునిఁ బట్టుకొనెను. ఆ యుద్ధమునందు బొఱ్ఱయ్య యుండెను. ఆ యుద్ధమును వర్ణించుచు నొక తెలుఁగు కావ్యమును రచించెను. ఇవి గాక సత్పురుష వర్ణనమను నూఱు శ్లోకములను, శ్రీరంగచరిత్రము, శ్రీరంగపట్టణ రాజుల వంశావళి, యాదవరాజుల వంశావళి యను గ్రంథముల రచించెను. ఒకప్పుడు నైజాము రాజ్యములో సర్వే చేయుచుండగ

కర్నల్ మెకంజీ యొక్క కాగితములు మొదలైన వాని నొక జమీందారుని మనుష్యులు దొంగిలించిరి. వానిని విడిపించుటకుఁ బోఁగా బొర్ఱయ్యను ఖైదు చేసిరి. అప్పుడు బొర్ఱయ్య యారాజు నొద్దకుఁబోయి, యాతనిని తన పాండిత్యము చేతను, కవిత్వము చేతను మెప్పించి కాగితములను, తనను విడిపించుకొని వచ్చెను. యుద్ధాదు లణఁగి యంతటను శాంతత ప్రసరించిన తరువాత, యంత్ర సాయములేక చేతితోనే దేశ పటములను దింపుట యభ్యసించి, మెకంజీనే మెప్పించెను. ఈతఁడిరువది యాఱవ యేటనే చెన్నపట్టణమునఁ గీర్తి శేషుఁడయ్యెను. ఈతని మరణమునకు మిక్కిలి దుఃఖించి మెకంజీ యీతనిని దహనము చేసిన చోట నొక చిన్న శాసనము వేయించెనఁట. అది యెచ్చట నున్నది కనుఁగొన వలయునని నేను చెన్నపట్టణము నందలి కొన్ని శ్మశానములఁ దిరిగితిని గాని నాకది కానిపించలేదు.

## కావలి రామస్వామి

ఈతఁడు బొర్ఱయ్యకుఁ దమ్ముఁడు. బొర్ఱయ్య గారి తరువాత మెకంజీ యొద్ద దుబాషుగా నున్న వాఁడు. కల్నల్ మెకంజీతోఁ గూడ కలకత్తాకుఁబోయి యచ్చట, మెకంజీ సంగ్రహమునకు వ్యవస్థిత రూపము నిచ్చెను. ఈ సాధనముల నన్నిటిని యుపయోగించుకొని యీతఁడు 1822వ సంవత్సరమున నింగ్లీషులో "దక్షిణ దేశపు కవుల చరిత్రము" అను గ్రంథమును వ్రాసి గవర్నర్ జనరల్ అయిన లార్డు కార్నవాలిస్‌నకు నంకితమిచ్చెను. ఇది మొదట కలకత్తాలోను తరువాతఁ జెన్నపట్టణమునఁ బ్రకటింపఁ బడినది. ఇందు తెలుఁగు, మరాటి, అఱవము, కన్నడము అనుభాషలకు సంబంధించిన కవుల చరిత్రము లున్నవి.

## బ్రౌన్ దొరగారు

సి.పి.బ్రౌన్ అను నతడాంధ్ర భాషా మతల్లి సేవకే జన్మమెత్తినట్లు కానవచ్చుచున్నది. ఈతఁడాంధ్ర వాఙ్మయాభివృద్ధికై చేసినంత పని యిటీవలి వారెవ్వరును చేయలేదని చెప్పిన నతిశయోక్తి కానేరదు. ఈతనిచే రచింపబడిన కోశముల మీరెఱిగియే యున్నారు. మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవ

పాండవీయాదికములైన యాంధ్ర యుద్గ్రంథముల కన్నింటికిని టీకలు వ్రాయించెను. మెకన్‌జీ వలెనే యీతఁడును జీతములిచ్చి పండితులను బెట్టి యీ పని చేయించెను. తెలుఁగు తాటాకు గ్రంధములన్న నీతని కమిత ప్రీతి. వీనిని సంపాదించుట కతఁ డెంతయో ధనము వెచ్చించెను. కొన్ని సమయములందు ధనము తక్కువ పడగా నీతడు తన వెండి పాత్రాదులను తాకట్టు పెట్టి పండితులను సత్కరించుచుండెను. ఈతనికి నరిదియైన తాటాకు గ్రంధముల యందు గల ప్రీతిఁ దెల్పు కథయొకటి చెప్పుచున్నాను. మా బంధువులు కొందఱకును ఒక జమీందారునకును ఒక యగ్రహారమును గుఱించి వ్యాజ్యము బ్రౌన్ గారి కోర్టులో జరుగుచుండెనఁట. కోర్టులో నితర వ్యాజ్యములు జరుగుచున్నప్పు డూరక నేలకూర్చుండ వలయునని మా బంధువులలో నొకఁడు బసవ పురాణము దీసికొని వెళ్ళి కోర్టులో నొక మూల గూర్చుండి అప్పుడప్పుడు మనసులోఁ జదువుకొనుచుండెను. బ్రౌను అది విని యొకమారతనిని పిలిచి యది యే గ్రంధమైనది తెలిసికొని, తనకొకటి సంపాదించి యీయవలసినదిగాఁ గోరెనఁట. అంత మాబంధువుడా పుస్తకము సంపాదించి బ్రౌన్ దొరకిచ్చెనఁట. అంత నాతనిని బ్రౌన్ దొర యనుగ్రహముతోఁ జూచుచు, శైవ సంప్రదాయములను గుఱించి యప్పుడప్పుడడుగు చుండెనఁట. ఈ సంగతి యంతయుఁ జూచి జమీందారుఁడు న్యాయమైన రాజీకి సమ్మతించెనఁట! ఇట్టి కథ లెన్నియో కలవు. ఎందరో పండితులు బ్రౌను వలన బాగుపడిన వారు కలరు. వారి సంతతి వారిప్పటికిని మంచి స్థితిలో నున్నారు. పూర్వపు రాజుల వలెఁ దన మీదఁ పద్యము చెప్పిన వాని కెల్లను బ్రౌను ఏదో యొక యుపకారము చేయుచునే యుండెను. బ్రౌను దొరగారి యాస్థానమొక జమీందారుని యాస్థానము వలె నుండెను. ఈతఁడు సంపాదించిన గ్రంథములన్నియు నిప్పుడు చెన్నపట్టణము అముద్రిత గ్రంధాలయమున నున్నవి. ఈతని సంగ్రహమును దొరతనము వారు ధనమిచ్చి కొనినట్లు కానరాదు. ఈతఁడు ప్రతి పుస్తకమును ఎంత శ్రద్ధతోఁ జదువుచుండెనో యాతఁడు ఆయా గ్రంథముల మీద వ్రాసియుంచిన షరాల (రిమార్కుల) వలనఁ దెలియఁగలదు. వాని నన్నిటిని చక్కగ నభ్యసించి యెవరైనను ఈతని చరిత్రము

సాంగముగ వ్రాయుదురు గాక.

(ఈతఁడు తెలుఁగు గ్రంధములను సంపాదించుటకు నెట్టి ప్రయత్నములు చేయుచుండెనో, ఎంతెంత ధనము వెచ్చించుచుండెనో తెలియుటకు నాతనికిఁ బెదగంజాము నుండి యొకఁడు వ్రాసిన యుత్తరమిచ్చుట నుదాహరించుచున్నాను.

మహాజరా రాజశ్రీ సీ.పి. బ్రౌన్ దొర వారి దివ్య సముఖానకు –

గుంటూరు జిల్లా యిల్కా బాపట్ల తాల్కూలో చేరిన పెద గంజాం కాపురస్థుఁడైన గంజాం పెద అప్పయ్య హరిదాసు వినయవిధేయ పూర్వకముగా వ్రాస్కున్న విజ్ఞాపనలు యేమంట్టే –

పల్నాడు వీరచరిత్రలనే గ్రంధమును నాద్వారా వ్రాయిచి పంపించవలసినదిగా తమరు మహారాజశ్రీ గుంటూరు జిల్లా కలెక్టరు దొరగార్లు మేష్టరు యె.పార్వీసు దొరవారుకు వ్రాయించి నందున్ను ఆయ్న్ను గారు నన్ను పిలిపిఁచ్చి రూబుగారీలో శలవు యిచ్చిన ప్రకారమునూ  తమరు నాప్యార వ్రాయించి వుండె వుత్తరాల ప్రకారమున్నూ యింత మట్టుకు 16 కథల గ్రంథమును గోవ కాకితాల మీఁద 5 బుక్కులలో  వ్రాసి వారి తావున దాఖలు చేసి వున్నందుక్కు అవి తమకు చేరినట్లు తిర్గి నా ప్యార 1853 సంవత్సరం పిబరెవరు నెల 15 తారీఖున వుత్తరం వ్రాయిస్తూ అందులో లేవని వ్రాయించిన 3 కథలలో బాలగోపన్నతో బ్రహ్మినాయుడు కోడిపోరుకు పోయిన కధనున్ను వుత్తండ వీరుల గంగాధర మణ్గులో ప్రాణలింగాలు పట్టిన కథానున్నూ సెప్టెంబరు బుక్కులో వ్రాసి వున్నాననిన్నీ తక్కిన అన్నగరాజు రాజ్యం చేస్ని కథ ఒకటిన్ని అంతు ఈ రెండు కథలున్నూ నా తావున లేకపోవటం చేత వాటిని గురించి విచారిస్తే యిక్కడ్కి షుమారు 24 ఆమడ దూరం గల బెండమూరి లంకలో వున్నట్టు తెలుస్తుందనిన్ని నాకు భత్య ఖర్చుకు యేమీ యింట్లో నా చిన్న వాండ్ల ఖర్చుకు యేమి ఆ గ్రంథాలు వుండె మాలకుదార్లకు యేమైన యిస్తేనే గాని వ్రాసుకోవడమునకు యివ్వరు గనుక వాండ్లకు యివ్వడముకు యేమి రూ 50 రూపాయలు దయచేయిస్తే నేను బెండమూడి లంకకు వెళ్లి బాహుళ్యం గల సదరు

కథలు రెండున్నూ సాధించి వ్రాసి తీస్కుని వచ్చి దాఖలు చేస్తానని యిదివరలోనే సదరహి దొరవారి ప్యార అర్జీల ద్వార విశదపర్చుకొని వున్నాను. వారి వల్ల తమ చిత్తానకు విశదమయ్యే వుందును. ఆ కథలు రెండున్నూ ఆగత్యం కావలసిన పక్షమందు సదర్ను వ్రాసుకున్న ప్రకారం నాకు ఖర్చుకు 50 రూపాయిలు దయచేయించినట్టులైతే అవి సాధించి తీస్కుని వచ్చి వ్రాసి పంపించుకుంటు వున్నాను. యిదివరలో శలవు ప్రకారం నేను వ్రాసి పంపించుకొని వున్న గ్రంథాలకు నాకు యిప్పిస్తామన్న రు 50 రూపాయలు మింజుమలే యిదివరలో యిప్పించి వున్న రు. 25 యిరువై అయిదు రూపాయలు గాక తక్కిన రు 25 రూపాయలున్నూ నాకు దయచేయించ గలందులకు సదరు దొరవారి ప్యార శలవు దయచేయించ వలెనని వేడుకుంటున్నాను. మొదట పార్వీసు దొరవారు నన్ను పిలువనంపించి యీ గ్రంథం వ్రాసి యివ్వవలసినదిగా అడ్గినంతలో నా తావు వుండె 11 గ్రంథముల సేహారిస్తూ వ్రాసి యిచ్చినందున అవి గోవ కాకితాల మీద వ్రాసి యిచ్చే నిమిత్తం 50 రూపాయలు నిష్కర్ష యేర్పరచి నా తావ్ను వుండె 11 కథలకు జాబితా తీస్కున్నందు సదరు జాబితాలో నమోదు అయి వున్న 11 కథలు గాక తమ యొక్క అనుగ్రహం సంపాదించుకోవలెననే తాత్పర్యం చేత యీ దేశమందు యితర్ల వద్ద కథలు 5 అయిదు కథలు వ్రాసి యిచ్చివున్నాను. మొదట నేను రు. 50 లు కలుప్పుకొని వ్రాయవలసిన కథల కంటె 5 కథలు జాఫా వ్రాసి యిచ్చి వున్నాను. గనుక నాకు రావలసిన రు. 25 న్యాయంగా దయచేయించవలెనని తమ యొక్క ఘనాన్ని మిక్కిలి ప్రార్థిస్తూన్నాను. దివ్య చిత్తాన్కు తేవలయును. 1753 సం॥ జూన్ నెల 11 తేది గంజాం పెద అప్పయ్య హరిదాసు వ్రాలు.")

(వా. వె. 15. పేజీ 99)

## బుక్క పట్టణము రాఘవాచార్యులు

ఈతఁడు పరమపదించి పదునైదు సంవత్సరముల కంటె కాలమై యుండదు. వీరిది గుంటూరు. ఈతఁడు డిప్యూటీ తహసీలుదారు పనిచేసెను. హోనరేబిల్ డి.యస్.

గ్రైకల్ దొర వారి యుత్తరపు ప్రకారము, ఆంధ్రదేశ చరిత్రమునకై సాధనములను సంపాదించుటకుఁ బ్రారంభించి, పెక్కు తామ్ర శాసనములను సేకరించి, చదివి, వానిని వ్రాసి యొక సంపుటము సిద్ధపఱిచెను. ఆ శాసనముల ననుసరించియు, మెకంజీ సంగ్రహ మందలి యాధారముల నాశ్రయించియు నాతఁడు ఆంధ్రదేశ చరిత్రమును రెండు భాగములుగ వ్రాసెను. ఒక భాగమందు కొండవీటి రెడ్ల చరిత్రమును, రెండవ భాగమందు గజపతుల చరిత్రమును ఉన్నవి. గజపతుల చరిత్రము నందు మనకిది వఱకుఁ దెలియని కొన్ని విశేషములు కలవు. ఈ రెండు భాగములును ఇటీవల జెన్నపట్టణము అముద్రిత గ్రంథ సంగ్రహాలయమునకు వచ్చినవి. మూఁడవ భాగమనగా శాసనముల భాగము మాత్రము కానవచ్చుటలేదు. ఈతఁడు సంపాదించిన శాసనములనన్నింటిని ఈతని తరువాతి వారు కరిగించి కాఁగు చేసికొనిరని తెలియుచున్నది. శాసనముల యోగ్యత యెఱుంగని వారింత కంటె నేమి చేయఁగలరు?

## రంగాచార్యులు గారు

ఆంధ్ర పరిశోధకులను గుఱించి చెప్పునప్పుడు కీర్తిశేషులయిన మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులు గారును, వారిచే స్థాపింపఁ బడినదియు, వారి పుత్ర పౌత్రులచే నభివృద్ధి చేయఁబడుచున్నదియు నగు విశాఖపట్టణ మందలి ఆర్ష పుస్తకశాలయు, విశేష సంస్మరణీయములని వచించుటకు సందియము లేదు. ఇందు మన దేశము నందు దొరకు గ్రంథములేకాక, ద్వీపాంతరములందు గాని దొరకని అద్వితీయ సంస్కృత గ్రంథములకుఁ బ్రతులు తెప్పించి యుంచుట యెంతయుఁ బ్రశంసనీయము. ఆచార్యుల వారిచేఁ బ్రారంభింపఁబడిన సంస్కృత మహాకోశము పూర్తియై యుండిన యెడల వాచస్పత్యాది కోశములు వెనుకఁ బడియుండును. అది అసంపూర్తిగ నుండుట యాంధ్రుల దురదృష్టమనియే చెప్పవలయును.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రమునకై కృషి చేసిన గురుజాడ శ్రీరామమూర్తి

పంతులుగారిని, కందుకూరి వీరేశలింగము పంతులు గారిని ఆంధ్రులెన్నడైనను మఱువఁగలరా? వీరేశలింగము గారి ప్రతిభ సకల దిక్సంచారి. వారు వ్రాయని విషయము లేదు. చేయని సత్కార్యము లేదు. కావున నితర ఘనకార్యములకై వారి కీర్తి తెనుఁగు దేశమునందు చిరకాలము వ్యాపించి యుండు ననుటకు సందేహము లేదు. అట్లైనను వారు మఱియే ఘనకార్యమును చేయక యుండి, మఱియే గ్రంధమును వ్రాయక యుండి, యొక్క యాంధ్ర కవుల చరిత్రమును మాత్రమే వ్రాసి యుండినను వారి కీర్తి యజరామరమై యుండుట నిక్కము. ఇఁకముందు నాంధ్ర భాషను గుఱించి యెన్ని గ్రంథములైనను పుట్టును గాక; వాఙ్మయ చరిత్రము దెలిసికొనగోరు విద్యార్థికి దీని పఠనము అపరిహార్యము.

పైని పేర్కొనఁబడిన వారు గాక కీర్తిశేషులైన పరిశోధక మహాశయులు మఱికొందఱుందురు. కాని, నా యజ్ఞాన మూలముననను కాలహరణ భీతి చేతను ఇచ్చట వారందఱి నామములను స్మరించుటకు వీలులేదని చింతిల్లుచున్నాను. మన సమకాలికులైన శ్రీయుతులు వేణుగోపాలచెట్టిగారు, జయంతి రామయ్య పంతులు గారును, మానవల్లి రామకృష్ణ కవి గారును, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారును, వంగూరి సుబ్బారావు గారును, బుర్రా శేషగిరిరావు గారును, ఆంధ్రేతిహాస పరిశోధక మండలియు, వేంకటరమణ కవులును, మఱికొందరును నూతన విషయములను కనుగొనుటకును, పురాతన విషయములను నూతనముగ నన్వయించుటకును యత్నము చేయుచున్నారు గనుక వారును మనకు స్మరణీయులే.

ఇట్లు పూర్వాచార్య సంస్మరణముఁ గావించి వాఙ్మయ సంబంధమైన కొన్ని నూతన పరిశోధనలను గుఱించి ముచ్చటించెదను.

## యుద్ధమల్లునకుఁ బూర్వపుఁ దెలుఁగు పద్యములు

నన్నయభట్టునకుఁ బూర్వము తెలుఁగునఁ బద్యరచన లేనే లేదనియు, నది నన్నయచే నూతనముఁగ బుట్టింపఁబడెననియుఁ దలంచెడు పండితులు కొందఱు మన దేశమునందుఁ గలరని మీరెఱుంగుదురు. పూర్వలిపి పరిశోధన

శాఖ వారికి బెజవాడలో యుద్ధమల్లుని శాసనము దొరకినప్పటికి నుండియు నీ వాదము పూర్తిగ ఖండితమైనది. ఆ శాసనమును శ్రీయుత జయంతి రామయ్య పంతులు గారు ఆంధ్ర పరిషత్పత్రికలోను, ఎపిగ్రాఫియా యిండికాలోను ప్రకటించియున్నారు. అది 927వ సంవత్సరము మొదలు 934వ సంవత్సరము వఱకు వేంగి దేశమును పాలించిన చాళుక్య యుద్ధమల్లుని శాసనమని వారు నిరూపించి యున్నారు. అందుపై గొన్ని వాద వివాదములు గూడ జరిగినవి. నిష్పక్షపాత బుద్ధితో విచారించు మహనీయులకు నా శాసనము నన్నయ్యకు రమారమి నూరేండ్లు పూర్వపుది యని తోఁపక మానదు. అయినను ఇందుకు నొప్పుకొనని వారు కొందఱు కలరు. ఇంగ్లండులో నింకను భూమి గుండ్రముగ లేదు, బల్లపరువు వలెనే యున్నది అని వాదించువారు కూడఁ గలరు! వారికి సమాధానము చెప్పుట యెవరి తరము?

యుద్ధమల్లుని శాసనము సంగతి యిట్లుండగా నంతకంటే బూర్వపు తెలుగు పద్యములు బయలుదేరినవి. వానిని నేఁడు మీకు సమర్పింపబోవు చున్నాఁడను. ఇందొకటి సీసపద్యము, మఱియొకటి తరువోజ. ఈ శాసనములు క్రొత్తవి కావు. ఇందలి పద్యములను కనుఁగొని, వాని యతిప్రాసగణములఁ బరీక్షించి, యివి తెలుఁగు పద్యములే, గద్యములు కావని నిశ్చయించుట నూతన విషయమే గాని శాసనము లదివఱకుఁ గనుగొనబడినవే. ఈ శాసనములు బటర్‌వర్తు వేణుగోపాలచెట్టి గార్లచేఁ బ్రకటింపబడిన 'నెల్లూర్ ఇన్‌స్క్రిప్షన్స్' అను గ్రంథము యొక్క రెండవ సంపుటమునందు నీయఁబడినవి. ఇవి యాంధ్ర భాషా చరిత్రమునకుఁ జాల ముఖ్యమైనవి యైనను ఇన్ని దినముల వఱకుఁ బండితుల దృష్టిని నెంతగ నాకర్షింపవలయునో యంతగా నాకర్షింపక పోవుట యాశ్చర్యము. ఇందలి యొక శాసనము పద్యమయమైయుండునని శ్రీయుత చిలుకూరు వీరభద్రరావు గారు తమ ఆంధ్రుల చరిత్రలో వ్రాసిరి. అదియే మంజరీ ద్విపదయై యుండునని యొక తావునను, తరువోజయని మఱియొక తావునను శ్రీయుత వంగూరు సుబ్బారావు గారు తమ వాఙ్మయ చరిత్రము నందు వ్రాసియున్నారు.

సీసపద్యము గల మొదటి శాసనము ఎవ్వరి దృష్టిని ఆకర్షించినట్లు కానరాదు. ఈ మధ్య విజ్ఞాన సర్వస్వము యొక్క ఆంధ్ర సంపుటమునకై ప్రాచీనాంధ్ర భాషకు సంబంధించిన శాసనములను అభ్యసించుచుండగా నీ రెండు శాసనములును తప్పక పద్యమయములని నా మనసుకుఁ దోఁచి, కొంత ప్రయత్నించి చూచి, యవి పద్యములేయని నిశ్చయించుకొంటిని. ఈ రెండు శాసనములను యుద్ధమల్లుని పెదతాతయైన గుణగ విజయాదిత్యుని కాలము నాటివి. తరువాతి కాలము వారీతనిని గణగ విజయాదిత్యుఁ డన్నను, ఈతని సమకాలికులును, ఈతని శాసనములును ఈతని పేరు 'గుణగ' 'గుణగ నల్లాత' అనియే చెప్పుచున్నవి. ఈతఁడు 845 మొదలు 888 వఱకు రాజ్యము చేసెను. ఈతని మంత్రి పండురంగఁడను వాఁడు. ఈతని శాసనముల నన్నిటిలోను ఈ మంత్రి పుంగవుఁడే 'ఆజ్ఞప్తి'గా నుండును. ఇప్పుడు గుడివాడలోను, ఇతరత్రను 'పంద్రంగ' వారు కలరు. వారికి నీతనికి నేమైన సంబంధము కలదేమో విచారింపవలయును. ఇఁక శాసనములను విచారింతము.

మొదటి శాసనము నెల్లూరు జిల్లా కందుకూరు గ్రామము లోనిది. ఇది 'నెల్లూరు ఇన్‌స్క్రిప్షన్స్' అను గ్రంధము యొక్క రెండవ సంపుటములో 544వ పుటలో నీయబడినది. ఈ రాయి యాగ్రామమునందు రామస్వామిమేడ అను దేవాలయములోని గోడలోఁ గట్టబడి యుండెను. దానిని శ్రీయుత వేణుగోపాల చెట్టి గారు తీయించి తాలూకా కచేరిలోఁ బెట్టించిరి. ఇట్లు వారు చేసి యుండకుండిన మనకిప్పుడా రాయి లభించి యుండదు. ఈ రాతిని స్వయముగాఁ జూచి గ్రంథములో నీయబడిన పటములో బాగుగఁ గానరాని యక్షరములఁ గొన్నిటినైనను కనుఁగొనవలయునని నేను ఆ రాయి తాలూకా కచేరిలో నున్నదా లేదా యని విచారింపగా, తాలూకా కచేరి రెండు మూడు స్థలములకు మాఱినందున నిప్పుడా రాయి యెచ్చటను కానవచ్చుట లేదని మొన్ననే మా మిత్రులైన శ్రీయుత సరస్వతీ గారి వలనఁ దెలిసిది! కావున నిప్పుడు శ్రీయుత చెట్టిగారు తమ గ్రంధమందిచ్చిన

ఛాయాపటమే మనకు నాధారము. దానిని బట్టి చూడ నీ శాసనమందు సీసపద్యముండెనని స్పష్టపడుచున్నది. ఈ పద్యమందలి రెండు చరణములు స్పష్టముగ నున్నవి. అందుపోయిన మూడు నాల్గక్షరములును మన యూహచేఁ బూర్తి చేసి, రెండు తావుల ఉత్వ సంధిని విడదీసిన యెడల యతులతోఁ గూడ సీసపాదము లేర్పడుచున్నవి. మూడవ పాదములో సగమును, నాల్గవ పాదమున నుత్తరార్ధమును ఇట్లే స్పష్టపడుచున్నవి. ఇప్పుడు మనము తాటాకు గ్రంథముల నుండి పద్యములను వ్రాసి కొనునప్పుడు లక్షణము సరిపోవుటకుఁ జేయునట్టి స్వల్పమైన మార్పుల వంటివే యీ మార్పులు గాని అంతకంటెఁ బెద్దవి కావు. నిండు సున్న యున్న చోట అఱసున్నగ మార్చుచున్నారము. 'ని' అని చివర నున్న యెడల 'న్' అని నకార పొల్లుగ మార్చుచున్నాము. అట్లే మూలమందుఁ గొన్ని మార్పులు చేసినఁ బద్యము సిద్ధించుచున్నది.

ఇందురాజైన గుణకేనల్లాతని పేరును, ఆతని మంత్రియైన పాండురంగని పేరును స్పష్టముగ నున్నవి. కావున దీని కాలనిర్ణయమును గుఱించి యే విధమైన సంశయమును లేదు. ఇట్లు ఈ పద్యము యొక్క పద్యత్వమును గుఱించియు, కాలమును గుఱించియు నిశ్చయ చిత్తులమై (ఇక) రెండవ శాసనమును గూర్చి విచారించెదము.

ఈ శాసనము శ్రీ చెట్టిగారి గ్రంథమునందు 896వ పుటలో నీయఁబడినది. ఇయ్యది యిప్పటి గుంటూరు జిల్లాలోని అద్దంకి గ్రామము నందు నున్నది. దీని ఛాయాపటమును గ్రంథమునం దీయఁబడినది. కాని యంత స్పష్టముగ లేదు. ఎపిగ్రాఫి డిపార్టుమెంటు వారికి వ్రాసి దీని ప్రతి యొకటి కొత్తగాఁ గొట్టించి తెప్పించితిమి. కాని యీ రాయి యెండకెండి వానకు నాని చలికి వణుకుచు నెచ్చటనో యెవరి దొడ్డిలోనో పడియున్నందున చెట్టిగారి కాలము కంటె మిక్కిలి దురవస్థలో నున్నది. అయినను కొన్ని యక్షరముల నిర్ణయమునకు సహకారియైనది. ఇది పరమ మాహేశ్వరుండయిన పాండురంగనిచే నాదిత్య భట్టారకునకు నీయఁ

బడిన దానమును తెల్పును. ఇది గద్య పద్యాత్మకము. మొదటి 7 పంక్తులును పద్యమయములు. 8 మొదలుకొని 11వ పంక్తి వఱకు గద్యము. ఇందలి వృత్తము తరువోజ. ఇది పెద్ద వృత్తము. గద్యమును జూచి పద్యమను కొనుటకు నెంత మాత్రమును వీలులేనంత పెద్దది. ద్విపద యొక్క రెండు చరణములు కలిపి దీని చరణ మొకటి యగును. నాలుగు చరణములందును ప్రాస యుండును. ఒక్కొక్క చరణములో మొదటి యక్షరముతో నాల్గు స్థలములందు యతి యుండును. అనగాఁ బ్రతిచరణము నందును నాల్గుచోట్ల యతి మైత్రి గల యక్షరములే యుండవలయును. ఇన్ని కట్టుదిట్టములతో నున్న పద్యమును అన్యముగాఁ జెప్పుటకు నెవ్వరికి వీలులేదు.

ఇట్లు నన్నయ్య భట్టు కంటె రెండు వందల యేండ్లకుఁ బూర్వమును, యుద్ధమల్లుని కంటెఁ దొంబది యేండ్లకుఁ బూర్వమును తెనుఁగునందు బద్యకవిత్వముండెననియు, శాసనముల మీఁదఁ గూడఁ బద్యములు చెక్కించుచుండిరనియు నిశ్చయింపవచ్చును.

మనకు దొరకిన యీ రెండు పద్యముల యొక్క వృత్తములను గుఱించి యొక విశేషము కలదు. మొదటిది సీసము, రెండవది తరువోజ. ఈ రెండును అచ్చ తెలుఁగు వృత్తములని చెప్పవచ్చును. కొందఱ మతమునఁ దెనుఁగు వృత్తములందు స్వతంత్రములయిన వేవియు లేవు. కొన్ని సంస్కృతము నుండియుఁ , గొన్ని కన్నడము నుండియుఁ దీసికొనఁ బడినవఁట. కాని సీసపద్యమును గుఱించి యట్లు చెప్పుటకు వీలులేదు. సీసపద్యము సంస్కృత వృత్తముల లోనిది కాదు. కన్నడమునందు దీనికిఁ బ్రచారము లేదు. దీనికిఁ దెనుగుననే ప్రచారము కలదు. 990 ప్రాంతము వాడైన నాగవర్మచే రచింపబడిన ఛందోంబుధి యందు సీసపద్యోదాహరణమొకటి యున్నది. కాని ప్రక్షిప్తమని కొందఱి యభిప్రాయము. అది ప్రక్షిప్తమైనను గాకపోయినను, కర్ణాట వాఙ్మయమునందు సీసపద్యమును ఉపయోగించిన వాఁడరిది. గొప్పకవి యెవఁడును ప్రయోగించి యుండలేదని తజ్ఞుల యభిప్రాయమై యున్నది. ఇఁకఁ దెనుగుననో దానిని ఉపయోగింపని కవియే లేడు. కావున దీనిని అచ్చ తెలుఁగు వృత్తమని చెప్పిన యెడల నతిశయోక్తి కానేరదు.

ఇదియుఁ గాక ఛందోంబుధి చెప్పిన నాగవర్మ వేంగి విషయము వాఁడు అనగా నాంధ్రుడు. ఆతఁడు సీస పద్యమునుఁ దన కర్ణాట గ్రంథమునందు నిజముగనే చెప్పియున్న యెడల నది తెలుఁగు దేశమునందు నేర్చుకొనినదే యని మనమూహించవచ్చును.

తరువోజ వృత్తముఁ గూడ నిట్టిదిగానే కాన్పించుచున్నది. ఇయ్యది సంస్కృతచ్ఛంద శ్శాస్త్రమునందు గాని, కర్ణాటచ్ఛందశ్శాస్త్రమందు గాని కాన్పింపదు. రెండు ద్విపద చరణములతో దీని చరణ మొక్కటి యగును. సంస్కృతమునందు ద్విపద కును నామసామ్యము తప్ప మఱియే సంబంధమును లేదు. దానికి రెండు చరణములుండును. దీనికి రెండు చరణములుండును. గణములు మాత్రము వేఱువేఱు. సంస్కృతము నుండి తీసుకొనబడినఁ యక్షర గణములకుఁ దెనుఁగున బ్రాస నియమముండినట్లు దీనికిఁ బ్రాస నియమమున్నందున నిది సాంస్కృతికమేమో యన్న సంశయము కలగవచ్చును. కాని యట్లు సందేహింప నక్కర లేదు. కన్నడ ఛందశ్శాస్త్రమునందు ద్విపద వంటి వృత్తమొకటి చెప్పఁబడినను వాఙ్మయమునందు దానికిఁ బ్రచారము లేదు. తెనుఁగుననో వాఙ్మయము నందేకాక, బ్రతి గృహమునందును, నాఁడువారి పాట రూపముగ ననాది కాలము నుండియు వ్యాపించి యున్నది. కావున దీనిని 'తెలుఁగు వృత్త'మని చెప్పుటకు నేమియు సంశయము లేదు.

నన్నయకుఁ బూర్వము గవిత్వము నొల్లని వారీ పద్యముల నొక విధముగ నాక్షేపింపవచ్చును. అసంపూర్తిగ నున్నవియు, తొట్టి మొట్టిగ నున్నవియు నగు నీ పద్యములు నన్నయ కావ్యముల యెదుట లెక్కయా, ప్రమాణములా? యని వారనవచ్చును. యుద్ధమల్లుని శాసనమందలి పద్యములను గూడ వీరు 'తొట్టి మొట్టి పద్యము'లని యాక్షేపించి యున్నారు. కాని ఈ యాక్షేపణయే వీరు తమ మూల వాదమును వదలుకొనిరని తెలుపుచున్నది. ఈ పద్యములను మేమొక కావ్యమని యుదాహరించి యున్న యెడల బూర్వము తెలుఁగునఁ బద్యరచనయే లేదు; సంస్కృతమును, కన్నడమును చూచి యొక దినము నన్నయయే మొట్టమొదటఁ

దెనుఁగు పద్యము రచించెను అని వారి వాదము. దానికి బదులుగ పై పద్యములు చూపఁబడుచున్నవి. ఒక పద్యము మాత్రము గాదు, గణయుక్తమైన యొక చరణము నన్నయకుఁ బూర్వపుది తెలుగున దొరకినను వారి వాదమంత నంతరింపవలసినదే. నన్నయకుఁ బూర్వము నియమితేంద్ర చంద్ర సూర్యగణములతోఁ గొన్ని తెలుఁగు వృత్తములఁ దెనుఁగు వారు పాడుచుండిరనియు, నన్నయలో గానవచ్చెడి యతిప్రాస నియమములు అంతకు బూర్వమే యుండెననియు, నన్నయ పుట్టించినవి కావనియు నొక్క పద్య చరణము స్థాపించఁగలదు. కావున నిట్టి వానిని నాంధ్ర వాఙ్మయ చరిత్రమును తెలిసికొనఁ గోరు వారు అనాదరణతోఁ జుచుటకు వీలులేదు.

## ప్రాస చంపకమాల

గుణక విజయాదిత్యుని మఱియొక శాసనమునందు నొక విశేషము కలదు. ఈ తామ్ర శాసనము క్రొత్తగా దొరకినది. కృష్ణా జిల్లా, గుడివాడ తాలూకాలోని సాతలూరను గ్రామమున దొరకెను. శ్రీయుత నాగేశ్వరరావు గారి మూలమున నాకు లభించినది. దానిని c రాఁబోవు సంవత్సరాది సంచికలోఁ బూర్తిగఁ బ్రకటించుచున్నాను. ఇచ్చట నందలి యొక్క విశేషము మాత్రము చెప్పెద. అందు కవిచే పిట్టరుఁ డనబడు విష్ణువర్ధనుని వర్ణించుచు సంస్కృతమున నొక చంపకమాలా వృత్తము చెప్పఁబడినది. దాని నాలుగు చరణములందును ప్రాస కలదు. యతి మాత్రము సంస్కృత సంప్రదాయమనుసరించియే యున్నది. ఆంధ్ర సంప్రదాయ మనుసరించి లేదు ఆ పద్య మెద్ది యన –

## చంపకమాల

అరి నృప వాజి వారణ పదాతి మహాభ్రవిరామ మారుతః
పర కర నస్త్రితాసిభరు భిప్ర పినాశన భాను సన్నిభః
గురు తర దీన భారవత మానవ మానిత కల్ప పాదపః
వర కరి గల్ల భూమిప భూజాసిరిహాజి భువి ప్రహాసతే.

చంపకమాలా వృత్తము సాంస్కృతికమైనను దానికి సంస్కృత వాఙ్మయము నందు విశేషప్రచారము లేదనుట యందఱకుఁ దెలిసిన విషయమే. కర్ణాటాంధ్ర భాషల యందు నది విశేషముగాఁ గాన్పించుచున్నది. అట్లే ద్వితీయాక్షర ప్రాస విషయమును. ఈ రెండును దేశ భాషలందుఁగలవు. సంస్కృతమునందు లేవు. కావున పై శ్లోకము సంస్కృతము నందున్నను, అది దేశభాషా సంప్రదాయము ననుసరించి వ్రాయఁబడె ననుటకు సందియము లేదు. అనగాఁ దొమ్మిదవ శతాబ్దము నందు గుద్రవాడ విషయములో, అనగా గుడివాడ ప్రాంతమునందు దెనుఁగు కవులు ప్రాసయుక్తమైన చంపకమాలా వృత్తమును రచించు చుండిరని మన మీ సంస్కృత శ్లోకము వలన నూహింపవచ్చును. అప్పటికి వృత్తములలో యతి పాటింపఁ బడుచుండెనో లేదో ఈ పద్యమును బట్టి నిశ్చయముగా చెప్పలేము. కన్నడము నందు వలెనే యతి నియమము తెనుఁగునందు మొదట లేకయుండెనేమో? భావి పరిశోధన వలన గాని యీ సంగతి తేలనేరదు.

పైని నుదాహరింపఁబడిన తెలుఁగు సంస్కృత పద్యములు నన్నయభట్టునకు రమారమి రెండు వందల సంవత్సరములు పూర్వకాలపువి. అనగా నంతగా నెక్కుడు ప్రాచీనములు కావు. కావున నన్నయ కాలపు వ్యాకరణ ఛందో లక్షణములు చాల వఱకు వానికిఁ బట్టుచున్నవి. ఆ కారణము చేతనే మనము వానిని పద్యములని గుర్తింపఁగలిగితిమి. కాని యా కాలమునకుఁ గూడ బూర్వపు వాఙ్మయమును పరిశోధించునప్పుడు, సర్వకాలములందును ఛందోవ్యాకరణ లక్షణము లొక్కరీతిగా నుండవన్న సత్యమును శోధకులు మఱువక యుండవలయును. లేనియెడలఁ బద్యములు గద్యముల వలెను, సలక్షణ వాక్యములు తప్పుల వలెను, నాగరక పదము లెఱకలి బాస వలెను దోఁచి, మనము పెడమార్గమునం బడవచ్చును. కావునఁ బురాతన శాసనములను శోధించు మహనీయులు తమ ప్రజ్ఞావిశేషముచే గుణక విజయాదిత్యునకుఁ బూర్వపు టాంధ్ర పద్యరాజములను గూడ గుర్తించి యాంధ్ర లోకమున కొసంగుదురు గాక.

## నన్నయభట్టాది కవియే

నన్నయ భట్టారకునకుఁ బూర్వము దెనుఁగు కవిత్వమున్నంత మాత్రమున ఆతని గౌరవమునకు గాని, ఆదికవి యన్న బిరుదమునకు గాని, యేవిధమైన లోపమును రాఁజాలదు. ఇప్పుడు మనము పఠించెడి ఆంధ్ర మహాకావ్యములలో మొట్ట మొదటిది యాతనిదే. ఆంధ్ర ఛందోవ్యాకరణ లక్షణములకు నాతని భారతమే ప్రథమ ప్రమాణము. అంతకుఁబూర్వము కావ్యము లుండిన నవి లోపించినవి. కావున నీతఁడే ప్రథముఁడని చెప్పుట లోపము గాదు. అది యొక విధముగ సత్యమే. ఇట్టి బిరుదములకుఁ గొంతవఱకు నౌపచారికార్థము గ్రహింపవలెను. సంస్కృతమున వాల్మీకిని ప్రథమ కవి యందురు. అంతకుఁ బూర్వపువి యగు వేదములలో ఛందములు లేవా? వేదములు పౌరుషేయములా, అపౌరుషేయములా యనిన వాదమటుండనిచ్చినను, మంత్రద్రష్టలైన యెందఱు ఋషులకు కవులన్న బిరుదములు లేవు? అసుర గురువైన శుక్రాచార్యుఁడు కవిగాడా? శుక్రాచార్యులు మొదలా? వాల్మీకి మొదలా? చతుర్ముఖ బ్రహ్మకుఁ గవియన్న బిరుదము గలదు. అది యట్లుండె. కాళిదాసును 'కవికులగురువం'దురు. అప్పుడు వాల్మీకి యేమాయె? పెద్దనను 'ఆంధ్ర కవితాపితామహు'డందురు. పదునొకండవ శతాబ్దమున నున్నవాడుఁను, ఆంధ్ర భాష పితయునగు నన్నయకు పదునారవ శతాబ్దము నందున్న పెద్దన తండ్రి యని యా యీ బిరుదమునకు అర్థము? కావున నీ బిరుదములకు ఔపచారికముగను, లాక్షణకముగను అర్థమును గ్రహించు నెడల నన్నయకుఁ బూర్వమాంధ్ర వాఙ్మయమున్నదను కొను వారికిని, లేదనుకొను వారికి, గూడ యే వివాదములతో నవసరముండదు.

## పరిశోధనకు నూతన ప్రదేశములు

మన పరిశోధకు లిదివఱకు నెక్కువగా నుత్తర సర్కారులనే తెనుఁగు దేశముగ భావించి పరిశోధనలన్నియు నటువైపులనే జరిపియున్నారు. చెన్నపురి మాన్యుస్క్రిప్టు లైబ్రరీ పండితు లిదివరకు దత్తమండలముల వైపు తాటాకు గ్రంథములకై వెళ్లలేదు.

పరిషత్తు వారు చేసిన ప్రయత్న మత్యల్పము. కృష్ణదేవరాయని రాజధానికి నాసీమంతాద్భాగము నందున్న దేశముల విడిచి పెట్టుట యెట్టి తెలివి గల పని? ఈ జిల్లాలలో నచ్చటచ్చట కొన్ని మఠములు కలవనియు గ్రిందటి సంవత్సరపు ఎపిగ్రాఫీ రిపోర్టులో జదివినట్లు జ్ఞాపకము. ఈ మఠములు జంగము మఠములో వేఱు మఠములో తెలియదు. కాని తెనుఁగు దేశమునందు నితరత్రను జంగము మఠములలో శైవవాఙ్మయ మపూర్వమైనది కలదని నా తాత్పర్యము. నేనిటీవల పరిష్పత్రికలో బ్రకటించినదియు, దిక్కనకుఁ బూర్వపుదియు నగు శివతత్వ సారమను గ్రంథము జంగముల యింటనే దొరకెను. సాధారణముగా నీ జంగము మఠస్థులు పరమతముల వారికి గ్రంథములీయరు. అయినను మన సదుద్దేశములను వారికిఁ దెల్పి చెప్పియు, వేఱు విధములను బ్రయత్నించి యిట్టి మఠములలోని గ్రంథములను సంపాదించవలెను.

అట్లే మైసూరు రాజ్యమునందును కొంత తెనుఁగు దేశము కలదు. అచ్చటను అపూర్వ గ్రంథములు కొన్ని దొరకవచ్చును. హరిభట్టు రచితమైన నృసింహ పురాణమును, అహోబల రచితమైన చిత్ర కవిత్వ లక్షణమును మఱికొన్ని మనమిది వరకు వినని గ్రంథములు మైసూరులో నున్నవని నాకుఁ దెలిసినది. వానిని సంపాదించుటకు యత్నించు చున్నాఁడను.

## హైద్రాబాద్ రాజ్యము

ఆంధ్రదేశమును గుఱించియు, నాంధ్ర రాజుల గుఱించియు, నాంధ్ర వాఙ్మయమును గుఱించియు నెక్కుడు పరిశోధనము చేసి క్రొత్త క్రొత్త వింతలను కనుఁగొనఁదలఁచిన వారికి హైద్రాబాద్ రాజ్యమందలి తెలుఁగు భాగ మొక బంగారము వంటిది. బ్రిటిషు ప్రభుత్వమందలి తెలుఁగుదేశమును, నైజాములోని తెలుఁగు దేశమును ఒకటికి నొకటి తగిలియున్నను ప్రభుత్వములు భిన్నములగుటచే నుత్తర సర్కారులోని తెలుంగు వారికి హైద్రాబాదు రాజ్యమందలి తెలుఁగు దేశమొక యండమాను దీవి వలెఁ దోచుచున్నది! కాని నైజాము రాజ్యమందలి మన

బాంధవులను గుఱించి మనమింత భయపడవలసిన పనియు లేదు. ఇంత యౌదాసీన్యముగ నుండుటయు న్యాయము కాదు. నేను ఒక విధముగ నీ యాంధ్రదేశ ద్వయమునకు సంబంధము గలవాడను. నేనుండు మునగాల జమీందారి యొక దీవి గడ్డవలె నైజాము రాజ్యమునకు నడుమ నుండును. మాకుఁ జుట్టు సరిహద్దు నైజాము రాజ్యమే. రాజకీయముగ మేము బ్రిటిషు ప్రభుత్వంలోని వారిమైనను ఇతర విషయములన్నిటిలోను మేము నైజాము రాజ్యమునకు సంబంధించిన వారమే. కావున నైజాము రాజ్యమును రెండు చీలికలుగ విభాగింపవచ్చును. తూర్పు భాగమునకు 'తెలంగాన్' అనియు, పశ్చిమ భాగమునకు 'మరాఠవాడి' యని పేరు. ఈ తెలంగానులోఁ బెద్దది యగు 8 జిల్లాలు కలవు. అత్రాఫ్‌బల్దా, వరంగల్, నల్లగొండ, మెతుకు, కరీంనగర్, మహబూబ్‌నగర్, నిజామాబాద్, ఆదిలాబాద్ అను జిల్లాలను శుద్ధాంధ్ర దేశమని చెప్పవచ్చును. ఇంత వైశాల్యమును, జన సంఖ్యయుఁ గల తెలుఁగు దేశమునుఁ గుఱించి మనమేమియుఁ దెలిసికొనక యూరకుండుట న్యాయమా? ఈ తెలుఁగు భాగము మనకంటె రమారమి, నూఱేండ్లు వెనుకనున్నందున, పూర్వకాలపు గ్రామ సంఘముల యొక్కయు, ఆచార వ్యవహారముల యొక్కయుఁ జరిత్ర కనుగొన వలయునన్న నీ ప్రాంతమునందుఁ దప్ప మఱి యెచ్చటను మీకుఁ గానరాదు.

## తెలంగాణము

ఇదియే అసలు తెలుఁగు దేశమనియు జెప్పవచ్చును. తురకలు దీనికిచ్చిన 'తెలంగాన్' అను పేరు 'తెలంగాణము' అను మన మాటయే. 'ఆణ' శబ్దము దేశపరము. మహారాష్ట్ర దేశమునకును కన్నడ దేశమునకు తగిలియున్న దేశమునకు తెలంగాణము అన్న పేరుండెను. ఇచ్చటి బ్రాహ్మణులే తెలంగాణ్యులు. ఇచ్చట వ్యవసాయము చేయు కాఁపులే తెలఁగాలు. మొదటిది 'తెలంగ' రూపము, 'తెలుంగు' రూపము తరువాతది. ఈ తెలంగాణము మొదట నితర నాడుల వలె నొకనాడి. వెలనాడు, కమ్మనాడు, పాకనాడు వంటిదే యిది యొకటి. వెలనాటిలోని

బ్రాహ్మణులు వెలనాటి వారు. కాపులు వెలమవారు. కమ్మనాటిలోని బ్రాహ్మణులు కమ్మ బ్రాహ్మణులు. కాపులు కమ్మవారు. కమ్మ బ్రాహ్మణులనే మనమిప్పుడు కరణ కమ్మలనియెదము. పాకనాటిలోని బ్రాహ్మణులు పాకనాటి వారు. కాఁపులు పాకనాటి రెడ్లు. కరణ కమ్మలను వారిని పూర్వము కరణశబ్దము లేకయే 'కమ్మ బ్రాహ్మణు'లను చుండిరనుటకు శాసన ప్రమాణము లున్నవి. (చాళుక్య రాజులలో అమ్మరాజు నామము గల రెండవ రాజు యొక్క శాసనమునం దిట్లున్నది.

ఆ సవి ముఖు వాస్తవ్యో దేవార్యో దేవ సన్నిభః

భారద్వాజాన్వయం కమ్మకులజః కులవర్ధనః !!

ఈ శాసనమింకను ప్రకటింపఁ బడలేదు. బహుశ శ్రీయుత జయంతి రామయ్య పంతులు గారి యొద్ద నుండవచ్చును. ఇట్లు మిక్కిలి పురాతన కాలమునఁ దెలుఁగు దేశము చిన్నచిన్న నాళ్లుగా విభాగింపఁ బడియుండెను. కొంతకాలము పోఁగా నా నాళ్లలో తెలంగాణమను దానికి బ్రముఖత సంభవించి యదియే దేశమంతటకును, అన్ని నాళ్లకును తన నామమే యొసంగెను. అదియే యా నాళ్లలోని భాషకుఁ గూడ నామమయ్యెను. ఇందు నాశ్చర్యమేమియు లేదు. పిఠాపుర గ్రామము జమీందారీకంతకును తన పేరిచ్చినది కాదా? మద్రాస్ పట్టణము ప్రెసిడెన్సీ కంతకును పేరీయలేదా? ఇట్లు నైజాము రాజ్యమందలి తెలంగాణము తెలుగుదేశ చరిత్రమునకు విత్తనము వంటిది. కావున నా భాగమును గుఱించి మనకెంత యధికముగఁ దెలిసిన యంత మేలు. అట్టి స్థితిలో మన మా దేశమును గుఱించి యేమియు నెఱుగక యుండుట యెంత శోచనీయము?!

పురాతన చరిత్రమునకే గాక, తరువాత కాలపు చరిత్రకుఁ గూడ నైజాము రాజ్యమందలి తెనుఁగు దేశమును మన వారు శోధింపవలసి యుండును. కాకతీయుల సామ్రాజ్యమునకు ఓరుగల్లె రాజధాని గద. కాకతీయుల రాజధానికి నెంతో దూరమందున్న యుత్తర సర్కారులోనే కాకతీయుల శాసనములు ముఖ్యమైనవి పెక్కులు దొరకగా, వారి రాజధానియైన ఓరుగల్లు ప్రాంతమున జక్కగఁ బరిశోధించిన యెడల నెన్నియో శాసనములు, వేఱు చరిత్ర సాధనములును దొరక గలవనుటకు

సందేహము లేదు. 14, 15వ శత్తాము లందు విజయనగర సామ్రాజ్యమెంత వైభవమనుభవించెనో, 12వ 13వ శతాబ్దములలోఁ గాకతీయులును అంత వైభవమనుభవించిరి. కావున వారిని గుఱించి మనకెన్నియో విశేషములు తెలియవలసి యున్నది. అవి యోరుగంటి ప్రాంతమునఁ దప్ప మఱియెచ్చటఁ దెలియఁగలవు? కాకతీయులకు బూర్వము పశ్చిమ చాళుక్యులు, రాష్ట్రకూటులును, కాలచుర్యులును రాజ్యము చేసిరి. తెలుఁగు దేశమందలి వారి యేలుబడిని గుఱించి మనకేమియుఁ దెలియదు. వీరు గాక రాచవారు, వెలమవారు, మఱి యితరులును చిన్న చిన్న రాజ్యములు నేలిరి. శాసనము లటుండ నిచ్చి వీరిని గుఱించిన దంత కథలును, కైఫీయతులును పోగు చేసినను ఎంతయో నూతన విచిత్ర చరిత్ర తెలియఁగలదు. ఇందుకొక చిన్నయుదాహరణ మొసంగెదను.

## సీతాపతియె చిత్తాపఖానుఁడు

పెక్కు సంవత్సరముల క్రింద నేను ఓరుగంటికి వెళ్లి యుంటిని. అప్పుడచ్చటి కోటలో నొక శాసనము చూచితిని. ఆ రాతి మీఁది యక్షరములు స్పష్టముగ లేనందునను, అప్పుడు శాసనాక్షరములఁ జదువ నభ్యాసమిప్పుడున్నంత లేనందునను, శాసన మంతయు వ్రాసికొనలేకపోయితిని. కాని చిత్తాపఖానుడను వాఁడొకఁ డా శాసనమును వేయించెననియు, అది సంస్కృత శాసనమనియు, జీర్ణమైన కృష్ణదేవాలయమును ఉద్ధరించిన సమాచారమందున్నదియు మాత్రమె మొత్తము మీఁదఁ గనుఁగొంటిని. అప్పటి నుండియుఁ దురకయేమి? కృష్ణదేవాలయమును ఉద్ధరించుట యేమి? యన్న సంశయము మాత్రము నన్ను బాధించుచునే యుండెను. వీలయినప్పుడెల్లను, వీలయిన చోట్ల నెల్లను, వీలయిన వారినెల్లను చిత్తాపఖానుని గుఱించి విచారించుచునే యుంటిని. ఇంతలో నా శాసనము యొక్క ప్రతి యొకటి మెకంజీ సంగ్రహములో నాకు దొరకెను. అది చాల తప్పులతో నున్నందున నైజాం ప్రభుత్వము వారికి వ్రాసి శాసనము యొక్క అచ్చులను తెప్పించితిని. చిత్తాపఖానుని కైఫీయతులును కొన్ని దొరకెను. ఇవన్నియుఁ

గలుపఁగా నీ యద్వితీయ పురుషుని చరిత్ర చాలవఱకు బయల్పడెను. ఈతఁడు తెలఁగయో, బోయయో, రాజమంద్రి వైపు వాఁడు. చిన్నతనముననే గుల్బర్గా వైపునకుఁ బోయి, తన యప్రతిమ శౌర్యముచే నచ్చటి బహమనీ చక్రవర్తి యొద్ద గొప్ప సరదారుఁ డయ్యెను. చిత్తాపఖానుఁ డన్న బిరుదమును సంపాదించెను. తరువాత బహమనీ రాజ్యవైభవ మంతరించి యందుండి విజాపుర గోలకొండాది రాజ్యము లేర్పడు కాలమున నీతఁడును ఒక స్వతంత్ర రాజ్యమును స్థాపింపవలయునని యత్నించి ఓరుగంటిని కమ్మంమెట్టును మఱికొన్ని దుర్గములను తురుష్కుల యొద్ద నుండి లాగుకొని పెద్ద రాజ్యమును సంపాదించి, 10, 12 సంవత్సరముల వఱకు స్వతంత్ర ప్రభుత్వము చేసెను. తరువాత గోలకొండ నవాబైన కులీకుతుబ్‌షాహ ఈతని నోడఁగొట్టి, యచ్చటి నుండి బారఁదోలెను. పిమ్మట నీతఁడుత్తర సర్కారులలో గజపతుల సామంతుఁడుగ నుండి, కృష్ణరాయలు కలింగము మీఁదికి దండెత్తి పోయినప్పు డాతనినెదిరించెను. బ్రిగ్సు భాషాంతరీకరించిన తురుష్క చరిత్రలో 'సీతాపతి' అని చెప్పఁబడు వాఁడీతఁడే. నేను సిద్ధము చేసిన యీతని చరిత్రయు, శాసనమును హైద్రాబాద ఆర్కియాలాజికల్ సీరిసులోఁ ద్వరలోనే ప్రకటింపబడును. గాన నిందున గుఱించి యధికము చెప్పవీలు లేదు. తాత్పర్యమేమన ఁజిన్న చిన్న సమాచారములను కూడా శ్రద్ధతోఁ జోగుచేసితిమేని యవి చరిత్ర కాధారములు కాఁగలవు.

పురాతన గ్రంథములను గుఱించియు మన మీహైద్రాబాద దేశము వెతకవలసియుండును. ఇచ్చట గొప్ప గొప్ప కవులు పుట్టిరి. పాలకురికి సోమన, పోతన, మడికి సింగన, హరిభట్టు, వెలిగందల నారయ మొదలైన కవిపుంగవు లిచ్చటి వారె. ఇంకను మనకు బాగుగఁ దెలియని కవులెందఱో గలరు. ఇప్పటికిని మంచి కవులున్నారు. ఆంధ్ర భాషయందలి పురాతన రూపములు గూడఁ బెక్కు లిచ్చటఁ గానవచ్చును. కావున నాంధ్రుల చరిత్రమును గుఱించియు, నాంధ్రుల వాఙ్మయమును గుఱించియు నిజమైన నూతన విషయములను శోధింప

వలయుననిన, మన తరుణ పరిశోధక వీరులు హైద్రాబాదు రాజ్యము మీఁదికి దండు వెడలవలయును. ఎక్కువ కాలము తిరుగుటకు వీలులేని వారు కొందఱు కలిసి వంతు లేర్పఱుచుకొని, సంవత్సరమునకు నొక్కొక నెల ప్రకారము ఒక్కొక జిల్లాకుఁ బోయి వచ్చి తాము చూచినదియు, వినినదియు వ్రాసి ప్రకటించుచుండిన నూతన విషయములు పెక్కులు వెలువడఁ గలవు. ఆ దేశమందును మనకుఁ దగిన సాయము చేయువారును, తెలియని సంగతులు చెప్పువారును, మన వెంటఁ దిరుగు వారును కలరు. ఈ నూతన మార్గమును మా మిత్రులు కొందఱు త్రొక్కుదురు గాక.

## పరిశోధకులకు విన్నపము

భాషా విషయికమైన పరిశోధనలు చేసి క్రొత్త గ్రంథములను సంపాదించు మహనీయులకుఁ గొన్ని విన్నపము లొనరింప వలసి యున్నది. ఆ విన్నపము లొక్కొక వ్యక్తికి సంబంధించినవి కావు. సర్వసామాన్యములు.

1. క్రొత్త పుస్తకములు దొరకిన తోడనే యది యపూర్వమైనదియని తోఁచిన యెడల, 'నాకు నిట్టి గ్రంథ మిట్టి స్థలమున దొరకినది; ఇప్పుడది యిట్టి స్థలమందున్నది; దాని యపూర్వత యిట్టిది' – యని కొద్ది లేఖ యొకటి ప్రకటింపవలెను. ఈ గ్రంథమును తామే ప్రకటింపఁ దలఁచిరేని శోధకులు గనుక నిట్టి హక్కు వారికిఁ గలదు. కాని యంతమాత్రమున నెవ్వరికిని చూపక దాచియుంచు నధికారముగాని, ఎప్పటికినీ బ్రకటింపక దాచియుంచు నధికారము గాని ఎవ్వరికిని లేదని యెఱుఁగవలయును. తాము ప్రకటింపఁ దలఁచిన యెడలఁ జూపు వారికి వారు ప్రకటింపఁ గూడదన్న షర్తు మీఁదనే చూపవచ్చును. ముఖ్యముగ నూతన గ్రంథము చిక్కినప్పుడు అది యెక్కడఁ జిక్కినది, ఇప్పుడెక్కడ నున్నది తెలుపక యుండుట భాషా ద్రోహమని నా తాత్పర్యము. గ్రంథ మెచ్చట దొరకినది, ఎచ్చటనున్నది తెలిసిన యెడల దాని ప్రాచీనతను గుఱించి సంశయము గలవారును, పాఠాంతరములను గుఱించి సంశయము గలవారును వెళ్లి మూల ప్రతిని

చూచుకొందరు. తన సంశయమును బాపుకొందురు.

2. నూతన సిద్ధాంతము నొక దానిని తాము కనిపెట్టి, దానిని లోకమునకుఁ దెల్పునప్పుడు తమకుఁ గల హేతువులను గూడ స్పష్టముగఁ దెల్పవలెను. తమ యాధారము లేగ్రంధమునం దెచ్చట నున్నవి చెప్పవలెను. అట్లు హేతువులను, ఆధారములను చూపనిది యెంత గొప్పవారు వచ్చి యేమి చెప్పినను లోకులు విశ్వసింపరు. మా మిత్రులొకరు కొన్ని దినముల క్రిందట బత్రికలలో నీ క్రింది యర్థము గల వార్తఁ బ్రకటించిరి : –

"తమ శోధనలలోఁ దేలిన దేమనగా నైదవ శతాబ్దము వఱకే బౌద్ధత్రిపిటకములు తెలుఁగు లోనికి భాషాంతరీకరింప బడెను. కావున నప్పటికే తెలుఁగు వాఙ్మయము గలదని అందఱును తెలిసికొనవలసినది"

ఇది శంకరాచార్యుల వారి శ్రీముఖమో, దొరతనము వారి ఎగ్జిక్యూటివ్ ఉత్తరువో నాకుఁ దెలియలేదు. బౌద్ధ త్రిపిటకములు తెలుఁగులో నుండెనని తనకెట్లు తెలిసెను? ఆ గ్రంధమైనను దొరకి యుండవలెను? లేదా దానిని గుఱించి మఱియొక గ్రంథమునందైనను చెప్పఁబడి యుండవలెను. అట్టి యాధారములను చూపక మీరందఱు నా మాట నమ్మవలసినదని భగవంతుడు వచ్చి చెప్పినను ఈ దినములలో నమ్ము వాఁడెవఁడు? ఈ మిత్రుడు కలిసినప్పుడెల్లను మీ యాధారము లెవ్వియని నేనడుగుచుంటిని. చివరకు విసుగెత్తి యాతఁడు ఒకసారి యెల్లయ్య గారే గ్రంథములోనో యున్నదని చెప్పగా విని తొందరపడి ప్రచురించితిని గాని చివరకా గ్రంధము చూడఁగా నందీ విషయము లేదు అని ప్రత్యుత్తరమిచ్చెను!

## ఆంధ్రార్థ కథలు

నేను మాత్రమా విషయ మింతతో విడిచి పెట్టక సిలోన్‌లోని శ్రీ అంగారిక ధర్మపాలుర వారితోను, మిసెస్ రైస్ డేవిస్‌తోను, కలకత్తాలోని యొక పాలీ పండితునితోను ఉత్తర ప్రత్యురములు జరిపి, కొంతవఱకు నీ విషయమును గనుఁ గొంటిని. మీలోని బుద్ధిమంతు లీ విషయము నింకను పరిశోధించెదరని మీతోఁ

జెప్పుచున్నాడను. త్రిపిటకములు బౌద్ధులకు మన సంహితల వంటివి. వానిపై అర్ధకధలను భాష్యగ్రంధములు పుట్టినవి. అవి మన బ్రాహ్మణములు వంటివి. మనవారు 'మంత్ర బ్రాహ్మణ యోర్వేద నామధేయం' అని సంహితలను బ్రాహ్మణములను సమాన గౌరవముతోఁ జూచినట్లు, బౌద్ధులు త్రిపిటకముల వలెనే అర్ధ కథలను గూడ గౌరవముతోఁ జూచెదరు. అర్ధకథలలో నొక దానికి 'ఆంధ్రార్ధ కథ'యని పేరు. ఐదవ శతాబ్దము వాఁడగు బుద్ధఘోషుఁడను బౌద్ధపండితుడు వేఱు వేఱు దేశములు తిరిగి, యచ్చటచ్చటి యర్ధ కథలను సంపాదించి, వాని నన్నిటి సారాంశముగ నొక గ్రంథమును పాళీలో వ్రాసెను. ఆతనికి కాంచీ పట్టణమునందు ఆంధ్రార్ధ కథ యొక్క ప్రతి దొరకెను. ఈ అర్ధకధకు 'ఆంధ్రార్ధ కథ' యని పేరు వచ్చుటకుఁ గారణ మది యాంధ్ర భాషయందు రచింపఁబడుటయో, లేక యది ఆంధ్ర దేశమునకు సంబంధించినదనియో మనము చెప్పజాలము. ఆ గ్రంథమిప్పుడు దొరకుట లేదు. కాని యది ఆంధ్ర భాషామయమని యూహించుట కొక చిన్ని హేతువు గలదు. బుద్ధ ఘోషుఁడు సింహళదేశమునందు సంపాదించిన అర్ధ కథ సింహళ భాషలో యుండెననియు, దానిని తాను పాళి భాషలోనికి మార్చితిననియు బుద్ధఘోషుఁడే వ్రాసియున్నాఁడు. ఇదియుఁ గాక బుద్ధదేవుఁడు 'ఏ దేశవు వారాదేశ భాషలోనే తన బోధనలను చదువుకొనవలయు'నని శాసించెను. కావున ఆంధ్రార్ధకథ బహుశః ఆంధ్రమునందే యుండునని మన మనుకొనవచ్చును. నేను కనుఁగొనిన విషయమింతియ. జిజ్ఞాస గల శోధకు లెవరైన మూలాంధ్రార్ధ కధను కనుఁగొందురు గాక. అయ్యది జపాను, టిబెట్టు, చైనా దేశములలో దొరుకునేమోయని కొందఱి యభిప్రాయము.

3. పరిశోధకులకుఁ జివర విన్నపమొకటి చేయవలసి యున్నది. పూర్వపు శోధకులకు లభ్యమైన సాధనములు తక్కువగ నున్నందున, వారూహించిన కొన్ని విషయములలోఁ బొరపాటుండ వచ్చును. తరువాతఁ గ్రొత్త యాధారములు మనకు దొరకినందున మనము వారి తప్పును కనిపెట్టవచ్చును. అంతమాత్రమున మనమేమో

దిగ్విజయము చేసితిమని తలంచి పూర్వ పరిశోధకులను నిందింపరాదు. క్రొత్త ప్రమాణముఁ జూపి తప్పు దిద్దవచ్చునే కాని, పూర్వ గ్రంథకర్తను గుఱించి కఠినముగ వ్రాయుట పితృ ద్రోహమని నా తాత్పర్యము. ఒక విషయమునందే పనిచేయు వారిలోఁ గాలమందుఁ బూర్వముండు వారు తరువాతి వారికిఁ బితృతుల్యులు. ఈ నియమమును పెక్కురు లేఖకులు మఱచి, స్వల్పమేదో క్రొత్త విషయము తాము కనిపెట్టితి మనుకొనిన తోడనే విఱ్ఱవీగి, అదియే సమయమని తలంచి పూర్వులను వెక్కిరించుటతోఁ బుటలను నించుచున్నారు. క్రొత్తగాఁ గనిపెట్టని విషయమే యట్లుండ, అభిప్రాయ భేదములను గురించి, పరుల నిందించుట యెంత తప్పు? తమ అభిప్రాయము తెల్పుటలో నెవ్వరును, పూర్వులెంత గొప్పవారైనను, వారికి ఁ గాని, సమకాలము వారికిఁ గాని భయపడనక్కఱ లేదు. కాని, నిందలు వేయుట కెవ్వరికిని అధికారము లేదు. నింద ప్రారంభమైన తోడనే చిత్తము వికలమగును; బుద్ధి భ్రమించును, సారాసార వివేకము నిద్రించును, హేతువాదము సున్నయగును; న్యాయము లోపించును; సత్యమడుగంటును; మానుషత్వము మాయమై క్రూరమృగత్వము సంప్రాప్తించును!

## పరిశోధకులకు సమస్య

పరిశోధన సంబంధమయిన పని యొకటి ఈ సభ వారికిఁ గూడఁ గల్పించి యీ పరిశోధన పురాణమును పూర్తి జేయుచున్నాను. కలి విష్ణువర్ధనుని నాఁటి తామ్ర శాసనమొకటి కలదు. అది యిప్పుడు బ్రిటిషు మ్యూజియములో నున్నది. ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన పెక్కు శాసనములును, శిల్పాదికములును లండను పట్టణములోని బ్రిటిషు మ్యూజియములలో నున్నవని విని మీలోఁ బెక్కు మందికి నాశ్చర్యము కలుగవచ్చును. అందాశ్చర్యమేమియు లేదు. వాని యోగ్యత నింగ్లీషు వారు మనకంటె మొదటఁ గనుఁగొనిరి. కావున వారు వానిని సంగ్రహించుటయుఁ దమ దేశమునకుఁ దీసికొనిపోవుటయు, సంభవించినది. మన కింకను వాని యోగ్యత చక్కగఁ దెలియలేదనియేఁ జెప్పవలెను. తామ్ర శాసనములను, తాటియాకు

గ్రంథములను తమ యొద్ద నుంచుకొని, తమకు వాని వలన ప్రయోజనము లేకపోయినను ఎవరికి జూపని వారు, ఈయని వారును మనలో బెక్కురు గలరు. ఒక కుటుంబము వారిక కొన్ని తామ్ర శాసనములను గరగించి పెద్ద గంగాళము చేయించుకొనిరని యిది వఱకే చెప్పితిని గదా! ఈ గంగాళములో నాంధ్రదేశ చరిత్ర మెంత మునిగిపోయినదో? అది యట్టుండె. ప్రస్తుత మనుసరింతము. కలి విష్ణువర్ధనుఁడు 843–44 సంవత్సరములలో పదునెనిమిది మాసములు మాత్రము రాజ్యము చేసెను. 'అహదనకరం తామ్ర శాసన'మొకటి యీతనిది డాక్టర్ ఫ్లీట్ అను నతఁడు 'ఇండియన్ ఆంటిక్వేరీ' యను మాసపత్రిక 13వ సంపుటము నందుఁ బ్రకటించెను. ఇయ్యది కొంత సంస్కృత భాగమర్థమగుచున్నది. తెనుఁగు భాగము మాత్ర మగోచరముగ నున్నది. కావున ఫ్లీట్ తెనుఁగు భాగమున కర్థమీయలేదు. నన్నయ్యకుఁ బూర్వమున్న తెలుఁగు బాసను విజ్ఞాన సర్వస్వము యొక్క ఆంధ్ర సంపుటమునకై నేను అభ్యసించుటకుఁ బ్రయత్నించు చుండగా, నీ శాసనము నాకు ఁగానవచ్చెను. అప్పటి నుండియు తెనుఁగు భాగమున కర్థము కనుఁగొనవలయునని నేను పరిశ్రమ చేయుచున్నాను. రమారమి సగభాగము కర్థము కనుగొంటిని; మిగిలిన భాగమింకను సంశయాస్పదముగనే యున్నది. ఆంటీక్వేరీలో దీనికి ఛాయాపటము గూడ నీయఁబడియున్నది. అందులోపము లున్నవేమోయని సంశయించి, లండను నుండి మూల శాసనముల క్రొత్త ఛాయాపటములు, అచ్చున తెప్పించితిని. కాని భేదమేమియు కానరాలేదు.





# నైషధతత్వజిజ్ఞాస

శ్రీ అక్కిరాజు ఉమాకాంతం

డు

శ్రీహర్షుడు నిజముగా ఒక అఖండబుద్ధిబలసమన్వితుడు. అజ్ఞాతభాషలో తగవులాడిన దాసీల సంభాషణమును, ఒక్కసారి విన్నమాత్రమున రాజసమక్షము నందు ఒప్పగించ గలిగిన ధారణావంతుడు. తండ్రిని ఓడించిన పండితుని జయించుటకు కృతప్రతిజ్ఞుడై అచిరకాలమున, సర్వశాస్త్రములను నేర్చిన మేధాశాలి. విద్యాస్థానములు చాలక లోకమునంతటిని గ్రసింప జిహ్వలు చాచుచుండిన మేధాసముద్రమును శాంతింపజేయుటకు ఔషధము సయితము సేవింపవలసివచ్చిన అపూర్వశక్తిసంపన్నుడు. మానవ హృదయములను ద్రవింపజేయగల రససందర్భములు వచ్చినప్పుడు, కఠినులను సయితము కరగించగల కవితా హృదయము గలవాడు. నలుడు పట్టుకొన్నప్పుడు నలునిచేపట్టుబడి ప్రియావియోగము తలచుకొని హంస అన్నమాటలు శ్రీహర్షుని హృదయము తెలుపుచున్నవి.

"కథంవిధాతర్మయి పాణిపంకజాత్
తవప్రియా శైత్యమృదుత్వ శిల్పినః
వియోక్ష్యసే (తే) వల్లభయేతినిర్గతా
లిపిర్లలాటం తవనిష్ఠురాక్షరా
"అయిస్వయూథ్యై రశనిక్షతోపమం
మమాద్య వృత్తాన్త మిదం బతోదితా

ముఖాని లోలాక్షిదిశా మసంశయం
దశాపి శూన్యాని విలోక యిష్యసి
"మమైవ శోకేన విదీర్ణవక్షసా
త్వయా విచిత్రాంగి విపద్యతేయది
తదాస్మి దైవేన హతోపి హాహతః
స్ఫుటం యతస్తే శిశవః పరాసవః
"తవాపి హాహా విరహాత్ క్షుధాకులాః
కులాయ కూలేషు విలుఠ్య తేషుతే
చిరేణలబ్ధా బహుభి ర్మనో రథైః
గతాః క్షణేనా స్ఫుటితేక్షణామమ
"సుతాః కమాహూయ చిరాయచుంకృతైః
విధాయకం ప్రాణి ముఖాని కంప్రతి
కథానుశిష్య ధ్వమితి"

*(అయ్యో! విధీ! నా ప్రియురాలి మృదుత్వమును శీతత్వమును నీ యేచేయి నిర్మించినదో, అదే మరల ప్రియావియోగమును బొందుదువు అని కఠినాక్షరములను నా నొసట ఎట్లువ్రాయగలిగెను?*

*"భార్యా! ప్రియురాలా! తోడి హంసలువచ్చి పిడుగువంటి నా మరణవార్తను చెప్పినపుడు అయ్యో! నిస్సంశయముగా ఈ లోకమంతా నీకు శూన్యముగా కనబడునుసుమా.*

*"భార్యా! నన్ను గురించిన శోకముచే హృదయము వగులగా నీవు మృతినొందుదువా! హా! దైవహతుడైన నేను మరల హతుడను. మన ఆ శిశువులు దిక్కులేక తప్పక ప్రాణములు విడుతురు. అయ్యో! భార్యా! ఎన్నికోరికలో కోరి*

*చిరకాలమునకు పడసిన ఆ కన్ను తెరవని శిశువులు. నీవుకూడా లేకపోగా గూళ్లలో ఆకటి బాధకు మలమలమాడి, ఒక్క క్షణములో మగ్గిపోవుదురుగదా.*

*"బిడ్డలారా! తల్లిదండ్రులను కోల్పోయిన మీరిక ఎవరిని పిలిచి (ఆహారమడుగుదురు?) మీ చలించే ముఖములను ఎవరి వైపునకుత్రిప్పి (మాట్లాడుదురు).*

**"తతోపిమధురతమః కరుణఇతి"** *(సంభోగశృంగారము కంటె, విప్రలంభము కంటె, కరుణము మధురతమమైనది)* **"సర్వథైవ మనుష్య హృదయంద్రవతీతి"**(అన్ని విధముల మనుష్య హృదయము కరుణమందును ద్రవించును అని, అభినవ గుప్తపాదులు అన్నమాట సత్యము. ఈ తీరున శ్రీహర్షుడు మనుష్య హృదయములను ద్రవింపజేయగల కవితా సమన్వితుడు. అయితే నైషధము ఇరవై రెండు సర్గములు సాంతము చదివినప్పుడు, నైషధమునందు అడుగడుగునకు వచ్చు శాస్త్ర సంబంధములైన ప్రశంసలు, అసంబద్ధములైన ఉత్ప్రేక్షలు, అసభ్యములు, అశ్లీలములు, అనుచితములు అయిన పాడు సంభోగ వర్ణనములు కావ్యమును చెరిచి రసపరతంత్రుని విముఖుని చేయుచున్నట్లు నిశ్చయముగా కనబడుచున్నది. ఇంతటి మహా మేధాశాలి, సర్వశాస్త్ర సంపన్నుడు, కావ్యముయొక్క నిర్మలత్వమును కనుగొనజాలక పోయెనా? అని శంక కలుగుచున్నది. ఈ సంగతి విచారించెదను.

## కవితా పరిణామము

రానురాను శాస్త్రముల పరిశ్రమ వృద్ధి అయిన కొలదిని కవిత్వము క్షీణించుచుండునను సిద్ధాంతము కొంత వఱకు నిజమని నేననుకొను చున్నాను. వాల్మీకితో ఆరంభమై వాల్మీకియందే మహాదశ నారోహించిన సంస్కృత కవిత్వము, తక్కిన కవులందఱకును మార్గదర్శకమయ్యెను. వాల్మీకి ఆదర్శముగా కవితాలోకమున నిర్మల తేజస్సుతో ప్రకాశింపగలిగిన కాళిదాస, భవభూతులయందు, కవిత్వము వికాసము పొందెను. రాను రాను శాస్త్ర పరిశ్రమవృద్ధి అయినది. గొప్ప కవిత్వము బయలుదేఱుటకు బదులు, కవిత్వము మీద గొప్ప విమర్శనలు బయలుదేరెను.

గొప్ప విమర్శనము బయలుదేరిన సమయము గొప్ప కవిత్వము కుంటుపడిన సమయమని చెప్పవచ్చును. ఆనందవర్ధనాచార్యుని ధ్వన్యాలోకము, మమ్మటుని కావ్యప్రకాశము, క్షేమేంద్రుని ఔచిత్యవిచార చర్చ, ఈ మూడుగ్రంథములును, మహాకవితా శక్తి, మహావిమర్శన శక్తిగా పరిణమించిన రూపమునకు సాక్ష్యములుగా ఉన్నవి. కవితా పరమార్థములు నశించి క్షుద్ర గ్రంథావతరణము ఆరంభించినప్పుడే విమర్శ సహితము ఆరంభమగుచున్నది. నిర్మల కవితా రసాస్వాదమనుభవించిన వారు, ఇవి క్షుద్రకావ్యములు, ఇవి రసహీనములు, వాల్మీకి, కాళిదాసాదుల కావ్యములిట్లున్నవి, ఇట్టిది కవిత, ఇది కవితా పరమార్థము, ఇది రసము, ఇది రసాభాసము, అని లోకమునకు ఉపదేశించవలసిన అవసరము కలుగుచున్నది. ఇదే విమర్శనకు ఆరంభము. ధ్వన్యాలోక కారుడైన ఆనంద వర్ధనాచార్యుని కాలము వఱకే క్షుద్ర కావ్యములు, కేవల శబ్దచిత్రములే ప్రధానముగా గల కావ్యములు ఆరంభించినవి. చిత్ర కావ్యములను గురించి

**"తతోఽన్య ద్రసభావాది తాత్పర్య రహితం,**

**వ్యంగ్యార్థ విశేష ప్రకాశన శక్తిశూన్యంచ, కావ్యం**

**కేవల వాచ్య వాచక వైచిత్ర్య మాత్రాశ్రయేణోప**

**నిబద్ధం ఆలేఖ్య ప్రఖ్యం యథాభాసతేత**

**చిత్రం నత న్ముఖ్యం కావ్యమ్,**

*(రసభావాది తాత్పర్యము లేనిది, వ్యంగ్యార్థ విశేషమును ప్రకాశింపజేసే శక్తిలేనిది, కేవలము యమక చక్రబంధాదులతో, ఉత్ప్రేక్షాదులతో నిబద్ధమైన కావ్యము చిత్రకావ్యము. అది ముఖ్య కావ్యము కాదు)* అని అన్నాడు. అలంకారములు ప్రబలినవి. అర్థాలంకారముగాక, శబ్దాలంకారముగాక ధ్వని అంటే యేమిటి? అది లేనేలేదు, **"యస్మిన్నస్తి నవస్తుకించన"** అనే శుష్కతార్కికులు హెచ్చిరి. శాస్త్రముల పరిశ్రమ అధికమైనది. అప్పటినుండి నిర్మలకవిత్వము అడుగంటి కేవలము కవిత్వము మీద మీమాంస మాత్రము అధికమైనది. ధ్వని అంటే ఏమిటి? అది తాత్ప ర్యము

గాదా? లేకపోతే అనుమానములో అంతర్భావమునొందదా? భాట్టుల అభిహితాన్వయవాదము, ప్రాభాకరుల అన్వితాభిధానవాదము, ధ్వనికార మతమునకు తోడ్పడునా? ఈ తీరుగా వాదోపవాదములు, మీమాంసలు పెరిగినవి. రసనిరూపణమెట్లు? రసమనగానేమి? రసస్వరూపమేమి? రసము సామాజిక నిష్ఠమా? నటనిష్ఠమా? విప్రలంభము శృంగారమా? కరుణమా? ఇట్టి మీమాంసలు మఱియొక ప్రక్కన ఆరంభమాయెను. ఈ తీరుగా ఒకవైపున శాస్త్రవాదములు జరుగుచుండగా షట్ ఛాస్త్రములయందును ప్రవీణులైన పండితులు కావ్యకరణమునకు గడగుచుండిరి. వాల్మీకి కాళిదాస భవభూతి ప్రభృతుల కవితా ధర్మములు, రసపరవశత్వములు వీరికి పట్టలేదు. శాస్త్ర పరిశ్రమల ఫలములు వీరు కావ్యములయందు ప్రదర్శింప మొదలుపెట్టిరి. ఉత్తమములు కాని కావ్యములు ఆరంభించిన ఆ కాలమున అలంకారములకు వ్యాప్తి హెచ్చెనని తెలిపితిని, వ్యాకరణము, న్యాయము మొదలైన శాస్త్రముల సంప్రదాయములు, సిద్ధాంతములు, కావ్యములలో చూపుట గొప్పగా ఎంచ నారంభించిరి.

నైషధము కలియుగమున 43వ శతాబ్ది మధ్యమున ఉద్భవిల్లెను. ఇప్పుడు 51వ శతాబ్ది గనుక సుమారు 8 వందల యేండ్లక్రిందట ఆవిర్భవించినదని తెలియుచున్నది. నన్నయ భారతము పుట్టిన తరువాత సుమారు 100, 150 సంవత్సరములకు నైషధము జనించినది. **"ఇత్థంచ అభియుక్త యుక్తిభి రయ మేవసిద్ధాన్తపక్షః యత్ శ్రీహర్షః ఖ్రిష్టద్వాదశశతాబ్ద్యుత్తరార్ధేబభూవ ఇతి"** అని శ్రీమహామహోపాధ్యాయ పండిత శివదత్త శర్మగారు చేసిన కాలనిర్ణయమును నేను ప్రమాణముగా తీసికొంటిని.

### శాస్త్రములు

శ్రీహర్షుని కాలమునాటికి శాస్త్రపరిశ్రమ భారతవర్షమున హెచ్చినది. శ్రీహర్షుడు షడ్దర్శనములయందు ఆరితేరిన నిపుణుడు, అనిర్వచనీయతను నెలకొల్పుచు, ఖండనఖండఖాద్యమనే గొప్ప శాస్త్ర గ్రంథమును రచించిన మేధాశాలి. శాస్త్రముల

భారము క్రింద కవిత్వము అణగిపోయినది. ఏమి చెప్పబోయినా అతనికి శాస్త్రములు అడ్డముగా వచ్చి నిలుచుండెను. కవిత్వముగదా అని ఎంత అణచిపెట్టినా యీ శాస్త్రపు తెరలు అతనికి ఆగలేదు. బిల్హణుడన్నట్లు కవితాకన్య యితని దగ్గర ఇక వుండలేక తల్లడపడి యుండును. పట్టణమును వర్ణించబోయిన అతనికి వ్యాకరణము అడ్డమువచ్చి, **"ఫణిభాషితభాష్య ఫక్కికా"** వరరుచి కుండలించిన మహాభాష్యమువలె, దుర్గ్రహముగా ఉన్నది" అని చెప్పించినది. వ్యాసుని హంసమీది బంగారు ఱెక్కల కవిత్వమునకు తర్కము పెదవి విరువగా ఆ హంసకు **"హేమమృణాళినీ"** నాళములు మేతపెట్టి **"కార్యం నిదానాద్ధి గుణానధీతే"** (కారణగుణములే కార్యమునకు అలవడును, బంగారు మేత బంగారు రూపునిచ్చినది) అని తర్కమును సమాధాన పఱచెను.

దమయంతీ కుచములను వర్ణించబోయినప్పుడు తర్కము ముందుకువచ్చి

**"కలసే నిజహేతుదండజః"**

అనేచోట సమవాయి కారణమును, అసమవాయి కారణమును, నిమిత్త కారణమును ఉపన్యసింప జేసినది. నల దమయంతుల మనస్సమాగమమును దీవించదలచినప్పుడు ఆ తర్కమే మరల ద్వ్యణుకత్ర్యణుకాది ప్రతిపాదన పూర్వకముగా సర్గప్రతిసర్గములను వచింపజేసినది. 17వ సర్గము వద్దకు వచ్చునప్పటికి పూర్వమీమాంస, ఉత్తరమీమాంస, కాణాదము, గౌతమము, మొదలైన శాస్త్రములు ఒక్క పర్యాయము అన్ని ప్రక్కల కమ్ముకొనెను. ఈ శాస్త్రాలాపములనే ఆ సర్గమునందంతట అతడు నింపెను. ఇంతయెందుకు, **"కావ్యేచారుణి, కావ్యేచారుణి"** (సొంపైన కావ్యమునందు,సొంపైన కావ్యమునందు) అని అనుకొనుచు వచ్చిన శ్రీహర్షుడు

**"ధర్షితపరాస్తర్కేషు యస్యోక్తయః"**

(తర్కములో ఎవనివాక్కులు శత్రువులను బెదరగొట్టేవో) **తర్కేష్వప్య సమశ్రమస్య** (తర్కమందు సయితము అసమాన పరిశ్రమ చేసితిని) అని నిజరూపమును

బయల్పరచక ఉండలేకపోయెను. శ్రీహర్షుడు ఎంత మేధాశాలి అయితేనేమి, అతనికి కవిత్వమున ఎంత అభిలాష వుంటేనేమి? అతని శాస్త్రముల ధాటికి కవిత తాళలేకపోయెను. కనుకనే అముఖ్య కావ్యలక్షణములైన అస్థానస్థ శబ్దాలంకారములు, ఉత్ప్రేక్షలు, శాస్త్రప్రశంసలు, ప్రధానముగా కావ్యములో నిండిపోయినవి.

## శ్రీహర్షుని కాలము
## (మహమ్మదీయులు)

ఆంధ్ర రాజుల కాలముననే ఆరంభమయిన శక బర్బర యవన ప్రభృతి విదేశీయుల ఆక్రాంతి శ్రీహర్షుని కాలమునాటికి స్థిరముగా నెలకొనినది. సబక్తజిన్ యొక్క విజయములు, గజినీ దండయాత్రలు భారత వర్షమును కలతపెట్టినవి. సోమనాథుని పవిత్ర దేవాలయమును మ్లేచ్ఛుడు కాలద్రొక్కెను. భారతవర్షము ప్రధమ పర్యాయము యవనుని యెదుట ఖడ్గమును క్రిందబెట్టిన స్థానేశ్వర రణరంగము మిక్కిలి దగ్గర దగ్గరకు వచ్చుచుండెను. వంగ, మగధ, కోసల, కన్యాకుబ్జాది ప్రసిద్ధ రాజ్యములు కన్నీరు విడుచుచు యవనుని చేతబడిన కాలము అత్యాసన్నమై యుండెను. భారతీయ రాజాస్థానములు ఒకటి వెంట ఒకటి శీఘ్రముగా యవనానలముముందు కమిలిపోవుచుండెను. స్వాతంత్ర్యదీప్తితోపాటు సర్వధర్మములు గమనోన్ముఖములు కాజొచ్చినవి. మహమ్మదీయుల ఇంద్రియ లోలత్వము, పరాధీనుల స్త్రీత్వ ప్రతిపత్తి, భారతవర్షమున రాజమందిరములలో, సాధారణ ప్రజలలో ప్రవేశించ నారంభించినవి. వాస్తవముగా ధర్మదేవత ఒంటికాలిమీద నడవవలసిన సమయము ప్రాప్తించెను. ఒక తట్టున మహమ్మదీయులు స్థిరపడుచుండగా, మఱియొక ప్రక్కన దారిద్ర్య దేవత భూమియందు కాలు కుదుర్చుకొను చుండెను. ఈ మహమ్మదీయుల ఆక్రమణము వలన, దేశము పొందిన విపత్తును కనిపెట్టియే

**"ఉద్ధృత్య భూమిం యవనాబ్ధి మగ్నాం"**

*(యవనాబ్ధియందు మగ్నమైన భూమిని ఉద్ధరించి)*

అని ఒక రెడ్డి రాజును ఒక తెలుగు కవి కీర్తించెను. భారత భూమి యవనాక్రాంతమైనప్పటినుండి అర్ధపురుషార్ధము అన్యాధీనమైనది. ఏనాడు అర్ధము యవనహస్తగతమైనదో ఆనాడే భారతీయుడు పరాధీనతను ప్రాపించెను.

సువర్ణము అతనికి దూరముగా నిలువబడి తళతళకాంతులతో అతనిని భ్రమపెట్టసాగెను. శ్రీహర్షుడు కాలప్రాప్తమైన పరాధీనతను తప్పించుకొనలేక పోయెను. రాజుల సువర్ణ ప్రాసాదములు, అతనికి దివ్యభూములవలె తోచుచుండెను. రాజుల సువర్ణవర్ణ వదనములనుండి వచ్చినమాట అమృతమయమై అతనికి వినబడుచుండెను. రాజుల సువర్ణ హస్తములనుండి జారిన తృణము పుణ్య పరిపాకలబ్ధమైన మహాప్రసాదమువలె తోచుచుండెను. అందుకే

**"తాంబూలద్వయ మాసనంచ లభతే**

**యః కాన్యకుబ్జేశ్వరాత్"**

(రాజు నన్నుకూర్చోమంటాడు, రాజు నాకు రెండు తాంబూలములిస్తాడు) అని యెంతో గొప్పగా చెప్పుకున్నాడు. రాజు కూర్చోమనడమే, రాజు తాంబూల మియ్యడమే ఒక పెద్ద విశేషముగా చెప్పుకొనవలసిన అర్ధదాస్యరూపమగు దీనదశనుండి తప్పించుకొన లేకపోయెను. రాజాంతఃపురమునకు, రాజకుమారులకు, నిల్వనీడనిచ్చినట్టి వాల్మీకితో ఆరంభమైన కవిపరంపర అధఃపతనమునొంది, రాజు సువర్ణవదనముతో రమ్ము పొమ్మనడము గొప్ప వరముగా తలచవలసిన దీనదశకు వచ్చినది. వ్యాసుని హంసవలె ఱెక్కలయందు మాత్రమేగాక **సువర్ణమయీ తనుః ..... సువర్ణ శైలాదవతీర్య.** నై) వొళ్లంతటా సువర్ణముతో, సువర్ణ శైలమునుండి దిగి వచ్చిన ఆ సువర్ణ హంసము అతనిని తప్పక మోహపెట్టియుండును. సువర్ణ నైగనిగ్యముచే కన్నులు మిరుమిట్లు పడగా, లేఖిని పతితమైనది.

వాల్మీకి ధర్మమునకు అర్ధకామములను క్రిందుజేసెను. భర్త అరణ్యమునకు బయలుదేరినప్పుడు,

**"అగ్రతస్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్"**

*(కుశకంటకములను తొలగించుచు మీకుముందుగా నేను నడుస్తాను) అను ధర్మము కొఱకు అర్థకామములను త్యాగము చేసిన సీత వాల్మీకి సర్గమున వెలయగలిగినది.*

వ్యాసుడు ఒకసారి ధర్మమును, ఒకసారి అర్థ కామములను మీదుచేయుచు చివరకు అర్థకామముల భుజముల మీదనే చెయివేసెను. అనేక సంవత్సర సహస్రములు రతిక్రీడలనుభవించినను చాలక ఆ రతిక్రీడల కొరకే మళ్లీ తనువుదాల్చి

**పురాదశ సహస్రాణి దన్తినాం వాజినామపి**

**యం యాన్త మనుయాంతిస్మ సోయం ద్యూతేన జీవతి**

**సోయం ద్యూత ప్రవాదేన శ్రియశ్చైవావరోపితః**

**తూష్ణీమాస్తే యథా మూఢః స్వానికర్మాణి చింతయన్**

**పార్థివస్యసుతానామ కాను జీవేతమాదృశీ**

**అనుభూయ భృశందుఃఖ మన్యత్ర ద్రౌపదీంప్రభో (విరా.)**

*"భీమ సేనుడా! పదివేల యేనుగులు, పదివేల గుఱ్ఱములు, ఎవని వెంట నడుచుండెనో ఆ యుధిష్ఠిరుడిప్పుడు ద్యూతమువల్ల జీవించుచున్నాడు.*

"ఆ (వైభవ సంపన్నుడగు) యుధిష్ఠిరుడిప్పుడు అన్ని సంపదలను బోగొట్టుకొని స్వకర్మములను తలపోయుచు, మూఢునివలె ఊరక కూర్చున్నాడు.

ద్రౌపది తప్పితే, నావంటి రాజకుమారి ఎవతె ఇంతటి కడగండ్ల నుభవించి బ్రతుకగలదు?" అని భర్తను దెప్పిపొడిచి అర్థ కామములను ఆరాధించిన ద్రౌపది అతని కావ్యసర్గమున ఉత్తమ నాయిక యయ్యెను.

రామాయణ కాలమున మూడు పాదములమీద నడచిన ధర్మము, భారతకాలమున రెండు పాదముల మీదనే నడచినదని ధర్మజ్ఞులు చెప్పు సంప్రదాయవచనము సత్యము. కాళిదాసు భారత సర్గముతో తృప్తి చెందలేదు. దానిమీద ఒక మోస్తరు ప్రతిక్రియనే అతడు నడుపగలిగెను. కాళిదాసు

అర్థకామములను ధర్మముతో శబలితము చేసి వాటి నిర్మల స్వరూపమును అతడు వీక్షించెను.

**'క్రీత స్తపోభిరితి వాదిని చంద్రమౌళౌ,**

**అహ్నాయ సా నీయమజం క్లమముత్ససర్జ"**

*(ఓ పార్వతీ! తపస్సుచేత నన్ను వశపఱచుకొంటివి),* అని అనగానే తపః క్లేశమును ఆనందముగా అనుభవించి, ధర్మముచేత కామముయొక్క సుందరరూపమును చూచిన పార్వతి, కాళిదాస సర్గమున మనకు గోచరించు చున్నది. వాల్మీకి సీమ వనము; వ్యాసుని సీమ ప్రాసాదము. ప్రాసాదమును, వనమునకు క్రిందు చేసెను కాళిదాసు. రఘువంశము, కుమార సంభవము, శాకుంతలము, మాళవికాగ్ని మిత్రము ఈ అన్నిటియందు కాళిదాసు యొక్క యీ మనస్తత్వము మనకు తెలియుచున్నది. దీనిని ప్రేమ పరిణామమున వివరించితిని. కాని ధర్మదేవతకు మూడుకాళ్లు విరిగి ఒంటికాలిమీదనే కుంటుచు నడచిన కాలము వచ్చెను.

భారత వర్షము యవనాక్రాంతమైనది. ఉత్తమ పురుషార్థములు నశించగా అర్థదాస్యము, అనంగసేవ ప్రజలకు పరమపురుషార్థము లాయెను. కవులకు రాజభవనములే దివ్యప్రదేశములాయెను. అర్థము పరాధీనమై భారతీయుడు ఆత్మాధీనతనుకోల్పోయెను. అర్థము దూరమైనకొలదీ అర్థకామములకు దాసులైరి. దాని గొప్ప రూపము భారతీయ రాజులకు, ప్రజలకు ఎక్కువగా కనబడసాగెను.

**"పునశ్చయాచమానాయ జాతరూప మదాత్ప్రభుః"**

*(శ్రీ.భా. 1వ స్కంధము)*

ద్యూతము, పానము, స్త్రీలు, హింస అనే స్థానములతో కలి తృప్తి పొందక మళ్ళీ అడిగితే పరీక్షిత్తు కలికి సువర్ణమనే అయిదవ స్థానము కూడా ఇచ్చెను, అని శ్రీభాగవత కర్త అన్నట్లు సువర్ణము నిజముగా కలివశమైనది **"ఆశ్రమా యవనైరుద్ధా"**

(పద్మ.) అని ధర్మతత్పరులు చింతిల్లిరి. ఆర్య సంప్రదాయములు క్రమక్రమముగా విచ్ఛిన్నము లాయెను. మహామ్మదీయుల విషయలోలత్వము దేశమున వ్యాపింపజొచ్చెను.

శ్రీహర్షుని రాజైన జయంత చంద్రునియొక్క మంత్రి ఒక సరస్సు దగ్గర చాకలివాని చలవమడతను పసిబట్టి, ఆ చీరను ధరించిన యౌవనస్థను, విధవను గృహమునుండి లేవదీసి తన రాజుకు భోగ కాంతను చేసెనని, ఈ రాజుకాంత చివరకు ఒక మహమ్మదీయుని పట్టణము మీదికి తెచ్చెనని కథలను చదువునప్పుడు, ఆ కాలమున రాజవంశములయందు విషయలోలత్వము ఏ తీరున ప్రసరించినది, యవనుల ఆక్రాంతి దేశమున ఏ విధమున నెలకొనినది మనకు కొంత వఱకు విశదమగుచున్నది.

**"సరస్తటే రజకక్షాళి తాయాం శాటికాయాం నిలీనం మధుకరకులం దృష్ట్వా (దదర్శ) ...... సూహవదేవీనామ్నీ శాలాపతిపత్నీ యౌవనస్థా విధవా దర్శితా తాం..... జయంత చంద్ర భోగినీ మకరోత్ రాజ్ఞీ క్రుద్ధా ధనాఢ్యతయా స్వచ్ఛన్ద తయా నిజప్రధాన నరాన్ ప్రేష్య .... తక్షశిలాధి పతిః సురత్రాణః ... ఆయాతి.... "మ్లేచ్ఛ ధనుర్ధ్వానేషు మగ్నాని ధ్వానాంతరాణి యవనై ర్లాపుతాః"**

*(రాజశేఖరుని ప్రబంధ కోశమునుండి శ్రీ శివదత్త శర్మగారు ఉదాహరించినది)*

కామశాస్త్ర సంపుటములు కళకళలాడ మొదలు పెట్టినవి. 346 శ. లోడీ వంశస్థుడైన లాటఖానుని వినోదమునకు, కల్యాణమల్లుడు అనంగ రంగమనే కామశాస్త్రమును సంస్కృతమున రచించెనని తెలిసినప్పుడు, మహమ్మదీయ రాజభోగుల విషయలోలతయొక్క స్వరూపము కొంత మనకు గోచర మగుచున్నది.

శ్రీహర్షునిమటుకు శ్రీహర్షుడు పలుతావుల కామశాస్త్రమును పేరుపెట్టి ప్రశంసించెను. ఆ శ్లోకములను గ్రంథ విస్తరభీతిచే ఉదాహరించలేదు. నలుని చరిత్రము వ్రాయబూనినప్పటికీ, బహుకామినీ సంసర్గమున పరిభ్రమించు మహమ్మదీయ కాలపు రాజభోగియే అతనికి సాక్షాత్కరించుచుండెను. వ్యాసుని

నలుదు భోగ ప్రమత్తుడు కాడు. శ్రీహర్షుని నలుడు బహుభామినీ బాహులతా పరివేష్టితుడు. అనేక కామినీ సంసర్గమున ఓలలాడుచుండిన భోగి. అందుకనే

"శుద్ధాంత సంభోగ నితాంత తుష్టే
ననైషధే ర్యమిదం నిగాద్యమ్"
"అభ్యర్థనీయః స గతేన రాజా
త్వయా నశుద్ధాంత గ తోమదర్థమ్
ప్రియాప్యదాక్షిణ్య బలాత్కృతోహి
తదోదయే దన్యవధూనిషేధః"

*(ఓ హంసా! అంతఃపుర కామినులతో ఉన్నప్పుడు నలుని ప్రార్థించవద్దు.*

*ప్రియురాండ్ర సుందర ముఖముల చూచుచున్న అట్టి సమయమున ఇతర కాంతా నిషేధము తప్పక సంభవించును. అంతఃపుర కామినులతో సంభోగించి బాగా తృప్తుడైన నలునికి నా సంగతి చెప్పవద్దు)*

అని దమయంతిచేత శ్రీహర్షుడు చెప్పిస్తాడు. ఇది కాలతత్వము.

శ్రీహర్షుని మీద కాలము సంపూర్ణాధికారము వహించినది. ఆత్మబలోన్నతి గల అసాధారణశక్తి సమన్వితులుగాని, కాలమును మీరలేరు. శ్రీహర్షుని కాలమునాటికి ప్రాచీన ధర్మములు లుప్తములై, సార్వభౌముల వలయములందు, సంపన్నగృహములందు, సాధారణ ప్రజలయందు, మహమ్మదీయ రాజభోగుల విషయలోలత్వము ప్రబలినది. సాహిత్య మార్గములు సైతము ఈ పరిణామమును తప్పించుకొనజాలక పోయెను. ఆ కాలమున పుట్టిన నైషధము, అప్పటి లక్షణముల నన్నిటిని తాల్చక తప్పకపోయెను.

ఈ కావ్యముయొక్క ముగింపు సైతము కాలతత్వమును తెలుపుచున్నది. అప్పుడు రణరంగములు వెలసినా, ఆ రణరంగములందు పోరాడినది భోగ లంపటమైన ఆసుర ప్రకృతి. అప్పుడు ధర్మ సంస్థాపన కొరకు వీరుడు ప్రతి వీరునితో పోరాడలేదు.

విషయలోలత్వోన్మత్తులైన రాక్షసులు రాక్షసులు పోరాడిరి. ఇక ప్రజలు విషయ సుఖలోలురై క్లేశములను సహించగల వీరత్వమును కోల్పోయి పరాధీనతచే స్త్రీ తుల్యులైరి. కంఠమాలలు కంది పోవునో, హంసశయనములకు హానివచ్చునో, కాంచనచేలముల కాంతి మాయునో అని సుఖసాధనములను కాపాడుకొను ఆపవారి చిత్త దౌర్బల్యము దేశమందలి జనులకు సాధారణమాయెను. వాల్మీకి ప్రభృతులు ఆరాధించిన వియోగ శృంగారము,

**"శృంగారే విప్రలంభాఖ్యే కరుణేచ ప్రకర్షవత్"**

అని ధ్వనికారుడు కీర్తించిన వియోగశృంగారము శ్రీహర్షునికి దుస్సహమాయెను. వ్యాసుడు నలదమయంతుల వియోగము చెప్పినా, శ్రీహర్షుని భోగపరాయణమైన పరాధీన లేఖిని మాత్రము నల దమయంతుల సంభోగమునుండి ఒక అంగుళమైనను కదలజాలక సంభోగములోనే ఆగిపోయెను.

**"ఆరాధ్యాయస్వ పంచబాణమ్" (నలోక్తి)**

*(మదనుని ఆరాధించవలసినది)* అని సంభోగములోనే నలదమయంతులను నిలిపెను. నైషధమున ప్రధానమైన యీ సంభోగ శృంగారమును, శ్రీహర్షుడెట్లు ప్రతిపాదించెను? అని పరిశీలన చేసెదను.

వాల్మీకి, కాళిదాసు, భవభూతి, చూడగలిగిన శృంగారము యొక్క నిర్మల స్వరూపమును, శ్రీహర్షుడు, కనుగొనలేకపోయెను. కూర్చో. ఇదిగో తాంబూలము అని మహోవరములిచ్చిన రాజభోగి ఆ కాలమున రతిలాలసుడై ఆలకిస్తున్నపుడు, శ్రీహర్షుడు కామోద్రేకమైన సురతశృంగారమును వినిపించక యెట్లు మానగలడు? కావ్యము పతితమగునేమో, నలదమయంతులు అధమనాయకులగుదురేమో అని ఆలోచించుకొన లేకపోయెను.

ఒక తిండిపోతు మిక్కిలి ఆసక్తితో గారెలు తింటూ వుంటే అతడు వాటిని కొఱకడము, నమలడము, నమిలీనమలకుండా మింగడము, ఇంకొకగారెను కొరకడము, చెవిమెలవద్ద పిండి అంటు కొనడము ఇవన్నీ వర్ణించడము ఏ తీరున

వుంటుందో, కామోన్మత్తుడు భార్యను ఒళ్ళంతటా, బొడ్డు రంధ్రమును సయితము ముద్దు పెట్టుకొనడము, కంచుకము విప్పడము, నీవి సడలించడము, స్తనములను మర్దించడము, ఊరువులను పీడించడము మొదలైన కామపు పనులను వర్ణించడము ఆ తీరుగానే వుండును.

ఇది గ్రామ్యసంభోగవర్ణనము. ఇవన్నీ పశువృత్తులు. ఇవన్నియు నలుగురు వినవలసినవి కావు. ఉన్నదివున్నట్లు వర్ణించడము స్వభావోక్తిగాదా అంటారా? అట్లుగాదు. ఉత్తమ ప్రకృతిని ఉన్నదున్నట్లు వర్ణించడమునందు ఆనందజనకత్వముగలదు గాని, అధమ ప్రకృతిని ప్రధానముగా కావ్యమున వర్ణించినప్పుడు, రోతయే పుట్టుచున్నది. కలుషితచిత్తులకుగాని, అవి ఆనంద జనకములుగావు. ఇంద్రియములను విడిచి, భావము నాశ్రయించినప్పుడే శృంగారము పవిత్రమగుచున్నది. సురతైకలక్షణమైన గ్రామ్యసంభోగము మొదలైనవి పశువృత్తులని చెప్పితిని. ఇట్టి పశుత్వమును దాటినప్పుడే ప్రకృతికి ఉత్తమత్వము సిద్ధించుచున్నది. ఉపదేశ ప్రాప్తికేమి, కావ్యపరమ ప్రయోజనమైన ఆనందసిద్ధికేమి ఈ ఉత్తమ ప్రకృతియే అవలంబనమగుచున్నది. గనుకనే

**"నగ్రామ్య మాచరేత్ కించిత్" (దశ.)**

**అని సాహిత్యవేత్తలు హితము చెప్పిరి.**

**"ఉత్తమ ప్రకృతే రాజా దేరుత్తమ ప్రకృతి నాయికాభిస్సహ**

**గ్రామ్యసంభోగ వర్ణనం.... సుతరాం అసహ్యం"**

అని రసవేత్తయైన ఆనందవర్ధనాచార్యుడు పలికెను. ఇట్టిగ్రామ్య సంభోగమును క్షుద్ర ప్రకృతికి ప్రహసనములలో చెప్పితే, నవ్వు పుట్టించుటకు ఉపయోగపడునుగాని, ఉత్తమ నాయకులకు మిక్కిలి అనుచితమైనది. ఈ అనుచితమైన పనినే శ్రీహర్షుడు చేసెను. కాలమహిమచే విషయలోలత్వమున దృష్టినిల్పిన శ్రీహర్షుడు, ఉత్తమ ప్రకృతులైన నలదమయంతులకు గ్రామ్యసంభోగమును తగిలించెను.

నైషధము ఉత్తమ కావ్యము కాదు.

"దమయంత్యా నలస్యచ"

అని సంకీర్తనమునకు పాత్రమైన వ్యాస నలుడు శ్రీహర్షుని కావ్యమున పరిహాసమునకు పాత్రమాయెను. మొదట శ్రీహర్షుడు విటులను, విలా సినులను ప్రవేశపెట్టి చేసిన గ్రామ్యవర్ణనలు తెలిపెదను. నలదమయంతుల వివాహమైన తరువాత, కవి విందు నొకదాని నేర్పాటుచేసి దానిలో విలాస పురుషుల చేష్టలు వర్ణించి కుతి తీర్చుకుంటాడు. 1. ఒకనికి స్త్రీలు కామమోదన మియ్యవలెనంటాడు, 2. ఒక దాసి మెల్లగా తొండను తీసికొనివచ్చి నలునికి విసనకఱ్ఱ వీచేదాని కాళ్ళదగ్గర బెట్టినది, అది తాకగానే ఉలికిపడి ఎగిరినది. ఆ గజిబిజిలో చీరముడి వీడినది, ఉపాయముతోచక గుడ్డవిప్పి వేసినది. చీరవిడిచిన ఆ స్త్రీనిచూచి అందఱునవ్విరి. 3. ఒకతె పరాకున ఉండగా, ధూర్తుడు అద్దము తెచ్చిదాని కాళ్ళ సందున చూడకుండా పెట్టెను. దానిలో ప్రతిబింబితమైన భగమునుజూచి నవ్వెనట. 4. రవికచాటున ఉన్న కుచ ములను చూడవలెనని ఒకడు తంటాలు పడుతూవుంటే ఆమె పానక హోమ కుంభము పట్టుకొని తన స్తనములు ఇంతలా వున్నవని తెలుపుతున్నదట. 5. రతికి మన కిద్దరికి సమయమెప్పుడని అడగడానికి, ఒకడు ఉష్ణాన్నమును శీతాన్నమును పట్టుకున్నాడు, ఉష్ణాన్నము పగటికి, శీతాన్నము రాత్రికి గుర్తులు. ఆమె ఇది గ్రహించి పెదవి విరచింది. అంటే పగలూ కాదు, రాత్రీకాదు సంధ్యాకాలమున అని అభిప్రాయము. ఇట్టివి శ్రీహర్షుడు చెప్పుటకు వెనుకాడలేదు. శ్రీనాథుడు దీనిలో సందుచేసికొని తన ముచ్చట తాను తీర్చుకున్నాడు. "నీవు భగవదారాధన ప్రాప్తివి" అని ఒకడు ఒక స్త్రీతో అన్నాడట, "విద్వజ్జనులు నిన్ను విషయించివత్తురు" అని మఱియొక్కడన్నాడట. ఈ విధమున ఇతని బులుపు ఇతడు వెళ్ళబోసికొనెను. ఈ విందులో విలాసులు, షడ్రసములేకాకుండా, అపారశృంగారమనే సప్తమ రసమును అనుభవించిరన్నాడు.

"అపార శృంగారమయస్సమునిష్మన్

భృశం రసస్తోష మధత్తసప్తమః"

ఇక ఈ శ్రీహర్షుడు నల దమయంతుల పడకగది వద్దకు పోవుచున్నాడు. వాకిట్లో నిల్చొబడతాడేమోనని మన మనుకొందుముగాని అతడు లోపలికి పోదలచుకొనియే వచ్చెను. పోయినాడు. దమయంతి పడకగదిని చూచినాడు. అతనికి ఆ కాలపు భోగవిలాసములన్నీ ఎదట ఆడుతున్నవి.

**"తాం తృతీయ పురుషార్థ వారిధేః**

**పారలమ్భనతరీమరీరమత్"**

కామసముద్రమును దాటించినది ఆ దమయంతి అని అన్నాడు. ఆమెతో రమింప మొదలు పెట్టినాడు. ఎట్లా? **"దివానిశం"** రాంత్రింబగళ్లు. నలుని వంటివానికి దివామైథునమా అని యైనా శ్రీహర్షుడు సంకోచించలేదు. దీనికోసము ప్రత్యేకముగా రాజ్యము మంత్రులకు ఒప్పగించినాడన్నాడు.

"న్యస్య మంత్రిషు సరాజ్య మాదరాత్"

ఎందుకు? మన్మథ క్రీడలకు.

**"ఆరరాధ మదనం ప్రియాసఖః"**

ఇట్లాటి వానినే రఘువంశపు రాజును కాళిదాసు భావించెను, అతడు ప్రజలకు దర్శనము సైతము ఇయ్యజాలక గవాక్షముగుండా కాలుజాపి దానిని చూచిపొమ్మని చెప్పేవాడట. కాని కాళిదాస కవి, ఈ భోగలంపటుడు క్షయపుట్టి చచ్చినాడని వీనిమీద జుగుప్స పుట్టేవిధమున ఇతని కథను ప్రదర్శించెను. కాని శ్రీహర్షునికి ఆ ఔచిత్యజ్ఞానము కాల మహిమవల్ల నశించినది. ఉత్తమ నాయకుడైన నలుని దుర్గతి పాలుచేసెను.

నలుని పడకటిల్లు మేరు పర్వతమువంటి బంగారు మేడలో ఒక మణిమయ మందిరము. దానిలో చిలుకలు కామశాస్త్రములోని నఖక్షతదంతక్షతములను, ఆలింగనభేదములను తెలిపే కారికలను చదువుతున్నవి.

"యత్ర పుష్పశరశాస్త్ర కారికా

సారికా ధ్యుషిత నాగదంతికా"

ఆ పడకటింటిలో పటాలున్నవన్నాడు. ఒక ప్రక్కన ఇంద్రుడు అహల్యతో వ్యభిచరించిన పటము.

"పారదారిక విలాస సాహసం

దేవభర్తు రుదటంకి భిత్తిషు"

మఱియొక వైపున తారాశశాంకుల అభినయములు చెలరేగుచున్నవి.

(గౌరభాను గురుభామినీ స్మరోద్వృత్త

భావమితి వృత్తమాశ్రితాః)

ఇంకొక ప్రక్కన తపశ్శాలురు ఋషులు సయితము అప్సరసల కుచములు పట్టుకొనివున్న పటములు. వేఱొక ప్రక్కన శ్రీకృష్ణునికి నలునికి కాలసంఘర్షణ దోషము సంభవించిన నేమి? ఆ బోగ విలాసములు, ఆ రతిక్రీడలు, ఆ కామోద్దీపనములు, అతనికి కావలసి వున్నవి. కనుక వాటిని నలునికి అతడు సమర్పించెను. దమయంతి పడకటింటిని, వ్యభిచారపు ప్రతిమలతో నింపిన శ్రీహర్షుని మనస్తత్వము ఆ కాల మహిమను చాటుచున్నది. శయనము నెక్కేవరకు ఉండియైనా మరలలేదు. వారిద్దరు పాన్పుమీద ఎక్కిరి. ఇక శ్రీహర్షుడు ఎట్లు మరలగలడు? అప్పటి విధమును అతడు చెప్పెను. వాటిని క్లుప్తముగా నేనిచ్చట తెలిపెదను.

## స్తన గ్రహణము

(అస్పృశత్ సతదురోజకోరకౌ)

ఈ స్తనగ్రహణములో, పీడనములో పలువిధములు చెప్పెను. ఆమె కుచములను చేతులతో కప్పడము వాటిని తీసివేసి ఇతడు పట్టుకొనడము, ఇటువంటి లీలలు ఉన్నవి.

నలుడిట్టి పనులు చేసెనా లేదాయని విచారణకాదు. నలుడు చేసెనో లేదో శ్రీహర్షుడూ ఎరుగడు. నేనూ యెరుగను. కాని ఉత్తమ ప్రకృతులని మనమనుకునే నలునికి, దమయంతికి ఇట్టి చేష్టలు కవి వర్ణించడము అనుచితమనియే నేను చెప్పుచున్నాను. అవును సరే. వ్యాస నలుడు ఉత్తమ ప్రకృతియే కాని శ్రీహర్షుని నలుడు వేఱు, అతనికి ఆ చేష్టలు సరి పోవునంటారా, అనుట నాకు ఇష్టాపత్తియే. ఉత్తమ ప్రకృతికాని నలుని నాయకునిగాచేసి బంధించిన శ్రీహర్షనైషధము ఉత్తమ కావ్యము కాదని స్పష్టప డుచున్నది గనుక నాకు ఇష్టాపత్తి అని అంటిని. అవునయ్యా! కావ్యమునందు నీతి ప్రశంస అవసరములేదుగదా అంటారా? అవును. నీతి ప్రధానము గాదు. అది సత్కావ్యమున ధ్వనించి తీరుచునేయున్నది. నీతిగాని దుర్నీతిగాని వాచ్య రూపమున నేని, ధ్వనిరూపమున నేని, నిర్వచింప చెప్పవీలులేని సరో వర్ణన, చంద్రోదయవర్ణన మొదలైన వద్యసంచయములందు సయితము మనః పావనమైన ఒక విధమగు ఆనందము సంఘటిల్లుచున్నది. కాని గ్రామ్య సురతాదులు మనస్సును కలుషితముచేసి కావ్యమును దోషవంతము సేయుచున్నవి. కనుకనే నలదమయంతులను అధమ ప్రకృతులను చేసి గ్రామ్యసంభోగ వర్ణనాదులచే నైషధమునకు ఉత్తమ కావ్యత్వమును దూరము చేసెనని చెప్పుచున్నాను.

**"ఆంధ్రాణామేవ కాలేతు**

**సింధుంతీర్త్వాభియాస్యంతి భారతశ్రీ జిఘృక్షయా"**

*(కలియుగ రాజవృత్తాంతము)*

సింధువునుదాటి భారతశ్రీని వశపఱచుకొనుటకు యవనాదులు వస్తారు, అని ఐతిహాసికుడు చెప్పినపుడు అతని మనస్సు వాస్తవముగా ఖేదపడినది. విశ్వగుణాదర్శకారుని యవనాక్రాంతి విషయక ఖేదము సయితము తద్రూపము కొంత తెల్పుచున్నది. ఏనాడు శక యవన బర్బరాదులు సింధువును దాటిరో, ఆనాడే భారతశ్రీతోపాటు, భారతీయుల సర్వధర్మములు గమనోన్ముఖములైనవి. భారతవర్షము మ్లేచ్ఛాక్రాంతమైన కొలదిని భారతీయుల ఆచారములు,

సంప్రదాయములు, కవితలు, గానములు, అన్నీ కలుషితములు కాజొచ్చినవి భారతీయుల దృక్పథమే అధోముఖము కావలసివచ్చెను. ఆ విదేశీయుల భోగ పరాయణత్వము, విషయ లోలత్వము కావురుగమ్మినట్లు వ్యాప్తమైన ఆ కాలమున. కవిత్వము కలుషితమై భావసీమలనుండి దిగివచ్చి బాహుమూలములలో వేళ్లు నిమురుచున్న ఆ సమయమున, శ్రీహర్షుడు కావ్య కరణమునకు పూని కలుషిత కావ్యమునే రచించవలసిన పాడాయెను.

**"శృంగారామృతశీతగౌ" "కవికులా దృష్టాధ్వంపాంథే" యేమహా కవిభిరస్మవీక్షితాః పాంసులాభిరపియేనశిక్షితాః**"(శృంగారామృతమునకు చంద్రుడను, కాళిదాసాది కవులు సయితము ఎరుగనిమార్గములో సంచరించే నా కావ్యములో, ఏ రతిక్రీడలు వాల్మీకి కాళిదాసాది మహాకవులకు గూడా గోచరించలేదో, ఏ రతిక్రీడలు లంజెలు కూడా ఎరుగనివో వాటిని నల దమ యంతు లనుభవించిరి అని బుజములు కొట్టుకొని మురిసెనేగాని కాళిదాసాది కవులు వర్జించిన గ్రామ్య శృంగారము తన కావ్యమును పతితము చేయు చున్నదని, నల దమయంతులు తన చేతిలో క్షుద్రులగుచున్నారని, అతడు కాలమహిమచేతనే తెలిసికొనలేకపోయెను. కాల మహిమవల్ల ఎంత అంధత లేకపోతే లంజెలు కూడా ఎరుగని అని నలదమయంతుల పట్టున చెప్ప సాహసించగలడు? భోగపరాయణమైన రాజప్రకృతిని పూజించ ఉపక్రమించినట్టి అతని దృష్టి రతిలాలసమైన రాజముఖమునందే నిల్చినది. అందుకే కాశ్మీర రాజులు బుజము తట్టినదాకా, జయంతచంద్రుడు శబాసని తల ఆడించినదాకా నైషధము నవ్వుమొగము దాల్చలేకపోయెను. అది కాల మహిమ. కాలాధికారమును మీరగల ఆత్మబలోన్నతుడు కాడు శ్రీహర్షుడు. అందువల్లనే ఆ కాలపు పాడురుచులను సంతోషపరుపదలచి నలదమయంతుల పడక గదిని వ్యభిచారపు బొమ్మలతో నింపి వేసెను. నలుని గ్రామ్య మైథున లోలుని చేసెను. 'దమయంత్యా నలస్యచ' అని పుణ్యసంకీర్తనమునకు పాత్రమైన ఉత్తమ నాయిక, సాధ్వి, దమయంతి యొక్క తొడలు, చంకలేగాక భగమును సయితమును బయటపెట్టెను. ఈ తీరుగా ఉత్తమ పాత్రలను చెడగొట్టి కాల మహిమచే శ్రీహర్షుడు నైషధమును దుష్టకావ్యము చేసెను.

సయితము లక్ష్యమునందు ఏ అసమీక్షకారిత (బాగా ఆలోచించి చేయకపోవడము) కనబడుచున్నదో అది దోషమే అగుచున్నది) అని చెప్పి ప్రస్తావనము ముగించెను.

ఈ తీరుగా శృంగారము పతితమైపోయినది. నిజముగా కరుణము తరువాత శృంగారమంత మధురమైన రసములేదు. లోక ప్రవృత్తికే హేతు భూతమైన శృంగారము ఎట్లు మధురము కాకుండును? మొట్టమొదట మహాకవి వాల్మీకి పవిత్ర వదనము నుండి వెలువడిన ఆ పావన పదములలో కరుణము, శృంగారము ఇమిడి పారవశ్యమును కలిగించుచున్నది.

**"మానిషాదప్రతిష్ఠాంత్వమ గమత్ శాశ్వతీఃసమాః యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్"** *ఓ!నిషాదుడా కామమోహితమైన క్రౌంచ మిథునములో ఒకదానిని చంపితివి.)* అన్నాడు. ఆహో! వాల్మీకి!

శృంగార పరతంత్రమైన ఆ క్రౌంచ మిథునము ఆ నిర్మలచిత్తుని హృద యమును అమృతమయము చేసినది. అప్పుడు సంభవించిన ఆ వియోగము ఆ నిర్మలచిత్తుని హృదయమును ద్రవింపజేసినది. ఈ రెండింటి సమ్మేళనము హృదయము నుండి కవితను వెలువడజేసినది. అందుకనే ఆనంద వర్ధనాచార్యులవారు **"క్రౌంచ ద్వంద్వ వియోగోత్థః శోకఃశ్లోకత్వమాగతః"** అన్నాడు.

వాల్మీకి, సీతారాముల సంయోగ వియోగములు! కాళిదాసుని పార్వతీ పరమేశ్వరుల సంయోగ వియోగములు! యక్ష తత్పతీవియోగము, భవభూతి సీతారామ వియోగము! వియోగ సంయోగ, శృంగారముల యందలి పావన మాధుర్యము! లోకమును ఆనంద పారవశ్యమున ముంచుచున్నది.

**"శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనోరసః ... శృంగారే విప్రలంభాఖ్యే కరుణేచప్రకర్షవత్....** అని ఆనంద వర్ధనాచార్యుడు ఈ ఆనందమును ఆరాధించుచున్నాడు. ఇట్టి పవిత్రమైన శృంగారము ఏ తీరున విషయలోలురైన యవనరాజుల ఆక్రమణము తరువాత పతితమైనదో తెలిపితిని. పతితమైన యీ శృంగారము ఆ పతిత కాలమున ఆవిర్భవించిన శ్రీహర్షుని నైషధము నందు

సర్వలక్షణములతో వెలసినది.

కావ్యమనేది, ఆ కాలమునందు దేశమున ఉన్న సంప్రదాయములు ఆచారములు, ప్రజల ధర్మార్థ కామముల పరిణామములు, రాజ్యవ్యవస్థలు వీటి అన్నిటిచే శబళితమగు ఒక సృష్టిగాని, ఏ సంబంధమూ లేకుండా కవి నోటి నుండి ఆకస్మికముగా ఊడిపడు పదార్థ విశేషము కాదు. అన్ని కాల ములకు, అన్ని దేశములకు వర్తించే భావములు కావ్యమునందు ఉన్నా, అవి సయితము దేశ కాలములచే శబళితములగుచున్నవి. ఏకదృష్టితో ఎగయుచు ఆకాశసీమల విహరించు పతగము సయితము ప్రథమాశ్రయమైన భూమియొక్క సంబంధమును వదలజాలక గురుత్వ లఘుత్వాదులచే పరివృతమయియేయున్నది. కవి నుండి దేశ కాలతత్వములు అత్యంతము ఏనాటికి నివృత్తములు కావని చెప్పుచున్నాను.

నైషధమునందలి హంస సందేశమును హంస సందేశమనుటకంటె హంసోపదేశమనుట యథార్థవచనమగును. కాని యివన్నీ శ్రీహర్షుడు పట్టించు కొనలేదు. ఒక ప్రక్కన ఆకాలపు తర్కములు ఒకవైపున రాజభోగుల రతిక్రీడలు, మరియొక పార్శ్వమున విషయోన్మత్తుల విభవ విలాసములు మాత్రము అతనిని ఆవరించి కన్నుల యెదుట ఆడుచుండెను. ఆ కాల మహిమ అటువంటిది. ఆ కాలమున నైషధమే ప్రౌఢకావ్యమని, మహాకావ్యమని గణనకెక్కినది. నేటికిని నైషధము ఆ గణనతో ఉన్నది. అది కాల ప్రభావము. గొప్ప ఆదర్శములు, ధర్మపరాయణత్వము, నిర్మల జీవనము ప్రజలకు దూరమై, శుష్కములైన శాస్త్ర వాదములు ప్రబలిన ఆ కాలమున కాళిదాసుని కుమార సంభవము మరచి, కాళిదాసుని రఘువంశమును మరచి, కాళిదాసుని మేఘదూతను మరచి, నైషధమును గొప్ప కావ్యమని విద్వత్పరిషత్తులు, రాజవలయములు స్వీకరించుట వింతగాదు.

అయినప్పటికీ సరస్వతిని విష్ణుపత్నిగా వర్ణించినందుకు పడవేసినా మరి యెందుకు పడవేసినా, శారదాపీఠము నుండి శ్రీహర్షనైషధము మొట్టమొదట క్రిందపడడము భారతీయ కవితా విలోకనమునసనుసరించి ఆ కాలపు ప్రథమ విమర్శనము నైషధమునెట్లు తలచినది తెలియగలదు. ఆ కాలమున సయితము

కావ్యతత్త్వజ్ఞులు లేకపోదు. కాని వారిని మించి కూడ కాలము తన స్వభావమును వెల్లడి చేయుచున్నది.

నైషధము నొకనాడు శ్రీహర్షుడు కావ్య ప్రకాశకారుడైన ముమ్మటభట్టు వద్దకు తీసికొనిపోయి చూపెనట. **'కదాచిన్మమ్మటభట్టు స విధే శ్రీహర్షేణ నైషధ చరితం స్వనిర్మితం ప్రాదర్శి. తత ఆద్యంత మవలోక్యతే నోక్తమహో! పూర్వమేవ కావ్యమేతత్ ప్రదర్శిత మ భవిష్యత్, నూనం కావ్య ప్రకాశే దోష పరిచ్ఛేదే దోషోదాహరణ ప్రయాసోమేనా భవిష్యత్"** *(ఖండన ఖండ ఖాద్య భూమిక)*

(అయ్యో! ఇంతకుముందే నైషధమును చూపివుంటే, నా కావ్య ప్రకాశ దోష పరిచ్ఛేదమున దోషోదాహరణములకు నాకు ప్రయాసము లేకుండా పోయెడిది అని ముమ్మటభట్టు చెప్పెనట. అని గురు శ్రీమహామహోపాధ్యాయ ద్రావిడ లక్ష్మణశాస్త్రిగారు వ్రాసిరి. అయితే ఒకమాట మాత్రము చెప్పక ఈ విమర్శన ముగింపజాలను. సర్వశాస్త్రములు దాసభూతములై పాదముల వద్ద నిల్చుండి కావ్యసౌధమునకు క్రమసామగ్రి నందియ్యజేసిన ఇంతటి శక్తిమంతుడు తిరిగి కానరాలేదు.

ఇరవై రెండు సర్గల గొప్ప కావ్యమును నిర్మించినను ఎచ్చటనైనా ఒక పొల్లుమాటగాని, ఒక వ్యర్థమైన "తూచాగాని" ఒక చప్పిడి పదముగాని ప్రయోగించక రచన చేసిన ఇతని శక్తి వాస్తవముగా నాకు ఆశ్చర్యము కలిగించినది. **'మృషావిషాదాభినయాదయం క్వచిత్" "అహో అహో భిర్మహిమా హిమాగమే" "విభావరీభిర్బి భరాం బభూవరే" "ఖనీఖనీలిమ"** కదా **బిదభ్ర భమదభ్రగర్భే" "నయక్ష లక్షైకిమలక్ష్మినోవా' "క్వభాగ్యమాప్నోతి నభాగ్య భాగ్జనః" "భుజమే తస్యభజన్ మహాభుజః"** అని యీ తీరున అప్రసిద్ధ పదప్రయోగ దోషము లేకుండా శబ్దములను త్రిప్పగలిగిన యితని శక్తి నాకాశ్చర్యమును కలిగించినది. **"దమునా దమనాక్ప్రసేదుషః", "కుండిన మండనోయయౌ" "రరాజ నీరాజనయాసరాజఘః" "చాతురీ తురీ""పదమస్యా రదనచ్ఛదంపదన్" "ప్రతిబింబానవలంబితాంబుని" "సరసీః పరశీలి**

తుం""పారలమ్భన తరీమరీ రమత్", "నలినం మలినం వివృణ్వతీ"అని యీ తీరున అర్థమునకు హాని లేకుండా అక్షర సంఘటనము చేయగలిగిన ఇతని శక్తి నాకాశ్చర్యము కలిగించినది. అయితే ఇంత ఆశ్చర్యకరమైన యితని శక్తి యిన్ని విధముల దుర్వినియోగపడక కాళిదాసాది కవులు చూచిన నిర్మల కవితా స్వరూపమును దర్శించుటకు వినియోగపడియుండినచో మనకు ఒక గొప్ప కావ్యము లభించియుండును. ఎంత గొప్పవాడైనా శ్రీహర్షునిమీద కాలము వచ్చి వ్రాలినప్పుడు అతడు దాని ఆవరణమును తప్పించు కొనలేకపోయెను

## ఖండపురాయి

రాజప్రాసాదములలో **"తాంబూల ద్వయమాస నంచ"** (విడెములు, సువర్ణాసనము) పొంది రాజభోగముల విషయలోలత్వమును తృప్తి పరచదలపడిన అతని కావ్యము ఉత్తమత్వమును కోల్పోవలసి వచ్చెను.

పర్ణశాలల నుండి, ప్రకృతి వనముల నుండి భ్రంశమునొంది భారతీయ కవిత్వము రాజద్వారముల యందు సువర్ణ హస్తాస్త్రోక్షేపణమునకు ఎదురు చూడవలసిన సమయము ఏనాడు వచ్చెనో ఆనాటి నుండియే క్షయోన్ముఖ మైనది. భారత వర్షము శక బర్బర యవన ప్రముఖాక్రాంతమైనది మొదలు సర్వ ధర్మములు వినాశమార్గమును త్రొక్కినవి. ఒంటికాలితో కుంటుతూ అనార్య తాడితయై అశ్రువులు కార్చుచు శ్రీభాగవతమున గోచరించు ధర్మదేవత ఈ దశనే విశదపరచుచున్నది. భారత వర్షము యవనాధీనమై ఆర్యధర్మములు అంతరించిన నాటి నుండి వాల్మీకి, కాళిదాసు, భాసుడు, భవభూతి, వ్యాసుడు ఇట్టి పవిత్ర కవులయొక్క అవతరణము ఆగిపోయెను. భారతవర్ష కవిత్వము యొక్క నిర్మలదశను, పతిత దశను విడదీసే ఒక పెద్ద ఖండపు రాయివలె శ్రీహర్షుని నైషధము మనకు కనబడుచున్నది. అప్పటి నుండియు మరల భారతవర్షమున కాళిదాసాది పవిత్ర కవివరంపర ఆవిర్భవించకపోయెను. ఆనంద వర్ధనాచార్యుని నాటికే భారతీయ కవిత పతనము పొంద మొదలిడెను. **"యే నాస్మిన్నితి విచిత్ర కవిపరంపరా వాహిని సంసారే**

**కాళిదాస ప్రభృత యో ద్విత్రాః పంచషావా మహాకవయో ఉపలభ్యన్తే"** (ప్రతిభా విశేషముచే అతి విచిత్రమైన కవిపరంపరా సంస్కృతియందు కాళిదాస ప్రభృతులు ఇద్దరు ముగ్గురు, అయిదారుగురు మాత్రమే మహాకవులు కనబడుచున్నారు) అని అన్న ఆనంద వర్ధనాచార్యుని పంక్తులు చదివినప్పుడెల్లను భారత వర్షకవిత్వము యొక్క యీ ఆరోహణావరోహణ దశలు నా తలపునకు వచ్చుచుండును. ఇక నేటి కాలపు కవిత్వము.



# నవ్య కవిత - చారిత్రక భూమిక

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

**(ఇరవయ్యో శతాబ్దపు నవ్యసాహిత్యాచార్యులలో, ప్రసిద్ధ కవులలో ప్రముఖులైన రాయప్రోలు సుబ్బారావు గారి అముద్రిత వ్యాసం ఇది. ఈ విషయాలు చెప్పడంలో వారికన్నా అధికారులు మరొకరు లేరు కదా! ఆధునిక కవిత ఆవిర్భావ వికాసాలు, సాహిత్యతాత్విక దృక్పథం రాయప్రోలు వారీ వ్యాసంలో విశ్లేషించారు. ఇది ఒకరకంగా రాయప్రోలు వారి స్వీయసాహిత్య లేదా సాహిత్య స్వీయ చరిత్ర కూడాను. సం.॥)**

**1912**వ సంవత్సరం సంక్రాంతి నెలలో నేను మద్రాసు ప్రవేశించాను. విజ్ఞాన చంద్రికామండలి అంతకముందే స్థాపిత మయింది. అది చాలా ముఖ్యమైన కాలమని నేను నమ్ముతాను. అప్పటికి ఒకటీ ఒకటిన్నర శతాబ్దం ఆంధ్రులు అరవల యింట కోడంటికం చేస్తున్నారు. కాని 1910-20లలో ఆంధ్రులు రాజధాని ప్రధాన పీఠాలను ఎక్కారు.

జయంతి రామయ్య, వేపా రామేశం, చెన్నాప్రగడ భానుమూర్తి మొదలైనవారు ప్రముఖులు. పండితులలో ఆంధ్రవాల్మీకి, పంచాగ్నుల, వేటూరి, ఉమాకాంత పండితుడూ ఇత్యాదులు మద్రాసు వచ్చారు. కొమర్రాజు కోవిదుడు విజ్ఞాన చంద్రిక స్థాపించారు. కాశీనాథుని నాగేశ్వరరావుగారు బొంబాయిలో కూడ పెట్టిన రూపాయల సంచులను తంబుచెట్టి వీధిలో విప్పి వెదజల్లడం ఆరంభించారు. ఈ కాలపు చరిత్ర గ్రంథాలుగా వ్రాయతగినది. ఆ పని జరగలేదు. నేను అతి క్లుప్తంగా రామాయణమును కట్టె, కొట్టె, తెచ్చె అన్నట్లు సూచిస్తాను. ఎందుకంటే నా వ్యాసము, వ్యాస రచన లాగా పెరిగేటట్లు కనిపించింది.

సీతాదేవికి అశోకవనంలో శుభ నిమిత్తాలవలె నాకూ రైలులోనే కొన్ని సూచనలు

కనపడ్డాయి. గురజాడ శ్రీరామమూర్తి గారి కుమారుడు దుర్గాప్రసాదరావు అప్పుడు లా కాలేజీలో చదువుతున్నారు. వారు నాకు రైలు పెట్టెలో కలిశారు. తన బసకు తీసుకొనివెళ్ళారు. దాదాపు ఒక మాసం వారి వద్దనే ఉంచుకొన్నారు.

నేను మొట్టమొదట కొమర్రాజు కోవిదుని దర్శించాను. ఒక వారం, రోజూ వెళ్ళేవాణ్ణి. వారు నాకు ఏవో కొన్ని ఇంగ్లీషు రచనలు ఇచ్చి తెనుగులో వ్రాయమన్నారు. వ్రాసి యిచ్చి వచ్చేవాణ్ణి. వారి పితృవాత్సల్యమూ, ఆదరమూ నన్నెంతో ఆకర్షించింది. విజ్ఞాన సర్వస్వము ప్రారంభమయింది. నన్ను నెలకు రు. 50ల మీద నియమించారు.

హరిసర్వోత్తమరావుగారూ అక్కడ ముఖ్యులు. మంచి లైబ్రరీ ఉంది. నేను తెలుగు కావ్యాలన్నీ అక్కడనే చదివితినని చెప్పవచ్చు. అది వరకు సంస్కృతగ్రంథాలే చదివేవాణ్ణి ఆ సమయంలోనే గొల్లపూడి శాస్త్రి గారు (పూర్తి పేరు స్మృతిలో లేదు) దక్షిణాది ఆంధ్ర వాఙ్మయమును ప్రకటించారు. (వీరు గొల్లపూడి శాస్త్రి గారు కాదు. గంటి సూర్యనారాయణశాస్త్రి గారు. శృంగార గ్రంథమండలి పేరుతో రాధికా సాంత్వనం, సత్యభామా స్వాంతనం వంటి గ్రంథాలు అందంగా ప్రకటించేవారు. సాహిత్య శ్రోత్రియులు ఆందోళన చేశారు. ప్రభుత్వం ఇటువంటి గ్రంథాల ప్రకాశనం నిషేధించింది. వాదవివాదాలు చెలరేగాయి. తరువాత ఎప్పుడో ఈ నిషేధం ఉపసంహృతమైంది. –సం॥) అహల్యా సంక్రందనం వెలువడింది. దానితో పెద్ద తుపాను రేగింది. అదివరకే గ్రామ్య గ్రాంథిక వాదాలతో పత్రికలు మారుమ్రోగుతున్నవి. అవి అన్నీ చదివేవాడను.

ఏదో దైవ నిర్దేశంగా అంతఃప్రేరణ కలిగింది. కావ్యములో ఒక క్రొత్త రచన ప్రారంభిస్తే ప్రతిఫలం ఏమవుతుందీ అని నేనే ప్రశ్నించుకొన్నాను. తృణకంకణం వ్రాశాను. అది 1913. చిన్న కృతి, నూటయిరువై పద్యాలు. అచ్చయింది. వేదము వారి జ్యోతిష్మతీ ముద్రాలయములో ప్రథమ ముద్రణం. వెల నాలుగు అణాలు. తృణకంకణము వ్రాసేటప్పుడు నాకు సన్నిహిత సహచరులలో ముఖ్యులు కురుగంటి సీతారామయ్య, బసవరాజు అప్పారావు. బసవరాజు ఏ రోజు వ్రాసిన పద్యాలు ఆ రోజే తీసుకొని పొయ్యేవాడు. కంఠతా పెట్టి ఎక్కడపడితే అక్కడ చదివి ఏవేవో వ్యాఖ్యానాలు చేస్తుండేవాడు. కృతిలోపలి రచన క్రొత్త. ఆకారం కూడా అందంగా కుదిరింది. పసుపు పచ్చ అట్ట. ఆఖరు పేజీ మీద తెలుగు రొమాంటిక్ పొయిట్రి అని ఇంగ్లీషులోనూ,

అభినవ కవితా మండలి అని తెలుగులోనూ ప్రకటించారు. ప్రకటించిన నెలలోనే 500 ప్రతులూ అయిపోయినవి. రెండవ ఆవర్తానికి ఇచ్చారు.

తృణకంకణానికి చిన్న పీఠిక వ్రాశారు హరిసర్వోత్తమరావుగారు అందులో ఈ కవిత భావ కవిత అని పేర్కొన్నారు. తన పేరీయక ప్రకాశకులు అని వ్రాశారు. ఇందుకులో కృష్ణా పత్రికకు ముట్నూరి కృష్ణారావుగారు సంపాదకులు. వారి కంఠస్వరం ఆబోతు రంకెవలె ఉండేది. లేఖనంకూడా అలాగే. వీరోత్సాహమూ, పురుష భావ ప్రగల్భంగా ఉండేది. రాజకీయాలను వేదాంత సూత్ర ఫణితిలో వ్రాసేవారు. సాహిత్య విషయాలను అపూర్వ విషయోత్కంఠతో ధ్వనించేవి. ఆకార సదృశమైన ఆయన బహుముఖ ప్రజ్ఞా విశేషమును వర్ణించాలని నేను ప్రయత్నించాను, (ఇట్లా) "ఎండమావుల (గుఱ్ఱాల) కంఠాలకు గంటలు కట్టగల ప్రతిభా విశృంఖలుడని" అన్నాను. వారు తృణ కంకణము మీద ఒక పేజీ పూర్ణంగా సమీక్ష వ్రాశారు. దానితో తృణ కంకణం పడుచువారినే కాక పండితులనుకూడా ఆకర్షించింది. ఇది అభినవ కవి జాతకకథ. తృణకంకణం.

ఆనాటికి నేను చదువుతున్న పుస్తకం కాదంబరి. ఆ రోజులలోనే వచ్చిన క్రొత్త కావ్యం గురజాడ వారి నీలగిరి పాటలు. అప్పారావు పంతులు గారు, కొమర్రాజు లక్ష్మణరావు గారిని చూడవచ్చి ఆ పుస్తకం ఇచ్చి వెళ్ళారు. 1912 ఎడిషన్ కన్యాశుల్కం కూడా ఆ రోజులలోనే మద్రాసు చేరింది. ఇంతకు తప్ప వారి యితర రచనలు 1913కు పూర్వము వ్రాయబడినవి నేను చూడలేదు. రాణీ సంయుక్త (వేలాల సుబ్బారావు) అనే నవల ఆధునిక రచన చదివాను. వేంకట పార్వతీశ్వరుల నవల వసుమతీ వసంతము చదివాను. వారి ఛందో రచనలు చదవలేదు. శతావధాని తిరుపతి శాస్త్రి గారు తెనిగించిన మృచ్ఛకటిక చదివాను. నన్నుప్రారంభంలో బాగా ఆకర్షించిన నాటకమది. అలా నన్ను ముగ్ధుడను చేసిన మరొక నాటకము చిలకమర్తి వారి వాసవదత్త అనువాదం. అన్నిటికన్నా అత్యధికంగా నా హృదయములో అచ్చు పడ్డది వీరేశలింగం గారి శాకుంతలం. సంస్కృతంలో నేను బాగా చదివిన పుస్తకమది. కాళిదాసు భాషకంటే భావములు నన్ను మోహపెట్టినవి. కణ్వుని నోట పలికించిన 'పర్ణశాలకు వాకిట బలికిగాను' శకుంతల పెట్టిన ముగ్గులూ, 'ఎవతె జలంబు మీకిడక యెన్నడుత్రాగదు తాను ముందుగా', ఈ పద్యాలలో తపోవనములలో ఋషుల శిక్షలో పెరిగిన కులీన కన్యల హృదయములూ

భావములూ నన్ను సాహిత్యరక్తుణ్ణి చేసినవి. భారవి అంతా రాజనీతి గొడవ. నచ్చలేదు. మాఘములో బలరాముడు త్రాగి తాంబూల ధారలు కారుతుండగా రేవతీదేవి ఎద వ్రాలుతున్న పద్యాలు ఒకటో రెండో బాగున్నవి. అన్నిటికన్నా రఘువంశములో అజవిలాపప్రభావం నా మేధాకోశమునేగాక, హృదయపద్మ కోశమును గాఢంగా తాకింది. నైషధములో శ్రీహర్షుడి రచన మల్లినాథ సూరియే రాకపోతే ఏమయిపొయ్యేదో అనిపించింది.

తెలుగు కావ్యాలు మద్రాసుకు వచ్చిన తరువాతనే అధికాధికంగా చదువగలిగితిని. పిఠాపురం రాజాగారు ప్రకటించింది (కళా పూర్ణోదయం) అప్పుడే చదివాను. అందులో సుగాత్రీ శాలీనుల కథ, వర్ణనలు తీసివేసి, శయ్యాగృహంలో వారి యిరువుర చిత్తవృత్తులూ సునిశితంగా విస్తరించి ఉంటే బాగుండేది నా అభిరుచికి. తృణకంకణ రచనలో ఇది కొంత సంకలితమయిందేమో చెప్పలేను.

గజవెల్లి రామచంద్రరావు గారు ఇంగ్లీషు లిటరేచర్‌లో ఎం.ఏ. ప్యాసయి, లా కాలేజీలో చదువుతున్నారు. ఆయనకూ నాకూ ఒక్క మేడలో ఉండడం తటస్థించింది. ఆయన కాసార కవుల కవిత్వం మెచ్చుకొనేవాడు. ఆయన ఉపదేశ ప్రభావం బాగా తాకింది నన్ను.

మొట్టమొదట స్త్రీ పురుషుల సాహచర్యం భోగ స్పృహ లేకుండానే ఉండేది. పశు పక్ష్యాదులను చూచి పరస్పర సంయోగమును అనుకరించారు. (చూడు 'బ్రహ్మముడి' మిశ్రమంజరి) స్త్రీ, పురుషులు, అందులో తరుణులు స్వచ్ఛందంగా నవ్వుతూ ప్రేలుతూ అహ్లాదావస్థలో ఉంటే, వారికి అపవాదం చుట్టుకొనేది. ఈ అధమ భావమునే మహాకవి భవభూతి 'యథావాచాం తథా స్త్రీణాం, సాధుత్వేదుర్జనోజనః' అని విలపించాడు. ఇది విపరీతము కాదా! కుటుంబంలో అన్నాదమ్ములు అక్కా చెల్లెండ్రు మున్నగు ప్రియ జనులందరూ కాలుష్యకూపంలో పడవలసిందేనా?

'తృణకంకణానికి ఇదే బీజం'. శాఖా చంక్రమణం చేయవద్దని విమర్శకులను ప్రార్థిస్తాను. ఇది ఇలా ఉండగా, కావ్యాలలో ఉజ్జీవితులైన స్త్రీ పురుషులు నాయికా నాయకులు తప్ప ఇతరులకు ప్రవేశము లేకుండా పోయింది. నిగమ శర్మ అక్కగారిని కావ్యంలోకి తెచ్చిన తెనాలి రామకృష్ణ కవి వంద్యుడు. ఈ దుర్వాసన నాగరక సంపన్న

గృహములను దట్టంగా చుట్టుకొన్నది.

ఈ మలినాంబరము విడిచి మరొక శుక్లాంబరము కట్టితే, కావ్య అందచందములు అగుపడువా? సహృదయులర్థించు హ్లాదైక రామణీయకములు అంతరించి పోతవా? అసలు ఆద్యమయిన శృంగారమే జీర్ణారణ్యమవుతుందా? ఇదే ప్రశ్న నా హృదయములో మొలిచిన మల్లె మొలక!

ఇలాటి భావాలతోనే "ఉమ్మెత్తపూలవలె ఉప్పాడచీరల కుచ్చెళ్ళ పాదాల గుస్తరింప" అని వ్రాసితిని. రెండవది కావ్యాలలో దేవకాంతల సంపర్కం. ఈ దేవకాంతల ఆధిక్యమునాకు బోధపడలేదు. ఏనాడో ఏదో అమృతంత్రాగి, ముప్పది యేండ్ల ముదురు యువతులుగా నిలిచిపోయినారుట. పెండ్లి లేదు. పేరంటము లేదు. బిడ్డా పాపా లేరు.

వాల్మీకిమహర్షి స్త్రీల చారితార్థ్యమును ఇలా నిరూపించలేదు. భవభూతి సీతాదేవి చేత పలికిస్తాడు ఇలా! 'అపత్య సంస్మరణేన ఉచ్ఛ్వసిత ప్రస్నుతస్తనీ క్షణమాత్ర సంసారిణీ సంవృతాస్మి'– నవ మాసములు మోచి ప్రసవించి పసిపాపకు, పాలీయడం గొప్ప యోగాభ్యాస సిద్ధి. స్తన్య ప్రదాన కాలంలో స్త్రీ బ్రహ్మానందము ననుభవిస్తుంది. ఇది పురుష జీవితంలో సాధ్యము కాని పరమ ప్రాప్యము.

తరువాత కావ్య భాష. శుచి రుచులు అతిక్రమించిన భాషే గ్రామ్యమని నా విశ్వాసము. కుంభస్తనీ! రంభోరూ! ఇత్యాదులే బలిష్ఠములు, కావ్యరూపకములలో. ఎందుకంటే ఇవి భావమునకు అనౌచిత్య వైరస్యమును ఆపాదిస్తవి. 'దానిమ్మ పువు వంటి తరుణి వాతెర' అంటే అప్రయుక్తమన్నారు. ధూళి మునిగి బంగారు తునక అంటే సమాసపునరుక్తి అన్నారు. మల్లెదండ అంటే మల్లెపూలదండ అనవలెనన్నారు. ఇవన్నీ శాస్త్ర మూఢుల వాదాలు. కావ్యంలో "అభిధా, లక్షణా గమ్యయోః అర్థయోః ఉపరికశ్చిదర్థః సముపలభ్యతేకావ్యే" అని వ్యాఖ్యల సమాధానం.

శ్రీ శివశంకర శాస్త్రి గారు సాహిత్యరంగంలో ప్రవేశించారు. అభినవ కవితకు అండదండగా అత్యుత్సాహచోదకులయినారు. విశాఖ రచయితలు తోడు నీడలయి ఈ అరవై సంవత్సరాలు సహకరించారు. అభినవ కవిత వ్యాప్తిలోకి వచ్చింది. యువజనము పట్టుకొమ్మయినారు . విజయనగర రచయితలూ పండితులూ ప్రాపయినారు. అందువల్ల వర్ధమాన దశలో వికాస వంతమయింది. పండితులు గ్రామ్య గ్రాంథిక వాదంలో కత్తులు

చూసి విసరుతున్నా అభినవ కవిత పట్ల ఉపేక్షాభావమో, అధవా మౌనమో వహించారు.

రాజమహేంద్రవరంలో రెండవ ఆంధ్ర కవిపండిత సమావేశం జరిగింది. నన్ను అధ్యక్షులుగా పిలిచారు. ఆ సమావేశంలోనే అభినవ కవిత, నవ్యకవిత అనే విలక్షణ నామధేయము వహించింది. నవ్యసాహిత్య పరిషత్తు స్థాపితమయింది. ఆ మహాసభ విశిష్టంగా ప్రకాశించింది. మహా మహోపాధ్యాయ గిడుగు రామమూర్తి పంతులుగారూ, చిలకమర్తి లక్ష్మీనరసింహ మహాకవీ సభనలంకరించి తమ ఆదర ఆశీర్వచనములు ప్రసాదించారు. భమిడిపాటి కామేశ్వరరావు, ఆయన మిత్రులు, ప్రతిభావంతులు సభలో పాల్గొన్నారు. పద్యాలు రాగముతో చదివే ఆంధ్రుల అభ్యాసము గురించి మంచి చర్చ జరిగింది.

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు స్వయంగా అభినవ కవితా వ్యాప్తికీ, ప్రకాస్తికీ ప్రధాన పోషకులయినారని నా విశ్వాసము. వారు తమ ఆంధ్ర పత్రికనూ తరువాత భారతినీ పూర్తిగా అభినవ కవితావ్యాప్తికి స్వచ్ఛంద ద్వారముగా తెరచి పెట్టారు. దీనికి శ్రీ శివ శంకరశాస్త్రి గారు ప్రముఖ పాదయినారు. వారిని సభాపతి అని గౌరవంగా పిలిచేవారము. స్వయంగా పండితుడూ రచయితా కవీ వ్యవహార దక్షుడూ అయి నడిపారు రెండు దశాబ్దములు.

గడచిన 50 యేండ్లలో పత్రికలలోనూ, వ్యాసములలోనూ రెండు విషయాలు చర్చలో పడి అయోమయములైనవి. వాటి వాస్తవము స్మృతిలో ఉన్నంతవరకు వివరించి విరమిస్తాను.

**1. ఆధునిక కవితా నామధేయం**

నేను 1913లో పెట్టిన పేరు అభినవ కవిత. ఆంగ్లములో రోమాంటిక్ పొయిట్రి అనేది మనసులో ఉంచుకొని నేను ఈ పేరు పెట్టాను. ఆ పేరూ, దాని స్వరూప విశేషములూ సర్వవిధముల సమన్వయమవుతుందా కాదా అనేది నేను పరిశీలించలేదు. ఎవరితోనూ ఆలోచించలేదు. రోమాంటిక్ అనే పదం మొదటి నుంచి సామాన్యముగా అపూర్వముగా ఆశ్చర్యమూ, చోద్యమూ అనే భావములో వాడుతూ వచ్చాము. అపూర్వం అనే విషయం వాస్తవం కాదా! ఇది ఆంగ్లములో ఉన్న లిరిక్ పొయిట్రీకి వర్తిస్తున్నదని తోచింది. తప్పో, ఒప్పో అట్టే మథనపడలేదు. తృణకంకణములో కథ కేవలం పాత్రల

సంబంధము. అది వరకు కావ్యములలో కనపడదు. కావ్యములో సర్వసాధారణంగా నాయికా నాయకులుంటారు. కాని వారి సంబంధము మిధునానురాగము, సంభోగంగా పరిణమిస్తుంది. నేను ఆ సంబంధము విసర్జించాను అభినవ కవితలో. వారు త్రికరణయామిత్రులు, సహచరులు, అభేదమయిన సౌహృదయముతో పెరిగారు. వారు పెండ్లి చేసుకొందామనే భావమున్నట్లు నేను ఎక్కడా చెప్పలేదు. సూచించను కూడా లేదు. ఆడపిల్ల పెండ్లి అయింది. 'పతి పజ్జకు అంద రనుజ్ఞనీయరే' అని వీరేశలింగం గారి అనువాదమును ఉద్ధరిస్తున్నాను. అక్కడ ఆమె సంసార సుఖమును అనుభవిస్తున్నది. ఇక్కడ ఆమె మిత్రుడు ఆ వియోగములో కామపులకితుడై "ఆశాభంగ కఠోర శస్త్రికలుకోయఁన్ గాయములగాన్ బాధాశోకములో బడి తుందకం ప్రాణప్రబంధాశ్వాసమును" ముగించ నిశ్చయించాడు.

ఈ వార్త అతని మిత్రురాలికి తెలిసింది. నాకు ఆ బాల్యమిత్రుడు, ఇలా జీవితమును నిష్ఫలం చేయడం మానవధర్మం కాదని భావించింది. అతని నిర్ణయం మార్చి, అతడు వివాహమాడి తన వంటి మరొక యువతికి సంసారసుఖమునీయక, తాను అనుభవింపక పోవడం, ఆమెకు నచ్చలేదు. ఇది నేను భావించిన ఆంతర్యం. ఈ భావమును నాకు సరస్వతి ప్రసాదించిన తెనుగులో ప్రతిపాదించి, వాచ్యము కాకుండా అభివర్ణించాను.

ఈ భావమునకు భవభూతి రచన ఆధారం. ఆ మహాకవి అనురాగ భావమును మీమాంసించి ప్రేమలో పరవశింపజేశాడు. 'భద్రం ప్రేమ సుమానుషస్య కథ మప్యేకం హితత్ ప్రార్థ్యతే' అన్నాడు. ఇంకా ఆ ప్రేమ స్నేహ సారమందు సుస్థితమవుతుందన్నాడు. 50 యేండ్ల క్రిందనే శివశంకర శాస్త్రి గారు సూక్ష్మంగా సూచించారు తమ పీఠికలో. (చూ. రజతోత్సవ ముద్రణ పీఠిక, తృణకంకణం) తరువాత నేను శాంతినికేతనంలో ఉన్నప్పుడు అబోధమయిన ఈ భావము అగాధంగా ఉపనిషత్తులలో యోగ శాస్త్రములో ప్రయుక్తమని విధుశేఖరభట్టాచారి గారి ముఖతః తెలుసుకొన్నాను. ఇది తృణకంకణంలోని భావవిషయము. మిగిలినదంతా రచయితల ఊహాగానమే. భావకవిత అనే పేరు హరి సర్వోత్తమరావుగారు పెట్టినది. ఆనాడే ఈ పేరు కొంత చర్చలో పడ్డది. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు దీనిని ఇలా వ్యాఖ్యానించారు.

'కావ్యనాటకాలు శబ్ద శిల్పము. శబ్దం అఖండము. అది సాధారణ లౌకిక

వ్యవహారమును తెలిపినట్లు, సూక్ష్మమైన అలౌకిక వ్యాపారమును గోచరింపచేస్తుంది. అది గాక సాహిత్యములోభావమూ రసమూ ప్రధానము. భావములేనిదేరసము ఎక్కడ ఉంటుంది?' అని. తృణకంకణములో అంతర్యమంతా వాచ్యం కాకుండా ఉన్నది. ప్రభాకరశాస్త్రి గారికి ఇదంతా చెప్పాను. వారు నిజమేనన్నారు. తరువాత వేలూరి శివరామశాస్త్రి గారిని బెజవాడలో ఈ విషయం అడిగాను. అవును ఈ విషయం పెద్ద శాస్త్రీయమైనది. ఎప్పుడో నేనే వ్రాస్తాను అన్నారు. ఇది భావకవిత్వ మూలము.

తరువాత నవ్యకవితను పరామర్శించిన, అథవా విమర్శించిన పలువురు రచయితలు తృణకంకణములోని స్నేహభావమును ప్లటోనిక్ లవ్ అని అన్నారు. కాని డాక్టర్ నారాయణరెడ్డిగారు దీని ఆదిపాదులను చర్చించి ఇది వ్రాసిన వారు ప్లాటో సిద్ధాంతాలు బాగా పరిశీలించినట్లు కానరాదని ఖండితంగా విశదీకరించారు. ఇది నిజం.

**2. గురజాడ వారికీ నాకూ పోలిక**

పలువురు ఈ విషయం ప్రస్తావించారు. గురజాడ వారు మహాకవి. నాకు పూర్వులు. పెద్దలు. ఆంగ్ల సాహిత్యమును బాగా తరచినవారు. వారి రచనలు నేను తృణకంకణం రచించక పూర్వం చదవలేదు. కవిత్వములో న్యూనాధిక్యములను గురించి నేను వ్రాయుటకు సాహసించను. అది సహృదయుల కార్యం. ఆస్వాదించే వారూ ఆనందించేవారూ సహృదయులయిన పాఠకులు. అయితే ఇక్కడ ఒక్క ప్రశ్న ఆలోచించదగినది. తృణకంకణమునకు ముందు ఇద్దరు యువకులయిన స్త్రీపురుషులు సాహచర్య స్నేహమును వారి మనోభావములనే ప్రధానంగా వాచ్యముకాకుండా అభివర్ణించిన కవితగాని, కృతిగాని ఏదయినా ఉన్నదా? నాకు గోచరించలేదు.

1972లో ఒక అమెరికన్ యువతి నన్ను కలుసుకొని రెండు రోజులు సంభాషణలు జరిపింది. నోట్సు తీసుకున్నది. చివరకు I want you to write in English what you have introduced in lyrical poetry in Telugu అని అడిగింది. వ్రాసి యిమ్మన్నది. నేను స్వహస్తంతోవ్రాసి యిచ్చిన పంక్తులివి.

An earnest attempt was made to divert the lovely lyric from the sex overtones and direct it to the sublime echoes of kindness, fellowship and true joy of the divine grace in the human heart.

తృణకంకణము వైరాగ్యమును స్పృశించదు. జీవితములో సహజమయిన కామితము సుఖము. ఆ సుఖము 'రాగానుశయ' మన్నది యోగశాస్త్రము. 'మైత్రీ, కరుణా, ముదితం, ఉపేక్షా' ఈ నాలుగును సుఖసాధనలు అని వివరించింది. గృహాంగణములలో దాంపత్య విషయమయిన సుఖమును సమాజావరణములో మైత్రీముఖంగా సాధించమని ఉపదేశిస్తున్నది.

తృణకంకణంలోని యువతీ యువకులు దంపతులు కారు. మిత్రులు, వారి మాటలలో ఈ మైత్రీ భావము ప్రకాశించాలె. అసలు భావమే శబ్దార్థములకు పైగా ఉంటుంది. అందులో మనోభావములు చెప్పవలసి వచ్చినప్పుడు భాష ఒక క్రొత్త శ్రుతిలో ధ్వనించింది.

నేను వర్ణిస్తున్నవారు నాకు భావనా చిత్రములో స్పష్టంగా కనిపిస్తున్నారు. వారి చేష్టాదికం కూడా కనిపిస్తున్నది. వాటిని ధారాళంగా అప్పటి కప్పుడు ధారగిల్లిన భాషలో ఉపయోగించాను.

కొత్త సమాసములు, కల్పించానని విమర్శ. కాని సమాసవిధులు నిత్యములు కావనే విషయం మరచిపోయినారు.

నైషధము చూడండి. ఒకటి రెండు ఉదాహరిస్తాను. "మదన్యదానం పతికల్పనాయా...." ఇక్కడ మదన్యదానం అంటే నేను చేసిన మరొక దానమును గురించి అని అర్థము. రాజపుత్రి ఆమె. అనేక దానములు వ్రతాదులలో చేసి ఉండవచ్చు. అందులో ఒకటి. కాని మల్లినాథ సూరి సహృదయుడు. అంతేకాక సమర్థుడు. అసవ్య విగ్రహం ప్రకరణంతో సమన్వయించుకోలేదు. అందుకోసం మదన్యదానం అనే సమాసమును మాం అన్యన్యదానం ప్రతి అని విగ్రహించాడు. నన్ను అన్యుని దానదయ్యేటట్లు చేయబడే దానం అని అన్వయించాడు.' నేత్రాణి విదర్భసుతా సఖీనాం ప్రాపుస్తదేకం నిరుపాఖ్యరూపం' ఇక్కడ తత్ నలునకు అన్వయించక తత్ పరమాత్మ పరంగా నిరూపించాడు– నైషధం తృతీయ సర్గ.

మిశ్ర సమాసాలు పద్దమాట నిజం. ఏమీ! తిక్కన సోమయాజి కరచరణాది కాయము, వహ్ని పుట్టు అరణిని బోలి... (అనలేదా) అందుకనే అర్థవత్ సమాసమని వ్యాఖ్యాతలు నిర్ధారణ చేసుకున్నారు. ప్రకరణమును, పాత్రలను, సందర్భములకు వదలి సమాసం అన్వయించరాదు.

పాఠకునకు ఈ గొడవ అక్కరలేదు. పద్యములో ఏమైనా హృదయంగమమయినదీ, ఇంపయినదీ ఉన్నదా లేదా? అని చూస్తాడు.

**3. అస్పష్టత**

కావ్యం అంటే కవిత్వం సంవృత్తంగానే ఉంటుంది. అది గుణము. దోషం కాదు, కవితా పితామహుడు పెద్దన యిలా అన్నాడు. గుజరాతీ కాంతలస్తనములవలె గూఢము కాకూడదు. ద్రావిడ స్త్రీల కుచముల వలె బయటపడకూడదు. కనబడీ కనబడని ఆంధ్ర స్త్రీల పయోరుహములవలె 'గూఢమునూ చాటుదనమునూ లేకుండగానూ' ఉండవలెను. అదీ కవిత్వం. కాకపోతే కపిత్వమవుతుంది.

**4. శృంగారము**

అందరినీ  ఆకర్షించేది శృంగారము. ఆనందింపచేసేది కూడా శృంగారమే. ఇది కావ్యాదులలో అధికాధికంగా సంభోగాభిముఖంగానున్నది. దీనికి నిక్షేపము 'సప్తశతి' కావ్యం. అందులో శృంగారము ఇలా సంవృత్తముగా ఉంటుంది.

"క్రొత్తగా వచ్చిన కోడలు ఇంట్లో ఉన్నది. వాకిట మామగారున్నారు. ప్రియుడు సమయం చూచి ఇంట్లోకి దూరాడు. వారిరువురూ క్రీడా కలాపంలో కామపరవశులై ఉన్నారు. కోడలి కాళ్ళ అందెల చప్పుడూ, కరముల గాజుల గలగలా బాగా వినబడుతున్నాయి. అప్పుడు పొరుగింటిలో ఉన్న కోడలు అంటుంది.' ఇదుగో చప్పుడు చాలా అధికంగా వినపడుతున్నది జాగ్రత్త.'

అంటే నీ మామగారు గ్రుడ్డివాడు. ఆ సందు చూచి నీ ప్రియుడు వచ్చాడు. కాని అతడు చెమిటివాడు కాదు. నీ గలగలవింటున్నాడు. అత్తతో చెప్పగలడు సుమీ! అని ఇందులోని భావము. చెప్పవచ్చిన దేమిటంటే, తేటతెల్లంగా చెప్పబడని, వాచ్యము కాక సంవృత్తంగా ఉన్నదంతా అగోచరమే.

సంపంగి పొద దట్టంగా ఉంటుంది. దానిలో నుంచి సువాసన గుబాళిస్తుంటుంది. కాని పూవు బయటికి  స్పష్టంగా కానరాదు. పొదలోకి చూపు సారించి ఆకులూ రెమ్మలూ విడపరుస్తూ వెతికితే పుష్ప దర్శనమవుతుంది.

'హేమపాత్రల చందన మెండిపోయె

ద్వారములు మోయుచున్నవి హారములను' ఈ పద్యపాదాలలో ఒకానొక యువతి

విరహావస్థ వర్ణించాను. కాని కామజ్వర ప్రస్తావనలేదు. ఆ తాపములో నగలన్నీ తీసివేసి ఆ జ్వరము బాగా తీంవ్రించినపుడు నగలూ పూలు అన్నీ తీసి పారేసి పడే ఆపసోపాలు లేవు (వాచ్యంగా) కానీ అన్నీ ఉన్నవి.

బంగారు గిన్నెల్లో గంధం ఎండిపోయిందంటే ఉపశమనార్థం బంగారు గిన్నెల వంటి స్తనముల రాచుకొన్న చందనం కూడ ఎండిపోయిందనుటే. కామజ్వరం నూరు డిగ్రీలు దాటిందని భావం. మెడలో వుండవలసిన ముత్యాల దండలూ, పూల సరాలూ ద్వార బంధాలకు తగిలించిందటే విరహోద్రేకమే, కండ్లు బాష్పధారలతో నిండి వున్నవని అభిప్రాయం.

**5. అమలిన శృంగారం**

తృణకంకణములో శృంగారం ఉన్నది, లేదని నేను వాదించను. కాని అది సంభోగాభిముఖంగా లేదు. స్నేహదీప్తంగా ప్రోది చేశాను. పూజాశాలకూ శయ్యా గృహమునకు అంతరముండదా? శృంగారము నకు శుచీ, రుచీ రెండు అంశాలు ఏర్పరచుకొన్నాను. అందువల్ల ఇందలి శృంగారమును విలక్షించి, అమలిన శృంగారమని అన్నాను.

శృంగారము మలినమనీ అమలినమనీ రెండు శృంగారాలున్నవా అని విమర్శ. మలినమగుటకు అవకాశములేని శృంగారం అమలిన శృంగారం అన్నాను. వ్యభిచారాదులలో శృంగారం మలినమవుతుందని నా మతము. 'యశోదాకృష్ణులు'– సౌందర్య శృంగారములకు సంకరం చేయరాదు.

నా భావనలో కామ– ప్రేమలు రెండునూ శృంగార సంబంధము లుగా భాసించినవి. ప్రేమ దైవికంగానూ, కామం మానుషంగానూ సంకేతించుకొన్నాను. అందుకనే నా అమలిన శృంగార విషయములో శబ్దౌచిత్యమును పాటించాను. చక్రస్తనీ, రంభోరూ, లలనా ఇత్యాదులు కేవల స్త్రీ వాచకములుగా వాడక జాగ్రత్త పడ్డాను. ఇది అనుభవమే కదా! కూతుర్నీ, సోదరినీ లలనా అని సంబోధిస్తారా? అందుకని రమ్యాలోకములో ఈ ప్రసక్తి తప్పనిసరి అయినపుడు సురత సంభోగాదులను వాడలేదు. సంయోగమనడానికీ జంకాను. భోగార్చన సలిపినట్లు అన్నాను. దీని విషయం పూర్తిగా తెలియని వారు ఆక్షేపించారు. నేడు దీని ఆదిపాదులు ఉపనిషత్తులలో ఉన్నవి బయటపెట్టాడు

సుప్రసన్నాచారి.

నా రచనలో భాష రూపకచ్ఛాయ తిరిగింది. దీనినే ఆంగ్ల వ్యాఖ్యాతలు metaphoric expression అంటారు. ఆమె నగు మొగమున లజ్జాలతలు పూవులు పూచినవి అన్నాను. రామలింగారెడ్డిగారు నా పద్యాలు కొన్ని చూసి fancy ఇది అవుతుందా nature అవుతుందా అన్నారు. నాకు వివేచించే కౌశలము లేకపోయింది. వారినే అడిగాను తెలియచెప్పండి అని ఏమో చాలా చెప్పారు. అయినా స్పష్టం కాలేదు. most abstract beauty అని వర్ణిస్తూ అందలి పద్యాలు వ్రాసి యిమ్మన్నారు.

పసుపుత్రాగిన
కంఠమందున తాంబూల రాగరేఖలగపడి
తొగరినూలుపోగులు నిగనిగమనుచు
ఆణిముత్యాల దండలో అలరునట్లు
నీళ్ళకోసము నెలత కోనేటికేగి
నిండు బిందె బుజాన తొణికిసలాడ
వచ్చుచుండ హంసలు వెంటబడెను
నడలయందాల,

తరువాత వారిని కలుసుకోవడం జరగలేదు.

భాష అవ్యక్తశ్రుతి వంటిదని సంభావిస్తాను. ఎన్ని రాగాలకో అనువర్తిస్తుంది.

**6. దేశాభిమాన కవిత్వం**

మద్రాసులో ఉన్నత విద్యాభ్యాసము చేస్తున్న ఆంధ్ర విద్యార్థులు వేలమంది ఉండేవారు. వారికి మూడు సమాజములు వేరు వేరుగా ఉండేవి. వారందరూ 1913 ఏకమై ఒక మహాసభ సమావేశం జరిగింది. బయ్యా నరసింహేశ్వరశర్మగారు అధ్యక్షులుగా సభను నడిపారు. అప్పుడు నన్ను పద్యాలు వ్రాయమన్నారు (చూడు . ఆంధ్రావళి.)

ఆ పద్యాలలో యావదాంధ్ర జన మాతృదేవీ అని సంబోధించాను. ఆ సమాసం సంస్కృతంలో ఉన్నది తెలుగులోకి మార్చండన్నారు. తెనుగుతల్లి అనే పూజా వాచకం పుట్టింది.

అదివరకు ఆ మాట భాషలో లేదు. ఆంధ్రోద్యమమారంభమై విస్తరించి ఉద్రేకించింది. తెలుగుతల్లి జనులకంఠములలో మారు మ్రోగి నిలిచిపోయింది. నాకు ఆంధ్రాభిమానం

జన్మాంతర వాసనగా వచ్చినట్లున్నది. ఆ అభిమాన కవిత్వము చాలా వ్రాశాను. అప్పుడు 1914-1917 శాంతినికేతనంలో ఉంటిని. బంకించంద్రుని వందేమాతరం గీతం దీనికి ఓంకారం అయిందని నా స్మృతి. తెనుగు వాణి, తెనుగు కత్తి ఈదృశ సమాసములన్నీ నేను సృష్టించినవే. ఏమి కారణమో ఊహించలేను. అభినవ కవితను కొనసాగించారు పలువురు యువకులు. కాని అభిమాన కవిత్వం ఎందుకో వ్రాయలేదు.

1913-1917ల మధ్య అభినవ కవిత బాగా పాదుకొని మొలకెత్తింది. పదేండ్ల దాకా ఎవరూ ఆ వ్యవసాయంలోనికి దిగినట్లు తోచదు. 'నా రచనలు' ఏవి ఎప్పుడు వ్రాసితినో అది డైరీ వ్రాసి పెట్టుకోలేదు. శ్రీ శివశంకర స్వాములవారు నా యింటికి వచ్చినపుడు నా కాగితాలు పరిశోధించారు. ప్రోత్సహించి ఎన్నింటినో పత్రికలకు పంపేవారు. వారికి సర్వదా కృతజ్ఞుడను.

**7. నా రచనకు కొండగుర్తులు**

1909లో లలిత ప్రారంభ రచన. 1912 -1914లో తృణకంకణాది నాలుగు. 1915-17లో దేశాభిమాన కవిత్వం. అధిక భాగం రమ్యాలోక మాధురీ దర్శనాలు. 1949లో రూపనవనీతం. 1960లో దూతమత్తేభం. సంస్కృతానువాదం దీనితోనే ప్రారంభ మయింది. ఉత్తర రామచరిత్ర, శకుంతల. 1972లో సుందరకాండ, రాసపంచాధ్యాయి. అభినవ కవిత, దేశాభిమాన కవిత్వమూ నేనే ప్రారంభించాను. దాని లక్షణ సంగ్రహం కూడా నేనే వ్రాశాను. నాకు ముందు అలాటి కావ్యాలు లేవు. అలాటి కావ్యాలు గుర్తింప పరిశోధకులు వెదకవలెను.

అభినవ కవితా రచనలో నేను ఎవరినీ అనుకరించలేదు. మేఘదూత, మృచ్ఛకటిక, స్వప్నవాసవదత్త, ఈ మూడూ నన్ను బాగా సాకల్యంగా ఆకర్షించినవి. పద్యరచనలో నాటి అల్లసాని పెద్దనను, నేటి శతావధాని తిరుపతి శాస్త్రిగారినీ అనుకరించకపోలేదు. అంటే ఇతర ఉత్తమ కవులను అపాకరించానని అర్థము చేయరాదు.

**రసము - భావము**

వీటి గురించి నిస్సంశయముగా తెలుసుకోవలెనని ఎంతో చదివాను. విజ్ఞులను వినమ్రంగా జిజ్ఞాసువునై ప్రార్థించాను. వారు కూడా వివరించి చెప్పారు. నాకు ఇంత వరకూ పూర్తిగా బోధపడలేదు. ఇది సత్యం. నాటకాలలో భావమంటే అర్థమవుతుంది.

కన్నులతో కరములతో జరిగే సైగలు. కాని శ్రవ్య కావ్యములలో ఇదంతా అంతరంగ వ్యాపారము. శయ్యాయాత్ర సహాయిని అనే వాక్యం విన్నప్పుడు ఎంతో మనోవ్యాపారము జరుగుతున్నది. తుదకు ఏదో రమణీయమయిన రుచి స్ఫురితావస్థ కలుగుతుంది. శరీరము పులకిస్తుంది. సర్వాంగీణమైన హ్లాదము అనుభవించినట్లవుతుంది.

ఈ విశేషము వాక్కులో ఉన్నదా? అర్థములో ఉన్నదా? మహాకవి కాళిదాసు చెప్పిన 'వాగార్థా వివసంపృక్తౌ, వాగర్థ ప్రతిపత్తయే' అనే శ్లోకమే ఈ మీమాంసను తేల్చవలెనని అనుకొన్నాను. పైగా ఆయన వాగర్థ బంధమును పార్వతీ పరమేశ్వర బాంధవమునకు పోల్చాడు. పైగా జగత్పితరులనే విశేషణం ప్రయోగించాడు.

ఈ మహాకవి వాక్యానికి 'రసోవైసః' అనే ఉపనిషత్తే మూలమా అనిపిస్తుంది. మన ఆదికవి నన్నయ భట్టారకుడు పార్వతీ పరమేశ్వరులతోపాటు శ్రీ మాధవులను వాణీ విధాతలనుకూడా కలిపాడు. స్త్రీ పుంసంయోగ లోకహితమనీ స్మరించాడు.

(పండిత) రాయలు తరచి తేల్చి 'ఆవరణ భగ్నార్యద్యవచ్ఛిన్నాచిదేవరసః' అని నిర్ణయించాడు. నవ్యులలో కవులు సహృదయులు విద్వాంసులు అయినవారు దీనికి తమ భాష్యమాలోచించదగును. ఇది నా ఆశ. నా ప్రార్థన. ఇంతవరకు ఆశ ఫలించలేదు. నా ప్రార్థన వేత్తలు వినలేదు.

మహాకవి జగత్పితరభావమందునూ, నన్నయభట్టారకుని స్త్రీ పుంసంయోగభావమున శృంగార స్ఫురణమున్నదని భావించాను. దానినే నా అభినవ కవితలో అమలిన శృంగారమన్నాను. సిద్ధాంతాధికారము నాకు లేదనిపించింది.

అంతేకాదు. శృంగార శబ్దానికి మనస్సమాధానమయిన నిర్వచనము కాని వ్యుత్పత్తి కాని నాకు దొరకలేదు. వ్యుత్పత్తికూడా లభించలేదు. అమరుడు శృంగార శబ్దమునకు శుచి, ఉజ్జ్వలమూ అని రెండు పర్యాయ పదాలు ఇచ్చాడు. నేను నా సాహిత్య సాధనలో వాణీ విధాతలయందు శుచినీ పార్వతి పరమేశ్వరుల యందు ఉజ్జ్వలమునూ లక్షించుకొన్నాను.

'రసాది రూపః కచ్చిదర్థః సముపలభ్యతే కావ్య' అన్న వ్యాఖ్యా పలుకు నాకు రామాయణములోను, కాళిదాస కవితలోనూ అనుభవమునకు వచ్చింది. ఎక్కడ? ఏ ప్రకరణములో అని ప్రశ్నిస్తే చెప్పలేను.

రామాయణమును నేను గోమతల్లికనుగా రూపించుకొన్నాను. 76వ సంవత్సరములో స్వావరణంలో పూజించి ఆ తల్లి యిచ్చిన అమృతం తాగాను. ఆవులో పాలున్నవి. ఎక్కడ? అంటే ఏమి సమాధానం? కాని ఆఖరుకు లేగముఖముతగిలే సరికి పొదుగులోకి వస్తున్నవి. కాగా ఆ పొదుగును భావంగాను, పాలను రసంగాను సంభావించాను.

కావ్యములో రసభావములను గురించి అనుభవమార్గమును అవలంబించాను. శయ్యామాత్ర సహాయినీ అనే కవి వాక్యం స్థూల దృష్టితో చూస్తే దిక్కూ మొక్క లేక మంచం పట్టిన ఒక పేదరాలు మనసుకు తగలవచ్చు. అది ఇష్టార్థము కాదు. కాబట్టి భావాంబరములో తిలకిస్తాడు. అపుడు మంచి యిల్లూ, అందులో పడకగది, అందులో మంచముపై పానుపూ, దాని మీద ఉన్న ఒక మగనాలు ద్యోతమాన మవుతుంది.

ప్రియుడు దూరదేశంలో వున్నాడనీ దీర్ఘకాలం వియోగావస్థలో ఉండి పరితప్తయై ఒంటిగా తాను ప్రేమ సుఖైక జీవితం గడిపిన శయనము మీద నున్నదనే భావము స్ఫురిస్తుంది.

'తన సొగసు చూచి యేడ్చు జవ్వని యొకర్తు' అని పలికాను. దీని అర్థము అనుశీలిస్తే ఆమె రూపవతి, యౌవనంలో ఉన్నది. పడకటి యింట్లోకిపోయింది. గోడ మీద అద్దములో తన సుందరరూపము కనపడ్డది. అడవిలోకాచిన వెన్నెల అయింది కదా! హా! దుర్విధీ! అని విలపిస్తున్నది. ఇది భావకవితా వైఖరి.





# సాహిత్యతత్త్వము

శ్రీ సర్దేశాయి తిరుమలరావు

**గొప్ప భావుకుడాయన. సమ్యగ్దృష్టి, సాధికార సాహితీ తాత్త్వికచింతనం, నేటి సాహిత్య విమర్శకులలో ఆయనను ప్రథమ శ్రేణిలో నిలిపాయి. గడియారం వారి శివభారతంపై ఆయన రచించిన విమర్శ ఆధార భూమిక ఈ వ్యాసం. సం.,)**

సాహిత్యము జీవిత విమర్శనము (మాథ్యూ ఆర్నాల్డ్) అయిన, విమర్శనము సాహిత్య జీవితమనవచ్చును. తులనాత్మకమయిన కావ్యగుణ దోషపరిశీలనమే విమర్శనా ధ్యేయము. కవి హృదయావిష్కారము చేసి కావ్యావగాహమునకు దోహదము చేయుటయు, దోషముల వేఱుపఱచి, వానివలన కావ్యఘనత న్యూనము కానట్లు చేయుటయు, సాహిత్య విమర్శనా ధర్మము, సాహిత్యవిమర్శన ఉపాలంభనము కాదు. నిందకాదు. అవహేళనకాదు. వ్యంగ్యము కాదు. భర్త్సనము కాదు. విమర్శనము కవిజన ప్రోత్సాహకారిగ నుండుట అపేక్ష్యము. కాని సహజసాధువులైన కవులను మూగవారిగ చేయునదిగ ఉండరాదు. కవి మేదకుడు కావున అతనిని బెదిరించి చూతమని విమర్శకున కనిపించుటయు, కవి స్వతంత్ర ప్రవృత్తి కలవాడు కావున అతనికి కట్టుపాటులు చేయవలెనని లాక్షణికునకును, వైయ్యాకరణునకును అనిపించుటయును సహజము. "కవి గజాంకుశము", "కవిమూషిక మార్జాలము", "కవికంఠ కాలపాశము" "కవిసర్పగారుడము" వంటి లాక్షణిక గ్రంథ నామకరణ మందీ మనస్తత్త్వము కానవచ్చును. "కవిజనాశ్రయము", "కవి కంఠాభరణము", "బాలకవి శరణ్యము" వంటి లాక్షణిక గ్రంథ నామకరణమందు, కవి కుపకారము చేయవలెనను మనస్తత్త్వము

కనిపించును. భావుకుడయిన విమర్శకుని కొఱకు కవి వేచియుండును. తన కాలమునందు లేకపోయినమానె భావికాలమునందయినను తన మనోధర్మమే కలవాడు రాకపోవునా అని భవభూతివలె కవి శతాబ్దములు ఎదురుచూచుచుండును. ఒక్కొక్కప్పుడు కవిత్వమునే వదలుకొనును. ఒక కవికిని, అతని, స్నేహితునకు జరిగిన సంభాషణ వినుడు.

**కస్త్వంభోః? కవి రస్మి! కావ్యభి నవాసూక్తిః సఖే పర్యతాం**
**త్యక్త్వా కావ్యకథైవ సంప్రతిమయా! కస్మాదిదం? శ్రూయతాం**
**యస్సమ్యగ్వి వినక్తి దోషగుణయోః సారం స్వయంనత్కవిః**
**సోస్మిన్ భావక ఏవనాస్తి! అథభవైద్దైవాన్న నిర్మత్సరః.**

**– "కావ్య మీమాసం" – రాజశేఖరుడు**

**తెలుగు:** "ప్ర:– ఎవరు మీరు?

**ఉ:–** కవిని నేను.

**ప్ర:–** ఏమైనను అభినవ సూక్తి కలదేని మిత్రమా చదువుము.

**ఉ:–** ఇప్పుడు నేను కవితా ప్రస్తావనయే తలచుకొనుట లేదు.

**ప్ర:–** ఏల?

**ఉ:–** వినుడు. స్వయముగ తాను కవియై గుణదోషసారము తెలిసి చక్కగా విమర్శింపగల భావుకుడే ఈ ప్రపంచమున లేడు. ఎచ్చటనైన ఒకడున్నను దైవవశమున అతడు మాత్సర్యమును వీడి ఉండుట లేదు. కావున నేను కవిత్వమును వదలితిని". కవియు, విమర్శకుడును పరస్పర విరోధులను కొనుట అసంగత పరిస్థితి. వారిని ఒక నాణెపు రెండు ప్రక్కలుగా భావింపవచ్చును. స్వయముగ కవియైన వాడో, కవిహృదయము కలవాడో నిజమైన సాహిత్య విమర్శకుడు కాగలడు. జీవిత తత్త్వమును కవి తన మాటలలో చెప్పగ, కవితాతత్త్వమును భావుకుడు తన మాటలలో చెప్పును. కవి

సృష్టికర్తయగు బ్రహ్మవంటివాడు. భావకుడు సృష్టి లయకారుడగు శర్వుడయినను కావచ్చును. కావ్యగుణదోషములు ప్రసాద చిత్తతతో చేసిన విమర్శనము కావ్యమున్నన్నినాళ్ళు మన్ననలందును. కలుష చిత్తతతో, దోషైకదృష్టితో చేసిన విమర్శనము కాలప్రవాహమున మునిగిపోవును. ఒకవేళ తేలుచున్నను, కావ్యప్రియులైన లోకులు దానినొక చెత్తచెదారముగ పరిగణింతురు. లేదా వస్తు ప్రదర్శనాశాలలోని వింత వస్తువుగ చూతురు. షేక్సుపియర్ నాటకములను గూర్చిన నాటిథామస్ రైమర్వ్రాతలును, మిల్టన్ కవి రచించిన "స్వర్గచ్యుతి" (PARADISE LOST) లో దాని నిడివి తప్ప తక్కిన గుణము కన్పింపదు అనిన విమర్శకునివ్రాతలును నేడు మనకు విడ్డూరముగనే కన్పించును. సహృదయతతోడి సృజనాత్మక విమర్శనము కావ్యమును నూత్నతేజో విరాజమానము చేయును. అట్టి విమర్శకులు కవిలోక బాంధవులు. ఆంగ్లమున టి.యస్. ఇలియట్ (ఇతడు మహాకవికూడ), ఎజ్రాపౌండ్ (ఇతనిని "కవుల మంత్రసాని" అని అందురు), వాల్టర్ పాటర్, ఫ్రెంచి భాషలో సెయింట్ బీవ్ (SAINT BEUVE), రష్యన్ భాషలో ఇల్యా ఎహ్రెన్‌బర్గ్‌లు అట్టి సాహిత్య విమర్శకులు.

మహాకవుల రచనలపై ఆలంకారిక దార్శనిక విచారములు తెలుగున తక్కువ. ప్రాచీన కవులలో తిక్కన, నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు, పింగళిసూరన, ఆధునిక కవులలో గురజాడ అప్పారావు రచనలపై విస్తృత సాహిత్య చర్చలు జరిగినవి. నన్నయ, నాచన సోమన, శ్రీనాథుడు, కృష్ణదేవరాయలు, చేమకూర వేంకటకవి రచనలపై తగు మాత్రముగ పరామర్శలు వెలువడినవి. ఎఱ్ఱాప్రెగ్గడ, పోతన, సూరన, పినవీరభద్రుడు, అనంతామాత్యుడు, కోనబుద్ధరాజు, తెనాలి రామకృష్ణుడు, సంకుసాల నరసింహకవి, గౌరన, కంకంటి పాపరాజు, అన్నమాచార్యుల వంటివారి రచనలపై ఎన్నియైన సాహిత్య విచారధారలు రావలసి ఉండెను. రాలేదు.

సమకాలపు కవుల రచనలపై సాహిత్య విమర్శనమునకు దొరకొనుటలో కొన్ని కష్టనిష్ఠూరములున్నవి. "సమకాలము వారలు మెచ్చరేకదా" అని చేమకూర వేంకటకవి

వ్రాసెను. సమకాలము వారలు తిట్టరేకదా అనిన కూడ సత్యదూరము కానేరదు. మెచ్చుట కెంత నిర్లిప్తత కావలెనో, తిట్టుటకంత నిర్లిప్తత కావలెను. సాహిత్యవేత్త కావ్యము వ్రాసి కవి కాగోరునుకాని, ఇంకొక కవి గ్రంథముపై వ్రాయబూనడు. అది కృతజ్ఞతారహిత ప్రక్రియ. ఇది మొదటి కారణము. సమకాలీన కావ్యస్థానమును నిర్ణయించుట కష్టతరమగుట రెండవ కారణము. నిర్ణయించుట ఏల కష్టతరము? వర్తమాన కాలము మారుచుండును. వర్తమానకాల వస్తుస్వరూప స్వభావమును మారుచుండును. మారుచుపోవు స్వరూప స్వభావములను నిర్ణయించుట కష్టము. పురాణయుగము గడిచిన తర్వాతనే దానికి పురాణయుగమని సాహిత్యవేత్తలు పేరుపెట్టిరి. కళాస్వరూప నిర్ణయమునకు, కొంత ముందునకో కొంత వెనుకకో పోవలసి ఉండును. చిత్రలేఖకుడును, శిల్పియు తాము సృష్టించు కళాఖండ స్వరూప సామరస్యమును అవగాహనము చేసికొనుటకు కళాఖండమునకు కొంత దూరము ముందుకువచ్చి పరిశీలింతురు. అటులనే కావ్యశిల్ప స్వరూపమును నిర్ణయించుటకు కొంతకాలము ముందుకుపోయి పూనుకొనుటయే సరియైన విధానము. ఇక మూడవ కారణమిది. ఒక్కొక్క కాలమందొక్కొక్క విధమగు సాహిత్య సిద్ధాంతములు, అభిరుచులు రాజ్యము చేయుచుండును. సాహితీ జిజ్ఞాసువులు సమకాలీన సిద్ధాంతాభిరుచుల వలన కొంచెముగనో, గొప్పగనో, ప్రభావితులై ఉందురు. ఆ సిద్ధాంతములకును, ఆ అభిరుచులకు గిట్టని ఏ సమకాలీన రచనయు సత్వరాదరము పొందజాలదు. ఇట భవభూతి పలుకులు స్మరణీయములు. అట్టి రచనలు సమకాలీన సిద్ధాంతానుసారము అనుకూల వర్గీకరణమున కందవు. నేటి John Cowper Powys రచనలు, యూదుకవి Agnon రచనలట్టివి. ఒక్కొక్కప్పుడట్టి రచనలు సమకాలమునగాక తర్వాతికాలమున జనాదరణము సంపాదించు కొనును. ఇంగ్లీషున John Donne, G.M. Hopkins, Edward Fitzgerald ల కవిత్వములు, తెలుగున పాల్కురికి సోమనాథ, పోతన, వేమనల కవిత్వము లిందుకు తార్కాణ లనవచ్చును. సమకాలీన కవుల రచనలపై విమర్శనల గతులివి.

గడియారము వేంకటశేషశాస్త్రి వ్రాసిన "శివభారతమున" కిఱువదవ శతాబ్దమునందలి తెలుగు సాహిత్యమున విశిష్ట స్థానమున్నది. స్థూలదృష్టికి శివభారతము సాంప్రదాయక పద్యకావ్యముగ కన్పించినను సూక్ష్మ వివేచన చేసిన, ఈ గ్రంథమున

అనేక విషయములలో నవీనత గల అగ్రగామి కవిత్వముగ స్పష్టమగును.

భారత స్వాతంత్ర్య సంగ్రామము పరాకాష్ఠ దశలోనున్నప్పుడు, భారతీయత్వమును మొగలులనుండి రక్షించుటకు బ్రతుకు నర్పించిన శివాజీ జీవితమును శివభారతముగ వ్రాయుట మొదటి నవ్యత. H.A.Taine ప్రతిపాదించిన Race (జాతి), Milieu (సాంఘిక వ్యవస్థ), Moment (తత్కాల పరిస్థితి)ల ప్రభావ మీ గ్రంథావతరణమునందున్నది. ఆంధ్రుడైన కవి మహారాష్ట్రుడైన శివాజీ చరిత్ర వ్రాయుట రెండవ విశిష్టత. "మా తెలుగు తల్లి" "మా తెలుగు వీరులు" అని వ్రాయుట, పాడుట, స్వాభిమానము, ప్రాంతీయాభిమానమనిపించుకొనును. ఇతర ప్రాంత వీరుని గూర్చివ్రాయుట, పాడుట, జాతీయ సమైక్యతకు మూలకందము. రంతిదేవుడు, అశోకుడు, పుష్యమిత్రుడు, పృథ్వీరాజు, కృష్ణదేవరాయలు, షేర్షా, అక్బరు, దారాషుకో, శివాజి, రంజిత్‌సింగు, జవహర్‌లాల్ నెహ్రూ - ఇది సమైక్య భారతీయ నాయకుల సంప్రదాయ పరంపర. ఒక ప్రాంతపు కవి, ఇంకొక ప్రాంతము గూర్చి వ్రాయవలెను. శివాజీ గుఱించి తెలుగు కవి వ్రాసినాడు. కృష్ణదేవరాయలు గూర్చి పంజాబీ కవి వ్రాయవలెను. రాజరాజ చోళునిపై బెంగాలీ కవి వ్రాయవలెను. సుభాస్ చంద్రబోసు చరిత్రను మహారాష్ట్ర కవి వ్రాయవలెను. అప్పుడే మనలో నిజమైన జాతీయ సమ్యైకతాభావము స్థిరపడిన దనవచ్చును. ఈ పథమునకు శివభారతము మార్గదర్శి.

శివభారతమందలి ఆద్యంతములు ప్రత్యేకత గలవి. "నాంది", "ప్రస్తావన", "పూర్వరంగము"ల ఉనికివలన శివభారత మొక పద్యనాటకముగ రూపొందింప బడినదను భావమును కలుగజేయును. అధిక సంఖ్య పద్యములు సంభాషణాత్మకముగ నుండుట ఈ భావమును దృఢపఱచును. స్వకీయ సమస్యలు దుఃఖములు కాక శివభారతమందలి ప్రధాన పాత్రల ముఖమున జాతీయ భావములు, రాజనీతులు వినవచ్చుచుండును. ఇందలి దాదోజీ, రామదాసు, జయసింగు, శివాజి, పాత్రల వాక్యములు వినుచుండిన కిరాతార్జునీయములోని పాత్రల సంభాషణము వినుచున్నట్లుండును. శాంతిపర్వమందు భీష్మ, ధర్మరాజుల సంభాషణము వినినట్లుండును. కేవల జనరంజకతకు, సాహిత్య ఖేలనమునకుగాక గంభీర జాతీయతా తత్త్వ ప్రతిపాదనమునకై రచితమయిన శివభారతమును అదే అభినివేశము తోడనే

పరిశీలించుట సాహిత్య తాత్త్వికుల విధి.

కావ్యమును పరిశీలించు పద్ధతులు మూడు. లక్ష్యానుసరణ పద్ధతి, కవిమార్గానుసరణ పద్ధతి, లక్షణాననుసరణ పద్ధతి.

ఒకకవి రచనను పరిశీలించునపుడు, అతని కవిత్వమును సమకాలపు కవుల రచనలతోడను, ప్రాక్తన కవుల రచనలతోడను పోల్చి చూచుట లక్ష్యానుసరణ పద్ధతి. తెలుగు కవిత్వ విమర్శనమున ఒక కవిని విమర్శింపవలెనన్న, ఇదిగో తిక్కన ఎట్లువ్రాసెనో చూడుడని తెలుగు భారతమునుండి పద్యముల నుద్ధరించుట. పింగళి సూరన కవిత్వతత్త్వ విచారమున, కట్టమంచి రామలింగారెడ్డి ఈ పద్ధతి కంకురార్పణము చేసెను. ఆ కవి ఈ కవి కంటె గొప్పవాడు. ఈ కవి ఒకటవ శ్రేణికి చెందినవాడు, ఆ కవి మూడవ శ్రేణికి చెందినవాడు అను వర్గీకరణ మనస్తత్త్వము బహుజనపల్లి సీతారామాచార్యుల శబ్ద రత్నాకరమందు సుదీర్ఘ పట్టికగ రూపొందినది. కావ్యము ఒక గుడిగోపురము వంటిది. గుడి గోపురమున అనేక శిల్పము లుండును. కొన్ని చిన్నవి. కొన్ని పెద్దవి. కొన్ని అందమయినవి, కొన్ని అందవికారములైనవి. ఇన్ని విధములయిన శిల్పములున్నందువలననే ఆ గోపురమున కంత సౌందర్యము, అంత గాంభీర్యము. అంత అంగాంగ సామరస్య సంశ్లిష్టత. అందు ప్రతి శిల్పఖండికకును దానిదేయైన ఒక స్థానము (Niche) ఉన్నది. మఱుగుజ్జుగ, పొట్టలావుగ, కాలుచేతులు పొడవుగనుండి స్వతస్సిద్ధముగ వికారముగనే కన్పడు ఒక ప్రతిమను గోపురము నుండి తీసివేయుడు. ఇప్పుడు గోపురముపై సమగ్రదృష్టి సారింపుడు. గోపుర సమగ్ర సౌందర్యము (Mosaic beauty) కొంత లోపించిన సంగతి తెలియవచ్చును. శతక వాఙ్మయ ప్రపంచమున కవి చౌడప్ప లేనియెడల చాల వెలితి ఏర్పడును. అపారమయిన కావ్య సంసారమున ఏ కవి స్థాన మాకవిది. ఏ కవి పౌరసత్వ మాకవిది. కవితా లోకమును పేకముక్కల మేడతో పోల్చవచ్చును. కొన్ని పేకముక్కలు ప్రముఖ స్థానమునందుండును. కొన్ని పేకలు మారుమూల నుండును. కొన్ని రంగురంగులతో విరాజిల్లు చుండును. కొన్ని వర్ణ విహీనములై ఉండును. కాని దేనిస్థానము దానిది. ఒక పేకను కదల్చిన పేకమేడ కూలిపోవును. కవిప్రపంచ మైక్యరాజ్య సమితి (United Nations) వంటిది. చిన్నదయినను, పెద్దదయినను, బలహీనమైనదయినను, బలవంతమయినదయినను, ప్రతి దేశమునకును

అందు సమాన ప్రతిపత్తి కలదు. కవ్యైక్య రాజ్యసమితియందు ప్రతి కవికిని సమాన ప్రతిపత్తి కలదు. ఆ కవితో ఈ కవిని పోల్చుటకీ కవి ఒప్పుకొనడు. "కవి యల్లసాని పెద్దన, కవి తిక్కన సోమయాజి గణుతింపంగా, కవి నేను రామకృష్ణుడ" అని కవి తనను తానే ఇతర కవులతో పోల్చుకొనునేగాని, ఇతరులు పోల్చిన ఒప్పడు. "తుసా బుసా" అని ఎగిరిపడును. ఆ కవి గొప్పవాడే కావచ్చును. ఈ కవి అంత పెద్దవాడు కాకపోవచ్చును. ఐనను ఐక్యరాజ్య సమితిలో నిద్దఱు సమానులేకద. కవిసంతతి అజంతా కుడ్య చిత్రసంతతిని పోలును. ఏ చిన్న చిత్తరువును తీసివేసినను, తత్కుడ్యగత సమరస సౌందర్యము సమయును. ఏ కవిని కించపఱచినను, కవుల కందఱికిని అవమానము జరిగినట్లే. కవి తనకంటె ముందుకవి గడించి పెట్టిపోయిన కవిత్వమను ఆస్తిని పంచుకొనును. తెలిసియో, తెలియకయో వారసుడగును. ఎట్లు వ్రాయవలెనను విషయముననేకాక, ఎట్లువ్రాయగూడదను విషయమునను నిన్నటి కవి నేటి కవికి, నేటికవి రేపటి కవికి దారిచూపించిన వాడగుచున్నాడు. వాల్మీకికి మధుచ్ఛందసుడున్నట్లు నేటి కవికి నిన్నటి కవి ఉన్నాడు. నిన్నటి కవికంటె నేటి కవికి కవితా సౌకర్యమును ఎక్కువ. ఏలయన, ఇతడతని భుజములపై కూర్చొని ఉన్నాడు. షేక్స్పియరుకంటె తాను గొప్ప నాటకకర్తనని జార్జి బెర్నార్డ్షా అనినాడను సందర్భ మీ అర్థముతోడనే అయియుండును. కవుల పరస్పర సంబంధ మింతటి సున్నితమయినది. కావున, కావ్య పరిశీలనమున, లక్ష్యానుసరణపద్ధతి అనపాయికాదు.

ఆలంకారిక గ్రంథములందు నిర్ణయించిన లక్షణములబట్టి మన ఎదుటనున్న కావ్యము వెలకట్టుట లక్షణానుసరణ పద్ధతి. కావ్యము పద్యమా, గద్యమా, దృశ్యమా, శ్రవ్యమా, మహాకావ్యమా, కావ్యమా, ఖండకావ్యమా? జగన్నాథ పండితరాయలు చెప్పిన ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, అధమ అను నాల్గు విధములయిన కావ్యభేదములలో మన కావ్య మే భేదము? కావ్య నాయకుడు ధీరోదాత్తాది చతుర్విధ నాయకులలో ఎవరు? నాయిక ఎట్టిది? ఏ ఏ రసములున్నవి? కావ్యమందలి వృత్తులు, రీతులు, పాకములు, అలంకారములు, అష్టాదశ వర్ణనములు మున్నగువాని విశదీకరణము లక్షణానుసరణ పద్ధతి. ఈ పద్ధతివలన కావ్య బాహ్య, స్థూల స్వరూపములు తెలియవచ్చునేకాని, ఇవి తెలిసిన తర్వాత కూడ కావ్యమందు, ముత్యమందు కాంతివలె,

ఇంకను ఏమో తప్పించుకొని తిరుగుచుండునో, ఆ కవితా లావణ్యము మన అనుభవములోనికి రాజాలదు. ఆ కవితా రహస్యము మనకు చిక్కదు. ఈ విషయమునే ఆనందవర్ధనుడిట్లు చెప్పెను.

ప్రతీయమానం పునరన్యదేవ, వస్త్వస్తి వాణీషు మహాకవీనాం

యత్తత్ ప్రసిద్ధావయ వాతిరిక్తం విభాతి లావణ్య మివాంగనాసు

(ధ్వన్యాలోకము)

కవిత్వములోని అంతుచిక్కని ఈ రహస్యమునే Owen Baarfield తన Poetic Diction - A Study in Meaning లో, 'that precarious element in poetry which has puzzled critics and poets alike........." అని వ్యాఖ్యానించెను. కావున లక్షణానుసరణ పద్ధతియు సలక్షణమయినది కాదు. ఆలంకారికుల లక్షణములన్నింటిని కల్గియున్నను, కావ్యము తలిసెట్టి రామారావు "ప్రబంధనాయికా" వ్యంగ్య చిత్రమువలె, సుందరము కాకపోవచ్చును. నేటి ఆలంకారికుల లక్షణములతో నిన్నటి కావ్యమును పరిశీలించి, ఆ లక్షణములందు లేనిచో, కావ్య మలాక్షణిక మనుట గుఱ్ఱమునకు ముందు బండిని కట్టుటవంటిది. ఒక కాలమున ఒక ఆలంకారిక సిద్ధాంతము అధికారము చేయుచుండును. కవి ఆ సిద్ధాంతమున కనువగునట్లు కావ్యము వ్రాయుననుకొందము. ఒక రాజును పడగొట్టి ఇంకొకరాజు వచ్చినట్లు, ఒక సిద్ధాంతమును కాదని ఇంకొక సిద్ధాంతము ప్రాచుర్యము పొందును. అప్పుడు నిన్న సలక్షణముగ పరిగణింపబడు కావ్యము నేడలాక్షణికమగును. లక్షణ మనిన ఒక లక్షణము కాదు. ఉన్న లక్షణము లన్నింటి సముదాయ మనుకొనినను, ఆలంకారిక మతములు పరస్పర విరుద్ధములుగ నున్నవేకాని వానికి పొంతన కుదరలేదు. ఆనందవర్ధన మతమునకు, మహిమభట్టు మతమునకు ఉత్తర దక్షిణ ధృవముల యంతదూరము. కుంతకుని మతమునకు క్షేమేంద్రుని మతమునకు పోలికయే లేదు. లక్షణముల సామరస్యము ఇట్టులుండ కవి ఎవరి లక్షణములు పాటింపవలెను? కావ్య లక్షణములు కవుల రచనలలో అచ్చటచ్చట నున్నట్టివేకాని ఆలంకారికులు సృష్టించలేదు. ఆలంకారికులు వానిని సంకలనమును చేసిరనవచ్చునేమో! అలంకార శాస్త్రము కావ్యావగాహము కొఱకేర్పడినదేకాని కావ్యముపై

న్యాయవిచారణచేసి దానికి శిక్షనిచ్చుటకు మాత్రముకాదు. సంస్కృతమున కావ్యములు, అలంకార శాస్త్రములు శాంతియుత సహజీవనము సలుపుచుండెనేకాని, అలంకార శాస్త్రములు కవులను శాశింపలేదు. కావ్యములు ముందువచ్చిన చెవులు. అలంకార శాస్త్రములే వెనుకవచ్చిన కొమ్ములు. పాశ్చాత్య నాటక నియమములనే పరికింతము. తనకంటే ముందున్న ముగ్గురు నలుగురు గ్రీకు నాటకకర్తల నాటకముల పరిశీలించి అరిస్టాటిల్ చేసినవేకాని, ఆ నాటక కర్తలు (ఇస్కెలస్, సొఫొక్లిస్, యూరిపిడిస్) ఇతని నియమములు చూచి తమ నాటకములు వ్రాయలేదు. అరిస్టాటిల్ తర్వాత అతని నాటక సూత్రముల అనుసారము రచితమైన నాటకములు (ఫ్రెంచి కవులగు కొర్నీల్, రాసిన్‌ల నాటకములు), అరిస్టాటిల్ నాటక సూత్రములకంటె ముందువచ్చిన నాటకముల స్థాయికి రాలేదను విషయమును, అరిస్టాటిల్ నాటక సూత్రముల పాటింపని షేక్స్పియరు నాటకములు మహోత్తమములై యున్న విషయమును మననము చేసిన, శాస్త్రీయ సలక్షణతకు కళావైభవమునకు సంబంధము ఉండనక్కఱలేదను ప్రాథమిక సత్యము వెల్లడియగును.

శాస్త్రమున నియమములని యుండును. కాని కవిత్వమున కాదు. నిజముగ కవియైన వానికి ఆలంకారిక భిషక్కులిచ్చు సూత్ర చిట్కాలు, రసగుళికలు, సిద్ధాంత లేహ్యాము లక్కఱలేదు. కవిత్వము దానంతట అదియే వచ్చును. వాల్మీకికివలె, Robert Burnsకు వలె. కవిత్వము నియతికృత నియమరహిత మయినట్టిదనియు, అనన్య పరతంత్ర మయినట్టిదనియు, అలంకారికులే ఒప్పుకొనిరి. అలంకార శాస్త్ర గ్రంథములు లేకున్నను, కావ్యము లుద్భవించుచునే ఉండును. కావ్యములు లేకున్న అలంకారిక గ్రంథములు రావు. కావ్యములు లేకున్న జాతి సంస్కృతియే లేదు. మధుచ్ఛందసుడు, దీర్ఘతమసుడు, వామదేవుడు, వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, భవభూతి, బాణుడు లేరనుకొందము. అప్పుడు భారతీయ సంస్కృతియే లేదు. భరతుడు, భామహుడు, దండి, ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు, కుంతకుడు, రాజశేఖరుడు, జగన్నాథ పండితరాయలు లేరనుకొందము. అప్పుడు కొన్ని ఆలోచనా ప్రేరక గ్రంథము లుండవేమో కాని, భారతీయ సంస్కృతి ఉండును. ఆలంకారికుడు కవియునైన ఎడల చిత్రమయిన పరిస్థితి యేర్పడును. తాను ప్రతిపాదించు ఔచిత్య సిద్ధాంతమునకు విరుద్ధములయిన ఉదాహరణములను తన

రచనలనుండియే ఇచ్చి, క్షేమేంద్రుడు తన నిష్పక్షపాత బుద్ధిని, కవిని నియమబద్ధుని చేయుటయందు అలంకార దర్శనాశక్తతను చాటినాడు.

కావ్యము కవి సామ్రాజ్యము. ప్రాచీనుల మాటలలో చెప్పవలెనన్న, "అపారేకావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః". ఏ సామ్రాజ్యపు కట్టుపాటులా సామ్రాజ్యమువి. ఏ సామ్రాజ్యమును దర్శించునపుడు ఆ సామ్రాజ్య నియమముల ననుసరింపవలెననునది ప్రాచీన ధర్మశాస్త్రమతమే. కావ్యమును, దాని సృష్టించిన కవి ఉద్దేశించినట్టియు, తత్కావ్యాంత ర్భూతము లయినట్టియు, నియమములచేతనే పరిశీలింపవలెను. మాయకోవస్కీ, "కవితా నియమములను కవియే సృష్టించుకొనును. (The poet is precisely the person who creates these poetic rules) అనెను. కవి తనకు తానే సృష్టించుకొనిన నియమము లెట్లుండును? కరుణ మొక్కటే రసమనియు, తన కవిత్వ మందలి కరుణముచేత రాళ్లుకూడ ఏడ్చుననియు, వజ్రహృదయములు పగులుననియు అర్థము ధ్వనించునట్లు భవభూతి "ఉత్తర రామచరిత" నాటకమున పాత్రల ముఖమున చెప్పించినాడు. నన్నయ, తన కవిత్వమున "ప్రసన్న కథాకలితార్థ యుక్తి"యు, "అక్షర రమ్యత"యు ఉండుననెను. "ప్రాత వడ్డమాటలు" వాడనని తిక్కన శపథము చేసెను. తన కవిత్వమువలన "ఆంధ్రావళి మోదముంబొరయు" ననియు విశ్వాసము ప్రకటించెను. నన్నెచోడుడు, తనది "దేశి కవిత్వము," "వస్తు కవిత్వము" అని నిర్వచించెను. "అల్పాక్షరముల ననల్పార్థము" వచ్చునట్లు చేయగల రచనయే కవిత్వమని పాల్కురికి సోమనాథుడు తీర్మానించెను. ఎఱ్ఱాప్రెగ్గడ తనకు "ప్రబంధ పరమేశుడు" అను బిరుదమున్నట్లు చెప్పినాడు. అతని కవిత్వము ప్రబంధ గుణము కలిగినట్టిదని అర్థము. నాచన సోమనాథుడు తనను "నవీనగుణ సనాథు"నిగ పాఠకులకు పరిచయము చేసికొనెను. తన "కవిత్వ వర్ణనాకర్ణనమున, యతి విటుడుగాను, విటుడు యతిగాను మాఱకపోవునా?" అని సంకుసాల నరసింహ కవి సవాలుచేసెను. తాను "సహజ పాండిత్యుడు" అని నివేదించుకొనెను పోతన. ఇతని కవిత్వము సహజ పాండిత్య జనితమని అర్థము. అల్లసాని పెద్దనది అని ప్రచారములోనున్న "పూతమెఱుంగులుం..... సారెసారెకున్" అను దీర్ఘమైన ఉత్పలమాలికా చాటువులో కవిత్వ స్వరూపము వర్ణితమయినది. అల్లసాని పెద్దన కవిత్వమందీ లక్షణములు కలవా? పింగళి సూరన తన కవిత్వ

మెట్లుండునో "కళాపూర్ణోదయ" కావ్యమున "పొసగ ముత్తెపుసరుల్" "చలువగల వెన్నెలల చెలువునకు" (ఆశ్వా 1; పద్యములు 82-83) అను పద్యములలో కలభాషిణీ పాత్రముఖమున చెప్పించెను. "కళాపూర్ణోదయ"మే, పూర్ణకవిత్వకళా వికాసముపైని ఒక అన్యాపదేశ కావ్యము (Allegory) అని అనుకొనినను తప్పుండదు. రామరాజ భూషణుడు తన కవిత్వమున సంగీత సాహిత్యములుండు ననెను. చేమకూర వేంకటకవి తానువ్రాయు ప్రతి పద్యములోను (విజయ విలాసము) ఏదో ఒక విశేష ముండితీరునని ముందుగనే మనలను హెచ్చరించినాడు. వేములవాడ భీమకవి, మైలమ భీమన ఖడ్గసృష్టికి, బ్రహ్మాండమందలి భీషణ వస్తువులన్నియు ముడి సరుకులు అని వాని వివరముల నిచ్చినాడు. (చూ. "గరళపు ముద్దలోహము" అనుచాటు పద్యము). అట్టి కవియే అనదగు శ్రీరంగం శ్రీనివాసరావు "నవకవనము"నకు కావలసిన బీభత్సమయ సామగ్రిని పేర్కొనినాడు (చూ. "నవ కవిత" – మహాప్రస్థానం). నేటి దిగంబర కవులు "దిక్"లు అను కవితలద్వారా, క్రుళ్లను కప్పుకొనిన సంఘమును బిత్తర చేయవలెనని తత్తఱపడుచున్నారు. "కేకలు" వ్రాయుచున్నారు.

ఈ యీ కవులు తాము చేసిన ప్రతిజ్ఞలను నిలబెట్టుకొనిరా? లేదా? వారి వారి కవిత్వములలో, వారి వారి చేతనే నిర్వచింపబడిన లక్షణములు, గుణములు, ధర్మములు, ఉద్దేశింపబడిన శక్తులు, సామగ్రి, వస్తువులు ఉన్నవా? లేవా? అని పరిశీలించుట కవి మార్గానుసరణ పద్ధతి. కొందఱు కవులు తమ కవిత్వ గుణములను సూక్ష్మముగను, సున్నితముగను అచ్చటచ్చట సూచించి ఉందురు. తమ కవిత్వ ధర్మములను ప్రత్యేకముగ చెప్పని కవుల రచనలలోకూడ, జొన్నచేలో నడచుచు పోయినట్లెల్ల, స్వయం నిర్మిత సూత్రములు, నియమములు, కవితా సంబంధి తత్త్వములు, సుస్పష్టములగుచు పోవును.

ఇట్టి విమర్శనము కవిమార్గానుసరణ పద్ధతికి చెందును. ఇతర కావ్య నియమావళి కిచట చెల్లుబడిలేదు. రామాయణ కవిత్వ నియమములు మహాభారతమున కన్వయింపవు. తిక్కన కవిత్వ సూత్రములు, రామరాజ భూషణుని కవిత్వ సూత్రములు వేఱ్వేఱు. షేక్స్పియరు, జార్జ్ బెర్నార్డ్‌షాల నాటక నియమములకు సామాన్య గుణముకంటె విభిన్న గుణమే హెచ్చుపాలుగ నుండును. బ్రెక్ట్ (Bectrolt Brecht) నాటక సిద్ధాంతములు బెకెట్ (Samuel Beckett) నాటక సిద్ధాంతములు పరస్పర విరుద్ధములు. మిల్టన్ కవిత్వ పద్ధతిని

ఇ.ఇ. కమ్మింగ్స్ (e.e cummings) కవిత్వ పద్ధతితో పోల్చరాదు. ఎంతమంది కవులున్నారో అన్ని ఆలంకారిక మతములున్నవి. అన్ని సంప్రదాయములున్నవి. ఈ సంప్రదాయావగాహనమే విమర్శకుని విధి.

కావ్యము సాలీడు తననుండియే తంతువుల తయారుచేసి, గూడల్లుకొని అందు భద్రముగనుండు సాలీడువలె, కావ్యము స్వయం భవసాహిత్య సూత్ర తంతువుల మధ్య భద్రముగనుండును.

కావ్య మీమాంసకర్త రాజశేఖరుడు చతుర్విధ సాహిత్య విమర్శకుల పేర్కొనెను. ఎట్టి మంచి కావ్యమునైనను పరిగణింపనివాడు అరోచకుడు. కావ్యము మంచిదైనను, చెడ్డదైనను తెగమెచ్చుకొనువాడు సతృణాభ్యవహారి. ఈర్ష్యతోడి దోషైకదృష్టితో కావ్యమును పరీక్షించువాడు మత్సరి. నిష్పక్షపాతబుద్ధితో సత్యాన్వేషియై కావ్యసమాలోచనము చేయువాడు తత్త్వాభినివేశి. తత్త్వాభినివేశమార్గమ ముత్తమము. మత్సరమార్గము పరిహార్యము.

కావ్యరచన బాధాయుతము. కావ్య విమర్శనము బాధ్యతాయుతము. కావ్యము పాకము. విమర్శనము రుచి గ్రహణ పారీణత. కావ్యము సుగంధపుష్పము. విమర్శనము మందానిలము. కావ్యము మకరంద భరిత ప్రసూనము. విమర్శనము మధుపము. కావ్య మనాహత నాదము. విమర్శనము విమల గాంధర్వము. కావ్యము తుషా ధాన్యముల మిశ్రమమైనట్లయిన, విమర్శనము శూర్పము! ఇది సాహిత్య తత్త్వము.

"The rudiment of criticism is the ability to select a good poem and reject a bad poem, and its most severe test, its ability to select a good new poem, to respond properly to a new situation".

T.S. Eliot - INTRODUCTION TO THE USE OF POETRY AND THE USE OF CRITICISM.





# నేటి సాహిత్యము

## శ్రీ గిడుగు వేంకట రామమూర్తి పంతులు

ఈ నవ్యసాహిత్యపరిషత్తు వార్షికోత్సవము (1937) సందర్భములో నా చిత్ర పటము బహిర్గతము చేసి నన్ను గౌరవించినందుకు మీకందరికీ నా వందనములు. ఈ చిత్రపటము వ్రాసిన కవుతా రామమోహనశాస్త్రి గారిని నేను ప్రథమ పర్యాయము చూచినది వారు ఈ చిత్రపటము వ్రాయడానికి నన్ను చూడవచ్చినప్పుడే. ఈ శిల్పికి నా పటము చిత్రించ వలెనని ఎందుకు బుద్ధిపుట్టినదని నేను అడుగగా, అక్కడి మిత్రులవల్ల 'నేను వ్యావహారిక భాషావాదములో చూపిన సత్యాగ్రహము తనకు నచ్చిన'దని శిల్పి చెప్పినట్లు తెలిసింది. ఈ చిత్రపటము నాకు చిరమిత్రులైన ఉన్నవ లక్ష్మీనారాయణగారు తెరవడము నాకు సంతసము ద్విగుణము చేసినది.

నవ్యసాహిత్య పరిషత్తు అనగానే కొందరూరకే తాచుపాములవలె లేస్తారు. అసలు నవ్యసాహిత్యము అంటే అర్థమేమిటి అని కూడా అంటున్నారు. ఆ మాటకు సరైన అర్థము లేదని వారి ఊహ. 'నవ్య సాహిత్యము' అంటే నవ్య = ఇప్పటి సాహిత్యము అని నేను అంటాను. కొందరు 'నవ'లో నుంచి 'ను' (నూతన) వచ్చిందంటారు. నేను 'ను'లో నుంచి 'నవ' 'నూతన' వచ్చినవి అంటాను. ఇంగ్లీషులో నవ్ (Now) అంటే ఇప్పుడు 'కు' అనేది కవ్ (Cow) ఐనట్లే 'ను' అల్లా ఇంగ్లీషులో నవ్ (Now) ఐనది. కాబట్టి 'నవ' లేక 'నూతన' అంటే ఇప్పటిది అని అర్థము. నవ్యసాహిత్యము అంటే నేటి సాహిత్యము అని అర్థము. ఇందులో తప్పు ఏమున్నది?

నవ్యము, నూతనము, అంటే వీరికి ఇంత కష్టమెందుకు? ఋగ్వేదము ప్రాచీనతమమైనదిగదా! అందుకు మొదట ఋక్కు 'అగ్నిమీళే' అని ప్రారంభిస్తుంది. దానివెంటనే 'అగ్నిఃపూర్వేభిః ఋషిభిః ఈడ్యో నూతనైరుత' అని ఉన్నది. ఇక్కడ 'పూర్వేభిః' అని తృతీయా బహువచనములో పూర్వవైదిక రూపమున్నూ 'నూతనైః' అని నూతన సాంస్కృతిక రూపమున్నూ ఉన్నవి. ఋషులు మంత్రద్రష్టలు. ఋగ్వేద కాలమునాడు

కూడా పూర్వఋషులు చెప్పిన పాతఋక్కులతోనూ నూతన ఋషులు చెప్పిన నవ్యఋక్కులతోనూ అగ్నిని పూజిస్తూ వచ్చినారు.

కొత్తలో నైరస్యమేమీలేదు. గతమంతా గతము: అది తెలియదు. మనకు ఇప్పటిదే కావలె. నవ్యసాహిత్య పరిషత్తు కోరేది అదే. నేడు తెలిసే విషయాలు ఇప్పటి కవులు రచిస్తున్నారు. అందుకు తప్పేమీ లేదు. మొదట మొదట చాలా మంది భావకవిత్వాన్ని తిట్టినారు. ఈ నడుమ రాజమహేంద్రవరములో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు వార్షికోత్సవ సందర్భంలో అప్పటి ఆహ్వాన సంఘాధ్యక్షులు తమ స్వాగతోపన్యాసములో భావకవులను అంగీకరిస్తే మంచిదన్నారు. దానినిబట్టి ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు కూడా ఇప్పుడు నవ్య సాహిత్యాన్ని ఆమోదించినట్లే కనబడుతుంది.

ఋగ్వేద కాలమునాడుగూడా నూతన ఋషులు నవ్యఋక్కులు చెప్పినారు. అప్పటికి అవి నవ్యసాహిత్యము. తర్వాత బ్రాహ్మణములు వచ్చినవి; ఆ తర్వాత ఉపనిషత్తులు పుట్టినవి. అప్పటికి అవీ నవ్యసాహిత్యమే. పిమ్మట పురాణాలు పుట్టినవి. ఆ పురాణాలే అప్పటికి నవ్యసాహిత్యము. కావ్యాలు పుట్టిన రోజులలో అవే నవ్యసాహిత్యము.

కాని ఎప్పటికప్పుడు నవ్యసాహిత్యానికి దెబ్బలు వస్తూనే వచ్చినవి; వాటిని పెద్దలు నివారించుకుంటూనే వచ్చారు. అన్నిటికంటే సాహిత్యానికి పెద్ద దెబ్బవేసినది 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనే నిషేధము పెట్టిన వైదిక లోకము. వారి మతములో కావ్యము వేద మూలము కాదు కనుక వర్జ్యము. కాని అప్పటి కవులు ఆ నిషేధానికి కట్టుబడక కావ్యాలు వ్రాసినవారు. కావ్యాలలో శృంగారాది వర్ణనలు ఉంటవని వైదికులు ఆక్షేపిస్తే అప్పటివారు వేదములో నుంచి సంభోగ శృంగారం దగ్గరనుంచీ, కావ్యాలలో ఉండే అన్ని విషయాలూ, ఎత్తి చూపి వాళ్ళను నిరుత్తరులనుగా చేసినారు. కొందరు కావ్యము ఆనందము కలిగిస్తుంది, కనుక కావ్యపఠనము వల్లకాదు అంటే కావ్యాలు కలిగించే ఆనందము బ్రహ్మానంద సహోదరమని నిరూపించి కావ్యాలు కాంతాసమ్మితంగా ఉపదేశము చేస్తవని నిర్ధారణ చేసినారు. ఈ విధంగా అప్పటి కవులు కావ్య ప్రయోజనము సాధించినారు. లేకపోతే అప్పటి నుంచీ ఇప్పటిదాకా ఒక్క స్వాధ్యాయ ప్రవచనమే ఉండిపోయేది.

అలాగే మొదట వచన కావ్యాలు వ్రాసేవారిని ఆక్షేపించినారు. తర్వాత 'వాసవదత్త'

'కాదంబరి' వంటి గొప్ప వచన కావ్యాలు పుట్టినవి. అటుపిమ్మట 'కవీనా మగల ద్దర్పో నూనం వాసవదత్తయా' అనీ, 'బాణోచ్ఛిష్ట మిదం జగత్' అనీ వాక్యాలు పుట్టినవి.

ప్రాకృతంలో కావ్యాలు వ్రాయరాదన్నారు కొన్నాళ్ళు. ప్రాకృతము అపభ్రంశ భాష అనీ అందులో కావ్యాలు వ్రాస్తే నరకంలో పడిపోతారనీ భయపెట్టినారు. కాని తర్వాత 'సేతుబంధము' 'గాథాసప్తశతి' వంటి కావ్యాలు ఆ అపభ్రంశ భాషలోనే పుట్టినవి. బౌద్ధుల మతగ్రంథమైన త్రిపిటకమంతా జీవద్భాష ఐన పాలీభాషలోనే ఉన్నది. పాలీభాషలో ఎన్నో బౌద్ధమత గ్రంథాలు వ్రాశారు.

మన దేశంలోనే కాకుండా ఇతర దేశాల్లో కూడా కొత్త విషయాలకు మొదటలో కొంత బాధ వస్తూనే వచ్చింది. క్రైస్తవుల మతగ్రంథమైన బైబిలు మొదట ఇంగ్లీషులో ఉండకూడదన్నారు. విక్లిఫు (Wycliff) అది ఇంగ్లీషులో వ్రాస్తే తగలబెట్టించి ఆయననూ ఆయనను అనుసరించిన వారినీ ఎన్నో చిక్కులు పెట్టినారు. గెలీలియో (Galilio)ను అప్పటి మతాధిపతులు ఎన్నో చిక్కులు పెట్టినారు. ఇప్పటికి నూరేళ్ళ కిందటిదాకా ఆక్సుఫర్డు యూనివర్శిటీవంటి విద్యాలయాలలో ఇంగ్లీషు వాఙ్మయము ప్రత్యేకముగా చెప్పే ప్రొఫెసర్లు లేరు. ఇప్పుడు షెల్లీ, టెన్నిసను, షా – వీళ్ళ కావ్యాలు చదవనివాళ్ళను వ్యర్థులంటారు.

'సాహిత్యము, సారస్వతము, వాఙ్మయము' అనే మూడు మాటలను పర్యాయపదాలుగా వాడుతున్నాము. మూడు మాటలూ ఒకే అర్థంలో ఉపయోగించి వాటిని వృథాచేసేకంటే మూటినీ అర్థభేదముతో ప్రయోగిస్తే బాగుంటుంది. అందులో 'సాహిత్యం' అనే మాటను సామాన్యముగా ఇంగ్లీషులో 'కల్చరు' అన్నట్లు విశాలమైన అర్థంతో వాడితే మంచిది. ఈ అర్థములో సాహిత్యము లోక సంగ్రహార్థము ఎంతో ఉపయోగపడుతుంది. ఇప్పుడు శాస్త్రాలు అన్నీ కళలలోకి వస్తున్నవి. మనపూర్వులు యూరపు అంటేనే ఏమో ఎరుగరు. ఇప్పటి శాస్త్రజ్ఞులు లోకమంతా తెలుసుకొని ఒకచోటి నుంచి ఇంకొక చోటికి శీఘ్రంగా వెళ్ళుతున్నారు. అంతేకాకుండా జ్యోతిశ్శాస్త్రజ్ఞుల మనస్సులు ఇప్పుడు విశ్వవిహారం చేస్తున్నవి. ఈ మధ్య ప్రతిభలో 'విశ్వపర్యటనము' అనే చక్కని వ్యాసము వ్రాసినారు. నేటి సాహిత్యం అనంత విశ్వమంతా ఆక్రమిస్తున్నది.

నేటి లోకానికి ఉపకారము చేయవలెనంటే నవ్యసాహిత్యము కావలె. భారతాదులలోని

నీతులు ఇప్పుడు పనికిరావు. నేడు లోక సంగ్రహము కోసము పుస్తకాలు వ్రాస్తే నేటి వ్యావహారిక భాషలోనే వ్రాయవలె. గ్రాంధిక భాష ఎవ్వరికీ రాదు. అది మనకిప్పుడు పనికిరాదు. ఇంగ్లండులో లోకసంగ్రహానికి ఈమధ్య ప్రధానంగా నాటకము, జర్నలిజము ఎక్కువగా ఉపకరిస్తున్నవి. అలాగే మన దేశంలో కూడా కావలె. కాబట్టి వాడుక భాష ఉపయోగించక తప్పదు.

ఈ వాడుక భాష ఒక రూపంగా ఉండడం లేదని తెలియనివారు ఆక్షేపిస్తున్నారు. కాని వారికి జీవద్భాష స్వరూపమే తెలియదు. ఎక్కడైనా రెండు సూర్యోదయాలు ఒక్కేరూపంగా ఉంటవా? ఒక మనిషిని పోలిన మనిషి ఇంకొకదుంటాడా? ఒక్క మనిషివే రెండు చెవులూ ఒక్క విధంగా ఉండవే. జీవద్భాషలో ఉన్న విశేషమే అది. అచ్చుదిమ్మెలో వేసి తయారుచేసేది కాదు. వ్యాకరణాలతో నిఘంటువులతో కట్టివేస్తే పడివుండదు. అది జీవద్భాష. అది వాడకుండా ఉంటామనేవాళ్ళు నాలికలు కోసుకోవలసినదే.

ఈ యుగములో స్పిరిట్ ఆఫ్ ఛాలెంజి (Spirit of Challenge) ప్రధానంగా ఉన్నది. 'ఛాలెంజి' అంటే తెలుగులో సరిఐన పదము లేదుకాని ధిక్కారము అనేమాట కొంత దగ్గరగా ఉంటుంది. కాబట్టి ఈ యుగాన్ని 'ధిక్కార యుగము' అంటున్నాను. ప్రథమంలో కొందరు స్వతంత్రుల అధికారం ధిక్కరించి స్వతంత్రులైనారు. పూర్వం స్త్రీలు విద్య నేర్చుకోరాదు, ఉద్యోగాలు చేయరాదు. కాని వారిప్పుడు మేమెందుకు పనికిరామూ అంటున్నారు. వాళ్ళు అన్ని ఉద్యోగాలూ చేస్తున్నారు. టర్కీలో ఇప్పుడు చివరకు ఆకాశ విమానాలు నడిపేందుకు ఆరువందల మంది స్త్రీలు సిద్ధమయినారు. సైనిక దళాలలో కూడా స్త్రీలు చేరినారు. స్త్రీల రెజిమెంట్లే ప్రత్యేకంగా ఉన్నవి. ఈ విధంగా స్త్రీలు పురుషుల అధికారం ధిక్కరిస్తున్నారు. మొన్న మొన్నటివరకూ రాజ్యాలలో అధికారాలు ధనవంతులకే ఉంటున్నవి. కాని నేడు బీదవాళ్ళు ధనికుల అధికారం ధిక్కరిస్తున్నారు.

ఇటువంటి సమయంలో నేటి సాహిత్యాన్ని ఎవరైనా విమర్శిస్తే ఆ విమర్శకుల అవివేకమే వ్యక్తమవుతుంది. అట్టి విమర్శనలకు నిరుత్సాహ పడనక్కరలేదు. కాళిదాసుకూ భవభూతికీ కూడా ఆక్షేపణలు రాకపోలేదు. భాసుడూ మొదలైన వాళ్ళ నాటకాలు ఉండగా ఈ కొత్తనాటక మెందుకూ అని అప్పటి అజ్ఞానులు కొందరు ఆక్షేపిస్తే కాళిదాసు 'మాలవికాగ్నిమిత్రము'లో

"పురాణ మిత్యేవ న సాధు సర్వమ్
న చాపి కావ్యం నవ మి త్యవద్యమ్
సంతః పరీ క్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః"

అని ప్రస్తావనలో చెప్పించి నవకవులను హేళనచేసేవారిని, మూఢుల కింద కట్టి వేసినాడు. భవభూతి కూడా అప్పటివాళ్ళు 'ఎందుకివి' అవి ఆక్షేపిస్తే,

'యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
జానంతు తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలోహ్యాయం నిరవధి ర్విపులాచ పృథ్వీ'

అని చెప్పుకోవలసి వచ్చినది. వర్డ్స్‌వర్తువంటి మహాకవి పుస్తకాలు మొదట పదకొండేళ్ళలో పది ప్రతులు మాత్రమే అమ్మకమయినవి. టెన్నిసనువంటివాడు తన పుస్తకాలు అమ్ముడుకాకపోవడము చూచి "This will never do" అన్నాడు. బెర్నార్డు షా పుస్తకాలు అచ్చువేసే వాళ్ళే మొదట లేకపోయినారు. కాని ఇప్పుడు షా పుస్తకాలు విరివిగా అమ్మకమవుతున్నవి. 'షా'ను నీవు ఎందుకు పుస్తకాలు వ్రాస్తున్నావంటే "నేను నేటివాళ్ళకోసం వ్రాస్తున్నాను. నేటి లోకం కోసం వ్రాస్తున్నాను. శాశ్వతత్వం కోసం కాదు" అన్నాడు.

ప్రతి కొత్త ఉద్యమానికి మొదట చిక్కులు వస్తవి. నేను పాతికేళ్ళ కిందట ఈ ఊరు వచ్చినప్పుడు వింజమూరి భావనాచార్యులుగారు 'మీవాదం అంగీకరించము' అన్నారు. వారి పుత్రులైన వింజమూరి రంగాచార్యులుగారు మద్రాసులో అదేవిధంగా గ్రాంథిక భాషలోనే గ్రంథాలు వ్రాయవలెనన్నారు. కాని ఈ పాతికేళ్ళలో ఎంత మార్పు జరిగిందో చూడండి! గురజాడ అప్పారావు చనిపోయినప్పుడు వింజమూరి రంగాచార్యులుగారు సంవత్సరాది సంచికలో విచార పడుతూ కావ్యము వ్రాసినారు. నావాద మంగీకరించని వింజమూరి భావనాచార్యులుగారి కుమారుడు పార్థసారథి వ్యావహారిక భాషలో కథలు వ్రాస్తూ ఈ పరిషత్తులో సభ్యుడుగా ఉండడమే కాకుండా ఇంత వైభవంగా జరుగుతున్న ఈ సభవారి ఆహ్వాన సంఘానికి కార్యదర్శులలో ఒకడుగా కూడా ఉన్నాడు.

నేటి సాహిత్యము సర్వతోముఖంగా వృద్ధికావలెనంటే వ్యావహారిక భాషలో యూనివర్శిటీలలో అన్ని విషయాలూ బోధించేందుకు పనికివచ్చే పుస్తకాలు వ్రాయవలె. షుమారు రెండుకోట్ల తెలుగు వాళ్ళున్నారు. మన దేశంలో నూటికి పదిమందికంటె సంతకం చేయగలవాళ్లు లేరు. ఆ పదిమందిలో చదివేవాళ్ళు బహు కొద్ది మంది. అందులో సాహిత్యగ్రంథాలు అర్థము చేసుకోగలవాళ్ళు ఎందరున్నారు? చదవలేనివాళ్ళనందరినీ చదవగలిగేట్లు చేయడం మనపని. ఇంత మందికీ వ్యవహారానికి అవసరమైన చదువు చదివేట్లు చేయడానికి ఏ భాషలో పుస్తకాలు వ్రాయవలె? కాశీ కృష్ణాచార్యులుగారు ఆంధ్రం సంస్కృతం కంటె గొప్పది. ఆంధ్రం బాగా రావలెనంటే సంస్కృతమూ, ఆంధ్రమూ పూర్తిగా వచ్చి ఉండవలె అన్నారు. నేను కొంత పూర్వాంధ్ర భాష నేర్చుకోవాలని ప్రయత్నం చేశాను. కాని నాకు ఇప్పటికీ దాని స్వరూపం పూర్తిగా తెలిసింది కాదు. ఆ సందేహాలు తీర్చగలవారు ఎవరున్నారో నా ఎదట నిల్చి చెప్పండి! అటువంటి పూర్వభాషలో కావ్యాలు వ్రాస్తే మన దేశంలో చదువురానివారందరికీ చదువు నేర్పగలమా? ఈ మూడు కోట్ల మందీ నిఘంటువులూ, వ్యాకరణాలూ చెప్పుకొని తర్వాత విద్య నేర్చుకొనవలెనా? గ్రాంధిక భాషలో కావ్యాలు వ్రాయలేరు. గ్రాంథిక భాష అనే పేరుతో అందరూ కృతకభాష వ్రాస్తున్నారు. వ్యావహారిక భాష అంటే ఇప్పుడు శిష్టుల వ్యవహారంలో ఉన్న భాష. అది నేను ఉగ్గుబాలతో నేర్చుకొన్న భాష. అది దేశి, జాను తెనుగు! అది మనది, మన భాష. ఆ భాషలోనే కావ్యాలు వ్రాయవలె. కావ్యం నేర్పు దాని కూర్పులో ఉంటుంది. కర్పూరమంజరిలో సంస్కృతము మోటుభాష అనీ ప్రాకృతము సుకుమారమైందనీ అన్నాడు. అలాగే ప్రాకృత కావ్యము పసిపిల్లల వాక్కువలె అమృత మయమైనదన్నారు. కావ్యము అందము భాషలో లేదు. పూర్వపు వృత్తాలల్లో నేటి మాటలు పట్టవు. నేటి భాషకు తగిన వృత్తాలూ పాటలూ వాడుకలోకి తీసుకురావలెను. గురజాడ అప్పారావు అన్నట్లు 'కొత్తపాతల మేలికలయిక' ఉండవలె.

వ్యావహారిక భాష అపరిమిత ప్రయోజనము కలది. నవ్యసాహిత్యం లేకుంటే లోకసంగ్రహం జరగదు, లోకం వృద్ధిపొందదు! ఉత్సాహంతో పనిచేయండి! మీకు విజయం తప్పదు!



# త్యాగయ్యగారి నాదసుధారసం

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

శ్రీత్యాగయ్యగారు ప్రపంచానికి ప్రసాదించిన వరం గంగానదివలె మూడు మార్గాలతో ప్రవహించింది. శ్రీరామ భక్తి, కవిత, గానం, ఈ మూడు తత్త్వాలును పూర్వజన్మార్జితమైన పుణ్యంచేతనే తప్ప మనుష్య ప్రయత్నంతోగాని, ఆకస్మికంగాగాని లభించేవి కానంతగా, గొప్పతనంతో ఇంచు మించుగా ఉన్నవి. అయినా వంశ పరంపరగా, ఇంటిసొత్తుగా కూడా ఆయన పాలికి దొరకినవని చెప్పడానికి కావలసినంత సాక్ష్యం ఉన్నది.

త్యాగయ్యగారి ప్రియశిష్యుఁడైన సౌరాష్ట్ర వేంకటరమణ భాగవతులు తన గురువుగారి జీవిత చరిత్రను కొంతవరకూ సంగ్రహంగా వ్రాసి పెట్టినాడు. దానిలో త్యాగయ్యతండ్రి రామబ్రహ్మంగారిని గూర్చి ఈ మాట లున్నవి :

'వీరు శ్రీమద్రామాయణ, భాగవత, భారతాది ప్రసంగాదుల యందు ప్రవీణుడును, తంజావూరు తులసింగ మహాప్రభువులవారి సంస్థానంలో శ్రీమద్రామాయణ ప్రసంగంచేసి, శ్రీరామనవమి గర్భోత్సవము సలిపి అనేక సన్మానముల నొందిరి. ఆ ద్రవ్యాల చేత తన యింట్లో శ్రీరామనవమి జననోత్సవమును అతి విమర్శగా చేయుచు నుండును.

త్యాగయ్యగారి తాతగారైన గిరిరాజ బ్రహ్మంగారిని గురించి 'వీరు సకల విద్యలయందును సమర్థులు' అని మాత్రం పైచరిత్రలో గలదు. కాని ఎట్టియాపురం సుబ్బరామ దీక్షతులు గిరిరాజకవిని గూర్చి 'ఇతడు...సంస్కృతాంధ్రభాషలలో మిక్కిలి ప్రజ్ఞ గలవాడు, సంగీత విద్యాసంపన్నుడు. ఇతడు తెనుగున భక్తిరసముగాను, వేదాంతవిషయముగాను బహుకీర్తనములజేసి ప్రఖ్యాతిని బొందినవాడు' అని వ్రాసినారు.' ఐతే.

**'మాయా నీ వంచన నడువదు । మాటాడక పోవే'**

అనే కాంభోజిరాగం వేదాంతకీర్తన ఒకటే సుబ్బరామ దీక్షితుల పుణ్యాన చిట్టతోపాటు

మనకు లభించింది.

తక్కినవి నాకు దొరకలేదు. ఐతే తంజావూరి సరస్వతీ మహలు భండారంలో శాహమహారాజును, శరభోజిమహారాజును నాయకులనుగా జేసి, గిరిరాజకవి రచించిన శృంగార పదాలు కొన్ని నూర్లకైనా తక్కువ కాక, దిక్కూ దశా విచారించేవారు లేక మూల్గుతూ ఉన్నవి. ఆయన రచించిన తెలుగు యక్షగానాలు గూడాకొన్ని అక్కడ గలవు. గిరిరాజకవి తండ్రి పంచనదబ్రహ్మంగారు కూడా 'వేదశాస్త్ర పురాణాదులయందు నిపుణుడు' అని పై త్యాగరాజ చరిత్రలో ఉన్నది. కనుక త్యాగయ్య గారి పూర్వీకులలో కనీసం మూడు తరాలవారు సంగీత సాహిత్య భగవద్భక్తులకు పేరు పొందిన వారనిన్నీ, అందుచేత ఆయన కా మూడు విషయాలున్నూ, వద్దన్నా వదలక, ఉగ్గుపాలతో వచ్చిన వనిన్నీ చెప్పడానికి సందేహంలేదు. మరి అనిర్వచనీయమైన ఆయన ప్రతిభాశక్తి చేత ఆమూడూ చాలా ప్రబలించినవి. మూడూ ఒకదాని కొకటి వర్చస్సు నిస్తూ పెరిగినవి. ఒకదానితో మరి రెండూ ఎప్పుడుగాని వీడిపోక ఏకకుటుంబంగా నడచినవి. సంగీతానికి ఉల్లాసం ఎక్కువైన సమయంలో భక్తి., సాహిత్యాలూ, భక్తి ఉద్రేకించిన వేళలో సంగీత సాహిత్యాలూ, కావ్యకళ మెరసినప్పుడు భక్తీ, సంగీతాలూ వెనుక నిలిచి మేళం నడిపించినవి. ఈ త్రివేణీ సంగమాన్ని ఇంత స్పష్టంగా మనం త్యాగయ్య జీవితమందే చూడవచ్చును. ఈ మూటినీ ఆయన ఆత్మోత్తారణకై సాధించి ఊపాసించినాడు. కీర్తి, ద్రవ్యం,ప్రతిష్ఠ మొదలైన యే ఇతర ఫలాలనూ ఆసించక, ఇతర జీవులూ తరించవలెననే ప్రపంచానికి మూటినీ వెదజల్లినాడు.

ఐతే, ఆయన ధారాళంగా ఇచ్చిన ఈ తత్త్వ త్రయాన్ని మన మెంతవరకు గ్రహింపగలము? ఎంత జీర్ణించుకోగలము? మన కీ మూటిలో ఏది ముఖ్యం? ఏది గౌణం? ఈ విషయంలో నా దృష్టిని మాత్రం ఇక్కడ మనవి చేస్తాను.

త్యాగయ్యగారి భగవద్భక్తి నావంటివాని యోగ్యతకు చాలదూరం మించిన మహత్త్వం, ఆయన భక్తి సంస్కారం గొప్పది. కనీసం నాల్గుతరాలది. ఇంక ఆయన సాధన అతిమానుషమైనది. పుట్టినది నిర్గుణైక బ్రహ్మవాదులైన స్మార్త బ్రాహ్మణుల కులంలో,

పెరిగింది శివుడు, విష్ణువు, స్కందుడు, పార్వతి, లక్ష్మి, సరస్వతి, తులసి, విఘ్నేశ్వరుడు మొదలైన అన్ని దేవతలకు సమానంగా మొక్కులు చెల్లించవలసిన సంప్రదాయంలో ఈ పద్ధతిలో ఏ దేవతావ్యక్తియందుగాని ఆత్మీయత అనే భావాన్ని దృఢంగా అనుభవించే అవకాశం చాలదు. కాబట్టి భజన సంప్రదాయ ముండినా భక్తిసాధన ఈ సన్నివేశంలో మహాకష్టం. భక్తి జ్ఞానాలు రెంటికీ ఏకాగ్రత ముఖ్య సాధనమే. కాని, అన్వయంలో రెంటికీ ఎంతోభేదమున్నది. మనోమార్గాలను సంకోచ పరచి నిర్గుణతత్వాన్ని సాధించే 'సోహం' సిద్ధాంతం జ్ఞానమార్గం, వాటిని వికాసపరచి అనంతకల్యాణగుణపరిపూర్ణ తత్వం ప్రత్యక్షీ కరించుకొనేది భక్తి పంథా ఐనా ఈభక్తిమార్గానికి భిన్నరూప గుణ చరిత్రాదులు గల బహుదేవతల పూజాపురస్కారాలు సాధకములు కాజాలవు, ఏదో ఒక వ్యక్తిని పరదేవతగా భావించి, సమీపించి, అనుభవించి, ఉపాసించవలసి ఉంటుంది. తక్కిన దేవతలు, మునులు మొదలైనవారెంత గొప్పవారైనా ఆ మూలదేవత కనుచరులు గానే గమనింపవలసిఉంటుంది. ఇట్టి పరమైకాంత భక్తికి పునాది చాలా చిన్నతనమందే త్యాగయ్యకు వేసినారు. 'గోలిగుండ్లాడే' ప్రాయమందే తండ్రి రామబ్రహ్మం కొడుకుకు రామనామోపదేశం చేసినాడు. తరువాత 'ఐదారు దినములకే' రామకృష్ణానంద స్వాములనే యతీశ్వరుడు శ్రీరామషడక్షరీ మంత్రాన్ని అంగన్యాస కరన్యాసాలతో ఉపదేశించినాడు. ఆ మంత్రాన్ని అది మొదలు దినమొకటింటికి లక్షయిరువదియైదువేల నామముల ప్రకారంగా జపిస్తూ త్యాగయ్య తమ ముప్పదియెనిమిదవ ప్రాయమున తొంభైయారు కోట్ల నామములను పూర్తిజేసిరి అని ఒకకథ. మూడు మార్లయినా కోటిజపం ముగించినాడని వెంకటరమణ భాగవతుల వ్రాతవల్ల తెలుస్తుంది. ఎట్లయినా త్యాగయ్య తన ఆయుష్కాలంలో చాలాభాగం శ్రీరామమంత్ర జపానికి వినియోగించినాడనేమాట సత్యం. దానికితోడు త్రికాలపూజ; మిగిలిన కాలం కీర్తనల రచనకు, భక్తిరసం ప్రవహించే తొమ్మిది మార్గాలలో త్యాగయ్య దేనినీ విడవక అన్నిటినీ సాధించినాడు. గనకనే ఆయన జీవితమంతా ప్రధానంగా రామమయ మైనది. ఇతర దేవతలపైన శ్రద్ధసళ్ళింది. తుదకు సీతాదేవి మీద గూడా ఎక్కువగా చిత్తసమాధి కలిగించుకొనే అవకాశం ఆయనకు లేక పోయింది. అభిమానంలో తారతమ్యాన్ని

విచారిస్తే శ్రీరాముని తరువాత తక్కిన అన్ని దేవతలకంటె పార్వతీదేవిమీద ఆయనకు ప్రతిపత్తి ఎక్కువగా ఉన్నట్టు కానవస్తుంది. ఈ రామ భక్తి వికాసమార్గంలో పెరిగి పెరిగి తుదకు శ్రీరాముడుకూడా త్యాగయ్యపాలికి తన మేరలన్నీ దాటి సర్వాత్మకుడైన పరమాత్మగా ప్రత్యక్షమైనాడు. 'పరమాత్ముడు వెలిగే ముచ్చట' మొదలైన కీర్తనలలో ఈ పరిణామం స్పష్టంగా కానవస్తుంది.

తక్కిన పెద్దలంతా భక్తికి ఫలంగా భుక్తి, ముక్తులు రెండూ కావలెనని కోరుతూఉండే కాలంలో త్యాగయ్య ముక్తి ఒక్క దానికే వేకారినాడు.

**'రామా నీపై తనకు ప్రేమపోదు**

**భోగానుభవంబులందు బాగుగా బుద్ధినీయదు'**

అని తన మనోగతిని ఆయన ఘోషించినాడు. దేశమంతా చిన్నచిన్న రాజులు, జమీందార్లు, పాళేగార్లు, దోపిడికాండ్లు మొదలైనవారి చేతులలో నలిగి ఛిన్నా భిన్నంగా చెడి చెటాకుల గలుస్తూఉన్న కాలంలో, కుంపిణీ తెల్లదొరలు వారినీ వీరినీ తగలబెట్టి తమాషా చూస్తూఉన్న సమయంలో, రాజులనీ అధికారులనీ పేరు పెట్టుకొన్న వారి అడుగులకు మడుగులొత్తకపోతే, వారిమీద పదాలో పద్యాలో కట్టి పొగడి పైకెత్తకపోతే, బతుకే లేని సన్నివేశాలలో,

**'దుర్మార్గ చరాధముల దొర నీవనజాలరా'**

**'జేనె దుదరమునింప నే నరుల పొగడితినా'**

అని రామునితోనే మొరబెట్టుకునే విరక్తి, హఠం, శ్రద్ధ, నిర్లక్ష్యం అలవరుచుకొని ఎనభైయేండ్లు దినగండం దీర్ఘాయుస్సుగా జీవిత సూత్రాన్ని బిగబట్టి నడిపినాడు! ఇటువంటి సంస్కారబలం, సంప్రదాయ శుద్ధి, సంకల్పదారుఢ్యం, సాధన తీవ్రత లేకపోతే భక్తి వట్టి బహిర్లేపమో, వేషమో అవుతుంది. ఈ కాలంలో ఎంత మందికీ గుణాలు ఎంతమట్టుకున్నవో నాకు తెలియదు. నా మట్టుకు నాకు లేవనేది సత్యం.

ఇంతేకాదు, శివభక్తులు, దేవీభక్తులు, స్కందభక్తులు మొదలైన వారిమాట

అట్లుండనియ్యండి. వైష్ణవులలోనే కొందరికి రామునికంటే కృష్ణునిమీదా, నృసింహునిమీదా భక్తిభావం ఎక్కువగా ప్రసరిస్తుంది. ఇది వ్యక్తులందు ఎన్నో కారణాలచేత కలిగే చిత్తదౌర్బల్యం. త్యాగయ్య కూడా దీనికి తప్పలేదు. పై కృష్ణాదిమూర్తులమీద శాస్త్రానికి రెండుమూడు కీర్తనలు మాత్రం ఆయన రచించినా దంతే, కాని, ఆయన లక్ష్యమంతా, నమ్మకమంతా.

**'కోదండపాణిరూపముతో వెలసినవాడేరా దైవము'**

అనే వ్యాపించింది. కనక ఆయన భక్తిమార్గం వైష్ణవ హిందువులలోనే ఎక్కువ వ్యాపింపజాలదు. మరిన్నీ ఏ భక్తి గాని కొన్ని సంకేతాలకూ, సంప్రదాయాలకూ లొంగి ఉండక తప్పదు. విష్ణుభక్తికి రామానుజ మధ్వాది సంప్రదాయాలూ, సంకేతాలూ ఎన్నో ఉన్నవి. త్యాగయ్యగారిది స్మార్తసంప్రదాయం; అందులోనూ స్వంత మార్గాలెక్కువ. వారి కందరికీ ఇది అంటడం సులభంకాదు. ఇంక హిందువులు కానివారిమాట చెప్పనక్కరలేదుగదా. కనక వ్యక్తి, సంఘం, జాతి, మతం మొదలైన కట్లు, కంచెలు అన్నీ విచ్చుకొని తోసుకొని పోగల్గిన యే ఒకరిద్దరు మహానుభావులకో తప్ప సామాన్యులకు త్యాగయ్య గారి భక్తిమార్గం అందరాని పండు. అందినా తినలేము.

త్యాగయ్యగారి రెండవ వరం కవిత్వకళ, మహాకవుల కుండవలసిన గుణాలెన్నో ఆయనయందు స్వతస్సిద్ధంగా ఉన్నవి. చిన్నతనంనుంచీ పద్యాలూ పాటలూ అంతులేక విన్నాడు. వల్లించినాడు. స్వాభావికంగా రచనోత్సాహం కలవాడు గాబట్టి ఛందస్సు, యతిప్రాసలు మొదలైన వానిని సులభంగా వశీకరించుకోగల్గినాడు. భావాలలో ఆర్జవం నిండి ఏ మాట చెప్పినా వర్చస్సుతో చెప్పగలిగినాడు. కృత్రిమంగా మీద వేసుకొన్న భావాలు ఆయన రచనల్లో లేనే లేవనవచ్చును. కొన్ని సాంప్రదాయికపు మాటలు తప్ప అన్నీ నిండుగా బతికిన భావాలే. దీనికి తోడు తన యిష్టమెట్లు వస్తే అట్లు వర్తించి వ్యవహరించే ధైర్యమూ, స్వాతంత్ర్యమూ ప్రబలంగా ఉండినది. దీనితో రచనకు ఒక నవ్యత ఏర్పడి, భావాలకొక విలాసమూ, భాషకు ధారాళతా వచ్చి వినేవారి నాకర్షించగలదు. రామభక్తీ, తనకు ముక్తీ ఇవి రెండే భావనావిషయాలై కవితాకళకు

వలయం సంకుచితమైనా, దానిలోనే కొత్తకొత్త తోవలు తొక్కి ఆదే ప్రతిభాబలమున్నది. కనకనే ఈతని చేతికి దొరికిన శ్రీరామమూర్తి. దీక్షితులు మొదలుగవారి దేవతలవలె, కేవల ధ్యానోపయోగిమూర్తి మాత్రం కాక, మనతో చేరి, మనవాడై కానవచ్చుచున్నాడు. దివ్యమూర్తి మనుష్యుల అంతస్తుకు దిగినాడు. 'ఆత్మానం మానుషం మన్యే' అని ఆయన చెప్పిన అసత్యవాక్యం సత్యంగా, త్యాగయ్య గారి కవిత పుణ్యాన, మనపాలికి పరిమళించింది. తెలుగు కవులలో పలువురికీ శక్తి లేదు.

ఐతే, త్యాగయ్యగారి జీవితంలో ఆ శక్తికి భాషలోగాని, భావాలలోగాని తగినంత యేర్పులూ తీర్పులూ చేసే అవకాశమూ సంస్కారమూ చాలక, ఆయన కవిత పల్లెటూరి పడుచువలె అకృత్రిమంగా నిలిచింది. ఆయన తెలుగుభాష నాలుగైదు తరాలుగా తమిళదేశంలో నిలబడి సహజమైన పెరుగులూ మెరుగులూ చాలావరకు కోలుపోయింది; జిడ్డుగట్టింది. 'మూడు రెండు నదినాధుడు' 'నిద్దురజితుడు' వంటి కృత్రిమరూపాలతో అందదుకులైన వాక్యాలతో నడచింది. ఆయన సంస్కృతంకూడా ఎక్కువ వ్యాసంగాని కవకాశం చాలలేదనిపిస్తూ, నేర్చినదానికంటే విని గ్రహించిందే ఎక్కువ అని పదేపదే సూచిస్తుంది. **'కేచన నిజభక్తనిచయ' 'ముఖజితభార్యే'** ఇత్యాదులుదాహరింపవచ్చును. త్యాగయ్య వ్యాకరణ నియమాలు ఉల్లంఘించినాడనే కాదు నామనవి. ఆ ఉల్లంఘన సహజమైన సరళమార్గంలో నడవలేదనే. తాళ్ళపాకవారు, క్షేత్రయ్య మొదలైన పదకవులందరూ, ఎందరో పద్యగద్యకవులూ, వైయాకరణుల అధికారానికి మితిని కలిగించినవారే. శబ్దశాస్త్ర నియమాలను ఎదిరించే దొమ్మగలవారు అప్పుడప్పుడుండబట్టే ఏభాషగాని ప్రవాహినిగా నడుస్తుంది. లేకపోతే పడియనీళ్ళవలె నిలిచిపోక తప్పదు. కాని ఆ ఉద్యమం ఆయా భాషల ఆవరణంలోనే జరగవలసి ఉంటుంది. త్యాగయ్య గారి ప్రయత్నమో ఆ వలయానికి బైట అవిమర్శగా జరిగింది.

ఇంక ఆయన భావాలుగూడా ఎన్నో చోట్ల పై అపక్వతనే సూచిస్తున్నవి. శక్తికితోడు లోకశాస్త్ర కావ్యాదుల పరిశీలన వల్ల కలిగే జాణతనం, కావ్యజ్ఞుల శిక్షతోడి అభ్యాసం – అనే రెండుగుణాలు కవితారచనకు ఆవశ్యకమన్నారు పెద్దలు. త్యాగయ్యకు శక్తీ, అభ్యాసము సమృద్ధిగా ఉన్నవి. కాని తక్కినవి సంపాదించే విరామమూ, అక్కరా ఎక్కువగా

ఆయనకుండినట్లు కానరాదు. కాబట్టే 'నీతండ్రిసొమ్ము వెరవక పోనేరదు.' ' ఈ హారామితనమేల' 'రంగడా విభీషణునకు పంగనామ మిడినరీతి' ఇత్యాది, బాలభావాలు ఆయనరచనలో పడినిలిచినవి. చెప్పవలసిన భావాలు స్పష్టంగా, సరళంగా చెప్పగల ఓర్పో, శక్తియో లేక వాక్యమూ ఛందస్సూ ముగిస్తే చాలునని ముందుకుపోయిన రచన యెంతో ఉన్నది. కాబట్టి ఎన్నో కీర్తనలలో అర్థమిప్పటికీ అస్పష్టంగానే నిలబడింది. ఇదంతా ఆయన శిష్య ప్రశిష్యులు తెలుగు తెలియక చేసిన అపరాధమని చెప్పేది ఒక సంప్రదాయం, కొంత నిజం కావచ్చును. కాని,త్యాగయ్యగారికికూడా ఇందులో భాగం ఎక్కువగానే ఉండిందని చెప్పకపోవడం సాధ్యంకాదు. ఆయనది తోచినవెంటనే కూర్చి పెట్టిన ఆశుకవిత; మన సంగీత రచనలవంటిది. రాగం, తానం, పల్లవి, స్వరకల్పన ఇత్యాది కర్ణాటక సంగీత స్వతంత్ర రచనలలో గాయకుడు వల్లించిన దానిని వదలి, తన సభ్యుల అదృష్టాన్ని నమ్మి 'నీవేగతిరా దేవుడా' అని సాహసించి కల్పనకు దూకుతాడు. ఆ తెగుదారి చొరవలో ప్రతిభావంతుడయి సుశిక్షితుడైన గాయకునినుండి అతడుగాని, మనంగాని కలలోనైనా ఊహించిఉండని అపూర్వాద్భుత రచనలు ఆవిర్భవించగలవు. ఆ ప్రయత్నంలో అపస్వరాలూ, అవలయలూ చొచ్చుకొన్నా మనం ఓర్చుకొందుము. ఓర్చు కోవలెను గూడ. ఈ కళ స్వరూపమది గనుక. పట్టుకు సులభంగా దొరకని నాదకాలాలతో అర్థంలేని భావాలను రచించే విద్య అది. కాని సంకేతబద్ధమైన వాగర్థాలతో చేయవలసిన కవితాకళ ఆ దారిలో నడవవలసిన అక్కరలేదు. స్ఫురించిన రచనను మళ్ళీ నిదానంగా నెమరువేసి చేర్పులూ, తీర్పులూ చేసే అవకాశమూ, చేయవలసిన ధర్మమూ ఇందులో ఉంది. దానిని ఉపయోగించుకోకపోతే ఆ కళ అఖండంగా సిద్ధించదు. కాబట్టే 'నిలుకడ వలయు గృతికి' అన్నారు విమర్శకులు. ఆశురచనలో గూడా అప్పుడప్పుడు అద్భుత రచనలు మించవచ్చును. కాని, కవికి ఆ సాకు పనికి రాదు; రాగూడదు. త్యాగయ్యగారి కవిత ఈ ఆశుతరగతిది. ఆశ్చర్యము కలిగించే ముక్క లెన్ని ఉన్నా అఖండత చాలనిది. కనుక తెలుగు సాహిత్యంలో ఇతర కవుల రచనలు చవిచూచిన నాలుకకు త్యాగయ్య కవితలోని రసం చాలదు. ఈమాట సాహసమైతే మన్నించండి.

ఇంక నిజంగా నావంటివారిపాలికి మిగిలింది ఆయన అనుగ్రహించిన గానం.

అది మహాప్రసాదం. దాని వైశాల్యం, గాంభీర్యం, విలాసం, వైదగ్ధ్యం, వైవిధ్యం - అనిర్వచనీయమైనవి. దాని కదే సాటి. నిజమాలోచిస్తే త్యాగయ్య గారు ఆజీవమానం అఖండంగా అంతరంగంలో సాధించింది రామభక్తి యోగం; బహిరంగంలో అట్లే సాధించింది నాదయోగం. కవిత్వం ఈ రెంటికీ పొత్తుకలిపే కొండివంటిది. అది యీ రెండు మహాద్రవ్యాల ఒత్తిడిలో సన్నగిల్లి మసక మసకయిపోయింది. వంశపరంపరతో వచ్చిన త్యాగయ్య గానాభిరుచికి శొంఠి వేంకటరమణయ్య గారి దోహదం లభించింది. ఆ మహా విద్వాంసుడు - వాగ్గేయకారుడు - తంజావూరు సంస్థానం దర్బారులో ఉగాది పండగనాడు మొదటి పాటకచ్చేరీ చేసే అధికారాన్ని సంపాదించుకొన్నవాడు. ఇంతేకాదు. 'మహారాజువారి కొలువు మంటపములో రాజువారి ప్రక్కనే అర్ధసింహాసనారూఢు'డట. అంతటి మహావిద్వాంసుని శిక్షగూడా ఈ శిష్యమహత్తరునికి చాలలేదు. మళ్ళీ రామకృష్ణానందస్వామే వచ్చి నారదమంత్రోపదేశంచేసి ఉపాసన చేయించినాడు. దానిఫలంగా **'నాదసరసీరుహ భృంగుడు'** నారదుడు ప్రత్యక్షమై అగ్రహించినాడు. కనక త్యాగయ్య సంగీతం మనుష్యుల మట్టాన్ని దాటి దివ్యతకెక్కింది. కొన్నాళ్ళకు తరువాత శొంఠి వెంకటరమణయ్యగారే శిష్యుణ్ణి పిలిపించి తనయింట్లో పాటకచ్చేరీ చేయించి, ఆనందం పట్టజాలక, తనకు మహారాజావారు బహుమానంగా ఇచ్చిన తోడా, మకరకంటి మొదలైన సొమ్ములతో ఆయనను అలంకరించి చూచి కన్నులు చల్లజేసుకొన్నాడట. **'శిష్యాదిచ్ఛే త్పరాజయం'** అన్న పరమాచార్యన్యాయాన్ని సంతోషంగా ఆచరించి చూపిన ఆగురువు, ఆ శిష్యునకే అన్ని విధాలా తగిన మహనీయుడు.

కనకనే త్యాగయ్య నాదరచన భాషారచనను చాలా దూరం మీరిపోయింది. ఆయన నాదజీవనానికి భాష శరీరంగానూ, ఎన్నో చోట్ల వట్టి వేషంగానూ పరిణమించి ఒదిగి నిలిచింది. ఇంతే కాదు. పరదేవతగా శ్రీరామమూర్తిని ఉపాసించే సాధనంగా త్యాగయ్య ఉపయోగించుకొన్న యీ నాదకళ తుదకు శ్రీరాముడే ఐపోయింది. అథవా రాముడే నాదకళారూపముగా మారిపోయినాడు. అంటే రామమూర్తియందారోపించి ధ్యానించిన అఖండత, అమేయత, అనిర్వచనీయత - ఈనాదప్రపంచ మందే త్యాగయ్యకు అనుభవానికి వచ్చింది. ఇంకొకవిధంగా ఈమాట చెప్పితే పాట భక్తియెల్లలనుగూడా దాటిందన్నమాట. ఆయన రచించిన అమోఘమైన కృతులలో ఒకటైన ఈ కృతి ఈ

విషయానికి సాక్షి.

**'నీ దయచే రామ – నిత్యానందుడైతి,**

**నాదబ్రహ్మానంద రసాకృతిగల – నీదయచే**

**పరమ్మృదుభాష – సుస్వరమయభూష**

**పరత్యాగరాజ వాక్చేలావృత ”**

కాబట్టే, **'నాదోపాసనచే శంకరనారాయణ విధులు వెలసిరి ఓ మనసా'** అని చాటేదాకా ఆయన ధైర్యం పాకింది.

ఈ అనుభవమే ముఖ్యంగా ఆయన పాటలలో ఎక్కువగా ఉన్మీలితమైంది. సంకేతాలతో బతికేది భాష. కాబట్టి దాని వ్యాప్తి మితమైనది. భాషనుబట్టి మాత్రమే చూస్తే 'అరగింపవే పాలు' అన్నపాట రామునికే పూజచేస్తూ నైవేద్యమిచ్చే సమయంలో మాత్రం సార్థక మౌతుంది. అప్పుడుగూడా ఒక మాటు ఆమాట చెప్పితే చాలును. కాని దాన్ని నాల్గుపక్కలా పట్టుకొని ఆడించే పాటమెట్టుకు త్యాగయ్యగారు ఐదారు సంగతులు చేర్చినాడు. ఎందుకు? ఈ రాముడు, పాలు, ఆరగింపు మొదలైన ఖండభావాలకంటే వాటికి ప్రేరకమైన ఉల్లాసం, అలౌకికత, తృప్తి మొదలైన అనుభావాలలో తన్మయత్వాన్ని పొందడానికి, అఖండమార్గంలో నడవడానికి, ఆ నాదరచనలు సోపానాలు కాగలవు. సంగతులైదారు అనేది మచ్చుకేకాని శక్తిగలవారు ఐదునూర్లూ, ఐదేసి వేలూ కల్పించుకోవచ్చును. సంకల్పించుకోవలెను. కీర్తనలకు సంగతులు వేసి పాడే పద్ధతికి త్యాగయ్యే ప్రథమాచార్యుడంటారు. అదే నిజమైతే ఆయన కింతకంటే వేరే ఉద్దేశం కానరాదు. ఆయన తన కీర్తనలను భాషాభావాలు మాత్రమే ధ్యానిస్తూ, చల్లగా, ముద్దుగా, స్పష్టంగా ముత్తైదువుల పెండ్లిపాటలవలె, ఒకమాటు పఠించి వదిలేవాడనీ, ఈసంగతులు, నెరవళ్ళు,స్వరకల్పనలూ అన్నీ తరువాతి 'విద్వాంసుల' విపరీత కల్పనలనీ కొందరు ఊహించేట్టున్నది. కాని, అది న్యాయం కాదు. త్యాగయ్య గురువుగారింట్లో కచ్చేరీ చేసినప్పుడు 'దొరకునా ఇటువంటి సేవ' అనే కీర్తన పాడి, దాని మూడవ చరణం లోని **'కామితఫలదాయకియౌసీత'** అనేచోట 'పల్లవి సాహిత్య స్వరములు' పాడి

చూపినప్పుడే గురువుగారు 'దొరకునా ఇటు వంటి శిష్యుడు!' అని మెచ్చుకొని తన భూషణాలు ఇచ్చి గౌరవించినాడని వేంకటరమణభాగవతుల చరిత్రలో గలదు. ఇదిగాక ఎన్నో కీర్తనల సంగతులు అన్ని శిష్యపరంపరలలోనూ ఒకే విధంగా నేటికీ పాడే వాడుకలో ఉన్నవి. ఇంకా **'నాద సుధారసం బిలను నరాకృతాయెరా'** అనే కీర్తనలో సంగతులు ఆ నాదసుధారసమూర్తి రాముడు ఆదే మాటలైనవని త్యాగయ్యే ధ్యానించినాడు.

కాబట్టే ఆయన రచనలు భాష, మతం, జాతి మొదలైన ఎల్లలన్నీ దాటి కర్ణాటక సంగీత రసికుల కందరికీ ఈ నూటయేబదేండ్లకు పైబడి పరమానందదాయకమైన ఆస్తిగా పరిణమించినవి. ఆయన తెలుగు వాడనీ, రామభక్తుడనీ,బ్రాహ్మణుడనీ, ములకనాటి స్మార్తుడనీ, ఎక్కువ అభిమానమో, అసహ్యమో ఆయన పాటల విషయంలో ఆధునికులు కొందరు చూడడం కేవలం బాలిశమని - ఆత్మాపరాధమని - చెప్పక తీరదు. అవి అలౌకికంగా అనుభవించవలసినవి.

కనుక రామభక్తి ఉన్నా లేకపోయినా, తెలుగు సంస్కృతాలు రుచించినా రుచింపకపోయినా, త్యాగయ్యగారి కీర్తనలు దొరికినన్ని సంగ్రహించడమూ, వాటి వర్ణమట్టులను స్వరూపనాశం చేయక భద్రపరచి శిష్య పరంపరలో వ్యాప్తికి తేవడమూ, గాన గాంభీర్యాన్ని ఆ అంతస్తులో తామనుభవించి ఇతరులనుభవించేట్టు చేయడమూ - ఇవి ఇప్పటి కర్ణాటక నాదకళారసికుల ధర్మమని నా ప్రార్థన. ఇది మతధర్మము, కులధర్మము, జాతి ధర్మము కాని కాదు. మఱి మానవధర్మం. వివిధ భేదాలతో అడ్డగోడలతో ఉద్రేకాలు పెరిగి అనాహుతాలపాలై పోతూవుండే మన దేశంలో త్యాగయ్యగారి యీ గానకళకు పరస్పర స్నేహసౌహార్దాలకు సాధనంగా ఉపయోగించి మనం ధన్యులం కావలసిఉన్నాము. భక్తి లభిస్తే వ్యక్తులు కృతకృత్యులౌతారు. కవిత్వం రసింపగలిగితే తెలుగు తెలిసినవారానందిస్తారు. కాని త్యాగయ్య గారి నాదసుధ దొరికితే - హిందువులే కాదు, మనుష్యజాతే తరించిపోతుంది. ఆయనకళ నారాయణాస్త్రం, దానికి నమస్కారం తప్ప వేరే ఎదురేమీ లేదు.



# మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

- శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

అది స్తబ్ధరాత్రి. స్తబ్ధతర ప్రకృతి. విశ్వనాథ సత్యనారాయణ గారు తాము రచించుచున్న 'రామాయణ కల్పద్రుమము'ను జదువుచుండిరి. నేను పరవశుడనై వినుచున్నాను. తీయదనపు వేదనచే తూగాడు వారి గొంతుకలో పద్యములు గలగల లాడు చున్న కొలదియు నా హృదయమున భావములు నెఱ్ఱులు చీలుచుండినవి. చదువుచుండినది పుత్రకామేష్టి యాగ ఘట్టము. కర్మభూమిలోని ఘనత. "అది లేదే" యని రాపాడు రచయిత దుఃఖము. యజ్ఞ భూమిలోని పావిత్ర్యము, నాటి శాంతికి వేకారు కవి మనస్సులోని యాకలి, అనపత్యుడగు దశరథుని వేధ, అందులో దాగిన కవి బాధ – నా భావనానేత్రము నెదుట బ్రత్యక్ష మగుచుం డినవి. చదువుచున్న వారావేశమున ముందు వెన్కల జూచుట లేదు. నాకు వేళయే తోచుట లేదు. అర్ధరాత్రి మీరినది. కడకు వారు కన్నీటితో ఫక్కున పగులబడినారు. **"ఔను, మన దేశమున కేదియు నక్కరలేదు. ఎడద చచ్చిన జాతి కేమైన నెందులకు? 'మనది' యనున దంతయు గతించినది. నేడు మిగిలిన నన్నియు దాని జీర్ణచ్ఛాయలు. చచ్చిపోవుచున్న జాతిలోని చివరి మెఱుపులు, మా గొడవలు వినువా రెవ్వరు?"** అన్నారు. ఆ యనుట నా హృదయము నొక్కసారి యుఱ్ఱూత లూచినది. తల పైకెత్తి చూచితిని. వారి ముఖమున దారుణ కోపము – దారుణ తర తాపము పెనగొన్నవి. నిటాలము ముడుతలు పడినది. ఆ వికట భ్రూకుటిలో – ఆ జడిగట్టిన స్వేదబిందువులలో తెల్లని విభూతి పట్టెలు చెమ్మగిల్లినవి. విశాలములై జ్యోతిష్మంతములగు కన్నులు ధగధగ వెలుగజొచ్చినవి. 'పిలక' కంపించి పోయినది.

శరీర మాపాద చూడము భావనావేశమున దూగాడుచున్నది. నల్లని త్రాచువలె నున్న వేడి యూర్పు "నాభిలో బుట్టి గుండె నొకతాపు తాచి కంఠసీమ కమలి మొగమున కెగదన్ని భ్రూయుగమున నల్లనై" మా గదిలోని స్తబ్ధాకాశమున నలలు రేగినది. నాటి యా మూర్తి 'లయసమయ దండధరనిర్దయుడై' యున్న భట్టారకుని భీముని పాత్రమును జ్ఞప్తి కెలయించినది. ఆ జ్యోతి స్వరూపునెదుట నేను పురుగునై నా యస్తిత్వమునే గోలుపోవుదునా యని భయమైనది. చకితుడనై – దీనుడనై సత్యము కాని – మిధ్య గాని యా మూర్తి కొక్కసారి నమస్కరించుకొన్నాను.

నే నేమియు బదులొసగలేదు. వారి మాటలే నా గుండెలో సుడులు దిరుగ నారంభించినవి. రామాయణ పఠన మాగినది. బరువగు నెడదతో వా రింటికి వెళ్ళినారు. అతని వెంబడించు సామర్థ్యము నాకు లేదు. ఆ స్పర్శ అగ్నికణము – తీవ్రబాధ– దారుణ తపస్సు!

అతడొక విచిత్ర మానవుడు. విశిష్టవ్యక్తి. ఆ హృదయమునకు విషాదమే పరివేషము. సుఖములో నొదిగిన దుఃఖము – జ్ఞానములో నున్న యజ్ఞానము – సంయోగమునందున్న భావి వియోగము – వీనినే యా వ్యక్తి చూచును. తెలుగు నేలలో 'విశ్వనాథ'వంటి పండితు డుండవచ్చును గాని అతని వంటి సంస్కారి యరుదు. వారి భావము లొక నిముసమున – తాత్కాలికావేశమున గడ్డకు దొరలినవి కావు. మరి యనుభవ మను త్రేతాగ్నిలో వ్రేల్వబడిన హవిస్సుల ధూమములు. అతని జీవిత మగ్నికుండము. కడుపులో – ఎదలో క్రుంగి క్రుంగి ఆ దుఃఖమును పట్టలేనప్పుడు – వహ్ని పర్వతము 'లావా' రసమును వలె ఒక్కసారి తన రచనల బయటికి కుమియును. ఆ మానవుని జూచినప్పుడు – "నిజముగా నిత డెపుడైన నవ్వునా" యను సందేహము కలుగును. ఆ మహాకవి జీవిత మంతయు కష్టముల పెంట. కష్టము లనగా బహిరంగము మాత్రమే కాదు. ఠాగూరు కన్నను భోగి లేడు. అతని కన్న మథనపడిన వాడును లేడు. మఱి కష్టమనగా సత్యమును గూర్చిన యావేదన. ఈ తెగ వారికి ప్రపంచమంతయు సమస్యలే! అన్నియు నా

వేదనలే! సత్యనారాయణ గారికిని ఈ ద్రోవయే పట్టినది. ప్రపంచమంతయు పాశ్చాత్య నాగరికతాబద్ధమై తన వ్యక్తిత్వమును సంపూర్తిగ నాశమొనరించుకొని ప్రళయోన్ముఖమై పోవుచున్నది. మానవునకు మానవత్వముపై విశ్వాసము లేదు. 'ప్రాచీనత' అను దానిలోని మహత్త్వము నశించినది. పై మెఱుగులు ప్రియమైనవి. తెనుగునేలలో తెనుగుతనము లేదు. ఆనాటి కోతి కొమ్మచ్చులు - చెడుగుళ్లు- కత్తియాటలు - మల్లయుద్ధములు ఏవీ? ఆ రమణీయ సౌందర్యము లాకాశ సౌధము వలె మాయమైనవి. 'పుట్టగొడుగు మతములు', అధికారములేని స్వాతంత్ర్యములు గతియైనవి. స్త్రీత్వము లేని స్త్రీ - మగతనము లేని మగవాడు - ఈ రాక్షస విలాసములు .... ఇదియేనా పరమార్ధము? ఈ భావములచే బ్రదుకే బంధమైనది. జీవచ్ఛవమై పోవుచున్న సమాజమును జూచి క్రుంగినాడు. కన్నీరు గార్చి బావురుమన్నాడు. దీనికితోడు దరిద్రము!" ('మా స్వామి'- 50వ పద్యము), దానిలోతన వైదుష్యము - స్వాతంత్ర్యము - మతిప్రతిభ అన్నియు కిం భాగ్యములై పోయినవి. అదృష్టము పూర్తిగా వక్రించినది. చేతికందిన పండు నోటి కందుట లేదు. ('మా స్వామి' - 43వ పద్యము) ఏ పని చేయబూనినను తనకన్న ముందే యచట శని యావేశించును. బ్రదుకునకు పరాపేక్ష తప్పినది కాదు. ఆత్మస్వాతంత్ర్యము పడనివ్వలేదు. ఈ రెంటి నడుమ పడలేక కడ కాశ్రయించినాడు. యాచన గొంతులోనే నిలచినది. స్తుతిపరమగు నీ సమాజమున కాతనివేధ యర్థము కాలేదు. ఎవ్వరు నాదరింప లేదు. ఛీ యనుకొన్నాడు. వైరాగ్యము శరణ్యమైనది. కాని వెంట ముడివెట్టు కొన్న 'తొడుగుకంప' వంటి యీ సంసారము? గుండెల లోతులదాక బెనవైచికొన్న యీ మమత? ఈ తెగువ లేని హృదయము? కుమిలి కుమిలి కులదైవమగు విశ్వేశ్వరు నాశ్రయించినాడు. ఆ శిలామూర్తి పలుకలేదు. తన మొఱ దేవునకు కూడ కాబట్టలేదా? నా వలె నీ దైవము కూడ "తీవ్రేర్ష్యామదాసూయ వాంఛాదుష్టాత్మ్మ డగునా? ఆ యాదిభిక్షున కేమియు లేదనుకొమ్ము. కాకున్న నిమ్మళముగా 'తనమైదీధితి' లోనైనను జేర్చికొనరాదా! నాతో ఈ ప్రళయనాటకమాడించుటేమి,

తాను తమాషా చూచుటయేమి? నేను గాబట్టని దైవముతో నాకు మాత్రమేమి పని? ఓయా! నిన్ను వచ్చిన కాడికే తెగనమ్మెదను, "రారమ్మని" యేలము పాడుటకు తయారైనాడు. మా తండ్రి చూపిపోయిన 'తెలి ఢిల్లీ భోగముల్ పందుచేను'. పలుక వేమని మందలించినాడు. పనవి యేడ్చినాడు. ద్వేషించినాడు. కౌగిలించు కొన్నాడు. తన్ను తన్నినాడు. దైవమది యంతయు నిర్వికారుడై చూచెనే కాని తీర్పలేదు. దైవము - ప్రపంచము రెండును తనకు ద్వేషులే యనుకొన్నాడు. ఈ మానవులు మానవులా? 'గోముఖ వ్యాఘ్రములు.' వీరికన్నను తమ నైజవృత్తిని స్పష్టముగా గనుపఱచు పెద్దపులులే మేలుగాదా? 'వింతల కోరల్ మిడిగ్రుడ్లు లేని దితి సంతానంబు' కంటెను ప్రత్యక్ష రాక్షసులు నయము. ఈ యభిప్రాయములతో "సర్వంబున్ ప్రతికూలమే యయినయోజన్ దోచు లోకంబు" అని తీర్మానించు కొన్నాడు. తాత్కాలికములగు నీ పరిస్థితులు మాత్రమే కా దతని బాధించునవి. నిత్యములగు సమస్యలును కొన్ని కద్దు. "సౌందర్య మచ్చముగా శరీర సంబంధికాదు గదా? మఱి యీ మానవు లాంగిక సౌందర్య మును జూచి యేల యింతగా మత్తెక్కెదరు?" అని పనవును. "పూవులు పుట్టుచున్నవి, రాలిపోవుచున్నవి. ఈ సౌందర్యమున కెక్కడ వినియోగ"మని యేడ్చును. "అప్పు లిచ్చిన వారాబాకీ తీర్పలేని వానిని పట్టి యెందుకు బాధింతురు? వాని శరీరమం దే మున్నది? వాని బొమికలు రత్నములా?" యని వాపోవును. మఱి యీ సమస్యల నెవ్వరు తీర్చు వారు? ఎట్లు తీర్చుట? ఈ వేదన కర్థము లేదు - అంతము లేదు. ఈ రీతి నిత్యనైమిత్తికము లగు నియమముల ననుసరించిన వేదనలతో బాధ పడినాడు. ఆ దుఃఖమే కవితయై తెనుగు నేలకు దక్కినది.

ప్రపంచము మంచి చెడ్డలకు నాటక రంగము. ఈశబలిత మగు సృష్టియందే సౌందర్యము - శాంతి యున్నది. కాని దాని నరిగించుకొనవలె నన్నచో సామాన్యమగు శక్తి చాలదు. మన వాఙ్మయము నంతయు వెదకినను నాకు గనుపించున దిట్టివారు కవులలో నిద్దరు. ఒకడు తిక్కన; రెండవ వాడు కాళిదాసు.

అందుకే వారిరువురి జీవితమంతయు హాయిగా పూల తేరుపై కదలినది. ఒక్కొకసారి కాళిదాసు మనల నూరార్చినప్పుడు ఆనందచకితుల మగుదుము. ఆ స్పర్శ యమృత హస్తము వలె నుండును. వాసనలు లేక రంగులు మాత్రమే మిగిల్చికొన్న కొండగోగుల జూచి యాతని మనస్సును దుఃఖపడకపోదు. కడ కొక ముక్కతో తన్నూరడించుకొని, ప్రపంచము నూఱడించును.

"ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం
పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" – కు. సం.

అపుడా మహాకవి హృదయమునందు జగదీశ్వరి యగు ప్రకృతి మాతయే పలుకుచున్నదా యనిపించును. అంతేకాని భవభూతి వలె –

"నైసర్గికీ సురభిణః కుసుమస్య సిద్ధా
మూర్ధ్ని స్థితి ర్న చరణై రవతాడనాని" (ఉత్తర రామచరితము)

అని తా నేడ్చి ఇతరుల నేడ్పింపడు. "మానవ జన్మమున ఫలము శాంతి. వైరుద్ధ్యములను సమన్వయించుకొని స్వరూపమును నిలుపుకొనుట యందే నిజమగు మానవత్వ మున్నది. ఏడ్చి యేమి సాధించినట్లు? సృష్టిలోని కొఱతను జూచినప్పుడు సహృదయునకు దుఃఖము గలుగుట స్వభావము. కాని సృష్టికి ఒక నియతి యున్నది. ఈ నిత్యసత్యమును మనము మఱువరాదు. భగవంతు డొసగిన దానితో తృప్తిపడక లేని దానికై పనవుట పేరాశగాక మఱేమి?"

ఇది కాళిదాసు వాదము. తిక్కనయందును ఇట్టి భావము లనేకములు గాన్పించుచుండును. వారు మనోవశులు. ఋషిత్వమునకు చేసాచిన కవులు. ఈ జ్ఞానమార్గ మాపాత కఠినమే! కాని పరమసత్యము. దీని ననుసరించుట సులభము గాదు. అందుకే కవులలో వీరి కనుసరణములు చాల తక్కువ. అందుకొనవలె నని యాశ యందఱకును కద్దు. కాని అది అందియందదు. దూరపు మ్రొక్కులు మ్రొక్కుదురు.

మన 'విశ్వనాథ' కవికి వ్యాసభగవానునితో నారంభమై భవభూతియందు

పండిన మార్గమే పట్టినది. ఇది ఆయన యొక్క మూలతత్త్వము. దీనితో బాటు ఆవంకగుణము లన్నియు గుదురు కొన్నవి. తాను మాయ నేర్వలేదు; నేర్చిన వారి జూచి యోర్వలేదు. ఒకరిని యాచింపలేదు; అడుగక యివ్వని దాతల జూచి యుపేక్షింపలేదు. సుఖము లనుభవింపలేదు; మానలేదు. తనకు సరిపోని ప్రపంచమును విడువలేదు; సరిపోని వానిని సహనముతో సహింపలేదు. ఈ రీతి జీవిత మొక నిప్పులకుంపటియై పద్యములు, పదములు గాక యూర్పులే ధారలుగా కట్టినవి. ఈ మహాకవి తన 'యాంధ్ర ప్రశస్తి'లో "ఎన్ని జన్మమ్ముల నుండి యీ తనువునన్ బ్రవహించెనో యాంధ్ర రక్తముల్" అని యాశ్చర్య పడినాడు. ఆంధ్రరక్త మేమోకాని 'వైదిక రక్తము' మాత్రము నిశ్చయముగా పారినది. 'భాస్వన్మత్పితృరక్త గౌరవ'మని సగర్వముగా చెప్పికొన్నాడు. తండ్రి తమ్ము "తన హస్తంబున పెల్లురేగిన మహాదాతృత్వ శౌర్యాగ్ని కింధనములుగా" జేసి వెళ్లినాడు. లేమిడి పెద్దల యాస్తిగా దక్కినది. దానిని గూడ – దానితో సంప్రాప్తించిన దారిద్ర్యమును గూడ ఆభిజాత్యముగా అన్వయించుకొన్నాడు. ఆనాటి శ్రోత్రియ కుటుంబములు, అగ్నులు, అరణులు, వేదఘోషలలో పలికిన పావిత్ర్యము – వీనిని దలచి కన్నీరు నించి "నా మాతృభూమి తేజోమహశ్చ్యుతిని బ్రహ్మక్షత్ర తేజమ్ము మంటగలసి" అని గొంతెత్తి యేడ్చినాడు. బ్రాహ్మణుడు చేసిన యుప కారమంతయు భస్మహోమమై బ్రాహ్మణు డన్నంత చీదరించుకొను సంఘమును జూచి "భూమీదేవుల దుష్టు లందురు జనమ్ముల్ చూడు విశ్వేశ్వరా!" అని ఫిర్యాదు చేసినాడు. కాలము లేదుగాని – తాను గూడ ఒక నన్నయయై రాజరాజ నరేంద్రుని వంటి ధర్మ ప్రభువు మ్రొక్కులు గొనుచు 'లోకహితనిష్ఠతో' నామ్నాయముల బలికింపవలెనని యాతని యాశ.

సత్యనారాయణగారికి వైదిక కవి నన్నయ యింటి దేవుడు. "ఏ దేశికవిత పాలించిన కవిరాజు నన్నయ వ్యాకరణంబు నందు సమసిపోయెనో!" అనునది యెన్నడో – యెప్పుడో అతనికి గలిగిన భావము, భట్టారకుని జటిలదీర్ఘ సమాసములు,

సంస్కృత సంప్రదాయసిద్ధమైన అన్వయ కాఠిన్యము మొదలగునవన్నియు తన కవితయం దచ్చుగ్రుద్దుకొనవలె నని యాతని దప్పి. ఆంధ్ర దేశమున ముఖ్యముగా సంస్కృతమును వైదికులును, తెనుగును నియోగులును పోషించిరి. నిజముగ నన్నయభట్టుకంటెను తెనుగుదనపుతీపి తిక్కనయందు వేయిమడుగులెక్కువ. కాని నన్నయ కవితలోని పోకడలు దప్ప, 'విశ్వనాథ' రచనలో తిక్కన తెనుగుతనము లేదు. 'కోకిలమ్మ పెళ్ళి'లో తెలుగు కోయిలను సృష్టించినాడుకాని తాను మాత్రము సంస్కృతపు చిలుకయే యైనాడు. పాపము! నవీనులకున్న పెద్ద చెడ్డ గుణము వ్యుత్పత్తి లోపము. వారికి భావము లున్నవి; భాష లేదు. దీనికి తోడు చిత్రవిచిత్రములగు పదచాపల్యములు! అధికారము లేని స్వాతంత్ర్యము! నియమము ప్రాతదైనను క్రొత్త దైనను దానిని సరిగా నిర్వహింపలేని యసామర్థ్యము! దానిని కప్పిపుచ్చుకొను దురహంకృతి! దీనితో 'నస్పష్టత' యను వింతతెవులు నేటి యాంధ్ర కవిత్వమునకు పట్టుకొన్నది. వారు వాడు పదములకును, మనస్సులోని భావము నకును సంబంధముండదు. కాని ఈ లోపము లొక్కటియు 'విశ్వనాథ'కు లేవు. వారి వైదుష్య మంతు లేనిది. సంస్కృత వాఙ్మయమును సమగ్రముగా పరిశోధిం చినాడు. వ్యాకరణ సూత్రములను వల్లె వేసినాడు.ప్రస్థానత్రయమును పాఠము చదివినాడు. ఇవన్నియు కొందరు నవీనుల వలె భాషాంతరీకరణముల సహాయమున జూచి చదివితిమని వెఱ్ఱి మొఱ్ఱి చేష్టలు చేయక ప్రాచీన గురువుల యొద్ద ప్రాచీన పద్ధతిలో చదివినాడు. భాసుని నుండి నీలకంఠదీక్షితుల వఱకు నున్న కవుల అనేకచ్ఛాయలు అతని రచనలో వాసించుచుండును. ఇక నాంధ్ర మందమా – ఆపోశనమే పట్టినాడు. నన్నయ నుపాసించినాడు. తిక్కనను సేమమడిగినాడు. శ్రీనాథునితో చేయి కలిపినాడు. పోతనను మ్రొక్కికొన్నాడు. రాయలనాటి వాఙ్మయమును చదివినాడు. ఆముక్తమాల్యద నామోదించి తెనాలి రాముని వియ్యమందినాడు. 'విశ్వనాథ' కలము సారించినపుడు వాఙ్మయ మహాత్ములయాత్మలు వచ్చి సైగలు చేయుచుండునేమో! పై రెంటికి తోడుగా నాంగ్ల భాష వచ్చినది.

విద్యార్థి దశలో విమర్శ దృష్టితో - సత్యదృష్టితో చక్కగ నాకలించినాడు. కాని యాంగ్ల భాషలో ప్రాచ్య హృదయములోని శాంతి - ఋషిత్వము అతనికి గోచరింప లేదు. "మనలో లేని క్రొత్తదన మిందేమున్నది? ఈ భౌతిక దృష్టి మన వారు నమలిపారవేసినదే గదా! ఈ పాశవిక శృంగారములో - ఈ విషయలంపటతలో నున్న యానందమేమి? దీనినేనా ఋషిసంతతియగు హైందవులు 'దాహ'మని స్వీకరించునది! అయ్యో! దేశమేమి యన్యాయమైపోయినది. మా హృదయముల సర్వనాశనము చేసినదే యీ యాంగ్లవిద్య." - ఈ భావముతో 'దొరలు దొంగ'లని నిర్ణయించుకొన్నాడు. ఇంతలో తన 'రంగని' వంటి పరదేశ శుష్క విద్యావాసితులు యువకులు బయలుదేరినారు. దానితో నింకను అసహ్యము పెరిగినది. "ఇంగ్లీషు నెందుకు చదివితి?"నని పశ్చాత్తాప పడినాడు. "తొందరగా మఱచిపోలేదే!" యని చింతపడినాడు. కడకు "నా మాతృభాష నానా దుష్టభాషల యౌద్ధత్యమును తలనవధరించి" అని యెదదలో పెగలినాడు. కనుక సత్యనారాయణగారి కవితలో పడిన యాంగ్ల భాషల పైమెఱుగులు తనకు తెలియక పడినవే తప్ప తెలిసి పడినవి లేవు.

విశ్వనాథ సత్యనారాయణగారి పరీక్ష మహా సునిశితమైనది. ఒక దృశ్యమును కాని, వస్తువును కాని, అతడు చాల తీవ్రముగా - తీక్ష్ణముగా జూచును. ఆ పరీక్ష సౌందర్యపు మేరలు కూడ దాటిపోవును. చూచినదాని నటులే ప్రత్యక్షము సేయ నాకాంక్షించును. అపుడు సౌందర్యము గౌణమై విషయ కార్కశ్య మేర్పడును. ఒక దానిని చెప్పినచో పాఠకుడింకెన్నడు మఱువనట్లు - మఱచిపోలేనట్లు చెప్పవలెనని యాతని యాశ. దానికి సాంకేతికమగు భాష పర్యాప్తము కాదు. అమితవేధ ననుభవించును. లెక్క లేనన్ని క్రొత్తపదములను సృష్టించును. (పోతు వెన్నెలలు, ఎడద కోసలు, గుండెల గూడులు) భాషను సుడులు ద్రిప్పును. (లోగొంతు రాగాలు, ప్రేమల బావియూట, అమృతము కూడుగట్టిన దొరా!) క్రొత్తవగు నుక్తులను కల్పించును. (లేదలిరు వెన్నెలలు, వెన్నెల చివుళ్ళు మొదలుగునవి)

ఈ విధమైన వేదనయే భవభూతి మహాకవి యందును గానబడును. సంస్కృత వాఙ్మయమున నింకెచ్చటను వినబడని వింత పదములను, విశేషణములను, భావములను మనము చూతుము. ఈ మహాకవి తీక్ష్ణదృష్టికి 'నిరాభరణతలో నొక సౌందర్యము' గోచరించినది. భవభూతికి సీతయందు వలె దేవదాసి గిరిక కన్నుల యందు భగవంతు డాడినాడు. వీరిరువురికిని స్త్రీ వ్యక్తి జగన్మాత.

'విశ్వనాథ' ప్రయోగములయందు మహాస్వతంత్రుడు. అపూర్వములగు పదములెన్నియో యాతని రచనలలో దొరలు చుండును. సంస్కృతములోని వైకల్పిప్రయోగముల నన్నింటిని పట్టుపట్టి వాడినాడు. (అగ్న్యాహితుడు, వాగ్నేతృత్వము) వారు వాడిన కొన్ని యాచ్ఛిక ప్రయోగములు వ్యాకరణము లింకను సాధింపవలసి యున్నది. లేక మనము గమనింపవలసి యున్నది. (క్రొత్త త్రవ్వి, చిక్క వెన్నెలలు, శీతలీకరింపించు). గ్రామ్య పదముల కెన్నింటికో గ్రాంథికత గల్పించినాడు. (మోస్తరు, మాద్రి) మఱి యొక్కొక్కప్పు డతిసాహసముగా 'అతి సన్నగిలు' వంటి పదములను గూడ వాడుచుండును. ఆ యావేశమున ఆయనకు శరీరము గూడ దెలియదు. దొరకిన పదమంతయు యోగ్యమే యగును. గ్రామ్య గ్రాంథిక విషయమున నీకవి కొక నిశ్చితాభిప్రాయము లేదేమో! ఇది రసలుబ్ధులగు రచయితల కనవసరము గూడ. కాని నేను మాత్ర మీతనిని పాత్రోచిత భాషావాది యనుకొందును. సంస్కృత వైదుష్య మందలి యభిమానముచే సత్యనారాయణగారు 'జానుతెనుగు' సొంపుల నభిమానింపలేదేమో! ఆయన భాష గీర్వాణ సార్వభౌమత్వము నంగీకరించినది. ఈ మాటలన్నప్పుడు వారికి తెనుగు వారి యనుభవము చాలదని నా తలపు గాదు. వారి యనుభవము "రావియాకుల చుట్టలు కాల్చుకొను పాలేరు బుడ్డవాండ్రు మొదలుకొని జమీందారుల వఱకును విరిసికొన్నది. కాని ప్రౌఢత్వ మతనికి స్వభావమైనది. చిన్నభావమైనను గొప్ప భాషలో జెప్పును. ఆ భాషాసంధిలో భావబంధము నిరికించినపుడు భావము మన కందుబాటులో నున్నదైనను ఎక్కడో ఆకాశమున కెగిరి అందుకొనవలసిన పదార్థముగా మారిపోవును. చూడుడు:

"పునుకల్ చూచిన కాజగడ్డలు ఫణు
　　　ల్పొల్పారు కాజాకులే
మనసౌ జాబిలి కాజపూ వెరుపు పె
　　　ల్లై సారమౌ దుబ్బు ల
ల్లిన యుండల్ మెయిబూది పూత తెలి ధి
　　　ల్లీ భోగముల్ చేను నీ
వనెదన్ మాపితృపాదు లమ్మని పొలం
　　　బౌ దీవు విశ్వేశ్వరా!"

ఇందులోని పదార్థము లెల్లను మన పల్లెటూరు వారు వాడుకొనునవే! మనమును చూచినవే! కాని యా పదముల తిరుగుడులో భావ మేదో క్రొత్తదై ప్రయత్న లభ్యమైపోవును. ఇట్టి చోటుల వారి పాండిత్యమునకు మన మెంత సంతసించినను "భావము దూరమైనదే" యను బాధ మాత్రము పోదు.

కొంద రీనాటి విమర్శకులు సత్యనారాయణ గారి శైలిలో సంగీతము (Music) లేదందురు. నాకు చూడ నీ ప్రశ్నయే అర్థమగుట లేదు. ఉచ్చారణయందు సౌందర్యము లేని పదమే లేదు. కాని దానిని వాడిన చోటునుబట్టి యా సౌందర్యము ప్రకృత బాధకముగనో, సాధకముగనో పరిణమించును. సత్యనారాయణ గారిలో రసానుభూతికి బాధను గలిగించుప్రయోగములు లేవు. అతని భాష 'లేతబుఱ్ఱలకు' పనికివచ్చునది కాదు; జటిలమైనది. వసంతకాలమున తిన్నగా కదలివచ్చు పువ్వుల వాసనవంటిది కాదు; మఱి కీకారణ్యమున విశంకటముగా దిరుగు మదగజముల గుంపు. పై రెంటిలో నెందులో సౌందర్యము లేదు? కనుక 'విశ్వనాథ'శైలిలో సంగీతము లేదనుటకన్నను అది తారశ్రుతిలో పలికిన దనుట తగినది.

ఈ మహాకవికి ధ్వనిదృష్టి చాల తక్కువ. ధ్వని యొక శిల్పము. దానిని చిత్రించుటకు నిలుకడయు, నెమ్మదియు కావలెను. ఆవేశపరవశులై పరుగెత్తు వారికి నిలుకడ యెక్కడిది? ఇతడే కాదు – ఈ తెగవారందరును రసవాదులే.

రసమునకును, ధ్వనికిని సంబంధము లేదా యను విచార మిట నప్రస్తుతము. రసవాదులలో పూర్తిగ ధ్వని లేకయే పోవునని నా యభిప్రాయము కాదు. బ్రతుకు నుండి ధ్వనివాద మంత దూరము గాదు. మఱి యావేశ పరవశులకు ధ్వని దృష్టి లేదంటినంతే!

'విశ్వనాథ' కావ్యము లన్నియు చదువగా రెండు మూడు చోటుల మాత్రమే నాకు ధ్వని గోచరించినది.

"అయ్యా! భక్తులపైని నీ కరుణ ది
వ్యాంభ స్తరంగాలతో
ముయ్యేరై ప్రవహించుగాని యెడ"

ఇచట నత్యంత సూక్ష్మముగ త్రిమూర్త్యాత్మక స్వరూప వస్తుధ్వని గోచరించు చున్నది.

"పతి వంక చూచుచూ
పడతి కిన్నెరసాని
పోయేటి వేళలో భూమి తనంతగా
తోరమై విరియుచూ త్రోవచేసిందీ"

పై గీతమున సీతా నిర్యాణము రూపమగు రామాయణ వృత్తాంతము వ్యంగ్యము.

"పఱుగెత్తెడు నీవేణీ
బంధము బూనితి చేతను"

ఇచట శాస్త్రీయముగా ధ్వనియైనను శ్లేషయనిపించుటగా నున్నది. ఇతడు ముఖ్యముగా వాచ్యకవి. భావతతీక్ష్ణతపై నున్నంత దాహము శిల్పముపై లేదు.

సత్యనారాయణగారి కావ్యములను చదువుచున్నపుడు అతనికి నియతమగు శైలి యున్నదా యని సందేహము కలుగును. వారి యుపాస్య దైవమగు నన్నయకే లేదు. అతని క్కెడ నుండి వచ్చును? దీనికి రసావేశమే కారణము. ఈ మహాకవి

మహాస్వతంత్రుడు. ఏ పోకడలైనను పోగలడు. భాషారంగమున నాతడు సవ్యసాచి. భావములయం దాతడు భగీరథుడు. గద్యము నందు గాని, పద్యమునందు గాని వారి శైలి విశ్వరూపముల నెత్తును. కాని తాను స్వతంత్రముగా నిలచి చెప్పునపుడు మాత్రము ఆనాటి భట్టారకుడే మనకు బ్రత్యక్షమగును.

"కాషాయ రమ్య పల్కల హుతాశన శిఖా
సంపిహి తాశ్వత్థ సామిధేని
భువన మోహన హేతు నవ వయః ప్రత్యూష
స్సమయ రోచిఃపూర్ణ చంద్రరేఖ
కుపిత శంకర నేత్ర కుహరాగ్ని దగ్ధ మ
న్మథ దేవునకును ప్రాణ ప్రతిష్ఠ
అమిత లావణ్య నీలాకాశ పశ్చిమా
శాచరత్స్రిత నూత్న జలద శకల
మొక్క ఋషికన్య"

సంస్కృత సమాసములు నిడుదలై మధురములై యున్నవి. వానియం దొక విధమగు లయ - తూకము ఉన్నది. ఈ లయ భట్టారకుని విశిష్టగుణము. శ్రీనాథుని సమాసముల వలె ఆర్భాటము లేదు. సంస్కృత సమాసములలో మందగతి యున్నది. వాని నుచ్చరించుచున్నపుడు ఆనాటి యౌవన మదాలసలగు వైదిక కన్యకలు అలవోకకు గంగాతీరమున దిరుగుచున్నట్లే యుండును. పైగా నన్నిటికిని స్వాతంత్ర్యమను ప్రభాతారుణమగు మైపూత గలదు. నన్నయలోని బహిరంగ సృష్టియే యిందును కలిసికొన్నది. భట్టారకుని కవిత్వమున సాంస్కృతిక సంప్రదాయము లెక్కువ. అతని పద్యముల నొక్కొకసారి సంస్కృత శ్లోకముల వలెనే అన్వయింపవలసియుండును. ఈ యలవాటే సత్యనారాయణ గారికి పట్టినది. వారి 'యాంధ్రప్రశస్తి'లో

"ఆ మధురంపు దృక్కు ఫల

మై యుదయించిన యీకుమారు ది
వ్యామృత వాహినీ మధుర
మౌ పసినవ్వులె నన్ను నిల్పె నీ
భూమిపయిన్ లతాంగి సుతు
పుట్టినతోనె గతించినన్ మునుల్
పో మృగరాజరూపమును
పొందు మటంచును శాప మిచ్చినన్."

ఈ పద్యమున్నది. దీనిని "సుతు పుట్టినతోనె లతాంగి గతించినన్, మునులు మృగరాజ రూపమును బొందుమటంచును శాపమిచ్చినన్", భూమిపై నన్ను నిల్పె"నని యన్వయించు కొనవలెను. ఈ పద్ధతి జూచినప్పుడు సంస్కృత సాహిత్య సౌరభములు దీనియం దెంత పండి ఫలించినవో పాఠకు లూహసేయగలరు.

"నీ కర్పూరపు ఖండముల్ భుజము లందింపన్ గదోయి?" ఇక్కడ 'నీ' యనుదానికి భుజములతో నన్వయము. నడుమనున్న విశేషణము 'నీ కర్పూరపు ఖండముల్' అను దానిని దాటించి యన్వయించు కొనవలెను.

"ఆ వసంతా రామమ్ములలో పికమ్ములొలికెన్
ద్రాక్షారసాంభో నిధుల్"

ఇచటి 'ఒలుకు' అను శబ్దమునకు వెంటనే 'చల్లిపోవు' అను నర్థము స్ఫురించును. అప్పుడు 'పికమ్ములు' అను దానితో సరిగా నన్వయింపలేదు. శబ్దరత్నాకరములో చల్లు, పోయు అను నర్థములు కూడ నివ్వబడినవి. కాగా 'ఒలుకు' అను పదములో 'ఒలికించు' అను నర్థమును ఉన్నదన్న మాట. ఎటులైనను 'ఒలుకు' అను పదమునకు ఝుడితి స్ఫూర్తి మాత్రము లేదు.

నన్నయ సమాసముల వలెనే వీరి సమాసములును చాల నిడుదలు. ఒక్కొకసారి పద్యమునందలి రెండుమూడు పాదములను కూడ త్రోసికొని ప్రసరించును. 'శృంగారవీధి'లో కొన్ని పద్యములలో నొక సమాసమే నాల్గు

పాదములకును నడిచినది. సాధారణముగ రెండు పాదములైనను నాక్రమింపని సమాసము లరుదు.

అతని భావములే చాల నూతనములు. సృష్టి యంచులలో నుండి ప్రయత్నపడి పదార్థములను గొని తెచ్చును. 'ఓ చలి తేంద్ర నీలధనురుజ్జ్వలమూర్తి!' అను తీక్ష్ణదాహ మాతనికే కలదు. వాడు నలంకారము లన్నియు క్రొత్తవే! 'నూత్నత'యను పదార్థము లేని దీతడు కలమే పైకెత్తడా యనిపించును. తీక్ష్ణ ముగ నాలోచించు మెదడున్నది. భావించు హృదయమున్నది. తోచిన దానిని వెల్లడించు వైదుష్యమున్నది. చాలని దానికి సృష్టించుకొను సాహసమున్నది. ఆతని కేమి తక్కువ? విశ్వేశ్వరుని 'గళరుద్రాక్షీ భవద్బాడబా!' యని సంబోధించినాడు. 'ఆంధ్రప్రశస్తి'లో –

"........ శుక్తిమతి
తొంగలి ఱెప్పలబోలియున్న నీ
కనులకు నాంధ్ర దేశమది
కైవసమయ్యెనురా కుమార కా!"

అని దీపకర్ణితో బలికించినాడు. ఇట 'కుమారకా' యనుచోట నల్పార్థమున 'కప్' ప్రత్యయము. దానితో దీపకర్ణిలోని ప్రేమ మొదలుగునవి వ్యంగ్యములు. కాని 'కనులకు కైవసమగుట' మనకు నేరుగా క్రొత్త భావము. ఇట్టి విచిత్రపు పోకడ లెన్నియో కలవు. 'ఆంధ్రప్రశస్తి'లోనే –

"నీ కోదండ వినిర్గతాశుగ మహా
గ్ని జ్వాలలన్ దట్టమై
యేకోనల్ల హిమింపగా బడెడు తం
డ్రీ! యవ్వి శ్రీకృష్ణ వే
ణీ కల్యాణ పృషత్పరంపరల శాం
తిన్ సస్యవంతంబులై

ద్రు కేదారములై తగున్ విజయ ల
క్ష్మీ కేశబంధంబులై"

అని దీపకర్ణి పలుకుచున్నాడు. ఇది చక్కని ప్రౌఢోక్తి. ప్రాత క్రొత్తల నడిమిత్రోవ. ఇందులో నొక లోకాచారమును మూలముగా దీసికొని ఈ మహాకవి తన సామర్థ్యమును వెలయించినాడు. కేదారములను 'విజయలక్ష్మీ కేశబంధము' లనుట రమణీయమగు స్వాతంత్ర్యము.

ఇతనికి చంద్రుడు 'వడగట్టిన యెండు గంధపున్ బెఱడు' వలె గనపడినాడు. సముద్రుడు 'చీకటిలో మరణవేధతో మూల్గుచున్న దున్న'యైనాడు. దేవదాసి పలువరసలు 'సుదర్శ నాయుధపు టంచు'లుగా మారినవి. ఇట్టివి లెక్క లేనన్ని గానబడును. అతడు 'కిన్నెరసాని'లో వాడిన యుపమానమలు జూడుడు: పారుచున్న కిన్నెర –

"పదువు గట్టిన లేళ్ల కదుపులా తోచింది
కదలు తెల్లని పూల నదివోలె కదలింది
వదలు తెల్లని త్రాచుపడగలా విరిసింది

తొడిమ యూడిన పూవు పడతిలా తోచింది
కదు సిగ్గుపడు రాచకన్నెలా తోచింది
బెడగు వోయిన రత్న పేటిలా తోచింది"

అత్యంతము నూతనము లీ యుపమానములు. ఇట్టి వక్కడక్కడనే కాదు, వరుసబెట్టి యెన్నినూరులైనను వాడగల ప్రౌఢి యాతని కున్నది. స్వాతంత్ర్య మాతని కొక క్రీడ – జన్మహక్కు. అది యన్నిట వ్యాపించుటచేతనే జీవితమున కష్టములు తప్పనిసరియైనవి.

కొన్ని భావముల నాతడు వాడినప్పుడు పదసంపత్తి యున్నను – పర్యాప్తముగ నున్నను మనకు దృశ్యమే ప్రత్యక్షము గాదు. దీనికి కారణములు రెండు. మనము

బొత్తిగా నలవాటే పడని భావ నూత్నత యొకటి; ఆ భావములను లగింప జేయుటకు కోడెత్రాచువలె చుట్టలు చుట్టు కొన్న భాష. ఈ రెండును మనలను దూరముగా నెట్టివేయును. నిట్టూర్పుతో వెనుకకు మఱలుదుము.

సత్యనారాయణగారు మహారసావేశి. ఆ యావేశమున వారికి శరీరమే తెలియదు. పదములు, భావములు అవశములై దొరలవలసినదే కాని వెనుకముందులు జూచికొను నిలుకడ లేదు. దీనితో నొక భావము పూర్తియగు లోపలనే మఱియొకటి సందు చేసికొనును. ఒక్కొకసారి పాదమునకొక భావముం డును. వీని నన్నిటిని సమన్వయించికొనుట చాల కష్టమగును. కాని యిట్టివి అపూర్వముగా కనబడును. నరముల కంటిన వైదుష్యము – జన్మమున కంటిన ప్రతిభ – బ్రదుకున కంటిన స్వాతంత్ర్యము మహాకవి తలచుటకు ముందే తమంత తామే పైబడి దూకును. వీరి రసావేశమును గమనించినపుడొక్కొకసారి మనకు నవ్వువచ్చును. ఇట్టి జీవి ప్రపంచమున బ్రతుకగలడా యనిపించును. 'ఆంధ్రప్రశస్తి'లో నాతడనుట చూడుడు:

"ఈ నాపదార్పిత క్షోణి నేరాజు ధ
　　　ర్మాసనం బుండి స్మృత్యర్థ మనెనొ!
ఈ నాదృగావృతంబైన భూములలోన
　　　నే శౌర్యధనులు శిక్షింపబడిరొ!
ఈ నాశరీరమం దివతళించిన గాలి
　　　యెంత పౌరాతన్య మేచుకొనెనొ?
ఈ నాతనూపూర్ణమైన యా కాశమ్ము
　　　నేక్రతుధ్వనులు శబ్దించినవియొ"

అచటి గాలి, నీరు, వాన, కడకు చీమ – అన్నియు నాతనికి మాననీయములే! ఆకాశమున క్రతుధ్వనులు శబ్దించినవట. ఆకాశము శబ్దగుణము. ఈ క్రతు ధ్వనులలో నతని శ్రోత్రియత చక్కగా వాసించినది. కవి యెంతగా లీనుడైననో

తప్ప ఈ తన్మయీభావనము గుదురదు.

ఇట్టి రసవాదమునకు జెందిన భావము లెన్నియో ఈ మహాకవిలో దొరలుచుండును. 'కిన్నెర' రాయిధైన తన ప్రియుని జూచి,

"నాకు మల్లే నీవు నదివోలె పారరా
జలముగా యిద్దరము కలిసిపోదామురా
కెరటాలు కెరటాలు కౌగిలిత్తామురా!"

అని వాపోయినప్పుడు ఆ యాకాంక్షకు – ముగ్ధతకు మనమేమి రసస్వరూపమే పులకరించును. తన్మయీభవనము 'విశ్వనాథ'కు వెన్నతో పెట్టిన విద్య. గాఢముగా భావించును. తీవ్రముగా మననము చేయును. పూర్తిగా తన్ను మఱచును. "నీ నిష్ఠాగతి నీవుగాక మరి లేనేలేను విశ్వేశ్వరా!" యనినాడు. ఇది యాతని తన్మయీభవన పరాకాష్ఠ. ఒక్క విశ్వేశ్వరునేకాదు – ప్రతివస్తువును భావించినప్పుడు ఆతడు "శిలవోలెన్ గదలంగలేక హృదయస్నిగ్ధార్ద్ర సద్భావనాఖిల చైతన్యుడై" పోవును.

ఆతని తన్మయీ భవనము, తీక్ష్ణత యింత గాఢముగా హత్తికొనియుండుటచే ఆతనిలో తేలికభావముల కవకాశమే లేదు. ఏది చెప్పినను గాఢముగా – మనస్ఫూర్తిగా వివరించును. అతని రాగద్వేషములు – ఈర్ష్యాసూయలు గుండెల లోతుల నుంచి వచ్చినవే కాని తెచ్చి పెట్టుకొన్నవి కావు. వైభవక్షతమైన తెనుగునేలను జూచి –

"తెలుగు నదులెల్ల పొంగెత్తి ప్రళయవారి
కెరలిపడి తెన్గునేల ముగించనిమ్ము!
నేటితో సస్వతంత్రతా నియతమైన
యీ బ్రదుకు తెన్గువారు భరింపలేరు"

అని యన్నచో నా భావము హృదయపూర్వకముగా భావించినదే కాని 'జంభపు' చేష్ట గాదు. 'విశ్వనాథ' పుస్తకములను చదువుట కొక ప్రత్యేకాధికారము గావలెను. దారిబోవు వారి కంతయు నవి యర్థము కావు. కనుక "మా కర్థము కాలే"దని విమర్శించినచో లాభము లేదు. వారి కావ్యములే గాదు – మహాకవుల

కావ్యము లన్నియు నింతే!

తెనుగుదనమన్న నాతనికి మహాగర్వము. తానెన్ని జన్మములైనను తెనుగు నేలలో దెనుగువాడుగా బుట్టవలెనని ఆశ. అవకాశము దొరకినప్పు డంతయు తెనుగు పిట్టలు, తెనుగు పాటలు, తెనుగు నదులు అని కలవరించుచుండును. ఆంధ్ర రాజుల వైభవమును దలచినప్పు డాతని రక్త ముడుకెత్తును. "నే డది లే దే" యని యలపరించిపోవును. నాటి తెనుగు నేలలో "కడిగి యచ్చుటి మట్టి గడ్డలు సైతమ్ము నవమృగీమదవాసనలు" విగిర్చినవట. ఇంతయభిమానమున్నను అతనికి పాపము తెనుగుతనమంటలేదు. మరి కవిసి కొన్నది యాంధ్రత్వము. చిక్కని జాతీయములు – పూలగుత్తుల వంటి యాచ్ఛికములు 'విశ్వనాథ' శైలియందు కానము. వారి శైలి సంస్కృత సమాసముల బరువున భుగ్నమైనది. ఇట్టి శైలియే వారికి తగినది. లేకున్న నీగభీరములగు భావములు సుకుమారమగు భాషయందు లగింపక ద్విజేంద్రుని సాంఘిక నాటకముల గతియే పట్టియుండును.

సత్యనారాయణగారి రచనల యందు హాస్యము తక్కువ. బ్రదుకునందు లేని హాస్యము భావమునందు మాత్రమెక్కడ నుండి వచ్చును? కాని యంతటితో నాగడు. అంటని తెనుగుతనమునకు వలెనే అందరాని హాస్యమునకు గూడ యత్నించును. కొన్ని యెడల నపహాస్యమునకు గూడ యత్నించును. కొన్ని యెడల నాహాస్య మునందును తీక్ష్ణతయే నిలచి కలుగుచున్న కాసంత నవ్వును పోగొట్టును. అతని నవ్వు రంగుపూవుల వంటి వాసనలేనిది. తన్ను చూచి తనకే నవ్వు. నిష్ఠురమగు ప్రపంచము నాశ్రయించి బ్రదుకవలసిన భాగ్యము తనకు బట్టెనే యని తోచక నవ్వెడు, వెకిలి నవ్వు. భవభూతి మహాకవి నవ్వు కూడ ఇట్టిదే! ఇంతకును నిజముగా సత్యనారాయణగారి నవ్వు ఏడువలేని నవ్వు. అతని హాస్యము చూడుడు:

"ఓ సామీ! అల కొండకోయెతకు నీ
యొ య్యార మే బూది పూ
తే సర్వం బయి, నీకు నాయమ సొబం

గే నచ్చి కన్నారు ర
య్యా! సంతానము నేన్గమో మొకడు విం
తౌ నార్మొగా లొక్కడో
హో! సౌరాపద కాకరుం డొక డదే
మో కాని విశ్వేశ్వరా!"

నా కీ పద్యమును జూచినప్పుడు నవ్వు రాలేదు. 'మహాకవి' కీ యింత చాపల్యము లేకున్న బాగుండదా యను పశ్చాత్తాపమే కలిగినది. ఈ హాస్యము జీవితమునందు, రచనయందును లేకపోబట్టియే వీరి సంభాషణములలో శక్తి – కాదు, రక్తి తక్కువ.

ఆంధ్ర సాహిత్యమున సత్యనారాయణగారు తాకక విడచిన మార్గము లేదు. ఖండకావ్యములు, మహాకావ్యములు వ్రాసినారు; వ్రాయుచున్నారు. కథలు, నవలలు రచించినారు. గేయ కావ్యములను పాడినారు. వారు వ్రాసిన చాటువులలో గేయములు, ఇంకను స్వతంత్రముగా నున్న పదకవితలు ఎన్నో యున్నవి. వీనిలో ప్రాత క్రొత్తల నడిమి దారిని సమన్వయించుకొనుటలోని బాధ కొద్దిగా నున్నను విశిష్టత మాత్రము లేకపోలేదు. వారి పదరచనలలో చక్కగా పండినవి 'కిన్నెరసాని పాటలు.'

దీని యందలి కథావస్తువు వారు స్వయమేగా తయారు చేసికొన్నదే! ఇందు కాధారముగా నున్న వస్తువులు రెండు: ఒకటి భద్రాద్రి దగ్గరి కొండ– ఆ కొండను చుట్టుచున్న ప్రవాహము. ఆ యేరే యీతని రచనలో 'తెనుగుసాని' యైనది. ఆ గుట్ట 'తెనుగుమగ'డైనాడు. ఈ రెంటిని తోడుదీసికొని యొక తెనుగు వారి కాపురమును ప్రత్యక్షమొనరింప బూనుకొన్నాడు కవి. ఈ సన్నివేశమును చూచినప్పుడు పెనుగొండ యందలి 'బృందా వనము' చూచి శుక్తిమతీ కోలాహల గిరికాపాత్రములు సృష్టించిన భట్టుమూర్తి నాకు జ్ఞాపకమునకు వచ్చినాడు. ఒకటే దృశ్యము రెండు హృదయములలో – భిన్న రీతులతో భిన్న లక్ష్యముల కాధారమైనది. ఇరువురును కాలమునే యనుసరించినారు. అతడు పాండిత్యమును గ్రుమ్మరించి మెదడును

వంచి భళీ యనిపించు కొన్నాడు. ఇతడు తాను వాపోయి పరితల నేడిపించినాడు. రసనాళముల దాకి రసము యొక్క మేరలు తడవినాడు. 'కిన్నెరసాని' రసాకృతి. అందుచే నామె 'ధునీ'వైఖరి బూనినది. మగడు 'శిలాహృదయు'డగు మగవాడు – రాయి యైనాడు. ఇరువురకును గలిగిన దొకటే దుఃఖము. సంభవించినది భిన్నపరిణామము. అట్లు గలుగుటకు కారణమేమి? స్త్రీ పురుష జన్మల మూలతత్త్వమునం దున్న దీభేదము. ప్రకృతి రూపిణియగు స్త్రీ రసాకృతి. ముగ్ధలలిత స్వరూపిణి. పురుషుడు స్త్రీ కన్నను గంభీరుడు, ఉదాత్తుడు. వాని హృదయము దుః ఖముచే పగులునే కాని పాఱదు. ఈ దృశ్యమును జదువుచున్నప్పుడు ఉత్తరరామ చరితములోని –

> "అనిర్భిన్న గభీరత్వా దంతర్గూఢఘనవ్యథః,
> పుటపాక ప్రతీకాశో రామస్య కరుణో రసః"

అను శ్లోకము జ్ఞప్తికి వచ్చినది. ఈ భిన్న తత్త్వ రహస్యము నెంత సునిశితముగా నర్థము చేసికొన్నాడు 'విశ్వనాథ.' దీని నింకను చక్కగా మధుర భావకపులగు చైతన్యుడు, సూరదాసు మొదలగు వారు గమనించిరి. దానిని బలవంతముగ తొలగించుటకు హృదయపూర్వకముగ యత్నించిరి. అందియందని యా యనుభూతికై వేకారి యేడ్చిరి. వారి కవితయంద దీతీవ్రావేదనయే ధ్వనించును.

'ఆంధ్రప్రశస్తి'లో వలెనే 'కిన్నెరసాని' పాటలయందున రసావేశము గట్టు లొరసి పారినది. కిన్నెరసాని దుఃఖమున కొక వనమే కాదు తెలుగు వారి బ్రదుకులన్నియు పాటయై పోవును. ఇది యొక విలక్షణ కావ్యము. ఒక ప్రత్యేక రచనా పద్ధతికి దారితీయు ననుటలో సందేహము లేదు. 'విశ్వనాథ' – కిన్నెరసాని ఈ రెండును అనుస్యూతములై యాంధ్ర సారస్వతమునందు నిక్కచ్చిగా నిలువగలవు.

సాంకేతికమగు కావ్యదృష్టితో చూచినపుడు 'కిన్నెరసాని'లో పులుముడు లెక్కువ. అందుకే దానిని చదువరాదు – మఱి పాడవలెను. కంఠమెత్తి పాడినపు డాయామ్రేడితమే సౌందర్యముగ మారి భావదృష్టికి తోడువడును. "ఓ నాథ! ఓనాథ!"

యని నాలుగు సారులన్నప్పుడు, ఆ నాల్గుసారులును వివిధ స్వరములతో మేళవించినప్పుడు పదమొక్కటియైనను అనేక భావములు రాగమునకన్నను స్పష్టములై కానుపించును. దీనితో 'లీనత'యను ధర్మమెక్కువయగును. ఇతర కావ్యములకును, గేయకావ్యములకు నున్న భేదములలో నిది యొకటి.

ఒక్కొక్కసారి ఈతడు భావములు క్రమముగా బరిపోషించి సింహావలోకన న్యాయమున వెనుకకు చూచును. ఈ పద్ధతిలో పూర్ణ తన్మయీ భవనమునకు దారి యున్నది. వాక్యము పూర్తిగాక నిలచినప్పుడు ఎంతటి మూఢునకైనను వెనుక దిరిగి చూడవలసి వచ్చును.

"జలదేవతలు వచ్చి
నెలత కిన్నెరసాని
పదమంచు పదమంచు బలవంత పెట్టంగ
మతిమతి పతి చుట్టు తిరిగి కిన్నెరసాని
వలవలా యేడ్చింది పలపలా కుందింది"
"జలదేవతు వచ్చి
చంపెట్ట పతిగుట్ట
విడలేక విడలేక పడతి కిన్నెరసాని
చనలేక చనలేక చాన కిన్నెరసాని
పోలేక పోలేక బాలకిన్నెరసాని"

క్రింది చరణములలో నన్వయము ముగియలేదు. అసంపూర్ణమై నిలచినది. దీనితో మనకు తెలియకనే రెండవసారి "వలవలా యేడ్చింది పలపలా కుందింది" అని పై దాని ననుసం ధించుకొందుము. క్రింది చరణములలోని భావమంతయు నొక్కసారి పై దానికి లంఘించును, మీ మాంసకుల పరమాపూర్వము వలె రెట్టింపుగా రసము చర్వణావిషయమగును.

ఈ క్రింది దానిలో రాబోవు కథను సూచించుచు నాటక లక్షణమును

వెలయించినాడు. కిన్నెరసాని

"ఎదదలో నెదురైన

బెడదలో కష్టాల

కదలియే కలగాంచెనో!"

దీనికి తరువాత 'కదలిపొంగు' వర్ణింపబడుచున్నది. కావ్యమంతయు రోకటిపాట వలె గాక విషయభేదమును బట్టి గేయముల మట్టులును మారినవి.

ఇది యెంత గేయకావ్యమైనను దీనియందును –

"ఈ తరగల కదలికలో

నీ తరుణీ! నీ కంఠ

శ్రీతారుణ్యము తోచగ

పోతివటే పరుగులెత్తి"

అన్న కవికి స్వభావసిద్ధమైన ప్రౌఢోక్తులు వలచినవి. అట్టి యెడ సాధారణుడైన యొక సంసారి గాక యెవడో యుదాత్త నాయకుడు తలపోయుచున్నటులుండును. అనగా అచ్చపు కావ్యదృష్టి నాసించు నన్నమాట.

'కిన్నెరసాని' నే కావ్యములలో చేర్చవలెననుట యొక ప్రశ్న. ఇది పాశ్చాత్య విమర్శకులకు దుఃఖాంతము. ప్రాక్తన ఋషులకు మోదాంతము. మానవ జీవితమునకు లాలసత ముఖ్యము కాదనియు, సమస్త భారములను భగవంతునిపై వైచి నిత్యశాంతి ననుభవించుటయే ఫలమనియు బోధించుచున్నాడు. వైషయికమైన యనురాగము అంతకన్నను తీవ్రమగు – పవిత్రమగు భక్తిగా మారినది. జీవిత ములంతరించినచో దైవిక గుణమగు ప్రేమ నశింపదనియు, అది నిత్యమనియు ఘోషించినాడు. నిష్కల్మష ప్రేమకు భగవంతుడు దగ్గఱనే యుండునని చాటినాడు. కిన్నెర, దాని మగడు బ్రదికి పవిత్రులు, చచ్చి పవిత్రతరులు నయినారు. ఇంక నీకావ్యము మోదాంతము గాక మరేమి?

ఇక వీరు వ్రాసిన నవలలు – వీని యందు 'నేను జూచినవి మూడే. ఈ

మూడును కావ్యదృష్టికి నవలలుగా గాక కావ్యములుగా గోచరించినవి. సత్యనారాయణ గారు నవలలు వ్రాయుట భవభూతి నాటకములు వ్రాయుటవంటిదే! నవలకు కావలసిన పద్ధతి(Technique) లేదు. మన వారు నాటక రచనము సాహిత్య మునకు ప్రధానపట్టముగా నిర్ణయించిరి. నాటకకారుడు సహస్రాక్షుడు కావలెను. హృదయమును సంపూర్ణముగా నదుపులో నుంచుకొన్న ఋషికి నాటకరచన సాధ్యము. తన్ను మఱువనీని తన్మయీభవనము కావలెను. ఈ రెండు ధర్మములును ఆవేశపరులకు సామాన్యముగా నంటవు. ఈ రెంటిని సమన్వ యించుకొన్న వారు నాకు తోచినంతవఱకు భాస కాళిదాసు; దిఙ్నాగునివంటి మరికొందరు. తక్కిన వారికి సార్వత్రిక దృష్టి యున్న రస సిద్ధి లేదు; రససిద్ధి యున్న వశిత్వము లేదు. భవభూతి నాటకములలో పరిమాణములోని మితి (Sense of propotion) తక్కువ. దీనికి మాలతీమాధవము ప్రబల సాక్ష్యము. ఇక రససిద్ధి లేక పాండిత్యమును గ్రుమ్మరించి తృప్తిపడు నాటకర్తలు సంస్కృతమున నెందరో కలరు. నవలలు, కథలు మొదలగు వానికిని, నాటకమునకును మేరువంత భేదమున్నది. ఇవి నాటకములంత గొప్ప పదార్థాములు కాకపోయినను ఆ తెగలోనే చేరిన వస్తువులు. వానిని రచించుటకు నాటకకారుని వంటి మనస్తత్వమే కావలెను. 'విశ్వనాథ' మహావేశి. మఱి యతని గ్రంథములు కావ్యములు గాక నవల లెటులగును? కాకున్నను చింతలేదు. కావ్యములుగా, అఖ్యాయికలుగా చదివి యానందింతుము.

'చెలియలికట్ట' యొక యనర్ఘమగు రచన. ప్రారంభము మొదులుకొని చివర వఱకు నొక యాత్మవేదన ఛాయారూపమై పాఱినది. మన యువకులు ఎన్ని యపసిద్ధాంతములకో యెఱయగుచున్నారు. పాశ్చాత్య విద్య ప్రాచ్య హృదయము యొక్క పునాదులనే కదలించి వేసినది. ఆదర్శములన్నియు క్రొత్తగా నిర్మింపబడుచున్నవి. అవి హిందూ హృదయమున తయారైనవి కావు. మఱి దిగుమతి సరకులు. వీని ధాటి కెందరో యువకులు నైతికముగ పాడైపోవుచున్నారు. చిన్న, పెద్ద యను తారతమ్యజ్ఞానమే నశించినది. ఎవ్వడైననేమాటైన వాడవచ్చును.

అధికార వివక్ష లేదు. అనుభవములచే పండని నూతన సిద్ధాంతముల నఱిగించుకొనలేక – విడువలేక సంఘ మజీర్ణరోగముచే బాధపడుచున్నది. వీనిచే తీవ్రపరిణామములు కలిగి దారుణతర ప్రళయమునకు దారిచూపుచున్నది. దాస్యమును గౌరవముగా ననుసంధించుకొను చున్నాము. ఈ విషమ స్థితుల నరికట్ట గ్రంధకర్త సర్వవిధముల యత్నించినాడు.

వీరి నవలలు చదివిన యువకులు "విశ్వనాథ కేవలము పూర్వాచార పరాయణుడు. (Conservative) విశాలదృష్టి శూన్యము. అట్టి వారు మన దేశమునకు నేటి పరిస్థితులలో పనికిరా"రని తీవ్రముగా వాదింతురు. ఈ వాదమునందు కొంత సత్యము లేకపోలేదు. కాని యామాత్రమునకే యాతని త్రోసివేయుట మాత్రము కృతఘ్నత, నిజమే! గ్రంధకర్త హృదయ మున్న వాడు. ప్రాచ్యభాషల – యభిప్రాయముల గౌరవము గురుతించినవాడు. మనవంటి బానిస గాడు; స్వతంత్రుడు. అతని కీ కలుగుచున్న దుష్టపరిణామముల జూచి హృదయము మండినది. మన జాతీయతా స్వరూపమును వ్యక్తీకరించి బుద్ధి జెప్పబూను కొన్నాడు. దానిలో తనకు తెలియకయే కాసంత యభినివేశము సందుచేసికొన్నది. నేడు ముఖ్యముగా మన సంఘమున కిటువంటి రచయితలు గావలయును. 'మాది' యను అహంకారము చచ్చి నందువలననే మన జాతి క్షీణించుచున్నది. ఈ యహంతను రెచ్చగొట్టవలెను. అతని (Conservatism) (ఛాందసము)నకు క్షమాపణ యున్నది కాని మన (Extremism) (అతి) మాత్రము జాతి ద్రోహము – దేశద్రోహము. ప్రపంచ మంతటిని ప్రేమించు విశాల దృష్టి గలవారు నికరముగా సన్యసింపవచ్చును. వారికి స్వరాజ్యము మాత్రమెందుకు, బ్రదుకు మాత్రమేల?

కొందరీరీతి వాదింతురు: "సత్యనారాయణ గారు ఎదుటివారి దుర్బలాంశముల మాత్రమే యెత్తి ఖండింతురు. కొంచెము దృఢములుగు వాని జోలికి పోరు. వానిని దడవినచో తమ సనాతన వాదము నిలువదేమోనని వారికి భయము." నా కీ ప్రశ్నయే అర్థము కాలేదు. అంశములలో నివి దుర్బలములు, ఇవి సబలములు నని యెవ్వరును పట్టీ వ్రాయలేదు. ఎదుటి వారి వాక్చాతురి

మొదలగు వానిని బట్టి సబలము దుర్బలము కావచ్చును. దుర్బలమైనను బలవంతము కావచ్చును; ఒకవేళ నీ విభాగమున్నదే యనుకొనుడు. దుర్బలాంశముల నెత్తి "యెదుటి వారిని ఖండించెనే పాపము" అను నా యింత సానుభూతియు మనయందే యుండరాదా! పోనిండు. దుర్బలాంశములను వీరు ఖండించినారు. సబలాంశముల నింకెవ్వరైన ఖండించిన "అధిక స్యాధికం ఫలమ్" అందరు సబలాంశములనే ఖండించినచో నాటికి మరల ఈ దుర్బలముల సబలములై కూర్చొనవా?

"సత్యనారాయణ గారికి శాస్త్రీయ విజ్ఞానము లే"దను టొక వాదము. దీనికిముందు 'శాస్త్ర'మను పదమును ఏ యర్థమున విమర్శకులు వాడిరో తెలుపవలసి యున్నది. ఇంతకు నిది గాలి ప్రశ్న. పూర్తిగా వివరింపనిది యుత్తరమిచ్చుట కష్టమే. సత్యనారాయణ గారిలో ప్రాచ్యులలవాటు పడిన శాస్త్రజ్ఞాన మున్నది. అతని వచన రచనలో చిక్కని తర్కమున్నది. తాను తలచుకొన్న యే యభిప్రాయమునైనను నాతడు మట్టసముగా గ్రుక్కుమిక్కనక ఇతరులచే నొప్పించును. అతని దొక వాదము చూడుడు. సాధారణముగ నింగ్లీషు చదివిన వారు "మడు"గను మాట కర్థమే లేదు. మడుగేమిటి? పరిశుభ్రమగు గుడ్డ గట్టుటయే నాగరికత" యని గద్దింతురు. "పరిశుభ్ర వస్త్రధారణమే నాగరికత యైనప్పుడు – ఆ వస్త్రమును గట్టుకొన్నప్పుడు పర స్పర్శయే లేకుండుట యింకను నాగరికత కాదా?" – ఇది సత్యనారాయణగారి పంథా. దీనికి మన యువకులేమి బదులొసగెదరో చూడవలెనని నాకు కుతూహలము.

'విశ్వనాథ'గారి వచనము రచనము గాదు – మఱి కవిత. అనగా గద్యమునకు కావలసిన గుణముల కంటె పద్యమునకు వలయు భావన, ఆవేశము ముందు నడుచును. వారి 'వేయి పడగ'లను చదువుచున్నపుడ నేనొక మహా కావ్యమును జదువుచున్నాననుకొంటిని. శయ్యా సౌభాగ్యము, సమాసములలోని తూకము, నన్నయ కవితారీతులు – అన్నియు ప్రత్యక్షమగు చుండును. నన్నయయన్న నాతనికి పిచ్చి. అక్షరమక్షరము నాతని ననుసరింప నావేశము. "తగులును లేక తప్పును" నతడు; తీరుగా "తగులును లేక తగులదును" (వేయిపడగలు) అని భట్టారకుని వలెనే ప్రపంచించును.

వారి వచనమునం దనేక శయ్యలున్నవి. ఒక్కొకసారి సన్నయవలె దీర్ఘ కోమలములగు సమాసముల వాడును. తిక్కన వలె విఱుపులు విరుచును. శ్రీనాథుని వలె బిగువైన పదాటోపమును జూపును. పోతన వలె గలగలమను సమప్రాసములతో మధుర లాస్యము లాడును. పెద్దన వలె శిరీష కుసుమ కోమల వైదగ్ధ్య మును నెఱపును. రాయల వలె మారుమూల పదముల బగుల గొట్టును. తెనాలి వాని వలె ఉద్దండశైలిని జిమ్మును. చేమకూర వారి వలె తెనుగులలోని యచ్చుకట్టును చూపును. కడకు చూర్ణికల వంటి వానిని గూడ విడువలేదీతడు. ఈ క్రింది శైలి యెట్టిదో చూడుడు:

"పగదీరిన దన్ను పాపతేడు ప్రక్కలొఱయుచు నాసా రంధ్రమునెక్కి మెదడులో పీఠము బెట్టగా శ్రీ కాళహస్తీశ్వరుడు మల్లికార్జున దేవుని మహాభక్తుడు త్రేతాద్వాపర సంధినాటి గజరాజు, బాధచే బెట్టిన ఘీంకారము వంటి హృదయవిదారణమైన ఘీంకృతి" (వేయిపడగలు)

ఇంతేకాక చిత్రవిచిత్రములైన శయ్యల నీతడు క్రొత్తగా లేవదీయును. వచన రచనమున అతని కతడే సాటి. అతని పద్యములకు వలెనే గద్యములకు నియత మగు శైలి లేదు. కాని యెన్నియో రచనా పద్ధతులను గనుపఱుచినాడు. వానిని మూలములుగా గైకొని యెందరో వ్యక్తులు ఎన్ని విశిష్టరీతులనైనను పెంపొందింపవచ్చును.

వారి 'వేయిపడగ' లొక యపూర్వ సృష్టి. అది మన పుణ్య ముచే తెలుగువారి కొక్కరికే దక్కినది. సుబ్రహ్మణ్యేశ్వరుని ఫణములు వేయి. కవిగారి ప్రతిభా ఫణము లసంఖ్యములై తెనుగు నేల నావరించినవి. అం దొక విరాట్స్వరూపమున్నది. ప్రాచీన నవీన సమాజములకు వేయిపడగ లొక లంకె. ఈ గ్రంథము చదువదగినదే కాదు - వల్లింపదగినది. ప్రేమింపదగినే కాదు - పూజింపదగినది. ఆంధ్రుల కా రచనము గర్వకారణము. నా పేలవము లగు మాటలచే దానిని విమర్శించుట నిజముగా దాని గౌరవమును కొఱతపఱచుట.

వారి 'పసిరిక' పాత్ర భావనాకల్పితము. గిరిక 'దేవదాసీత్వము గూడుకట్టిన

మూర్తి'. అరుంధతి యరుంధతి. ధర్మారావు గారు కవిగారే! ఆ గ్రంధమొక యమృత ప్రవాహము - గంధర్వ లోకము! వారి నాటకములు రెండున్నవి. అందులో 'నర్తనశాల' బహుశః చిన్నతనమున వ్రాసియుందురు. ఇక 'వేనరాజు' భావుకులలో, పండితులలో నొక తుపానునే లేవదీసినది. దానిని పరామర్శించు విమర్శనము లెన్నియో పుట్టవల సియున్నది.

మహాకవి సత్యనారాయణ గారి నింత చిన్న వ్యాసముతో బూజింపయత్నిం చుట నిజముగా వెక్కిరింత. వారు ప్రాచీన మహాకవుల కెవ్వరికిని తీసిపోని సాహితీసార్వభౌములు. మహా పండితుడు. విశంకటుడు. ఇంకను చెప్పినచో రూపాంతరాపన్నుడగు భట్టారకుడు. అయిననేమి? అదృష్టము పూర్తిగ వక్రించిన యభాగ్యుడు, చచ్చిన వారిని గూర్చి యేడ్తుమే కాని బ్రదికిన మహాకవుల గొడవ మనకు గాబట్టుటయే లేదు. వారికి గుడివాడలో జరిగిన సన్మానము నూలుపోగు. న్యాయముగా నాతని ధర్మ సింహాసనముపై నెక్కించి రాజులు మోయవలెను. అతని గౌరవ మాంధ్ర దేశగౌరవము. కాని లాభమేమి? తెనుగు వారికి ఆత్మశక్తి గమనించి గౌరవించు సాహసమింకను రాలేదు.

నేటికే మహాకవి 'విశ్వనాథ' ఆంధ్ర వాఙ్మయమున 'కాలమందరుగనివా'డై నాడు. ప్రతిపద్యరసాస్పదమగు రామాయణమును పాడి ఋషియే కాగలడు. కాని ఇంతలో "అంతా వ్యర్థము. వట్టియాశ పెనుమాయావల్లి" అను బెడదచే మూల గూర్చుండునేమో యను భయము నాకున్నది. తెనుగు వారి నోములచే - ఆంధ్ర సాహితీ పుణ్యముచే అట్టి దుష్కాలము మాత్రము రాకుండుగాత!





# సంస్కృత విద్వాంసులకొక విన్నపము

- శ్రీ వేదము వేంకటాచలము

(కతిపయ శబ్దార్థశబ్ద స్వరూప విచారము, అని వీరు 70సం.ల కిందట భారతిలో వ్రాశారు. అందులోంచి ఈ రచన సంగృహీతం.

20వ శతాబ్దం తెలుగునాట పురాభారతీయ విజ్ఞానం, తులనాత్మక భాషాశాస్త్రం, ప్రాచీన భారత చరిత్ర, సంస్కృతి వేత్తలలో అత్యంత ప్రముఖులు శ్రీ వేదము వెంకటాచలముగారు. పారశీకుల వేదమైన జందవెస్తాను స్వరసహితంగా పఠించగల ప్రతిభాశాలి. ప్రాచీన భాషావేత్త. సం॥)

స్వామినః, మీ యట్టి మహాత్ముల పాదధూళి మా శిరమున నంటజాలు. మీ పాండిత్యము అఖండమైనది. దానిని తక్కువగా చెప్పుట బుద్ధి తక్కువ. మాది పండిత వంశము. నేను పండితుని పుత్రుడను, కావున నట్టి యవజ్ఞతను చేయజాలను.

అయినను 'బాలాదపి శుకాదపి' అను న్యాయముననుసరించి నమస్కార పూర్వకముగా నొకమనవి చేయుచున్నాను. మీకు సముద్ర మంత విద్యయుండినను అది రాణించుట లేదు. మీవలన సంస్కృత విద్యల వృద్ధికి సహాయము అల్పప్రాయమైయున్నది. మీ విద్యకన్న తక్కువ పడిన సంస్కృత విద్యతో యూరోపియనులు సంస్కృత విద్యల విషయమయి శోధనలు చేసి అమేయమైన యుపకృతిగల గ్రంథములను వ్రాసియున్నారు. వారు విద్యలను లభ్యపరచుకొనుట యందును, ప్రచుర పరచుటయందును గల పద్ధతులకును మీ పద్ధతులకును అంత భేదమున్నది. ఆ విద్వాంసులును మనవలెనే పేదలు. వారి భాషకాదు. వారి దేశము కాదు. వారు రచించు గ్రంథముల వలన

ద్రవ్యలబ్ధియు నుండదు. ఇట్లుండ వారు ఇట్టి పరిశ్రమ యేల చేయవలె? విద్యాభివృద్ధి కొరకు. ఈ యాస్థమనకేల కొరతపడవలె?

ఏ మాటకు గాని హేతువాదములు చేయకూడదు, తర్కవాదములు చేయకూడదు. 'నమీమాంస్యం కథంచన' అని వాగ్బంధనము చేయబూనుట సరికాదు. అవశ్యకర్త వ్యాంశములు – ఈ మీమాంస యును, ఈ వాదములును – అనుదినము యూరోపియనులు చేయు చుండునది యిదియే – కావుననే వారలు అంత పురోవృద్ధిలో నుండుట.

ఇప్పటికి నాలుగు వేల సంవత్సరముల క్రింద వ్యాపకులుగా నుండిన వారు ఎంత మహనీయులయ్యును వారు చేసిన కట్టుబాట్లను రాబోవు మన్వంతరముల వారందరును, మహాప్రళయము వరకు జవదాట కుండునట్లు వారి కాలుసేతులు కట్టివేసి, నోట గుడ్డలు చొప్పించి, శవ ప్రాయులనుగ పారవైచునంత యధికారము వారికెట్లు కలిగినది. ఇట్టి యధికారమును భగవంతుడు కూడ తనపై నిలుపుకొనలేదు.

కాలానుగుణముగ పద్ధతులు మారుచుండును. మీరలు కొంత ఇంగ్లీషు చదువుకొనవలయును. ఎక్కువగా పనిలేదు. సంస్కృతమును గురించి ఇంగ్లీషు విద్వాంసులు అప్పటప్పటికి వ్రాయు గ్రంథములను అన్వయించుకొను శక్తికి వలయు ప్రవేశమున్న యెడల చాలును. ఇంగ్లీషు గ్రంథములు ఒకటి రెండు తాము స్వయముగాజూచి అన్వయించుకొన గలిగిన యెడల అపేక్షణీయమయిన పద్ధతులన్నియును మీకు తెలియును. ఇంగ్లీషు విద్యను కొందరు కర్మఠులు చండాల విద్యయని చెప్పుట కలదు. చండాలత్వము శ్వాసవాయువునకు లేనట్టే విద్యలకును లేదు. మరియు ఇంగ్లీషువారు మన వేదములను 'చూచిన' ఋషులకు దూరపుదాయాదులు. చండాలురు కారు. హూణులును కారు.

ఇదియునుగాక మీరు అవెస్తభాషను పరిశ్రమచేసి పఠించవలెను. ఆ భాషాజ్ఞానము వలన సంస్కృత పాండిత్యమునకు మిక్కిలి శోభ కలుగును. బంగారమునకు మెరుగుపెట్టినట్లు, సంస్కృత భాష యొక్కయు, వ్యాకరణము యొక్కయు పూర్వ రూపము దానియందు తెలియును. అదియు నిపుడు మనకు ఇంగ్లీషు లేక గుజరాతి ద్వారా

సాధ్యమేగాని నా వద్దా. ఈ భాషను గురించిన వివరము కొంత వక్ష్యమాణ వ్యాసములో తెలియును.

మరియు మీకు కొంత హిస్టరీ తెలియవలసి యున్నది. అనగా పురాతన దేశ చరిత్రములు. ఆ దేశములను గూర్చియు ఆ కాలపు జనులు వారి మతములు. దేవతలు, ఆగమములు, ఆచారపద్ధతులు, ఇవి యన్నియు తెలియవలెను భూగోళ వృత్తాంతములు కొంత తెలియవలెను. అనగా పురాతనకాలమున ఏయే దేశమున ఏ పట్టణము, నదులు, పర్వతములు, రేవులు ఉండినవి? వాటి నామములు అప్పటప్పటికి ఎట్లు మారినవి? అక్కడి సస్యములేమి? ఫలవృక్షము లేమి? అని తెలియవలెను. ఈ రెంటిని తెలియక (హిస్టరీ – భూగోళము) పండితులని యుండువారు మన సంస్కృత విద్వాంసులు తప్ప ఈ భూమియందితరులు లేరు.

మీరు నాగరలిపిని వాడుక పరచుకొనవలెను. సంస్కృత గ్రంథముల కంతయు నిర్దోషములగు ప్రతులు నాగరలిపియందుండును. మరియు అన్యదేశముల వారు సంస్కృతమును గురించి వ్రాయు గ్రంథములలో నాగరమే వాడుదురు. గీర్వాణ భాషకు దేవనాగరలిపి యుండ పనిలేదా? ఈ పై జెప్పిన విషయములు ఇంగ్లీషులో వ్రాయబడిన గ్రంథములలోనే చిక్కునుగాని మనకుగల స్వదేశ గ్రంథములలో నిపుడు లేవు. కావున నింగ్లీషు నేర్చుట ముఖ్యము. అది కష్టమని పరిహరింపవలదు. పాణినీయమును, మహాభాష్యమును సాధించిన వారికిది యొక విషయము కాదు. వయస్సు కూడా కారణము కాదు. 'అజరామరవత్ప్రాజ్ఞః, విద్యామర్థంచ చింతయేత్' అని తమకు తెలిసియే యున్నది. మాతుః శ్రీ విక్టోరియా చక్రవర్తినిగారు షష్ట్యబ్దపూర్తి అయిన పిదప హిందూస్థానీ భాషను చదువనారంభించి లెస్సగ నేర్చినారు. ఈ విద్యా సాధనములను కొంత చేర్చుకొనిన యెడల మీరలు అద్వితీయులగుదురు.

## ప్రపంచ భాషలు

ఈ లోకమునందు మనుష్య జాతులెన్నికలవో అట్లే భాషల సంఖ్యలును ఏర్పడియున్నవి. ఒకరి భాష మరియొకరికి సహజముగా తెలియుటలేదు. చదివి కష్టించి

తెలిసికొనవలసినదే. ఈయన్ని భాషలకును సామాన్యములగు లక్షణములు కొన్ని గలవు.

1. ఏ భాషయందుగాని కల శబ్దస్తోమమంతయు ఆ భాషకు స్వతస్సిద్ధము కాదు.

2. ఇతర భాషలయందుండి బహు సందర్భముల వలన వచ్చి చేరిన పదములు పెక్కులు.

3. ఇతర భాషల నుండి గ్రహింపబడిన పదములు సాధారణముగ స్వభాషకుగల వ్యాకరణ పద్ధతులను, ఉచ్చారణ భేదములను, లోకుల వాడుకలను అనుసరించి వైరూప్యమును జెందును.

4. ఏ భాషయందుగాని యథార్థమయిన వ్యుత్పత్తి తెలియరాని పదములు (అనగా ఆ భాషయందు ప్రసిద్ధి గాంచిన పండితులకు కూడ తెలియనివి) అనేకములు గలవు.

5. ఒక్కొక్క భాషయందును స్వదేశ పదములు అనేకములు ఆ భాష రూపములను పొంది నిజ స్వరూపమిట్టిదియని తెలియరాక యుండును.

6. ఒక్కొక్క భాషయందును పరిభాషిక పదములు తరుచుగ నుండును.

7. ఒక్కొక భాషయెడలను -గ్రాంథికమయిన భాషకును, జనము వాడుచుండెడి భాషకును మిక్కిలి భేదముండును.

8. ఒక్కొక్క భాషయందును ప్రశస్తమైన యర్థముగల మాటలు కొన్ని నీచార్థములో వాడబడుచుండుటయును తద్విపరీతమును చూడగలము.

9. ఇతర భాషల నుండి స్వీకరించబడిన పదముల సంఖ్యలో కొన్ని అన్యదేశీయములని తెలియునుగాని, అట్టివి ఏ దేశము నుండి ఏ భాష నుండి వచ్చినవి అని తెలియకుండుట కలదు. మరికొన్ని పదములు అన్యదేశీయములనియే తెలియదు. స్వభాషలోనివేయని భావన.

ఈ లక్షణములన్నియు మన సంస్కృత భాషయందు గూడ కలవు. మన విద్వాంసులకు పరంపరాగతమయిన దుర్భ్రమయొకటి కలదు. మన భూగోళములో నుండు భాషలకన్నిటికిని మన సంస్కృత భాష మాతృభాషయనియు ఇది దేవతలు వాడుచుండెడి భాషయనియు నమ్ముచుందురు. కావుననే దీనిని గీర్వాణ భాషయని పేర్కొనుట కలదు.

ఇదియునుంగాక ఈవల వణిజుల వాడుకలో వ్యాపృతమయి యిపుడు ఉత్తరదేశములో సంస్కృతమునువ్రాయుటకు స్థిరపడిన నాగరమను లిపికి దేవనాగర మని కూడ నామకరణము చేసిరి. ఇట్టి దుర్భ్రమ క్రీస్తుశకము 18వ శతాబ్దిలో యూరోపు దేశమునందలి విద్వాంసులకు హీబ్రూ భాషను గురించి కలిగియుండినది. కాలక్రమమున అధిక విద్యావ్యాసంగము చేత ఆ దురభిప్రాయము అడుగంటిపోయినది. ఇప్పటికిని మనదేశమునందు సంస్కృతమునకు సంబంధించిన ఈ పొరపాటు సవరణకాలేదు. పయి చెప్పిన లక్షణములు మన గీర్వాణము నందు గలవనుటకు నిదర్శనములు వందల కొలది చూపవచ్చును. వాటిని గూర్చి వేరు గ్రంథము వ్రాయవలసి యున్నది. సద్యః సులభసాధ్యములగు కొన్ని శబ్దములను మాత్రము దిక్ప్రదర్శన న్యాయముగ సూచింతుము. హయవాచకమగు బడబాశబ్దమొకటి గలదు.

ఈ శబ్దము గీర్వాణులు వాడుచుండు బృందారకభాషలోనిదేనా? లేక మన సంస్కృత భాషయందు ఎక్కడనుండియో వచ్చి చేరినదా? మన పూర్వ పద్ధతుల ప్రకారము సంస్కృతములో నుండెడు ఏ శబ్దముగాని సంస్కృతమే అని చెప్పవలయును. దానికి సంస్కృతములో నుండు సాధన సంపదవలననే వ్యుత్పత్తి కల్పింప వలయును. యాథార్థ్యముతో పనిలేదు. ఈ శబ్దమునకు ప్రసిద్ధములయిన నామలింగాను శాసన వ్యాఖ్యానములలో చెప్పబడిన వివరణ చూడనగును.

క్షీరస్వామి - (బడంబలం హయంవా, వాతీతి, బడబా), భానూజీ దీక్షితుడు. సుప్రసిద్ధుడగు భట్టోజీదీక్షితుని కుమారుడు. 'బలం సామర్థ్యమతిశయితమస్యాః' బలంవాతివా, బలేన వ్రజతివా-, గురుబాల ప్రబోధిక-వలతే ఇతిబడబా, వలసంచలనే, వబయోర్లడయోశ్చైకత్వమ్'.

క్రీస్తు శకమునకు అయిదు వందల సంవత్సరములకు ముందు పారశీక దేశమునందు చాయమాన (Achaemenes) వంశ సంభూతులు, సామ్రాజ్యపదము నధిష్ఠించిన చక్రవర్తులు ఏలుచుండిరి. వారి కాలమందు భరత ఖండములో సింధునదికి పశ్చిమ భాగమంతయు వారి ప్రభుత్వమునకు లోబడి యుండినది.

పారశీక దేశమునందలి హయములు దేహమునందు ఉన్నతములును - కష్టమునకు

ఓర్చునవిగనుండును. అరబ్బీ గుఱ్ఱములు కురుచలును, అందమయినవియు, జవాధికములునయి యుండును. ఈ ప్రాచీన చక్రవర్తులలో నొకరు – ఈ రెండు జాతులను కలయదోలిన యెడల నొక ప్రశస్తమయిన సంకరజాతి ఉత్పన్నమగునని యెంచి అట్లు గావించిరి. అట్లు పుట్టిన అశ్వములు అరబ్బీ గుఱ్ఱములవలె జవనాశ్వములుగను, పారసీక హయములవలె బలిష్ఠములుగను వెలువడినవి. వీటిలో స్త్రీ ప్రకృతికి ప్రాశస్త్యము కలిగినది. వీటిలో శ్రేష్ఠమయిన వాటిని సామంతులకును, ఇతర దేశాధిపతులకును బహుమానముగా నొసంగుచుండిరి. క్రమేణ వాణిజ్య వాహిని కూడ ఏర్పడినది.

ఈ యుత్తమ హయములు మిక్కిలి వేగవంతములని సూచించుచు వీనికి 'బాద్‌పా' అని పేరుపెట్టిరి. ఇయ్యది అన్వర్థనామము. పాణినీయ ప్రక్రియలతో నవసరములేని వ్యుత్పత్తి – బాద్ అనగా వాయువు (సంస్కృతములోని 'వాత' శబ్దము) – పా అనగా పాదము. బాద్‌పా – అనగా గాలిని కాళ్ళుగా గలది. వాయువేగమని అర్థము. ఈ యర్థముగల శబ్దమును, గుఱ్ఱములను గురించియు నొక దేవదూతను గురించియు జగద్విదితుడు, యవనకవీశ్వరుడు, హోమరు గ్రీకుభాషలో 'పాదేనెమొస్' అని ప్రయోగించియున్నాడు.

ఆ శబ్దమునకు అర్థము 'గాలిని కాళ్ళుగా గలది'యని. ఈ హోమరు కవి ఈ చెప్పిన చక్రవర్తులకన్న మున్నూరు సంవత్సరముల కాలము ముందువాడు. ఈ 'బాద్‌పా' అనునది వాయు వేగము గలదైనందున స్వర్గాదిలోకములకు పోయి అక్కడి వారిని మెప్పించిన పిదప ఆ గీర్వాణుల వాణియందు బడబా అను నామముతో పరిణమించినది. మరియొక శబ్దమును ఉదాహరింతుము.

**కుకుప్ – కుకుభః**

'దిశస్తుకకుభః కాష్ఠాః అని అమరుడు – దిక్కు అని యర్థము. ఈ శబ్దమునకు కూడ వ్యాఖ్యాతలు పయిన చూపిన పద్ధతిన వ్యుత్పత్తి వ్రాసియున్నారు.

ఈ పదము (అసురుల) అస్సిరియనుల భాషలోనిది – బాబిలోనియను అనువారు ఈ యస్సిరియనుల వంశపూర్వులు (ఇప్పుడిచ్చుట) అస్సిరియనులని ప్రస్తావముకల

తావుల బాబిలోనియను లను కూడ కలిపి యన్వయింతురుగాక! ఆ భాషయందు 'కక్కబు' – 'కకబు' అని రూపము. ఈ శబ్దమునకు నక్షత్రమని యర్థము. అస్సిరియనుల గణములో చేరిన అరబ్బుల భాషలో ఈ మాట ఇంచుకరూప భేదముతో స్థిరపడియున్నది. 'కౌకబ్' అనగా నక్షత్రము. ఈ అస్సిరియనులు పూర్వదేవగణము. వీరు సురలకన్న బహుకాలము ముందుగా అనేక విద్యలను నేర్చినవారు. వారివలన దేవతలును మనుష్య జాతులును అనేక విషయములను తెలిసికొని వారి వారి ప్రతిభా విశేషము వలన ఆ జ్ఞానమును వృద్ధి పరచుకొనుచుండినారు.

ఇట్టి విషయములో చేరినది జ్యోతిశ్శాస్త్ర జ్ఞానమొకటి. నక్షత్రములు – రాసులు – మేషాదిస్థానములు ప్రథమమున కనిపట్టి యీ భూమి యందు వ్యాపింజేసిన వారు ఈ అస్సిరియనులని చెప్పదగియున్నది. పూర్వకాలములలో చీకటి రాత్రులయందు, కొండ గురుతులు లేని ఎడారి ప్రదేశములయందు, క్రొత్త తావులయందు – నడి సముద్రములోను – దిక్కులు తెలియుట ఎట్లు? అందుచేతనే ఇప్పటికిని 'వాడు కేవలం దిక్కులేనివాడు' అని జనసామాన్యమయిన వాడుక మాటకలదు. దానియర్థము ఏ ముఖముగ గాని పోవుటకు లేదనుట. అట్టి సందర్భములలో నక్షత్రముల వలన దిక్కులను గుర్తించుచు వచ్చిరి. నావికాయాత్ర చేయువారికిది దైనందిన విషయముగా నుండినది. వారు బాల్యాదారభ్య ఈ నక్షత్రములను, వాటినిబట్టి దిక్కులను గుర్తించుటను అలవర్చుకొనుచుందురు. ఈ కారణము వలన దిక్కులకును నక్షత్రములకును అభేదాధ్యవసాయము కలిగి దీని పేరు దాని పేరయినది.

**ఇంకొక పదము**

**ఋక్షము – నక్షత్రవాచకము.**

'ఋక్షాచ్ఛభల్లభాలుకాః' అని అమరుడు – భల్లూకము (ఎలుగు గొడ్డు – ఎలుగుబంటి)నకు ఋక్షమని పేరుగదా! 'నక్షత్ర మృక్షభమ్....' ఈ వాక్యములో ఋక్షశబ్దము నక్షత్ర నామ పర్యాయముగ పఠింప బడినది. ఏమి కారణము? కృష్ణాష్టమికిని పీర్ల పండుగకును ఏమి సంబంధము? ఈ సంబంధము సంస్కృత భాషా ప్రపంచములో తెలియదు.

జ్యోతిశ్శాస్త్రజ్ఞులని చెప్పబడిన అసురుల పూర్వులు ఇపుడు మనము 'సప్తర్షులు' అని చెప్పుచుండు నక్షత్ర కూటమునకు ఎలుగుగొడ్డు అని పేరు పెట్టిరి. నక్షత్ర కూటములకంతయు ఒక్కొక్కదానికిని ఒక్కొక్క ఆకార సామ్యమును భావించి మీనము, మేషము – ఇత్యాది పేర్లు ఈ ప్రాచీనులు పెట్టుచుండిరి. వీరు ఈ సప్తర్షి మండలమునకు' భల్లూక నామము పెట్టినారు. దేవతలు ఈ విషయమును బోధచేసికొనినవారయి ఆ నక్షత్రరాశికి మొదట భల్లూక నామముతో ఋక్షమని పేరుపెట్టిరి. ఈవల కొంతకాలమునకు మన సప్తర్షులకు వియన్మండలములో తావు కల్పించుట అవసరముకాగా వారికి ఒక్కొక్కరికి ఈ ఋక్షరాశియందలి ఒక్కొక్క నక్షత్రమును ఇచ్చివేసి ఆ ఋషులను అక్కడ చేరవ్రేసినారు. అప్పటినుండి అది సప్తర్షి మండలమయినది. పూర్వచరిత్రము విస్మృతమయినది. అయినను బహుకాలము ఎలుగుగొడ్డునకును, నక్షత్రములకును సంబంధము కలిగియుండినందున ఏ నక్షత్రముల తోడి సంబంధమని జ్ఞాపకశుద్ధి లేనందునను ఋక్షశబ్దము భల్లూక వాచకముగాను నక్షత్ర సామాన్య వాచకముగాను నుండినది. ఈ విషయమై మోక్షమూల భట్టాచార్యులు (Maxmuller) నిజము తెలియక పొరపడియున్నారు. ఒక్కొక్క నక్షత్రమును ఇచ్చివేసి ఆ ఋషులను అక్కడ చేర్చివేసినారు.

<u>చమస</u>

ఇదియొక పవిత్రమైన యాగపాత్రము. ఔదుంబరము, ఒక విధమయిన కొయ్యతెడ్డు. ఇంచుమించుగ అయిదారు అంగుళముల చదరమును నాలుగు అంగుళముల స్థౌల్యమును గలదై మధ్య మూడు అంగుళముల ఆయామమును రెండంగుళములలోతును ఉండునట్లు తొల్చబడిన పాత్రము. చేతితో పట్టుకొనుటకు ఆ కొయ్యలోనే దీర్ఘము కాకుండ నొక పిడి చేయబడియుండును. అగ్నిష్టోమాదిసోమ యాగములలో కొందరు ఋత్విక్కులు చమసాధ్వరులను పేరుతో వీటిని దగ్గర పెట్టుకొని అపుడపుడు ఒక్కొక్కమాట శ్రౌతప్రక్రియలోనిది అరచుచు నస్యము వేసికొనుచు లోకాభిరామము మాటలాడుచు ఉందురు. కొన్ని తరుణములలో ఈ చమసములతో సోమమును పోయుదురు. దానిని వీరుత్రాగుదురు.

ఈ పదము సంస్కృతికుల పూర్వులకును సామాన్యమగుమాట. దీని వ్యుత్పత్తి పరాసీలో

తెలియును. దీని స్వస్వరూపమున భరత ఖండమందంతయు తెలిసినమాట. తెలుగువాడుక భాషలో కూడా 'చమ్చా' అని వాడెదరు. దీని స్వరూపము 'చమ్చః' అనగా చిన్న తెడ్డు వంటి సాధనము. ఇంగ్లీషులో 'స్పూను' అందురు. ఫారసీలో 'చమ్' అనగా తెడ్డు. అబక 'చః' అనునదిక్షుద్రార్థద్యోతకమగు ప్రత్యయము. సంస్కృతములోని 'క' ప్రత్యయము వంటిది. 'చమ్చః' అనగా చిన్నతెడ్డు. ఇటులనే ఉత్తరాదిన వేడినీళ్ళకాచు తామ్ర పాత్రమునకు 'డేగిసా' అందురు. దీని స్వరూపము 'దేగ్చః' (ప్రథమాక్షరము 'డ' కాదు 'ద' అనగా చిన్నకాగు అని అర్థము. దేగ్ అనునది పెద్దది. ఇట్లు చమ్చః అనునది చమ్సః, చమసః అని మారినది.

## కొన్ని తెలుగు మాటల వ్యుత్పత్తి

వాడుకలో నుండు తెలుగుభాషలో ఆచ్ఛికములుగానివియు, సంస్కృత సమములు, తద్భవములు గానివియునగు పదములు ఇతర భాషల నుండి వచ్చియున్నవి.

ప్రాకృతములు (హిందీ, గుజరాతీ, మరాఠీ ఇత్యాదులు), హిందూస్థానీ లేక ఉర్దూ - అరబ్బీ - పారసీ - దఖనీ -ద్రావిడములు (అరవము, కన్నడము ఇత్యాదులు) సుమీరియన్ సెమిటిక్ (అస్సీరియన్, బాబిలోనియన్, హీబ్రూ) ఇత్యాదులు, గ్రీకు, లాటిన్, ఇంగ్లీషు ఇత్యాది భాషల నుండి లభ్యపడినవి. కొన్ని పదములు స్వదేశోత్పన్నములయిన పారిభాషికములు, కొన్ని సంస్కృతమునుండి కల్పింపబడిన పారిభాషికములు, కొన్ని దేశ చరిత్రములలోని సందర్భములననుసరించియు, కొన్ని భూగోళమునకు సంబంధించియు, కొన్ని ఇతిహాసములకు సంబంధించియు కలిగినవి.

కొన్ని ద్వైభాషికములు; అనగా తెలుగు భాషలోని పదమొకటియు, తత్సమానార్థ ద్యోతకమయిన వేరొక భాషలోని పదమొకటియును జేర్చి ఒక జంటమాటగ నేర్పడుట కలదు. ఇట్టి పదములను ఇంగ్లీషులో బైలింగ్వలిజమ్స్ అనియందురు. వాణిజ్యము - నావికాయాత్రలు - ఇత్యాది సంబంధముల వలన కలిగిన పదములు, కొన్ని ఆయా కాలపు రాజ్యాంగ పద్ధతులను, వ్యావహారిక సందర్భములను అనుసరించి వెలువడిన పదములు కొన్ని - స్త్రీపురుషుల ఆభరణములయు, అలంకార పరికరములయు నామములుకొన్ని; తినుబండారములు, పిండివంటలు, 'మిఠాయి' దినుసులు,

'గ్రంథాణ్యము'లని చెప్పబడు వైద్యమున కుపచరించు వస్తువుల నామములు కొన్ని, దీపావళినాడు పిల్లలు కాల్చుచుండు మందుసామానుల పేళ్లు కొన్ని - ఆటపాటలు, మేళతాళములు, ఊరేగింపులు, భోగవనితల నృత్యాదికములు, ఇత్యాదులకు సంబంధించిన పేళ్ళుకొన్ని; యుద్ధసేనలు - గుఱ్ఱములు - ఏనుగులు - బండ్లు ఇత్యాదులకు సంబంధించిన నామములు కొన్ని; మన ఉడుపులు, వస్త్రములు, 'షికారీ'ల వేటలు, సాముగరిడీలు, వీటి పదములుకొన్ని, ఇంకను ఇతర వర్గముల మాటలు పెక్కులును వాడుక భాషలో కుదిరియున్నవి. ఇవన్నియు ఇతర భాషల నుండి వచ్చిచేరినవి. ఇట్లే లోకములోని అన్ని భాషలయందును సాంకర్యము కలదు. అయితే యూరోపియనులకును మనకును గల భేదమొకటి ద్విరుక్తముగా చెప్పవలసియున్నది. మన పద్ధతి సంస్కృత పాండిత్యము నుండి మనకు వచ్చినదాయము.

ఇతర భాషల నుండి ఇతర ద్వీపములనుండి వచ్చి మన భాషలో పదములు చేరియున్నవనుట తప్పు, లజ్జకుకారణము. సంస్కృతమును గూర్చి ఇట్టి మాట చెప్పువాడు వేదబాహ్యుడు - దేశద్రోహి. వాని దురితమునకు నిష్కృతియలేదు. ఆంధ్రమును గూర్చి చెప్పినచో బహుశః ప్రాయశ్చిత్త కాండలలో నేదేని కృచ్ఛ్ర చాంద్రాయణాది సులభమార్గ మగపడవచ్చునని తోచుచున్నది.

యూరోపులోని సుసంస్కృతములయిన భాషలు అనగా ఇంగ్లీషు, జర్మను, ఫ్రెంచి - వీటిలో పై చెప్పిన విధమున నన్యదేశీయములు మెండుగనుండును. వాటి విషయమయి ఆయా దేశపు లాక్షణికులు, నైఘంటికులును ఒక్కొక్క మాట యొక్కయు పుట్టుకను, చరిత్రను శోధనచేసి బయలుపరచి నిఘంటువులను వ్రాసియున్నారు. ఇంకను వ్రాయుచున్నారు. ఇందులకు కారణము వారికి మానావమానములు లేకపోవుటయే. ఇట్టి గ్రంథములు మన భాషలకును కావలసియున్నవి; ఎప్పుడు కలుగగలవు? మనకును మానావమానములు వీడిపోయిన పిదప. ఇప్పుడు అనేక పదములు అన్యదేశీయములని మన లాక్షణికులకును నైఘంటికులకును తెలియుట లేదు. అట్టి వాటిని దేశ్యములని చూపి విరమించుచున్నారు.

ఈ నిఘంటువులలో తెనుగు పదములును దేశ్యములు, అరబ్బీ నుండి వచ్చినవనియు దేశ్యములే.

అంగడి – దేశ్యము; దుకాణము – దేశ్యము, అరబ్బీ నుండి వచ్చినవియు దేశ్యములే. ఇట్టి లక్షణము వలని ప్రయోజనమేమి?

అంగడి – దేశ్యము; దుకాణము – దేశ్యము, కిటికీ – దేశ్యము = గవాక్షము.

హాజరు – దేశ్యము – ఆస్థానము, హజారము యొక్క మారురూపము.

హజారము – దేశ్యము, అజారమునకు మొదటి రూపము.

అజారము – దేశ్యము – మొగసాల.

పాపోసు, పాయపోసు – వైకృతము = ముచ్చె

పాదుసా, పాదుసాహే – వైకృతము = రాజు

ఈ నైఘంటికులు ప్రయోగించుచుండు దేశ్యము, వైకృతము అను సంకేతముల కర్థము వారికే తెలియవలెను. చదువు వారికి తెలియదు. 'విధాతావేత్తి వానవా'.

దుకాణ శబ్దము – అరబ్బీ నుండి పరాసీలో చేరి భరతఖండములోని మహ్మదీయుల వాడుకలో ప్రచురమై హిందువులు వాడుచుండుమాట. ఇది మాండలికము. విశేషించి విశాఖపట్టణ సీమలో దుకాణమందురు. నెల్లూరి సీమలో అంగడియందురు కాని దుకాణమనుటలేదు. దీనికి పారసీ రూపములు దుకాన్ – దుక్కాన్ – వీటి యర్థము అంగడియని. ఇది యెట్టి దేశ్యమని ఈ నైఘంటికుల యభిప్రాయము?

కిటికీ – దేశ్యము = గవాక్షమని యర్థము.

ఇది తెనుగుమాట కాదు. హిందీ – ఆ భాషలో దీని రూపము కిడిక్ – ఇది యెట్టి దేశ్యము? హాజరు, హజారము, అజారము (దేశ్యములు) = ఆస్థానము. ఈ పదములు అరబ్బీ శబ్దమునకు తెనుగు వారి వాడుకలో పుట్టిన వికారములు. మహమ్మదీయ ప్రభుత్వములో పుట్టినవి. వీటి అరబ్బీ రూపములు హాజిర్ – హుజూర్.

ఈ హాజిర్ శబ్దము 'కోర్టు కచ్చేరీల' వాడుకలో మహమ్మదీయులును, హిందువులును అనుదినము చెప్పుచుందురు. అయితే ఉచ్చారణ తప్పుగ నుండును. 'హాజిర్' అని మధ్యవర్ణమును ఇకారముతో చెప్పక 'హాజర్' అని అకారముతో చెప్పుదురు. ఇట్లే

'నాజిర్' శబ్దము. కోర్టు 'నాజరుగారు' అందురు. 'నాజిర్' అని చెప్పవలెను. ఈ పదములెట్టి దేశ్యములు?

పాపోసు - పాయపోసు, వైకృతము = ముచ్చె.

వైకృతమను సంజ్ఞకు నిర్వచనమిట్లున్నది. 'ప్రాకృతసమమును, సంస్కృత ప్రాకృతభావమునైన పదము'.

సంస్కృతము చెడి, హిందూస్థానములో నూరు ప్రాకృతములయి యున్నది. ప్రాకృతము అన్న మాత్రాన యే ప్రాకృతమని అన్వయించునది? ఏ ప్రాకృతసమము?

ఈ పాపోసు, పాయపోసు శబ్దములు ప్రాకృత సమములు కావు. సంస్కృత ప్రాకృత భవములును కావు. పారసీమాటలు.

'పాయెపోష్' అనునది రూపము (యకారమును తేల్చి పలుకవలెను) అనగా ముచ్చె అని అర్థము. పాయె = కాలికి, పోష్ = తొడుగు; కాలికి తొడుగుముచ్చె.

'పోషీదన్' అని పారసీ ధాతురూపము. అర్థము తొడుగుట.

దీనియందలి షకారము మన వారి వాడుకలో సకారముగ మారినది. ఈ శబ్దమును మాండలికము. నెల్లూరు సీమలో, మద్రాసులో కొంతకాలము క్రింద వాడుకలో నుండినది. ఇపుడు - ఈ మాటను వాడుటలేదు. 'బూట్సు' క్రింద నలిగిపోయినది. దీనియర్థము ఈ కాలములో సాధారణముగ తెలియదు.

పాదుసా - పాదుసాహి - వైకృతము = రాజు.

వీటిని గురించి యొక వార్తికమును వ్రాసియున్నారు. "పాదుసా, పాదుసాహి శబ్దములకు మ్లేచ్ఛ భాషయందు తరచు వాడుకగలదు'.

దీనివలన స్పష్టము, వీరికి మ్లేచ్ఛ శబ్దమునకర్థము తెలియలేదు. ఈ తెలియమి మనలో పండిత పామర సామాన్యమైయున్నది. మ్లేచ్ఛ భాషయనుటలో ఈ భరత ఖండములోని మహమ్మదీయుల వాడుక భాషయని వీరి బోధగా తెలియుచున్నది. మరియు 'తరచు' అనుటలో వీరి భావమేమని తెలియలేదు. ఇదియును గనక తరచు వాడుకగల

దనుటచే నేమి ద్యోతితము? ఇది తెనుగు మాటయనియును దీనిని మ్లేచ్ఛులు తమ భాషలో చేర్చుకొని వాడుచున్నారనియా లేక ఇది మ్లేచ్ఛ భాషలో రూఢమయిన పదమనియు, తెలుగులో చేరియుండుననియా? ఈ రెండు సందర్భములలో నొకటియును దీని వైకృత శబ్ద నిర్వచనమునకు సరిపడదు. అట్లుండ వైకృతమనుట యెట్టిది?

పాదుసా – పాదుసాహి – ఇవి పారసీభాష మాటలకు వికృత రూపములు. పాద్షాః పాద్షః (బాద్షాః అని రూపాంతరము) అనగా సార్వభౌముడు, చక్రవర్తి, సామ్రాట్, రారాజు, పాద్షాహీ – విశేషణము, విశేష్యముగ గూడ వాడబడును. చక్రవర్తికి సంబంధించిన, సామ్రాజ్యమునకు సంబంధించిన (అని అర్థము). ప్రభుత్వము (అని అర్థము.)

ఆర్యావర్తమునందు మహమ్మదీయ ప్రభుత్వముతో వాడుకలో వచ్చి చేరినవి. మొగలాయి ప్రభుత్వములో మిక్కిలి వ్యాపకమును జెందినవి. ఢిల్లీ పాదుషా అని వాడుక. సామంతరాజులకు పాదుషా అని చెప్పరు. తరచుగ నాంధ్రుల వాడుకలో 'పాచ్ఛా', 'పాచ్ఛావు' 'పాచ్ఛాయి' అని కూడ కలదు. పాపోసు శబ్దమునందువలె షకారము సకారమగుట.

బొబ్బిలి కథలో (బాల్యములో విన్న జ్ఞాపకము) బుస్సీ దొర సరదారీలోని ఫ్రెంచి సైనికులను గూర్చి మాటలు.....

'దేశమెరుగనీ ఫరాసులే మనదేశముకొచ్చినరు. భూమి లెరుగనీ ఫరాసులే మన భూముల కొచ్చినరు. అంతలేసి మారాట భూములే హతముచేసినారు. గోలకొండ దర్బారి మీదనే కొట్టిపోరినారు. పాచ్ఛావును సాధించీనా ఫరాసులే వీరు!'.

ఈ కథ చెప్పిన వారికి ఆ కాలమందు పాచ్ఛా శబ్దము యొక్క క్రమమైన యర్థము తెలిసియుండినది. గోలకొండ దర్బారు అన్నాడు. అనగా సామంత ప్రభుత్వమని. ఇక్కడ గోలకొండ దర్బారు అనునది నిజాముగారి ప్రభుత్వము. పాచ్ఛావు అన్నది ఢిల్లీ చక్రవర్తి. మారాట అనునది మహారాష్ట్ర అని అర్థము.

పారసీకులు – సాంస్కృతికుల గణములోనివారు. కావున సాంస్కృతికుల వంటి

మ్లేచ్ఛులేగాని వేరుగాదు. వారి భాషయును సంస్కృత భాషవంటి మ్లేచ్ఛ భాషయేగాని ఎక్కువ తక్కువలు లేవు. వివరము వక్ష్యమాణము. మనదేశములోని మహమ్మదీయులు వాడుచుండెడి భాషయును మ్లేచ్ఛభాషకాదు. హిందూస్థానములోని హిందువులు వాడు చుండు భాషయును ఇదియును ఒకే భాషయని చెప్పవచ్చును.

ఇట్టి సన్నివేశములో అపేక్షణీయమయిన సాహితీపటిమలేక మన భాషలకు నిఘంటువులను వ్రాయబూనుట సాహసము. కేవలము సంస్కృతము నాధారపరచి సంస్కృతమునకుగాని సంస్కృతాంధ్రము లను మాత్రమాధారము చేసికొని తెలుగునకుగాని నిఘంటువులు ఏర్పడవు.

తెలియని విషయము తెలియదనుటలో అవమానమేమియు లేదు. తెలియనిచోట్ల యావచ్ఛక్తిని వినియోగించి తెలిసికొను ప్రయత్నములు చేయవలెను.

కొన్ని మాటలను సర్వసామాన్యముగ వాడుచుందురు. అయితే ఆ పదములకుండు అర్థమొకటి, వాడుకలోగల అర్థము మరియొకటి. కొన్ని మాటలను కొందరు ఒక అర్థములోను, మరికొందరు వేరయిన అర్థములోను ఉపయోగింతురు. కొన్ని పదములు మాండలికములు అనగా దేశ్యములు. ఒక మండలములో వాడుకలో నుండుమాటలు ఇంకొక మండలములో తెలియరావు.

ప్రేతమునకు పితృత్వము వచ్చువరకు జరుపునట్టి యపరకర్మకు ఒక ప్రదేశములో కర్మాంతరములు, ఒకచోట తీరాలు, ఒకచోట దినవారములు, ఒకచోట క్రతువులు అని చెప్పుదురు. ఇటువలెనే ఒకచోట గర్భాదానమందురు; ఇంకొకచోట ఆక్రియకే నిషేకమందురు; మరియొకచోట 'ప్రస్తుత' మనుటచే గర్భాధానమని తెలియదు. కడప – వారికి పునస్సంధానమనుటలో ఈ యర్థము కలుగదు. ఇట్టి మాండలికములు వేనవేలు యూరోపియను భాషలలో కలవు. వాటి కన్నిటికిని స్థలనిర్దేశములు, వ్యుత్పత్తి, పుట్టుక కాలము, ఇత్యాది విశేషములను తెలియపరచు నిఘంటువులు ఏర్పడియున్నవి.

మరియు కొన్ని మాటలను అపార్థములలో నుపయోగింతురని చెప్పితిమి. ఇందులకుదాహరణముగా పయిన చెప్పిన గర్భాధాన ప్రస్తుతమునే విచారింతము.

యాజకులు, పురోహితులు, తమ గృహస్థులతో కూడ ఊరిలో బంధు మిత్రాదులను ఆహ్వానము చేయవచ్చి – "అయ్యా – రేపు దేవదత్తయ్య గారి కుమారుడికి గర్భాధానము. తమరు సకుటుంబముగా దయచేయవలె' అని చెప్పుదురు. ఈ శబ్ద ప్రయోగమును గూర్చి మనదేశములో ఇంగ్లీషు చదివిన వారిలో కొందరి వాడుకయు నొకటి చోద్యముగ నుండును. వారు 'ఈ దినము రామమ్య గారి ఇంటికి భోజనానికి వెళ్ళాలి. వాడికి 'నప్షల్సు' అని చెప్పుదురు. ఈ 'నప్షల్సు' అనునది ఇంగ్లీషుమాట. గర్భాధానమని యర్థము. మనమాటకు పట్టిన దుర్గ్రహచారమే మనవారి యాజమాన్యమున ఆ ఇంగ్లీషు మాటకు కూడ గలిగినది. ఆ 'నప్షల్స్' అను మాటను గర్భాధానమను మాటవలెనే స్త్రీ విషయమయ్యే చెప్పవలెనుగాని మగవాని నుద్దేశించికాదు. దీనికి కారణము ఈ రెండు పదముల వ్యుత్పత్తిలో తెలియును.



మొగల్‌రాజ పురం హిల్ సైడ్. (వాటర్ కలర్స్) వి.వి.భగీరథి

# అవధానములు

- కొమర్రాజు వేంకట లక్ష్మణరావు

అవధానములు, అవధానులు : మన దేశమునం దష్టా వధానములనియు, శతావధానము లనియుఁ గొందఱు చేయుచుందురు. వారిని మన వారు అష్టావధాను లనియు శతావధానులయుఁ బిలుచు చుందురు. ఇట్టి యవధానములను గుఱించి గ్రంథములు సంస్కృతమునందున్నట్టు కానరాదు. అవధానులును స్పష్టముగఁ జెప్పరు. ఉచ్ఛిష్ట గణపతి మొదలైన దేవతల యుపాసనవలన నిట్టిశక్తి వచ్చు ననియు, నిది యభ్యాసము వలన రానేరదనియుఁ గొందఱు చెప్పుచున్నను, అభ్యాసము వలన నితర విద్యల వలెనే వీనిని గూడ నేర్చుకొన వచ్చును. (కందుకూరి వీరేశలింగము గారి స్వీయచరిత్రము, 1వ భాగము, 3వ ప్రకరణము) అని యిప్పుడు విద్వాంసులు నమ్ము చున్నారు. చిత్తైకాగ్ర్యముఁ జేయుశక్తియు, ధారణశక్తియు నెక్కుడు గఁ గలవారి కవధానము సులభసాధ్యము; అన్యులకుఁ గొంతకష్ట సాధ్యము.

అవధానము గుఱించిన పై వ్యాసము చదువు వారికి, నొక్కసారి (ఏకసమయావచ్ఛేదమున) ఎనిమిది విషయములను గాని, నూఱు విషయములను గాని మనసెట్లు గ్రహించు నన్న సందేహము గలుగ అవధాని అన్ని అష్టావధానమందుఁగాని శతావధానమందుఁ గాని అవధాని అన్ని విషయములను ఏకకాలమందు గ్రహించుచున్నాఁ డనుట నిజము గాదు. కాని అష్టావధానములను ఏకకాలమందు గ్రహించుచున్నాఁ డనుట నిజము గాదు. ఒక విషయము మన దృష్టిపథకమునకు రానున్నది యని మొదటఁ దెలిసి యెదురు చూచుచున్నపు డా విషయమును గ్రహించుటకు మనసునకు 76 మానముల కాలముకంటె నెక్కుడుపట్టదు (Rihote Psychology Attention, P. 74) మానకాల మనఁగా

నొక సెకెనులో 1000వ వంతు. ఆయా అవధాని యొక్క గ్రహణశక్తిని బట్టి ఈ కాలము హెచ్చుచుండును, తగ్గుచుండును. కావున నతిసూక్ష్మకాలములో గ్రహింపఁ బడు విషయము లన్నియు మనకు నేకకాలమందు జరిగినట్లు కావనవచ్చినను భిన్నభిన్న కాలమందే మనస్సుచేత గ్రహింపఁబడును. ఇదియుఁ గాక యీ యవధానములలో నవధాన కార్యముకంటె 'ధారణ' (Retention) 'స్మృతి' (Reproduction, memory) అను మానసక్రియల పనియే యొక్కుడుండును. ప్రథమ పృచ్ఛకుని ప్రశ్నయు, ద్వితీయ పృచ్ఛకుని ప్రశ్నయు, నేకకాలమందు నడుగఁ బడవు. ప్రత్యుత్తరములును ఏకకాలమందు నీయఁబడవు. కావుఁన గ్రమముగాఁ జెప్పఁబడిన ప్రశ్నలన్నియు జ్ఞాపకముంచుకొని, మరల నా వరుస వచ్చినప్పుడు గాని, నడుమ నడిగినప్పుడు గాని ప్రతిపృచ్ఛకుని ప్రశ్నలకును తగిన జవాబు చెప్పుటకు ధారణాశక్తియు, స్మృతియు నెక్కుడు గావలయును, అవధానము, ధారణ, స్మృతి యనునవి వేఱువేఱు మానస వ్యాపారము లయినను వీనికిఁ బరస్పర సంబంధము కలదు. లక్ష్యపూర్వకముగ (అవధాన పూర్వకముగ) గమనించిన విషయము చక్కఁగ ధరింపఁ బడును, అనఁగా బాగున మనస్సులో నాఁటును. అట్లు నాఁటినది మరల వలయు నెడ శీఘ్రముగ జ్ఞాపకము వచ్చును.

ఇకఁ నష్టావధాన శతావధాన విధానములును, వానికై చేయఁబడు నుపాయములును సంగ్రహముగఁ జెప్పెదను.

**అష్టావధానములు:** అష్టావధాన మనఁగా నేకకాల మునందు నెనిమిది విషయములను మననస్సుచే గ్రహించి ధరించుట. ఏకకాలమనఁగా మిక్కిలి యవ్యవధిగల కాలము. శాస్త్రీయరీతి చేత నవి భిన్న కాలములే యైనను వ్యావహారికమున నేకకాలముగనే కానవచ్చును. సాధారణముగ, 1. కవిత్వము, 2. వ్యస్తాక్షరి, 3. గణితము, 4. సమస్య, 5. పూరణం, 6. కావ్యపాఠము, 7. చదరంగము, 8. సంభాషణము నను నెనిమిది కార్యముల నవధాని యేక కాలమునందే చేయుచుండును. అష్టావధానమునకు నీ యెనిమిదియే యుండవలయునని నియమము లేదు. ఇందుఁగొన్ని మార్పుచేసి కొందఱు చెప్పెదరు.

వీనిలో 'కవిత్వము,' 'సమస్య' అనునని నిజముగా ఆశుకవిత్వ విషయములు. ఆశుకవిత్వమునందుఁ గూడ నవధాన మెక్కువగ నుండవలయును. ఇందునుగుఱించి 'ఆశుకవిత్వము' క్రింద నధికముగ వ్రాయఁబడును.

వ్యస్తాక్షరి : ఒక్క వాక్యమునందలి పదము లొక్కొక్కటిగఁ బృచ్ఛకునియిష్టము వచ్చిన క్రమముగ నిన్నవయక్షర మిది యని చెప్పిన యెడల నన్నియు విని చివరకు మూల వాక్యమిది యని యవధాని చదివి చెప్పును; లేదా యెవరికిని దెలియకుండఁ గాగితముపైని వాక్యము వ్రాసి అక్షరముల కంకెలు వేసి అక్షరములను కత్తిరించి అందు నిష్టము వచ్చిన క్రమమున నొక్కొక్కటి యవధానికిఁ జూపు చుందురు. అర్థయుక్తమైన వాక్యమైన యెడల నక్షరముల సహవాసము కొంతవరకు జ్ఞాపకశక్తికి సాయము చేయును గాని, పెక్కుసారులు పృచ్ఛకుఁడు వాక్యమందలి పదములు నీయక, అర్ధము లేని యక్షర సమూహ మొకటి కల్పించుకొని యందలి యక్షరము జెప్పును; లేదా అవధానికిఁ దెలియనిభాషలోని వాక్యమందలి అక్షరముల నైనను చెప్పును. అప్పుడీయవధానము కొంచెము కష్టము. దీనికి శతావధానమునందుఁ జెప్పబడిన నూఱుస్థిర శబ్దములు సాయము తీసికొనవలెను (దీని తరువాత రచింపఁ బడిన శతావధాన విధానమును జదువుఁడు). స్థిరనా మములకును ఈ యక్షరములకును స్థిరసంబంధము కలుగఁజేసి కొనవలెను. వీలగునంతవఱకు పృచ్ఛకుఁ డిచ్చిన అక్షర మొక శబ్దము యొక్క ప్రథమాక్షరముగ నుండునట్లుగఁ జూచి యా శబ్దమునకు, అవధాని మనస్సులోని ధ్రువ శబ్దమునకు సంబం ధములోని ధ్రువ శబ్దమునకు కల్పుకొనవలెను. 9వ అక్షరము 'చ', అవధాని యొక్క 9వ ధ్రువశబ్దము 'పాము' అనుకొనుడు. ప్పుడు అవధాని 'పాము చలిచీమల చేతఁ జిక్కి చావదె సుమతీ' అని యొక వాక్యమును కల్పించుకొనెను. మరల నతఁడు వరుసగఁ నక్షరములను జెప్పునపుడు 9వ సంఖ్య అతనికి మనసు లోనికి రాఁ గానే, 'పాము' అను ధ్రువ శబ్దమును దానితోపాటు 'పాము చలి చీమలచేతఁ జిక్కి చావదె సుమతీ' అన్న మాటయుఁ దోఁచి 9వ యక్షరము 'చ'యని స్పష్టపడును. ఈ క్రియ యంతయు నభ్యాసముచే నొకసెకను కంటె నెంతో తక్కువ కాలములో

జరుగును. ఇష్టాక్షరము శబ్దమునకు మొదట నుండుటకు వీలు లేని యెడల శబ్దమునకు మొదట నుండుటకు వీలు లేనియెడల శబ్దమునకు మధ్యను, చివర నుండునట్లు ఏర్పఱుచు కొనవచ్చును. మూఁడు నాల్గు హల్లులు గలసిన సంయుక్తాక్షర మైన యెడల నా యక్షరములు విడఁదీని వేఱు పదముగనో పదములగనో యేర్పాటు చేసికొనవలయును. 'స్య' అనునక్షర మిచ్చిన యెడల నిది గల శబ్దము దొరకుట దుర్లభము. కావున దానికి గుర్తుగ 'సంగయ్య'అను శబ్దమును కల్పించుకొని ధ్రువశబ్దముతోఁ గల్పుకొనవలెను. ఈ శబ్దమందలి మొదటి అక్షరము 'స్' కును, రెండవ క్షరము 'గ్'కుసు, మూఁడవ యక్షరము 'య్' కును ఉద్బోధికములుగ నుండును. అభ్యాసము వలను నీ కల్పనా శక్తి దినదినాభివృద్ధిం జెందును.

కొంచెము శ్రద్ధగ సుండవలెను. ఒకప్పు డితరములగు నవధానములను ఇదియు నొక్కసారి తటస్థింపవచ్చును. అప్పుడు పొరపాటు పడవచ్చును. ఇదియుఁ గాక, వీనిని లెక్క పెట్టునప్పుడు 1, 2, 3, 4 అని లెక్క పెట్టుకొనుచున్న యెడల నెక్కడనైనను అంకెలు పొరపడవచ్చును. క్రిందటి తడవ లెక్కించినది మూఁడా, నాలుగా అని సంశయము రావచ్చును. కావున 1టి కాఁగానే పరబ్రహ్మ మనియు, 2 కాఁగానే ద్వైత మనయు, 3 కాగానే వేదములనియు మనసులో నీ ప్రకారము మొదటి 10 సంఖ్యలకో 20 సంఖ్యలకో ఒక నామక్రమమును, తరువాత 10 సంఖ్యలకో 20 సంఖ్యలకో మఱియొక నామక్రమమును ఏర్పాటు చేసుకొన్న యెడల సంఖ్యలు తప్పకుండఁ దేలఁగలవు.

గణిత విషయమునందు లెక్కలు చేయుటయుఁ గలదు. కొందఱు కూడికలు గుణకార భాగహారములను చేయుదురు; కొందఱు ఇంగ్లీషు తారీకిచ్చిన యెడల మనసులో లెక్కవేసి వారము చెప్పుదురు, ఇందుకై వీరు గణిత శాస్త్రమునందు నిట్టి లెక్కలు చేయుటకై కల సులభ పద్ధతులను నేర్చుకొందురు.

శతావధానమందు నూర్గురు పృచ్ఛకులు వరుసగఁ గూర్చుండి అవధానిని క్రమముగ నూఱు విషయములను గుఱించి నిష్టము వచ్చిన వృత్తములనందు

వర్ణింపుమని యడుగుదురు. అవధాని మొదటి వాని యొద్ద నుండి చివరి వాని వఱకును వరుసగ నొక్కక్కనికి వాఁడు గోరిన విషయమును గుఱించి వర్ణనము వాఁడు గోరిన వృత్తమున మొదటి చరణము చెప్పుకొనుచుఁ బోవును. నూఱవ వానికి ప్రథమ చరణము చెప్పిన తరువాత మరల మొదటి పృచ్ఛకుని యొద్దకు వచ్చి యచ్చట నుండి క్రమముగ నూఱు మందికిని వారి వారి రెండవ చరణమును జెప్పును. ఇట్లు క్రమముగ నాల్గు చరణములును పూర్తి చేయును. తరువాత మొదట నుండి చివరి వాని వఱకు నొక్కొక్కనిఁ జూచి వారి పద్యముఁ బూర్తిగ నాల్గు చరణములును చదువును.

కొన్ని యవధానములందు నన్నియు వర్ణనములే పెట్టక, కొన్ని సమస్యలును, కొన్ని లెక్కలును (ఇంగ్లీషు తేదీ యిచ్చి వారము చెప్పుమనుట మొదలయినది), అష్టావధానముల వలె గంటలు కొట్టుట, పూలు వేయుట మొదలయినవియుఁ బెట్టుదురు. కాని వర్ణనములు. సమస్యలే యెక్కువగ నుండును. కావునఁ గవిత్వము చెప్పఁగల్గినవారే సాధారణముగ శతావధానము చేయఁగలరు. వారి వారి భాషా జ్ఞానమును బట్టి వర్ణనలు సమస్యలు సంస్కృతము, తెలుఁగు, పారిసీ మొదలయిన భాషలలోఁ జెప్పెదరు.

పూర్తిగ శతావధానము చేయుటకుఁ గాలము 16 గంటలు మొదలు 24 గంటల వఱకునును పట్టును. ఇన్ని గంటలొకటే రీతిని సభ చేయుచుండుట కష్టము గనుక, దినమునకు 5, 6 గంటల చొప్పున సభ చేసి మూఁడు నాల్గు దినములలోఁ బూర్తి చేయుదురు. ఇది యాంధ్ర దేశాచారము. ఉత్తర హిందూ దేశమందే యవధానమైనను ఒక్క సభలోఁ బూర్తి కావలసినదే. అట్లు కాని దానిని వారు అవధానమని యననేయనరు. కావున నచ్చట శతావధానము లరుదు. అష్ట, షోడశ, పంచవింశతి అవధానములే జరుగుచుండును. శతావధానము మిక్కిలి శ్రమ ప్రదము గనుక సాధారణముగ నొక్కసారి చెప్పిన వానికి 'శతావధాని' యన్న బిరుదు వచ్చును. అట్టి వారు మిక్కిలి తక్కువ. శతావధాను లన్న పేళ్లు పెట్టుకునికొనిన వారు సాధారణముగ నిరువది ముప్పది యవధానములను

మాత్రము చేయుచుందురు.

శతావధానమునందు నూర్గురు పృచ్ఛకు లడిగిన వర్ణన విషయములును వృత్తములును ప్రాసాక్షరమును జ్ఞాపక ముండవలయును. ఇంతియ కాదు, ఏ పృచ్ఛకుని యొద్దకు వచ్చి నప్పు డా పచ్ఛకుని విషయము, వృత్తము, అది వఱకుఁ జెప్పిన చరణము యొక్క ప్రాసాక్షరము జ్ఞాపకమున్నఁ గాని తరువాతి చరణము చెప్పుటకు వీలులేదు. కావున నవధాని అవధాన ధారణా జ్ఞాపకశక్తు లితరజనుల యాయా శక్తుల కంటె నెక్కుడు తీవ్రముగ నుండవలెననుటకు సందేహము లేదు. కాని యీ మానవ శక్తులెంత తీవ్రముగ నున్నను, కేవలము వాని సాహాయ్యముననే అవధానములు చేయఁగల్గుట యసంభవము. కావున నామానసిక శక్తులకుఁ దోడు పడుటకై కొన్ని యుపాయములను పన్నవలెను. ఈ యుపాయములు 'జ్ఞాపక సిద్ధాంతము' (Law of Association) అను మానసిక సిద్ధాంతము ననుసరించి పన్నఁబడును. విడివిడి శబ్దములను జ్ఞాపకముంచుకొనుటకంటె నా విడివిడి శబ్దములే యొక కథా రూపముగఁ జెప్పఁబడిన యెడల జ్ఞాపకముంచుకొనుట సుకరము. ఆ కథలోని ప్రతి శబ్దమునకు ఇతర శబ్దములతో కథరూప సాహచర్యము (సహవాసము) కలిగినందున, నిది యితర శబ్దములను జ్ఞాపకముగఁ (Reminder) బని చేయును. 'పుట్టె కట్టె కొట్టెను తెచ్చె' నను మాటలు అర్థము లేనవిగఁ జెప్పి జ్ఞాపకముంచుకొనమనినఁ గష్టముగ నుండును. కాని 'పుట్టె' ననఁగా రాముడు పుట్టెను. 'కట్టె' ననఁగా సేతువు కట్టె కట్టెను. 'కొట్టె' ననఁగా రావణునిఁ గొట్టెను. 'తెచ్చె' ననఁగా సీతను తెచ్చెను అని రామాయణ కథతో సంబంధము కలిపి యీ మాటలు చెప్పిన యెడల నవి జ్ఞాపకముండుటయే కాక వాని క్రమము గూడ జ్ఞాపకముండును. అట్లే పిల్లవాఁడు, చెప్పులు, కఱ్ఱ, చెవి, ఈఁకె, కరణము, కప్ప, కాలు, మామిడిపండు, జల్లెడ అను పది మాటలు మరలఁ జెప్పు మన్న యెడలఁ గ్రమముగఁ జెప్పుట కష్టము. ఈ పదములనే ఒక కథగ నల్లి ఒక పిల్లవాఁడు చెప్పులు తొడుగుకొని, కఱ్ఱ పట్టుకొని, చెవిలో నీఁకె కలము దూర్చుకొని, కరణమును వెక్కిరించుచు నడవఁగా నాతని కాలొక కప్పపైఁ బడి చేతిలోని మామిడి పండు

జాతి క్రిందఁబడి జల్లెడ వలె నంతటను చిల్లులు పడిపోయెను. అని చెప్పిన యెడల నీ పదము లన్నియు సులభముగ జ్ఞాపకముండయే కాక వాని క్రమముగ గూడ జ్ఞప్తిలో నుండును. ఇట్టి కొన్ని యుక్తులనే అవధానులుపయోగించెదరు. వాని విధము కొంచెముగ వివరిం చెదను.

అవధానములు చేయుట నేర్చుకొనునప్పుడు మొదట నవధాని నూఱుపేళ్లు క్రమము దప్పక వల్లె వేయును. ఈ పేళ్ల జాబితా ఒక్కొక యవధానికి నొక్కొక విధముగ నుండును. ఒకటే విధముగ నుండవలయునని లేదు. కాని యిద్దఱు అవధానులు కలిసి అవధానము చేయునెడల వారి జాబితా యొకటిగనే యుండవలయును, లేనియెడల నవధానము తప్పును. ఈ పేళ్ల జాబితాలో నే పేరు చెప్పినను అవధాని సంఖ్య వెంటనే చెప్పునట్లును, సంఖ్య చెప్పిన యెడల నా పేరు చెప్పునట్లును ఆ జాబితాను వల్లించి యలవాటు చేసికొనియుండును. అవధాని జాబితాలో 1వ శబ్దము 'శంకరుడు' 37వ శబ్దము 'చీఁపురుకట్ట', 75వ శబ్దము 'గుఱ్ఱము', 98వ శబ్దము 'ఉయ్యెల' అని అనుకొందము. బాగుగ వల్లించినందునను, అదే పనిగ అసకృదావృత్తిచే నలవాటు చేసి కొన్నందునను అవధాని గారికి 1 అనఁగనే 'శంకర' పదమును, 'శంకరుఁడు' అనఁగనే 1వ సంఖ్యయు జ్ఞాపకము వచ్చును. ఇట్లే అన్ని యంకెలను గుఱించియు, శబ్దములను గుఱించియు నని తెలిసికొనవలెను. ఇది అవధానముల మొదటి పాఠము.

ఇట్లు శబ్దములతో సంసిద్ధుఁడైన యవధాని, తన శబ్దములకును పృచ్ఛకుని ప్రశ్న విషయమునకును సంబంధము కల్పు కథలను అల్లుట నేర్చుకొనవలెను. అవధాని 1వ పృచ్ఛకుని యొద్దకు రాఁగా నాతఁడు నాకు పరీక్షా ఫలితమునకై యెదురు చూచుచున్న పిల్లవాని మానసికావస్థను వర్ణింపుమని అడుగును అని అనుకొందము. అవధాని 1వ అంకె 'శంకరుఁడు' కావున శంకరునకును పరీక్ష పిల్లవానికిని సంబంధము గల కథ యొకటి వెంటనే కల్పించుకొనును. 'పరీక్షా ఫలితమునకై ఎదురుచూచు పిల్లవాఁడు తన్ను శంకరుఁడు ప్యాసు చేసిన యెడల రెండు కొబ్బెర కాయలు కొట్టెదనని మ్రొక్కెను' అని యొక కథ తన మనసులో

వెంటనే అల్లుకొనును. దీని కెంతయో కాలము పట్టదు. అభ్యాసమధికమైన కొలఁదియు ఒక సెకనులో నరపాలు కూడఁ బట్టదు' ఇట్లు కథ కల్పించుకొనుట వలన ఈ శంకర పదము ద్వారా 1వ సంఖ్యకును, 1వ పృచ్ఛకుని విషయమునకు అవధాని మనసులో లంకె కూడి, మరలఁ గావలసివచ్చినపుడెల్ల జ్ఞాపకముగ నుండును అన్ని పదములకును పృచ్ఛకుని విషయముతో సంబంధము కుదురక పోవచ్చునని చదువరుల తలఁపవచ్చును. కాని అభ్యాసము వలన, నెట్టి విపరీతములైన రెండు విషయము లకును, లంకె పెట్టు నలవాటు అవధానికి సమకూరును. పరీక్ష పిల్లవానికిని ఇతర శబ్దములకును సంబంధమెట్లు కుదురునో చూతము. 1వ పృచ్ఛకుఁడు గాక 38వ పృచ్ఛకుఁడు ఈ (పరీక్ష పిల్లవాని) విషయమును వర్ణింపుమని కోరె ననుకొనుఁడు. అవధానుల 38వ శబ్దము 'చీఁపురుకట్ట'. పిల్లవానికి దీనికి సం బంధమును కల్పుట యెట్లు? 'పరీక్షా ఫలితమునకై యెదురు చూచుచున్న పిల్లవాఁడు తాను తప్పిపోయిన యెడలఁ దన్ను తన తల్లి చీపురుకట్ట తీసికొని కొట్టును అని భయ పడు చుండెను' అని కథ కల్పించుకొనవచ్చును; మఱియొక విధముగనైనను గల్పవచ్చును. ఇట్లు 'చీఁపురుకట్ట' శబ్దసాహ చర్యము చేత నవధాని మనసులో 38వ సంఖ్యకును పరీక్ష పిల్లవానికిని (ఆ యవధానము పూర్తి యగు వఱకు) నెడతెగని సంబంధము కలుగును. మరల నవధాని యా పృచ్ఛకుని యొద్దకు వచ్చి రెండవ చరణము చెప్ప వలసి వచ్చినప్పుడు గాని, నడుమ నెవరైనను 38వ ప్రశ్నకు జవాబు చెప్పుఁడని యడిగినప్పుడు గాని అవధానికి ఈ కల్పిత కథ వర్ణనీయ విషయమును జ్ఞప్తికిఁ దెచ్చి యిదివఱకు జెప్పిన చరణములను అందించును. ఇట్లే 75వ పృచ్ఛకుఁడు ఈ విషయమును వర్ణింపుమని కోరిన యెడల, 75వ శబ్దమగు 'గుఱ్ఱము'తో పరీక్షా బాలుకుని గల్ప 'నా కిప్పుడు పెద్దగుఱ్ఱమున్న యెడల నెక్కి సినెటుహౌసునకు వెళ్లి పరీక్షా ఫలితమును కనుఁగొని వత్తు' నని విద్యార్థి యనుకొనెను, అని కథ కల్పించు కొనవచ్చును. 98వ పృచ్ఛకుఁడడిగిన యెడల 'నా బాలుని మనస్సు ఉయ్యాల వలె నూఁగులాడు చుండె'నని యల్లవచ్చును. ఇట్లు కొంచెము ఆలోచన చేసిన యెడల నెట్టి శబ్దమునైనను ఎట్టి

విష యముతోనైనను కల్పవచ్చును. కల్పించుకొను కథలు, సందర్భములు వినుటకు సొంపుగ నుండవలెనని లేదు. ఎట్టి ఆవకతవకలుగ నున్నవిగను, ఎట్టి విచిత్రమయిన ఊహాలు గలవిగనైనను ఉండ వచ్చును. అవి అవధాని మనసునందే యుండును. ఇతరులకుఁ చెప్పఁబడవు. ఆయన మనస్సులో రెండు విషయములకు సం బంధము కలుగుటయే యుద్దేశము. స్థిరనామములకును వర్ణన విషయములకును సాధారణపుఁగథ పొసగనప్పుడు, స్థిరనామము లకు సంబంధించిన లేక పోలిన యిత నామములతో సంబంధ పఱచి, భయంకర కృత్యములు, విపరీత కార్యములు, అద్భుత చర్యలు కల్పించుకొన్న యెడల మనఃపటము నందు నవి దృఢముగ నాఁటుకొనును. 25వ పృచ్ఛకుఁడు సెటిల్‌మెంటును గుఱించి యడిగెననుకొనుము. అవధానుల వారి 25వ శబ్దము 'శ్రీరాముడు' అనుకొందము. శ్రీరామునితోఁ గథ కల్పించుకొనుటకు వీలు లేనప్పుడు బలరాముఁడు, పరశురాముఁడు, రాముఁడు మొదల యిన పేళ్లతోనైనను కల్పవచ్చును. అవధానులు మాననీ యులగు మోచర్ల రామచంద్రరావు గాని నెఱుఁగుదురేని, మాననీ యులగు రామచంద్రరావుగారు లెజస్లేటివ్ కౌన్సిలులో 'సెటిల్ మెంటును'ను గుఱించి ప్రతిపక్షుల గుండెలదరు నట్లు సంభాషించిరి అని కల్పిం చుకొందురు.

ఈ ప్రకారము పృచ్ఛక సంఖ్య జ్ఞాపకము వచ్చినతోనే దానికి సంబంధించిన విషయము జ్ఞాపకము వచ్చునుపాయము చెప్పఁబడినది. ఇక వృత్తము, ప్రాసమును జ్ఞాపకముందు నుపాయ మెద్దియో విచారింతము. పది, యిరువది యవధానములు, మాత్రము చేయునప్పుడు, విషయము జ్ఞాపకము రాఁగానే, దానిని గుఱించి యంతకుఁబూర్వము చెప్పిన చరణము జ్ఞాపకమునకు వచ్చును. కాని నూఱు అవధానములు చేయవలసి వచ్చినప్పుడు ఏవియైనను గుర్తులు పెట్టుకొనని యెడల నొకప్పు డవధానులు పొరపడవచ్చును; కావున నట్టి సంశయము వచ్చినపుడు నిశ్చయబుద్ధి కల్గుటకై వృత్తమును గూడ నంతకుఁబూర్వము కల్పించుకొన్న కథతో లంకె పెట్టెదరు. శార్దూలము, మత్తేభము, ఉత్పలమాల, చంపకమాల, సీసము, కందము, తేటగీత, ఆటవెలఁది మొదలయిన వృత్తముల పేళ్ళు గాని, గుర్తులు

గాని కథతోఁ గలయునట్లుగ నల్లుకొందురు. 1వ పృచ్ఛకుఁడు పరీక్ష పిల్లవానిని గుఱించి శార్దూలముతో వర్ణింపుమని యడుగఁగా 'పిల్లవాఁడు శంకరుని ధ్యానించి కొబ్బరికాయ కొట్టెదనని మ్రొక్కను' అని కథ కల్పించుకొను నని యిదివఱకుఁ జెప్పితిమి. ఇందు వృత్తము సంగతి కూడఁ గలసి యుండవలయునన్న, 'పిల్లవాఁడు శంకరుని శార్దూలాంబరునిగా ధ్యానించి కొబ్బరికాయ కొట్టెదనని మ్రొక్కను' అని కథ కల్పించుకొందురు. 'మత్తేభము' చెప్పుమన్న 'గజచర్మధరుని ధ్యానించెను' అని అనుకొందురు. ఉత్పలమాలకు 'పెద్దదండ' అనియు, చంపకమాలకు 'చిన్నదండ' అనియు, కందమునకు కంద, పెండలములు మొదలయిన పదములను, సీసమునకు వెండి, బంగారము, సీసము మొదలయిన పదములను గుర్తుగ నుంచుకొని వీలుప్రకారము కథలోఁ గల్పుచుండును. కొందఱింకొక మార్గము నవలంబింతురు. ఆకారము మత్తేభమునకును, అకారము శార్దూలమునకును, ఉకారము చంపకమాలను, ఊకారము ఉత్పలమాలకును ఇట్లే మిగత గుర్తులు పెట్టుకొందురు. ఈ గుర్తు ప్రకారము 1వ పృచ్ఛకుఁడడిగిన ప్రశ్నకు 'పరీక్ష పిల్లవాఁడు పరీక్ష ప్యాసు అయిన యెడల శంకరునకు నూఱు మామిడికాయలు సమర్పించెదను' అని మ్రొక్కెనని కథ కల్పించుకొందురు. 'మామిడి' శబ్దములోని మొదటి అక్షరమైన 'మా'లో 'ఆ' ఉన్నది గనుక నది శార్దూల వృత్తమునకు జ్ఞాపకము. ఇట్లే ప్రాసములను గుఱించి చియుఁ గథ కల్పించెదరు. పై ప్రశ్నమునకు నుత్తరముగ మొదటి చరణము చెప్పఁగ 'ద్ర' ప్రాసము పడిన యెడల పైకథలోఁ జిపర 'అని మ్రొక్కుచు వాఁడు నిద్రించెను' అని కలుపుకొనును.

**వైదికావధానము:** 'అవధాన' శబ్దము మొదట వేదాధ్య యనమును గుఱించి వాడుక లోనికి వచ్చినది. అడిగిన పన్నము గాని, పనస గాని తప్పక చెప్పుటకు తదేక దృష్టి కావలయును. అదియే యవధానము. 'తు', 'చ' తప్పకుండఁ బనస చెప్పిన వానిని 'అవధాని' యందురు. పనస చెప్పుటలో పదము, క్రమము, జట, ఘన, రథ, పంచసంధి అని ఐదు విధములు కలవు. ఇవన్నియుఁ దప్పక చెప్పుటకు నద్భుత ధారణాశక్తి యుండవల యును. మొదటఁ బది పండ్రెండు సంవత్సరముల

వఱకును సంథ వల్లించి తరువాత ననకృదావృత్తి యున్న యెడల నివి యన్నియు సిద్ధించును. ఇందులో ననేక విధములయిన చిత్రములు చేయుచుందురు. పది పనసలఁ దీసికొని, మొదట నన్నింటి మొదటి పదములను, తరువాత నన్నింటి రెండవ పదములును, తరువాత నాల్గవ పదములను ఇట్లు క్రమముగఁ జెప్పుదురు! ఒక పనసఁ దీసికొని మొదటి చివరి పదము లొక్కసారియు, తరువాత మొదట నుండి రెండవ పదమును, తరువాత మొదటి నుండి మూఁడవ పదమును చివరి నుండి మూఁడవ పదమును ఇట్లు గబగబ చెప్పుదురు.

**స్వరావధానము :** వైదికావధానము నందే స్వరావధానమన్న యొక భేదము కలదు. వేదమంత్రములకు ఉదాత్తానుదాత్త స్వరితప్రచయములను నాల్గు విధముల స్వరములు కలవు. ఈ నాల్గు స్వరములకును నాల్గు పేళ్లు గుర్తు పెట్టుకొని పృచ్ఛకుఁడు దూరముగఁ గూర్చుండి యొక పనస మనసులో ననుకొని (పృచ్ఛకు నకుఁ బనసపాఠము రానియెడలఁ బనస గల కాగితము అవధా నికిఁ గానరాకుండఁ బెట్టుకొని వ్రేళ్ళపై స్వరము చూప వచ్చును) వేళ్ళమీఁద బొటిమన వ్రేలితో స్వరములు మాత్రములు చూపును. ఆ వ్రేళ్ళ గుర్తును చూసి అవధాని ఆ పనసను గుర్తించి చదువును. ఇందుకు స్వరావధాన మనునొక గ్రంథము కలదు. అందు ఉదాత్తము మొదటఁ గల పనసలివి, అనుదాత్తములు మొదటఁ గలవి యివి యని విడఁదీసి చెప్పఁబడి యుండును. అవధాని వానిని పాఠము చేసి యుంచును.

**నేత్రావధానము :** ఇందు నిద్దఱవధానులు పనిచేయుదురు. ఒకఁడు దూరముగఁ గూర్చుండి మనము కాగితము మీఁదను వ్రాసియిచ్చిన మాటలు గదల్పక, కేవలము కనులను కదల్చి రెండవ యవధానికిఁ దెల్పును. అతఁడా కనుల చలనముఁ జూచి, యా మాటలు నోట జెప్పును. వీరిద్దఱును మొదట నక్షరములకు ఁ గను సంజ్ఞ లేర్పఱుచుకొందు రనుట స్పష్టము. అట్లేర్పఱుచు కొనినను, అవధాని సావధానముగ నేత్ర చలనము అనుసరిం చినఁ గాని వాక్యమును కనుఁగొనలేఁడు.

**అవధానము, యోగము:** ఇటీవల మన తెనుఁగు దేశ మందు నవధానముల పిచ్చియు, ఆశుకవిత్వముల పిచ్చియు హెచ్చినది. ఏ పిల్లవాఁడును అష్టావధానియే, నాల్గు పద్యము లల్ల నేర్చిన ప్రతి వాఁడును శతావధినియే. అవధానశక్తి నెంత వఱకు నభివృద్ధి చేయవచ్చు నన్న విషయమును జూపుట కెవ్వఁడేనియు నొక్కఁ డిట్టి యవధానముల వెంట దగిలినను తగుల వచ్చును కాని ఎక్కడు జనులవధానములు చేసిన యెడలఁ బ్రయో జనము లేదు. ఎక్కుడు శ్రమ చేసిన యెడల విద్యార్థులకును, సామాన్య జనులకును బుద్ధి భ్రంశము కలుగువచ్చును.పది విషయములందు నొక్క కాలమున లక్ష్యము పెట్టుటకు యత్నించుటకంటె నొక కాలమున నొక విషయమునందు నిశ్చలముగ దృష్టినిగాని మనస్సుగాని నిల్పి, తదేక నిష్ఠతో సను సంధానము చేయు సామర్థ్యమునకై పాటుపడుట మన విద్యార్థులకును, ఇతర జనులకును ఉపయోగకరము. దీనినే యోగ మందురు. కావున శతావధానము కంటెఁ బ్రపంచమునందు నేకావధానమే ముఖ్యముగ విద్యార్థులకు నావశ్యకము. ఇతర విషచయములన్నింటిని మఱచి యేక విషయమునందుఁ గొంచెము కాలమైనను పూర్తిగ మనసు నిలుపగల్గితిమేని యా విషయమును వేయి సారులు వల్లించిన దానికంటె నెక్కుడు గట్టిగను, స్పష్టముగను, అచలముగను, ఆ విషయ మలవడును.

**గ్రంథ సంగ్రహము :** అవధానమును గుఱించి సంస్కృ తము నందు గ్రంథ మున్నట్లు కానరాదు. ఇటీవల శ్రీయుత నందగిరి శేషగిరిరావుగారు "అవధాన దర్పణము" అను తెనుఁగు గ్రంథ మును ప్రకటించినారు. అవధానమును గుఱించిన రహస్యములను ఇతరులు దాఁచి యుంచుచుండఁగ వీరు తమ యనుభ వములను పుస్తక రూపముగఁ బ్రకటించి ప్రపం చమునకుఁ దెల్పుట యెంతయు శ్లాఘా పాత్రము.

**(ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం నుంచి)**



# ఆంధ్ర సాహిత్యంపై సంస్కృత మహాభారత ప్రభావము

శ్రీ పింగళి లక్ష్మీకాంతం

మన పూర్వ్వతు 'ద్వాపరాంతము' అని చెప్పేకాలమున అనగా షుమారు అయిదువేల సంవత్సరముల క్రిందట ఈ మన భారత దేశంలో సర్వసంప్రదాయనాశహేతు వయిన ఒక సంక్షోభము తుపానువలే లేచి భరత ఖండము నంతనూ ముంచి వేయటానికి ఉద్యుక్తమై యుండునది. మన జాతియొక్క ప్రవృత్తికి, మన సాంఘిక నియమములకు, మన ఆధ్యాత్మిక ఉన్నతికి ఆది నుంచీ కారణభూతమైన వేదశాస్త్ర విజ్ఞానమంతా ఆ మహాకల్లోలంలో ఛిన్నాభిన్నమై, సనాతన మార్గము తప్పి, పరస్పర భిన్నములైన పలు రకముల కృత్రిమ మతములకు, ఆ మతములను ఆశ్రయించిన పలు రకముల జాతులకు, ఆ జాతులను పాలించే పలు రకముల రాజులకూ తల యెత్తే అవకాశం చిక్కినది. ఆ విప్లవమును ధర్మగ్లాని అని గాని, ధర్మసాంకర్యము అని గాని చెప్పవచ్చును. ఎప్పుడెప్పుడు ధర్మగ్లాని కలుగుతుందో అప్పుడప్పుడు నన్ను నేను సృజించు కొంటాను అని చెప్పిన భగవంతుడు శ్రీకృష్ణుడు సనాతన ధర్మమును పునః ప్రతిష్ఠించుటకు ఆ కాలంలో అవతరించినాడు. ఆ ధర్మసంస్థాపనార్థమై ఆయన చేపట్టిన సాధనములలో భారత యుద్ధము ఒకటి.

భారత యుద్ధము కేవలము కురుపాండవుల యుద్ధమే కాదు. ఆ రెండు పక్షముల నిమిత్తముగా ఆనాడు ఈ భరత ఖండములో ధర్మాధర్మములకు జరిగిన మహాయుద్ధమది. కృష్ణుని అవతారమునకు పూర్వమునుండియే ఆ రెండు పక్షములునూ తమ తమ సేవలను కూర్చుకొనుచూ, తమ తమ పక్షములను బలపరచుకొనుచూ, ఎడనెడ తారసిల్లినపుడు ఒండొంటిని తాకుచూ ప్రజాసమూహామునకు కంటికి నిద్రయు, కాలికి

నిలకడయు లేని ఉపద్రవమును దెచ్చి పెట్టుచుండినవి. చారిత్రకంగా చూస్తే అధర్మమే బలవత్తరమై ఉండినది. దానికి ఆబలము చేకూర్చిన రాజులు కంసుడు, శిశుపాలుడు, నరకుడు, జరాసంధుడు మొదలైనవారు. వీరిలో ప్రబలులైన నరకజరాసంధులు నరబలిని కోరే హింసాత్మక శాక్తేయ మతస్థులు. ఉత్తర హిందూ స్థానంలో సగంకంటె ఎక్కువ భాగం వారి వశంలో ఉండినది. మతము పేరిట వారు సాగించిన దుష్పరిపాలనమే వారికి రాక్షసులని పేరు తెచ్చింది. ఈ రాక్షసులను స్వయంగా సంహారంచేసి, వారవలంబించిన దుర్మతమును తుడిచివేసి, సనాతనమును, ఉపనిషత్ర్పతి పాదితమును ఆయన సాత్విక మతమును ప్రతిష్ఠించుటయే తన అవతార ప్రయోజనంగా భావించి శ్రీకృష్ణ భగవానుడు తన భూలోక యాత్రను మొదటి నుండీ సాగించాడు. తాను పునః ప్రతిష్ఠచేసే ఆసనాతన ధర్మం శిరసావహించి తనకు శిష్యుడై తన ఉపదేశప్రకారం ప్రజాపరిపాలనం ఏర్పర్చగల ధార్మికుడైన మహాప్రభువు పాండవుడేనని చూడగలిగి అతనికి భారతయుద్ధ జయము నిచ్చి ధర్మపరిపాలకుడైన రాజుగా పట్టాభిషేకం చేశాడు.

ఈ మహాయుద్ధానికి పూర్వం ఎంత కాలం నుండో విజృంభిస్తున్న సాంఘిక దావాగ్నిలో పురాతన భారత విజ్ఞానమంతా దగ్ధమైపోయింది. వేదములు తారుమారైనవి. ఉపనిషత్తులు, ధర్మ శాస్త్రములు విస్మృతములైపోయినవి. అసద్ధర్మములు, అసత్య సిద్ధాంతములు తలయెత్తసాగినవి. ఆనాటి విజ్ఞానమంతా గ్రంథ రూపంలో కాక శ్రుతరూపంగానే ఉండేది. అందచేతనే పండితులకు బహుశ్రుతులు అనే పేరు వచ్చింది. ద్వాపరాంతంలో జరిగిన యీ ప్రళయంలో శ్రుతరూపమైన ఆవిజ్ఞానమంతా మృగ్యమైపోయింది. ధర్మసంస్థాపనం చేయటానికై కృష్ణుడవతరించినట్లే ఇంచుమించుగా అస్తమించిపోయిన ఆ ప్రాచీన విజ్ఞాన సంస్థాపన చేయటానికే వ్యాసుడు పుట్టాడు. అందుచేతనే ఆ మహర్షిని నారాయణావతరామన్నారు. ఆ యుగాంతంలో యాదవకృష్ణుడున్నూ, కృష్ణద్వైపాయనుడున్నూ పుట్టియుండకపోతే ఈ భారతదేశము పాశ్చాత్యులు అడుగుపెట్టేనాటికి ఆఫ్రికా, అమెరికా ఖండము లున్నట్టుగా శుద్ధ అనాగరక జాతులకు ఆలవాలమై భూతప్రేత పిశాచములకు తాండవరంగంగా ఉండేది.

వ్యాస భగవానుడు ఈ విజ్ఞాన సంరక్షణానికి పూనుకొనినప్పుడు మొదట చేసిన కార్యం వేదములను విడదీయటం. ఆనాటికి పేదములు చిక్కుపడ్డ నూలుగుట్టవలె పోగు

తీయటానికి వీలు లేకుండా చేతపట్టితే తెగిపోయేస్థితిలో ఉన్నాయి. ఆ నూలిరాశి దగ్గర కూర్చుండి ఒక్క పోగైనా తెగకుండా ఆ చిక్కు తీసి పడుగుగా చాచినవాడు వ్యాసుడు. ఈ అర్థాన్నే ఎఱ్ఱాప్రెగడ 'ప్రోగులై యెందును పోగేర్పడక యున్న, శ్రుతులన్నియును ఓజ సూత్ర పరిచె' అని చక్కగా, సంగ్రహముగా, వ్యంగ్య ప్రధానమైన పద్య పాదంలో ఇమిడ్చాడు. వేదములు విడదీసినంతనే భారతీయ సంస్కృతి భవనమునకు దృఢమైన పునాది యేర్పడింది. ఆయన భారతాన్ని రచించడము అనగా ఆ పునాదిమీద భారతీయ విజ్ఞాన సౌధాన్ని నిర్మించటము. కౌరవ పాండవ చరిత్రను నిమిత్త మాత్రముగా గ్రహించి ఆ మహాకవి భారతములో ధర్మశాస్త్ర వాక్యములూ, ఆగమ తాత్పర్యములూ, ఉపనిషద్రహస్యములూ, ఐతిహాసిక గాథలూ, పురాణ చరిత్రలూ, రాజవంశ వర్ణనలూ, అది యిది అననేల, సమగ్ర భారతీయ సంస్కృతి సారమంతా రాశీభూతం చేసి ఒక్కచోట నిబంధించాడు. ఆనాటికి ఒండొంటికి పొత్తు కుదరక తలకొకదారిని పోతున్న ఆగమ సిద్ధాంతముల నన్నిటినీ సమన్వయపరచి వాటికన్నిటికీ ఏకవాక్యత కల్గించాడు. మీదుమిక్కిలి సర్వోపనిషత్ సారమైన భగవద్గీతను ఇందు బంధించి ఉపనిషదర్థములకు స్థిరమైన వసతి ఏర్పరచాడు. ఇంచు మించు సనత్సుజాతీయము కూడా అట్టిదే.

ఈ మహారచనవల్ల రోగగ్రస్తమై చివికి జీర్ణించిపోతున్న భారతీయ ఆత్మస్వరూపము ఆరోగ్యవంతమై నూతన యౌవనము తో, వసంత ఋతువునందలి ఉద్యానవనమువలె కలకలలాడ జొచ్చింది. ఆకల్పవాటికలో లభించని సత్పదార్థం లేదు. ఎవరు ఏ భావముతో సేవిస్తే ఆ భావితార్థమే లభించింది. ఆదిపర్వము 32వ పద్యము 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని' ఇత్యాదిచూడండి. ఈ అర్థాన్నే సూత్రప్రాయంగా 'ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ, యది హాస్తి తదన్యత్ర యన్నే హాస్తి నతత్ క్వచిత్' అని సౌతి అన్నాడు. అయితే వారి వారి అభిమతములనుబట్టి నానామూర్తు లుగా గోచరించే యీ భారత సరస్వతియొక్క నిజస్వరూపం ఏమిటని ప్రశ్నిస్తే అది ధర్మా ద్వైతమూర్తి అని తిక్కన సోమయాజి చరమపరమ సిద్ధాంతము చేశాడు. ఇందుచేతనే సమస్త వేద వేదాంగసారములు క్రోడీకరించిన కోశము కావున ఈ మహాగ్రంథము పంచమవేదమైంది.

భారతదేశములోని దేశ భాషలు, ఆ భాషలలోని కవిత్వము మొదట యెట్లా పుట్టినా, ఆయా భాషలలో ఉత్తమ సాహిత్యము అని చెప్పుకోతగిన ప్రౌఢరచనలన్నీ సంస్కృత

వాఙ్మయానికి అనువాదాలు గానో, అనుసరణములుగానో అవతరించాయి. దీనికి కారణమేమంటే భారతజాతి కంతకీ ఒకే సంస్కృతి ఉండటం, అది అంతా సంస్కృతంలో నిక్షిప్తమై ఉండటమున్నూ, విజ్ఞానాత్మకము, ఉపదేశపూర్వకము అయిన సాహిత్యరచనకు దొరకొన్న దేశ భాషాకవులు ఆ సంస్కృత మహానిధులను త్రవ్వి ప్రజలకు ఆ ధనములను పంచిపెట్టటం కంటె తాము క్రొత్తగా సృష్టించేది యేదీ ఉండదని భావించి ఉంటారు. సంస్కృతానువాదములను ప్రారంభించక ముందు ఆయా భాషలలో కవులూ లేకపోలేదు. కవిత్వమూ పుట్టకపోలేదు. కాని అదంతా బాల్యదశ. ఆ బాల్యదశలోని కవిత్వమంతా రమణీయంగా, ఆనందజనకంగా ఉండవచ్చు. ఆనందజనకమైనంత మాత్రమున సారస్వత ప్రయోజనము పూర్తిగా సిద్ధింపదు. ఆనందముతోబాటు విజ్ఞాన బోధకత్వముంటేగాని సాహిత్యము ఉత్తమ కక్ష్యకు ఎక్కదు. చిత్రకళలలో తానును ఒకటి అయ్యూ కవిత్వము తక్కిన సోదర కళలకు దుర్గమమైన భూములను మెట్టుట యీ కారణము చేతనే. సంగీతాది చిత్రకళలు ఆనందదాయకాలేగాని విజ్ఞానోపదేశకములు కావు. ఆ ఉభయ సామర్థ్యములు కలది కావ్యం. అందుచేత మహా కావ్యము లెప్పుడూ విజ్ఞాన – ఉపదేశములతో విశ్వశ్రేయమును కాంక్షిస్తూనే ఉంటాయి. 'విశ్వశ్రేయః కావ్యం' అనే వాక్యమునకు అర్థమిది. సమగ్రమైన ఆత్మీయతావికాసము కలగవలెనంటే, రసాస్వాదనతోబాటు ఆత్మజ్ఞానము సంపాదించవలెనంటే ప్రౌఢ సారస్వత సేవకంటే వేరొక మార్గం లేదు. కవిగా జన్మించినందు వలన తనమీద భగవంతుడు పెట్టిన బాధ్యతను గుర్తించిన మహాకవులు అటువంటి మహాగ్రంథరచనములకే పూనుకుంటారు. కాని మహాగ్రంథ రచనము వస్తువుగా మహాకథను ఆపేక్షిస్తుంది. అల్పకథలను తీసుకొని మహాప్రబోధములను సల్పవలెనంటే సాగదు. మన దేశములో జరిగిన అటువంటి మహాకథలలో భారతం మొదటిది.

భారతకథను దేశ భాషలలోకి అతరింపచేస్తే ప్రజలకు విజ్ఞాన సత్రము నెలకొల్పినట్లు అవుతుందని, ఆ ప్రజలు ధర్మమార్గమున సంచరిస్తారు అని, వారు మాట్లాడే భాష ఉత్తమ సాహిత్యద్రవ్యంగా పరిణమిస్తుంది అనీ సంకల్పించిన మహోదారుడు రాజరాజనరేంద్రుడు. ఆ సంకల్పాన్ని నిర్వహించటానికి తాంబూలము పుచ్చుకున్న మహాకవి నన్నయభట్టు. నన్నయ ఆదికవి అయినట్లు గానే తెలుగులో భారతము

ఆదికావ్యమయింది. సంస్కృతములో రామాయణం ఆదికావ్యమయి యుండగా దానిని వదిలిపెట్టి రాజరాజనరేంద్రుడు భారతాన్నే ఎందుకు కోరాడంటే మహత్త్వములో రామాయణముకంటే భారతము గొప్పది కనుక, నన్నయ భారతము పుట్టకచేత అది కావ్యమే కాకుండా ఉత్తమ కావ్యరచనకు మార్గదర్శకము కూడా అయింది. ఆయన 'ఆంధ్ర కావ్యపథమ్ము తీర్చినవాడు' అని ఖ్యాతిని పొందారు. అంతేకాదు. నన్నయనాటికి ఆంధ్రభాషకు చక్కని వ్యవస్థ యేర్పడి లేదు. తెలుగు భాషను సంపన్నముగా చేయుటకై ఆనాటి రచయితలు స్వీకరిస్తున్న తత్సమ తద్భవ పదములకు శాస్త్రీయమైన సురూపత యేర్పడ లేదు. సమాసఘటనలు కూడా నియతిని పొందలేదు. అవ్యవస్థితము గా నున్న ఆ భాషలో భారత రచనమే కాదు. ప్రామాణికమైన ఏగ్రంథ రచనమూ సాగదు. అందుచేత భాషాసంస్కారమునకు, దాని ప్రామాణికత్వమునకు, శబ్దస్వరూప నిరూపణకు ఆనాటి పండితులు పరిషత్తులుగా ఏర్పడి చాలా కృషిచేశారు. వారిలో నన్నయ భట్టు అగ్రస్థానమును అధిష్టించాడు. ఆ పరిషత్ సహాయంతో ఆయన చేసిన అనుశాసనమే తెలుగు భాషకు ప్రమాణమైంది. ఆయన వాగనుశాసనుడైనాడు.

లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని భారతమును కొనియాడడం సంస్కృత భారతముపట్ల సందేహాస్పదమే అయినా తెనుగుభారతముపట్ల యథార్థమైనది. సంస్కృత భారతములోని కొన్ని ప్రయోగములు వైయాకరణులుగాని యితర కవులుగాని లక్ష్యముగా స్వీకరించటానికి అంగీకరించరు. అవి ఆర్ష ప్రయోగములు అని వాటికి ప్రత్యేక మొకస్థానము ఇస్తారు. ఇక తెనుగుననో మన భారతాన్నిబట్టే లక్షణగ్రంథాలు పుట్టాయి. కవుల కందరికీ ఈ భాష లక్ష్యమైంది. భారత ప్రయోగానికి విరుద్ధంగా ప్రయోగం చేసే కవులందరూ అప్రామాణికులుగా తిరస్కరించ బడ్డారు. కావున భాషాలక్షణమునకు, లక్ష్యమునకు కూడా దృఢతరమైన యీ పునాదిమీదనే ఉత్తర కాలంలో ఆంధ్ర వాఙ్మయ గోపుర నిర్మాణం జరిగింది.

కాని, నన్నయ చేతిలో భారతము పూర్తికాకపోబట్టి రాజ నరేంద్రుడు ఆశించిన ప్రయోజనం నెరవేరలేదు. భారత కథలో మూడువంతులు నిలిచిపోవటమే కాకుండా ధర్మ ప్రతిపాదకమైన మహాగ్రంథమంతా మిగిలే ఉన్నది. దానిని చేపట్టి కొనసాగింపగల మహాకవి యెవ్వడూ రెండు వందల యేళ్లదాకా పుట్టలేదు. ఆ రెండు వందల యేళ్లలో

ఆంధ్ర దేశంలో ఇంచుమించు ద్వాపరాంతం లో ఉత్తర హిందూస్థానంలో తటస్థించిన విప్లవంవంటి విప్లవమే పొడచూపింది. వీరశైవము అనే పేర ఒక నూతన మత ప్రచారం సాగి వర్ణాశ్రమ ధర్మాలను, కర్మపరత్వమును, నిర్దయంగా తీక్షణంగా ఖండింప మొదలిడింది. ఆ మతాచార్యుల ఉపదేశములూ ఆ కవుల గ్రంథములూ అమాయికమైన ప్రజాసామాన్యమును, సామాన్యులనే కాక వివేకవంతులైన విద్యావంతులను కూడా సనాతన మార్గం నుండి తొలగింపపూనుకొన్నాయి. శివభక్తి, శివారాధన, శివపారమ్యము భారతీయులందరకూ వందనీయమే కాని శివేతరులైన దేవతలను నిందించటం, దూషించటం, వీరశైవ చిహ్నామైన లింగధారణం మొదలైనవి లేని శివభక్తులను తూలనాడటం మొదలైన గ్రామ్య ప్రచారాన్ని అరికట్టటానికి అద్వైతానికి శక్తిచాలక ఉండినది. అద్వైతసారమంతా సంస్కృత భాషలో ప్రస్థానత్రయంలో ఉన్నది. దానిని చదివినవారు, చెప్పగా విన్నవారు, విని గ్రహించినవారు చాలా తక్కువ. భారతంలో ఉన్నది ఈ అద్వైతసారమే గదా! ఆ భారతాంధ్రానువాదాన్ని పూర్తిచేస్తే ప్రజలకు ప్రజల భాషలో అద్వైతమును బోధచేసినట్లు అవుతుంది. ఆ ధర్మసారం వంటపడితే వీరశైవంమీద వారే విముఖులవుతారు. అందుచేత కవిబ్రహ్మ తిక్కనసోమయాజి దీక్షాపూర్వకంగా భారత రచనానికి ఉపక్రమించి ఆంధ్రులకు ఆంధ్ర భాషలో అద్వైతామృతాన్ని పంచిపెట్టాడు. స్వర్లోకవాసులయిన రాజరాజ నరేంద్రుడు, నన్నయభట్టు, తమ తపస్సు ఫలించిందని సంతోషించారు. శివకేశవాత్మకమైన హరిహరపరబ్రహ్మమును సృష్టించిన అపరబ్రహ్మ యీ కవిబ్రహ్మ.

ఆ అద్వైతమూర్తిని ఆయన ఆవిష్కరించినంతనే ఆంధ్ర దేశంలో వీరశైవ, వీరవైష్ణవ అంతర్యుద్ధాలు సమసిపోయినవి. నూటికి ఏ నలుగురైదుగురో తప్ప ఆంధ్రులందరూ అద్వైతులే అయినారు. నేటికిని మనలో బహు సంఖ్యాకులకు శివకేశవభేద బుద్ధియే లేదు. 'శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే' అన్న మంత్రార్థమును మనము జీర్ణించుకొన్నాము. వీరశైవము పేర యీ మతవిప్లవమే కాక ఆదుష్కాలములో ఈ ఆంధ్ర భూమిలో రాజకీయ విప్లవములు కూడా చెలరేగినవి. అచిరకాలములోనే రాజ్యముల తరువాత రాజ్యములు కూలిపోయినవి. పల్నాటిలో ఆనాటి భారత యుద్ధానికి ప్రతిబింబంగా అన్నదమ్ములకు మరియొక యుద్ధం జరిగింది. ఈ అంతర్వైరమువల్ల

దేశము నిర్వీర్యమై ఛిన్నాభిన్నములై పోయినది. ఈ దురంతమంతా పారజూచిన పెద్దలు కొందరు ఆంధ్రజాతిని ఏకముగా సంఘటించుటకు, ఆంధ్రత్వమునకు ఒక సుస్థిరరూపమును ఏర్పరచుటకు పలువిధముల పాటుపడిరి. వారి పరిశ్రమముయొక్క సారస్వత రూపమే తిక్కనగారి భారత స్వరూపము. ఆంధ్రత్వమునకు, ఆంధ్రభాషకు, అద్వైత మతమునకు మన హృదయములలో దృఢస్థానకమైన స్థిరత్వ మేర్పడినది. ఈ భారతరచనలో తిక్కన చూపిన కళాకౌశలం నాటి నుండి నేటిదాక 'కావ్యశిల్పిని' అని అనిపించుకోదలచినవాని కెల్ల మేలుబంతియైనది.

తదుపరి నూరేండ్లకు అరణ్యపర్వ శేషమును పూర్తిచేసిన ఎఱ్ఱాప్రగడ కూడా నన్నయ తిక్కనల ప్రక్క నిలబడగల మహాకవియే. కవిత్రయము అను పేర ఆ ముప్పురు మనకు పూజ్యులైనారు. ఇంకొక చిత్రమేమంటే గుణప్రాధాన్యమునుబట్టి చూచినపుడు ఈ ముగ్గురి రచనలును మూడు భిన్న పద్ధతులలో నడుస్తుంటాయి. నన్నయ రచనలో ప్రధాన గుణము కథా కథనము. తిక్కన రచనలో ప్రధాన గుణము నాటకీయత, అనగా సంవాద చతురత, పాత్ర చిత్రణము, అభినయ నిర్దేశము మొదలైనవి. ఎఱ్ఱన రచనలో ప్రధాన గుణము వర్ణనా సౌలభ్యము. అసలు సారస్వతము అనేది శ్రవ్యము, దృశ్యము, వర్ణనాత్మకము అని మూడు విధములుగానే ఉంటుంది. ఆ మూడు శాఖలకు ఈ ముప్పురు ఆది కవులు మహాగురువులై ఉత్తరకాలంలో ఏ జాతి కవికైననూ తమ రచనే ఆదిభిక్ష అగునటులుగా భారతమును ఇచ్చిపోయినారు. ఈ భరత ఖండములో ఏ దేశ భాషలోను ఆంధ్ర మహాభారతంవంటి భారతము లేదు. ఆంగ్ల సారస్వత ప్రతిష్ఠకు ఒక షేక్స్పియరు నాటక చక్రమే చాలినట్లుగా ఆంధ్ర సారస్వత ప్రతిష్ఠకు ఒక్క మహాభారతమే చాలును. మన జాతికి ఇటువంటి మహాప్రసాదము లభించుట సంస్కృత భారత ప్రభావము వల్లనే.



# నాగేశ్వరరావుపంతులుగారు:

# తత్త్వవేత్త, గ్రంథకర్త

శ్రీ నోరి నరసింహశాస్త్రి

(శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆధునిక తెలుగు భాషా సాహిత్య సంస్కృతులను ఉజ్జీవింపచేసినవారు. ప్రాచీన సాహిత్యాన్ని పునరుజ్జీవింప చేసినవారు. తెలుగువారి సర్వతోముఖ విజ్ఞాన వికాసానికి కారణజన్ముడైన మహితాత్ముడు పంతులుగారు. కొమర్రాజు, కందుకూరి, గిడుగుల సమస్కంధుడు ఆ మహనీయుడి దివ్యమూర్తి మత్త్వం ఈ వ్యాసంలో నిరూపితం. సం॥)

"ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్."

నేటికి మన మనుభవింప నారంభించుచున్న సర్వతోముఖమగు నాంధ్రాభ్యుదయము నాగేశ్వరరావుగారి జీవితముతో ఎంత పెనవేసికొని యున్నదో, వారి నిరంతర కృషిమీద నెంత యాధారపడి యున్నదో, సామాన్యులకు విప్పరాని చిక్కు. ఆయన ప్రతిభా ప్రవృత్తు లెంత విస్తార గంభీరములో, వాని పరిపూర్ణత్వ మెట్టిదో పూర్తిగా తెలిసినవారు అరుదు.

ఆయన దేశోద్ధారకుడు. బిరుదములు పలువుర కలంకార ప్రాయములు. సార్థకమైన బిరుదములు కల కొలది మందిలో పంతులుగారు అగ్రశ్రేణివారు. ఆంధ్ర ప్రభుత్వాధినేతలు ఇప్పుడిప్పుడే వారి దేశోద్ధారకత్వ స్వరూపము గుర్తింప నారంభించు చున్నారు. సామాన్య జనులు గుర్తించినట్లు లేదు. విశ్వదాతగా ఆయనను కీర్తించువారు వారి వితరణ మాత్రమే ఎరుగుదురు. ఆ దాతృత్వమునకు విశాలమైన వారి పరమకారుణిక హృదయ మెరుగరు. ఎంత చిన్న సత్కార్యమును తలపెట్టినవారి

కైనను వారిచ్చుచుండెడి చేయూతకు కారణమైన వారి విశ్వప్రేమను భావింపగలవా రరుదు. వారి దాతృత్వమునకు అవకాశమిచ్చిన వారి సంపదకు అంతరాంతరములలో నొక్కింత యసూయ కూడ కలవారే పలువురు!

ఆంధ్ర విశ్వవిద్యాలయము వారికి 'కళాప్రపూర్ణ' పట్ట మొసగినది. అప్పుడు ఎందరో మహాపండితులుండగా, పండితులుగా కనబడని వీరి కిచ్చుటకు వీరికున్న పలుకుబడియే కారణమని పలువురభిప్రాయపడియుందురు. కాని ఏ ఒక్క పండితునికిని లేని బహుముఖమగు కళాప్రపూర్ణత్వము వారికే కలదనుట యతిశయోక్తి కాదు. ఆ పట్టము పొందినవారిలోనెల్ల వారే యుత్తములు, పాండిత్య ప్రకర్ష ప్రకటించుకొను నితరులవలెగాక, వారి పాండిత్యములోతు గంభీరమైనది; మహాసముద్రము లోతువలె పైకి కనుపించునది కాదు.

విరోధికృత్సంవత్సరాది సంచిక / పీఠికలో ఒకానొక ప్రసిద్ధాంధ్రుని గూర్చి నాగేశ్వరరావుగారు వ్రాసిన ఈ క్రింది మాటలు వారికే అక్షరశః అన్వయించును. ఎట్టి యాదర్శములు వారిని నిరంతర మావేశించి యుండెడివో కూడ నీ వాక్యములు సూచించును.

"స్వయం సహాయమునకును, సత్యప్రియత్వమునకును, నిరంతర వ్యవసాయ పరత్వమునకును ప్రమాణముగా నెన్నదగిన ఈ పూజ్యుని సచ్చారిత్రము పఠనార్హము!!"

ఆంధ్రదేశ ప్రజలలో ఒక విచిత్ర ప్రకృతి ద్యోతకమవుచున్నది. చేతులార తెచ్చుకొన్న దారిద్ర్యముతో బాధపడువారిని, సత్పథభ్రష్టు లైనవారిని, అల్పాయుష్కులను, యాచన మభ్యాసముగా కలవారిని అతిశయముగా శ్లాఘించి పూజించినట్లుగా, స్వశక్తివలన నార్జించిన సంపదతో తృప్తిపడుచు ఇతరులను యాచింపనివారిని, ఎట్టి సందర్భములందును సత్పథము విసర్జింపని పుణ్యపురుషులను, దీర్ఘాయుష్మంతులై నిరంతర ధర్మ దీక్షా పరతంత్రులైన పూజ్యులను, వారిని తగినట్లు మనవారు గౌరవింపరు. సాంస్కృతిక రంగము లన్నిటిలో నిది ప్రతిఫలించుచుండుట శోచనీయము! పంతులు గారు ఆంధ్ర హృదయములలో పొందదగిన ఉత్తమోత్తమ స్థానము పొందకుండుటకు ప్రధాన కారణమిదియే కావచ్చును.

2

నాగేశ్వరరావుగారి సంస్కార స్వరూపము అవగాహన చేసి కొనుటకు వారి

యౌవన దశలోను పరిణత యౌవనములోను ఎట్టి భావములు ప్రపంచ మందును భారతదేశమునందును ప్రచలితమై యుండెడివో తెలిసికొనుట యవసరము.

ఆ కాలమున విజ్ఞాన శాస్త్రజ్ఞుల కందరికి కనువిప్పు కలిగించినది డార్విను పరిణామవాదము. అది జీవశాస్త్రమునకు సంబంధించి ఉద్భవించినదైనను దాని ప్రభావము విజ్ఞానశాస్త్రము లన్నిటియందేకాక, మత సాంఘిక వేదాంత కళాసాహిత్యాది సమస్త రంగములందును చూపసాగినది. ఈ కాలములో ఐన్‌స్టీన్ సాపేక్ష వాదమున కెంత ప్రాబల్యమున్నదో అంతకంటె ఎక్కువ ప్రాబల్యమే ఆనాడు పరిణామ వాదమున కుండెడిది. నేటి సాపేక్షవాదము ప్రపంచ విఖ్యాతి పొందక పూర్వమే దానిని పంతులుగారు గ్రహించిరి. వారి ఉత్తర కాలీన రచనలలో నది ప్రతిఫలించుటయే కాక స్పష్టముగా పేర్కొనబడినది. అయినను వారి సంస్కృతిని విశేషముగా ప్రభావితము చేసినది పరిణామ వాదమే. వారి యువనాస్యములందు వలెనే రచనలయందును పరిణామ శబ్దము తరచుగా దొరలుచుండును.

ఇక రెండవది. ఆ కాలమున భారతీయ విద్యావంతులందు రామకృష్ణ పరమహంస జీవితము బోధలు ముఖ్యముగా వివేకానందుల ద్వారా విశేష వ్యాప్తికాంచినవి. వారిద్దరును ఔత్తరాహులును వంగీయులును నైనను, వారి ప్రభావము ఆ ప్రాంతములందుకంటె దక్షిణ భారతముననే దృఢతరముగా వ్యాపించినది. వివేకానందులు శంకారాద్వైతమునే అభిమానించి యుపదేశించినను, వారి యుపదేశములలో నది వేదోక్త కర్మాచరణమునకు శిరోభూషణముగా గాక, కులమతాతీతమై విశ్వసాధారణతత్వముగా రూపొందినది. పరమహంస బోధలు పురాణములనుండియు, ప్రాచీన భక్తుల కథానుభవముల నుండియు గ్రహించినవే యైనను, ఆయన ప్రదర్శించిన జీవితము పలు నూతజోజ్జీవితములై ప్రాణ ప్రతిష్ట పడిసినవి. మత కలహములతోను, విజృంభించుచున్న క్రైస్తవ మత ప్రచారముతోను సతమతమవుచున్న భారత భూమిలోని సంస్కారవంతులను పరమహంస ఉపదేశించిన సర్వ మత సమరసభావములు విశేషముగా నాకర్షించినవి. ఈ సామరస్యము, విశ్వ విస్తృత భావించి పంతులుగారు కావించిన ప్రతి రచనయందును ద్యోత మగుచుంచును.

వారు విద్యాభ్యాసము చేయుచుండిన కాలములో జర్మను తత్త్వవేత్తయైన 'కాంటు' గ్రంథములకు ఎక్కువ ప్రాబల్యముండెడిది. ప్రాచ్య తత్త్వవేత్తలలో శంకరులవలెనే, పాశ్చాత్య తత్త్వవేత్తలలో కాంటు అద్వితీయుడను ప్రతిష్ఠ విద్యార్థి లోకములో నుండెడిది. నీతిశాస్త్రమునకు మూలసూత్రముగా ఒక సిద్ధాంతమును ఆయన ప్రతిపాదించెను. అది యిప్పటికిని ఎథిక్సులో పరమ ప్రధానమైన సూత్రములలో నొకటియే. అది పంతులుగారి హృదయములో నాటుకొని యుండవలె. దాని స్వరూపమునే వివరించు భారత పద్యమే నేటివరకు ఆంధ్రపత్రిక సంపాదకీయముల కన్నిటికి శిరోధార్యమై మకుటాయమానముగా శోభిల్లుచున్నది. 'ఒరు లేయవి యొనరించిన' ఇత్యాది పద్యము పంతులుగారి ధర్మదీక్షకుప్రత్యక్ష చిహ్నము! కాంటు సూత్రమునకును భారత ధర్మమునకును సామరస్యము.

వారు బందరు, గుంటూరు, మదరాసులో ఉన్నత విద్యాభ్యాసము చేసినను, విద్య పూర్తియైన కొలది కాలమునకే సాహసముతో బొంబాయి కేగిరి. ఆనాడు మహారాష్ట్రమున కంతటికి పూనా పట్టణము సాంస్కృతిక కేంద్రముగా నుండెడిది. గోఖలే, తిలకు, రానడేవంటి మహానుభావులెందరో మహారాష్ట్రమునేకాక భారత జాతినంతటిని వీర్యవంతము చేయుచున్న రోజులవి. బ్రిటీషు ప్రభుత్వము మన దేశమున నెలకొనకుండ ప్రతిఘటించిన వారిలో చివరివారు మహారాష్ట్రులు. అంతవరకు భారతదేశములో చాల భాగము మహారాష్ట్రుల పాలనముననే యుండెడిది. అట్లు పాలించిన యోధాగ్రేసరుల వంశములలోని మహనీయులతో పాటు పూర్వ వీరుల స్మృతి యప్పటి కింకను మాయక యక్కడ సజీవమై యుండెను. గణేశ నవరాత్రముల పేరితో జాతీయత యానాడక్కడ విజృంభించి భరతభూమిని దీపించుచుండెను. కేవల రాజకీయ రంగమునందేకాక, సర్వతోముఖముగ ప్రాచీన హైందవ సంస్కృతియందు చైతన్యముతో గూడిన అభిమానము విజృంభించి ఉత్తమ కృషి జరిగినది. భండార్కరువంటి విద్వాంసులు సంస్కృత భాషకు చేసిన సేవ అపారమైనది. భారతదేశ మందంతటను లభ్యమైన సంస్కృత గ్రంథప్రతులను తెప్పించి పండితులచే పరిష్కరింపజేసి నిర్ణయ సాగరువారు నిర్దుష్టముగా అచ్చువేయించి తక్కువ ధరకు దేవమంతట వెదజల్లిరి. ఆనాడు వారచ్చువేసిన వేదభాష్యములు

అష్టాదశ పురాణ గ్రంథములు నేటికిని తదభిమానులకు ఆధారముగా నున్నవి.

అట్టి చైతన్యము పొంగులువారుచున్న మహారాష్ట్రములో వర్తక సంస్థలో చేరి జీవిత మారంభించిన నాగేశ్వరరాయలు ఉన్నతాదర్శపూరితులై, ఆ మహా చైతన్య స్రవంతిని ఆంధ్ర దేశమునందు వెల్లివిరియునట్లు చేయుటకు దీక్షపూనిరి. వారికంటె వయస్సులో పిన్నలయ్యును, సంస్కృతిలోగాని, ఉన్నతాదర్శములలో గాని వారికే మాత్రము తీసిపోని కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు వారికి సహచరులైరి. లక్ష్మణరావుగారు మహారాష్ట్ర భాషలో గూడ సుద్గ్రంథములు వ్రాసిన విద్వాంసులు. ఆంధ్రపత్రిక బొంబాయి నుండి మదరాసుకు రాకముందే లక్ష్మణరావుగారు చెన్నపట్టణమునకు వచ్చి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి *స్థాపించి అద్వితీయ గ్రంథములను ప్రచురించుటకు పూనుకొనిరి. సత్యాన్వేషణతత్పరత్వములోను, విద్యా సంస్కృతులు ఆంధ్ర దేశమంతట వ్యాప్తి చేయువలెనను దీక్షలోను, ఆ యిద్దరును ఒకరి కొకరు తీసిపోని మహావ్యక్తులు. వ్యాపార సంస్థలతోడి సంబంధము తో ప్రారంభించిన నాగేశ్వరుల లోకానుభవము, వారు తలపెట్టిన ప్రతి ఉద్యమమును సంపూర్ణముగా కార్యరూపమున సాధించు శక్తిని మాత్రము వారిద్దరిలో నాగేశ్వరుల కొక్కరికే యిచ్చినది. లక్ష్మణరావుగారు ప్రీతితో పెనగులాడి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము నందు అకారము కూడ పూర్తి చేయలేక దివంగతులైరి. ఆ పిమ్మట వారి స్మృతి చిహ్నముగా పంతులుగారు లక్ష్మణరావుగారు వ్రాసి కొనిన నోట్సు ఉన్నంతవరకైనను పూర్తిచేయించి ప్రకటింపగలిగిరి. అంతకుపూర్వము సంచికలుగా వచ్చుచుండిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము రెండు సంపుటములును, పంతులుగారి చేతిలో ఆంధ్ర భాష ఇంతవరకు నోచుకొనని ఉజ్జ్వల రూపముతో సాక్షాత్కరించినది. డెమ్మి 1/4 సైజులో ఒక్కొక్కటి 600 పేజీలుగల సంపుటము లవి. విషయ గౌరముననేగాక కాగితము, అచ్చు, సాధారణ చిత్రములు, త్రివర్ణ చిత్రములు, పటములు, బైండింగు, తక్కువ వెల–వానికి సాటియైన సంపుటములు తెలుగులో నిప్పటికి చూచి ఎరుగము. పంతులుగారీ ప్రకటనలో ధనము వెదజల్లియుండ వలెను. వారెన్నో దానములు చేసి విశ్వదాత యని ప్రసిద్ధి కెక్కినను, వారి వితరణమునకు ప్రత్యక్ష చిహ్నము, నభూతో న భవిష్యతిగా ప్రకటింపబడిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము!

బొంబాయికి జీవయాత్రకై వెళ్లిన నాగేశ్వరరాయలు అక్కడి నుండియే ఆంధ్ర వారపత్రిక ప్రారంభించినారు. అది కీలక సంవత్సర భాద్ర పదశుద్ధ చతుర్దశి బుధవారమున (9-9-1908) ప్రారంభింప బడినది. ఆనాడు వెలువడుటకు మహారాష్ట్రములో నానాడు మహోత్సాహముతో జరుగుచుండిన గణపతి నవరాత్రోత్సవములే కారణము. ఉత్సవము ముగిసిన వెంటనే పత్రిక ప్రారంభించిరి. స్మార్త సంప్రదాయముననను, శైవ సంప్రదాయముననను గూడ ప్రథమపూజ్యుడు శ్రీ మహాగణాధిపతి. నాగేశ్వరరాయల కార్యదీక్షకు, వారికి శ్రీ మహాగణాధిపతియందలి భక్తితోడై, వారు తలపెట్టిన కార్యములు నిర్విఘ్నముగా నెరవేర్ప గలిగెను.

ఆంధ్రపత్రిక బొంబాయిలో నారేండ్లు వారపత్రికగా నుండి చెన్నపట్టణము వచ్చి, వారపత్రికగనే కాక దినపత్రికగా గూడా వెలువడసాగినది. పత్రిక వెలువడసాగిన మూడవ సంవత్సరము నుండియే (సాధారణ సంవత్సరాది నుండి) సంవత్సరాది సంచిక లారంభమైనవి. అవి వందల కొలది చిత్రపటములతో ఉత్తమ వ్యాసములతో ఆంధ్రభూమి నలంకరించెడివి. మొదటి సంచికను బాల్యమునందే చూచు భాగ్యముగల ఈ వ్యాసకర్త దానినెన్ని పర్యాయములు ముగ్ధుడై తిరగవేసెనో లెక్కింప శక్యముకాదు. సర్వరంగములలో ప్రసిద్ధులైనవారి ఛాయా పటములు చూచు చున్నప్పుడెంత ఉన్నతాదర్శములు రేకెత్తుచుండెనో ఊహింప వలసినదే!

పంతులుగారు చెన్నపట్టణములో విద్యాభ్యాసము చేయు చుండిన రోజులలో నక్కడ రెంటాల వెంకట సుబ్బారావుగారను గొప్ప మేధావి, హైకోర్టు వకీలుగా నుండెడివారు.

3

నాగేశ్వరరాయలు గ్రంథ శతములు రచించినను అవి గ్రంథ రూపముగా కనుపింపవు. వారి భగవద్గీత కూడ వారి నిర్యాణానంతరమున వారు వ్రాసిన అసంపూర్ణమైన ఉపోద్ఘాతము తో ప్రచురింపబడినదే. వారి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర వారు ఆంధ్ర వాఙ్మయ సూచికకు పీఠికగా వ్రాసినదే, వారి యనంతరమున గ్రంథరూపము ధరించినది. వారు వ్రాసిన పీఠికలు, ప్రత్యేక వ్యాసములు కొన్ని

కలిపియు, కొన్ని ప్రత్యేకముగను గ్రంథములుగా గ్రహింపదగినవే. విజ్ఞాన సర్వస్వములో అజంతా విహారములపై వ్రాసిన వ్యాసము ప్రత్యేక గ్రంథముగా రాదగిన వానిలో నగ్రగణ్యము! అజంతా విహారములను గూర్చి బహుగ్రంథములు చదివినవారికి గూడ కలుగని వాని స్వరూపమును గూర్చిన విస్పష్ట భావన ఆ వ్యాసమువలన కలుగగలదు. అందులోనిదే 'అనాహతము' అను వ్యాసము కూడ కొంత వరకట్టిదే. బసవ పురాణప్రస్తావన, మాలపల్లి తొలిపలుకు, స్నానఘట్టము పీఠిక, శతకమంజరి సంపాదకీయము, శతకముల పీఠికలు సమగ్రగతకు, వారి నిష్పక్షపాత దృష్టికి, విశాల ప్రవృత్తికి ప్రత్యేకముగా నెన్నదగినవి. ఇక వారి సంవత్సరాది సంచికల పీఠికలు ప్రస్తావనలు నిరుపమానములు. ఆ యా సంవత్సరముల ఆంధ్ర సాంస్కృతిక చరిత్రకుప్రధానముగను, భారతభూమి సంస్కృతికిని, ప్రపంచ సంస్కృతికిని కొంతవరకును, భవిష్యచ్చరిత్రకారులకు ప్రధా నాధరములుగా నుండదగిన ఉదాత్త సమీక్షలు. పంతులుగారిట్లు బహు గ్రంథకర్తలు. అయినను భారతదేశములో పూర్వముండిన మహాశిల్పులు చిత్రకారులు గ్రంథకర్తలు తమ నామమునకు కంటె తమ సృష్టికే ఎక్కువ ప్రాధాన్యమిచ్చినట్లే, పంతులుగారును ఎందరో గ్రంథకర్తలను ప్రచారమునకు తెచ్చినను తాము గ్రంథకర్తగా యశస్సు తెచ్చుకొనుటకు ఎంతమాత్రము ప్రయత్నింపలేదు. వారు 'సంపాదకులుగా' నుండుటకే అభిమానించిరి. వ్యాస శబ్దార్థము కూడ దానికి తుల్యమైనదని విజ్ఞులకు ప్రత్యేకముగా వివరింప నక్కరలేదు.

పంతులుగారు ఇంత విస్తారముగా చేసిన రచనలకును, ఇతరుల రచనలు వ్యాప్తికి తెచ్చుటకును మూలసూత్రములేవి? ఏ తత్త్వము వారి నావేశించి కార్యాచరణ నిమగ్నుల గావించినది? వారి తాత్త్విక దృష్టి ఎట్టిది? వారి ప్రధానాదర్శమేది? ఈ రెండు ప్రశ్నలకు క్లుప్తముగా సమాధానము చెప్పినచో వారిది సమన్వయ తత్త్వమని, వారి యాదర్శము విశ్వశ్రేయస్సు అని వెంటనే చెప్పవచ్చును. వారి హృదయములో సమన్వయము, విశ్వశ్రేయస్సు ఎంతగా స్థిరప్రతిష్ఠ చేసికొన్నవో తెలియుటకు వారి రచనలకు ఆ రెండు శబ్దములు తరచుగా ప్రతి శబ్దించుచుండుటయే ప్రత్యక్ష నిదర్శనము!

4

వారి సమన్వయ తత్త్వ స్వరూపమేమి?

ప్రపంచము నేడనేక విరోధ భావములలో సతమత మవుచున్నది. అనేక మతములు, మతములలో శాఖాంతరములు కలవు. విజ్ఞాన శాస్త్రము మత విశ్వాసముల నన్నిటిని కూకటివ్రేళ్లతో పెల్లగించి వేయుచున్నది. పాశ్చాత్య సంస్కృతికి ప్రాచ్య సంస్కృతికి ఘర్షణము, ప్రజాస్వామ్య సంగ్రామములు, పారిశ్రామిక సంగ్రామములు కలవు. ప్రాచీన భావములకు నవీన భావములకు విరోధము చెలరేగుచున్నది. ఆంధ్రభాషా విషయములో గ్రామ్య గ్రాంథిక వివాదములును గలవు. ఈ విషయములన్నిటిలో భేదము బాహ్యమైనదనియు అంతర్యమున నన్నిటి లక్ష్యమొకటే యనియు వారి సమన్వయము. అదియే వారి తాత్త్విక దృష్టి!

వారొకచో 'వాద మంతర్లింగ రూపమున విశ్వమంతటను విలసిల్లుచున్నది. మానవ దేహమున సహస్రారమునందు దేదీప్య మానముగా విరాజిల్లుచున్నది. బుద్ధ క్రీస్తు కృష్ణావతారములందీ దివ్యతేజమును భక్తులు సందర్శించి చిత్రించిరి' అని వ్రాసిరి. వ్రాయుటే కాదు, విరోధికృ త్సంవత్సరాది సంచికలో క్రైస్తవ మతమును గూర్చిన రెండు వ్యాసములును, మహమ్మదు జీవితమును గూర్చి యొకటియు, బుద్ధ జయంతి వ్యాసమొకటియు ప్రచురించిరి. క్రైస్తవ మత సంబంధములైన రెండు వ్యాసములలో నొకటి క్రైస్తవ మతమన్న భయపడనవసరము లేదని చెప్పుచుండగా, రెండవది భవిష్యత్కాలమున 'ఇండియా యను కిరీటము క్రీస్తుకు తప్పక దొరుకును, అది క్రైస్తవ మతమయమగునని ఉద్ఘాటించినది. ఆ సంచికలోనే ఒకే పేజీలో ప్రక్క ప్రక్క పార్వతీ పరమేశ్వరులయు, ఏసుక్రీస్తు, గౌతమబుద్ధుడు, సుజాత, జొరాస్టరుల చిత్రములను ప్రచురించిరి.

అపరోక్షానుభూతియందు 'శంకరాచార్యులు సాపేక్షములైన కర్మయోగమును సన్యాసయోగమును బుద్ధియోగమును, నిరపేక్షమైన ఆత్మయోగము నందు వేదాంత రూపమునను సమన్వయము చేసి సనాతన వైదిక మతము నుద్ధరించి ఆచార్య పదము నధిష్ఠించెను' అని పేర్కొనిరి.

వీర శైవులు జైన బౌద్ధ మతములను ఖండించి ఆ మతస్థులను హింసించినను

బౌద్ధమతములోని త్రిశరణములే వీరశైవములో గురు లింగ జంగమ శరణు రూపముల దాల్చినవని సమన్వ యించిరి. యోగ విషయములో గూడ పరిభాషలో భేదమే కాని స్వరూపములో భేదము లేదనుటకు యోగమునకును వీరశైవాగమము లకును సమన్వయము చేయుచు, ఒక పట్టిక రూపములో ఒకదానికొకటి యెదురుగా షల్లింగములు, షట్ స్థలములు, షడక్షరి, షట్చక్రములు, షడ్వ్యాహృతులు చూపి సిద్ధాంత మొనర్చిరి. 'వీర శైవాగమములందు వేదాంత మంత్రశాస్త్ర రహస్యములు భిన్న రూపముల సమన్వయమును బొంది భక్తియోగ ప్రభావమును నిత్యజీవనమందు విస్తరింపజేసిన'వనిరి. 'ఆదియుగమునందు కరపరమైన వైదిక మతము తదనంతరము జ్ఞానవరమును భక్తి పరమునునై పరివర్తనము పొందినది. వైదిక మంత్రోపస్థిత రుద్రుడు వేదాంతమున శివస్వరూప పరిణామమును బొందుచు, సర్వవ్యాపకుడై 'శివోహం' తత్వమును వ్యక్తము చేయుచున్నాడు. శివుడు యజ్ఞ పురుషుడు, సగుణ నిర్గుణ పరబ్రహ్మము' అని వక్కాణించిరి.

ఈ సమన్వయ తత్త్వము వారికి భగవద్గీతను నిష్ఠతో అధ్యయనము చేయుటవలననే అబ్బినది. భగవద్గీతకంటె వేద వేదాంగ వేదాంతములను, సాంఖ్యయోగ భక్తులను, శాస్త్రాను భవములను సమన్వయము చేయు నుద్గ్రంథము మరియొకటి లేదు. అందువల్లనే అర్జునునిచే వ్యామిశ్రములైన వాక్యములతో నా బుద్ధిని మోహింపజేయుచున్నట్లున్నావు అనిపించినది. ప్రత్యేకముగా గ్రంథ రూపముగా పంతులుగారు రచించిన గ్రంథము భగవద్గీతావివరణ మొక్కటేయని కూడా మనము గుర్తించుకొనవలెను.

ఈ సమన్వయ తత్త్వము మత విషయములతో నాగలేదు. అప్పటి నుండి నేటివరకు వాద ప్రతివాద కారణమైన గ్రాంథిక గ్రామ్య భాషా వాదమును ప్రస్తావించుచు, 'గ్రామ్యభాష గ్రాంథిక భాషగాను,గ్రాంథిక భాష గ్రామ్య భాషగాను మారుచుండుట ప్రకృతి సిద్ధము.... సహజధర్మము మారకుండ భాషాభివృద్ధిని జేయుట భాషాభిమానుల విధి' యని యుద్బోధించిరి. విజ్ఞానశాస్త్ర గ్రంథములలో పారిభాషిక పదములు సంస్కృతము నుండి సృష్టింప వలెనా, పరభాషా పదములనే గ్రహింపవలెనా అను విషయమున 'సంస్కృత భాషలో లేని నూతన పరిభాషకుగాను

అన్య దేశ పదములను వాడుట లోకాచార సిద్ధము. ఉన్న పదములకు బదులన్యదేశ పదములను వాడుట నిరర్థకము' అని నిర్ధారించి హిందూ దేశ భాషలు సంస్కృత సంపర్కములేక బలహీనములై కళా విహీనములగుచున్నవని నిర్దేశించిరి. ఈ సందర్భములోనే హిందూదేశ భాషలకు సన్నిహిత సంబంధము కల్పించుటకు సంస్కృతము సాధనము అని సిద్ధాంతము చేసిరి.

పై విషయములు ఇప్పటికి 55 సంవత్సరములకు పూర్వమే పంతులుగారు చెప్పినవి. వారు అభిమానములకు మొగ్గుచూపక, సత్య పథాన్వేషణము చేయు నాదర్శముతో యోగదృష్టితో దర్శింప గలవారు కనుకనే, వివాద విషయములలో నతిసూత్రముగా మధ్యేమార్గ మన్వేషింపగలిగిరి. వారి రచనలలో తరచుగా నొక యాదర్శము ప్రదర్శితమగుచుండును. మనము మన జీవయాత్రను దేహయాత్రార్థముకాక లోక కల్యాణార్థముగా మలచినచో, జీవ యాత్రయే దేవయాత్రయై క్రమముగా కైవల్య యాత్రయు శివయాత్రయు మోక్షయాత్రయు కాగలదు. వారి జీవితాదర్శ మదియే!

పంతులుగారు పూర్వాచార పరాయణులనుట ప్రసిద్ధమే. కాని వారిది అభ్యుదయ మార్గమున సాగిపోవు నిత్య యౌవన దృష్టి. బొంబాయి నగరమున యౌవనవతులు పాఠశాలలకు పోవుటచూచి యానందించి, ఆ యీడున తెలుగు యువతులు నలుగురు పిల్లల తల్లులై ఉత్సాహమును గోల్పోవుచున్నారని వాపోవుచు, ఆంధ్ర దేశమున కీ మహద్దశ యెప్పుడు పట్టునో తెలియదని చింతపడిరి. అట్లే వాణిజ్య పరిశ్రమల యందును నాంధ్రులు వెనుకబడి యున్నారని యాభై యేళ్లకు పూర్వమే వారు విచారము ప్రదర్శించిరి. ఆంధ్రములో గత సంవత్సరములలో ప్రచురింపబడిన గ్రంథ సంఖ్యలిచ్చుచు, అందులో ముప్పాతిక గ్రంథములు పద్యరూపము లని తెలిపి, విద్యావ్యాప్తిగల పాశ్చాత్య దేశములందు వచన గ్రంథము లధికముగా నుండుననుచు తెలుగు గ్రంథకర్తలు వచన రచనల కెక్కువగా పూనుకొన్నచో జ్ఞానము వ్యాపించి భాషాభ్యుదయ మును దేశాభ్యుదయమును కాగలదని ఉద్బోధించిరి.

సంచిక ముఖ చిత్రపటమును గూర్చి 'ఇది యీ యుత్సాహ భరితావస్థకు నిదర్శనము. సుందరోద్యానము. వసంతకాలము, పుష్పశోభితము. రూపవతి,

సురుచిర వస్త్రాలంకృత, ఎలజవ్వని. కుసుమాపచయము. పరమోత్సాహము' అని వర్ణించిరి. పంతులుగారిని నిత్య యౌవన వసంతమూర్తి ఎంతగా ఆవేశించి యుండెడిదో మరి!

5

మరి నాగేశ్వరరావు రచనలలో ప్రధాన లక్షణము లేవి? విశ్వశ్రేయః కావ్యమ్ అని సూత్రించి, శ్రేయసే భూయాసుః అని మంగళాచారణము చేసిన నన్నయ భట్టారకుని ఆదర్శమునే వారును తమ సమస్త రచనలలో కార్యరూపమున బ్రదర్శించిరి, జీవయాత్రను కైవల్య యాత్రనుగా జేయు నాశయమే వారి రచనలలో విశ్వ శ్రేయస్సు రూపము ధరించినది.

దానికి సాధనముగా పంతులుగారు పరిగ్రహించిన సమన్వయతత్వమే విశాల దృష్టిగా రూపొందినది. సత్పథమునే తమ గమ్యముగా నెన్నుదురు. తమకు తోచినదేకాక ఇతర మార్గములు దుష్పథములుగా భాసించును. నదీనాం సాగరో గతిః-సర్వ దేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి-మమ వర్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః-ఇత్యాది వాక్యముల స్ఫూర్తి కలవారికి ఈ విశాలదృష్టి యలవడును. పూజ్యులైన యాచార్యులు ఉద్దండులైన పండితులు అనేక వ్యాఖ్యలు రచించిన భగవద్గీతవంటి ఉద్గ్రంథము నకు వారు వ్రాసిన టీకా తాత్పార్య వివరణములో కొన్ని ఎంతో ముచ్చట గొల్పు స్వతంత్ర వివరణములు కలవు. 'శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వ నుష్ఠితాత్' అను వాక్యమును వివరించుచు, ఆత్మయోగధర్మము స్వధర్మమనియు, దేహేంద్రియధర్మము పరధర్మ మనియు వివరించుట యట్టివానిలో నొకటి. ఆ క్రింది శ్లోకములోనే భగవానుడు ఇంద్రియ విషయములందు రాగద్వేషములకు వశము కాగూడదని ఉపదేశించినది గుర్తుకు తెచ్చుకొన్నచో పంతులుగారి స్వతంత్ర వివరణ మెంతయు సమంజసమని రూఢమగును.

గీతా గ్రంథము వ్యాఖ్యానించుటలో వారు ప్రధానముగా తిలకు గీతా రహస్యము నవలంబించినట్లు తోచును. కొంత మహాత్ముని గ్రంథమును అవలంబించిరి. కాని పూర్వాచార్యుల నెక్కువ గౌరవముతో భజించిరి. చేతనైనంతవరకు సమన్వయము చేయుచు అది సాధ్యముకానిచోట్ల, ఎవరిని ఖండించుటకు పూనుకొనక వారి వారి

భావము లిట్లున్నవని సంక్షేపముగా ప్రదర్శించి ఔచిత్యము పాటించిరి.

వారి రచనలలో నితరులను స్పష్టముగా ఖండించవలసిన యవసరము వచ్చిన చోట్లను గూడ నిగ్రహము సౌజన్యము చూపుదురే కాని విషయ ప్రదర్శనములో వెనుకాడరు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో నేటి ద్రావిడ పరిశోధకుల విపరీత తమిళ వాఙ్మయ ప్రాచీనతా సిద్ధాంతములను విమర్శించుచు 'వేదనాయుగం పిళ్లెగారి మాతృ భాషాభిమాన మవ్యక్త సిద్ధాంతములకు గారణమైన' దనిరి. ఒక సంవత్సరాది సంచికలో గత సంవత్సరమునందాంధ్ర లోకమునందు కవుల కలహములు ముదిరినవని ప్రస్తావించి యివి జాతిద్వేషాభిమానములుగా బరిణమించు దురవస్థ నుండి బాషను గాపాడుట తమ విధి యని భాషాభిమానుల నుద్బోధించిరి.

పంతులగారి రచనలు చూచినవారికి వారి సర్వతోముఖ వ్యాసంగమును, గ్రహించిన ప్రతి విషయమందును సమగ్ర పఠన పరిశోధనములు నద్భుతము లనిపించును. ఆంధ్ర వాఙ్మయ సూచికకు పీఠికాప్రాయముగా రచించిన ఆంధ్ర వాఙ్మయ చరిత్ర మిందులకు నిదర్శనము. ఆంధ్ర కవులను వాఙ్మయమును గురించి యేకాక తమిళాది భాషా వాఙ్మయములను గూర్చి కూడా నప్పటికి వచ్చిన గ్రంథ జాతమును వ్యాస శతములను మూల కావ్యములతో పాటు ఎంత క్షుణ్ణముగా నెట్టి పరిశీలనా దృష్టితో పఠించిరో ఆ గ్రంథమే ప్రత్యక్ష సాక్ష్యమిచ్చును. అజంతా విహారములు అను సుదీర్ఘ వ్యాసములోగూడ నీ లక్షణములు స్పష్టముగా చూడనగును.

పంతులుగారివలె బహుముఖ వ్యాసంగములుగల వారికి బహు గ్రంథ పఠనము అస్పష్టతకు కారణమగుట సామాన్య ధర్మము. కాని యది ఎంత మాత్రమును వారి రచనల కన్వయింపదు. ఎంత విపుల విషయమైనను స్పష్టముగా సులభముగా చెప్పుటలో వా రద్వితీయులు. కావలసినచోట్ల వారు పట్టికలు సిద్ధము చేయుదురు. ఆంధ్రవాఙ్మయు చరిత్రలోని పట్టికలు విషయావగాహనమున కెంతయు నుపకరించును. ఇక అజంతా విహారముల వ్యాసము చదివినవారికి కలుగు నాశ్చర్యమునకు మేరయుండదు. ఆ ప్రదేశము చేరు మార్గములతో ప్రారంభమైన వ్యాసము, ఆ విహారములెట్టి రమణీయప్రదేశములో నిర్మింపబడినవో వర్ణించి ఏ గుహ ఏ యాకారమున నున్నదియు, దేనిలో నేతావున ఏ చిత్రము వ్రాయబడినదో

స్పష్టముగా కన్నుల కట్టినట్లు ప్రదర్శించును. ఆ చిత్రములలో రెండవ గుహాలయములోని పద్మపాణి బోధిసత్త్వుని చిత్రము ఉత్తమోత్తమ మైనదిగా త్ర కళావిదులు భావింతురు. పంతులుగారు దానినే విస్తరించి 'మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వ'మియ్యదియని దక్షిణా మూర్తి భావనతో సమన్వయించి, ఆ మహాచిత్రములోని తక్కిన వివిధ భాగములను ఉత్సాహముతో వర్ణించినది. చదివినవారికి చిత్రకళయందు పంతులుగారి యభిరుచి ఎంత సున్నితమైనదో విస్మయము కలిగించును. అజంతా విహారముల స్వరూపము ఆ వ్యాసము చదివినప్పుడు కలిగినంత స్పష్టముగా కలుగుటకు బహుకాలము, బహుశ్రద్ధగా, బహుకష్టముతోగాని లభ్యముకాని బహుగ్రంథములను పఠించిననేకాని కలుగదనుట యతిశయోక్తి కాదు.

ఇతర గ్రంథములకు వారు వ్రాసిన ప్రస్తావనలు తొలి పలుకు లందు ముఖ్యముగా వారి గుణగ్రహణ పారీణత గోచరించును. ఈ లక్షణమునకు బసవ పురాణ ప్రస్తావము, మాలపల్లికి, స్నాన ఘట్టమునకు వ్రాసిన తొలి పలుకులు దృష్టాంతములు. బసవ పురాణ ప్రస్తావము వారి మతతత్త్వ సమన్వయమునకు నికషో పలము. నేటికాలపు గ్రంథమైన మాలపల్లిని వారెన్ని విధముల శ్లాఘించిరో చూడదగును. శైలిని గూర్చి వ్రాయుచు, "తెనుగు మాటలు, తెనుగు దేశము, తెనుగు సాహిత్యము, తెనుగు హృదయము, తెనుగు సంకల్పము, మాలపల్లి కనిర్వచనీయమైన ప్రతిభను సమకూర్చినవి..... వాడుక భాషయందు నవరస భరితమైన కావ్యమును రచించిన లక్ష్మీనారాయణగారు ధన్యులు... భారతీయ వేదాంత విజ్ఞాన సారమైన విశేష ధర్మోపదేశముతో.... కథ నుపసంహారము చేయుట సర్వోత్తమముగా నున్నది" అని ఉగ్గడించిరి.

పంతులుగారి కెంత సౌజన్యమున్నను, సత్యపథము నుండి తొలగుట కంగీకరింపరు. ఆ తొలి పలుకులలోనే "సందర్భాను సారముగా చేసిన వర్ణనలు, బోధలు, వ్యాఖ్యానములు జ్ఞానదాయకము లైనను కావ్యరసానుసంధానమునకు ప్రతిబంధములై కావ్యము పురాణ పరిణామమును బొందినది" అని వ్రాసిన దానిలో ఎట్టి నిశిత విమర్శనమున్నదో బోధపడగలదు. ఇది ముఖ్యముగా నేటి

నవలాకారులును విమర్శకులును గమనింపదగిన సూక్ష్మధర్మము.

అట్లే బసవ పురాణ ప్రస్తావనములో "వీరశైవము తలపెట్టిన కులావరణ నిర్మూలనము దుస్తరమైనది. లింగాయతులు, జంగములు, సాలెలు, జాంద్రలు ప్రత్యేక కులమువారై మరికొన్ని కులములేర్పడినని..... భక్తి ప్రధానమైన వీరశైవము నిర్జీవమైన యాచార సంప్రదాయబద్ధమై సాంఘిక ప్రయోజనములకును, మానవ కల్యాణమునకును నిరుపయోగమైనది" అని వ్రాయుటకును వారెంత మాత్రము వెనుకాడలేదు.

వారి యుదాత్త గంభీర శైలి ముఖ్యముగా నెన్నదగినది. వారి కాయమువలెనే వారి యాశయములును ఉన్నతములు. వారి ఛాయపటము చూచువారికి నిండుదనము, సౌమ్యతతోపాటు, ఒకానొక విచిత్రమైన దూరభావము కూడ కానవచ్చును. అది యల్పబుద్ధులకు భయము కూడ కల్పించును. ఇక్కడ కుబుద్ధులకు అల్పులకు కుటిలులకు స్థానము లేదని యట్టి వారిని దరిచేరనీయని ఉదాత్త భావమే!

పంతులుగారి రచనలన్నిటిలో వారికి అభిమానపాత్రమైనవి సంవత్సరాది సంచికలు, వానికి వారు వ్రాసిన పీఠికలు, ప్రస్తావములునని మా విశ్వాసము. వానిలో పంతులుగారు తమ సర్వశక్తులు సంపూర్ణముగా వినియోగించెడివారు! అవి సామాన్యముగా వసంత శోభను వర్ణించుటతో నారంభమగును. సూర్య సిద్ధాంతము ననుసరించి గత సంవత్సరముతో సృష్ట్యాది నుండి 195 కోట్ల యాభై ఎనిమిది లక్షల, ఎనభై ఐదువేల, ఎనిమిది వందల పైచిలుకు సంవత్సరములు గతించినవని లెక్కవేసి ఈ యనంత కాలములో సంవత్సరకాల మెంత స్వల్పమో సంభావింతురు. ఆపైన నీ గత సంవత్సర కాలములో ప్రపంచము నందలిప్రధాన పరిణామముల సమీక్షచేసి ప్రత్యేకముగా భరత భూమిలోను, ఆంధ్రభూమిలోను జరిగిన విశేషములు సమగ్రముగా ప్రదర్శింతురు. తుదకా సంచికలోని వ్యాసములను చిత్రములను స్థూలముగా వివరింతురు.

ఇది సామాన్య ధర్మమైనను, వారికి ప్రతి సంవత్సరాది సంచిక లోను ఏదో ఒక విశేష విషయమునకు ప్రాధాన్యమీయవలెనను గొప్ప యాలోచన ముండెడిదను

విషయము 1916 నల సంవత్సరాది సంచిక ప్రస్తావన చదివినప్పుడే కాని స్ఫురింపలేదు. ప్రతి సంవత్సరము చేయు నాలోచనలేకాక ఎన్నో సంవత్సరములు ముందుగానే ఒక ప్రణాళికాబద్ధముగా నాడీ సంచికలు ప్రచురింప సాగిరను విషయము బోధపడినది. ఆ ప్రస్తావములో పూర్వము ప్రచురించిన ఆరు సంచికల విషయములు ప్రస్తావించి ఏ సంచికలో నేది ప్రముఖమో వివరించిరి. సాధారణ సంచికలో విద్య జీవిత చరిత్రములును, విరోధికృత్తులో సాంఘిక విషయములను, పరీధావిలో పంచమ జార్జి రాజ్యాభిషేకముతో ఢిల్లీ నగర చరిత్రము స్వదేశ సంస్థానము చరిత్రలును,ప్రమాదీచలో వాఙ్మయ సంబంధములను, ఆనంద సంచికలో మహాపురుషుల చరిత్రములును, రాక్షసలో, ఐరోపా మహాసంగ్రామ చరిత్రయు, ప్రముఖ స్థానమలంకరించెనని తెలిపి మరో సంచికలో వ్యవసాయాభి వృద్ధి, నాట్యరంగము, చిత్రలేఖనము, రూపకల్పన, దేవాలయములు, ప్రాధాన్యము వహించినవని వివేచన మొనర్చిరి. ఈ దృష్టితో చూచినచో ప్రస్తావనలు వారి రచనలలో మకుటాయ మానములనిపించును.

సర్వకార్యములందువలె తమ రచనలందంతయు విశ్వశ్రేయస్సు ప్రతిఫలింపజేయుచు తమ జీవయాత్రను శివయాత్రనుగా జేసుకొన్న నాగేశ్వరరావుకు నమోవాకములు!

ఒరులేయని యొనరించిన
సరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథములకెల్లన్.
(మహాభారతము)



# కృత్యాద్యవస్థ

శ్రీవిశ్వనాథ సత్యనారాయణ

**లో**కంలో యేదైనా కష్టమైనపని చేస్తే కృత్యాద్యవస్థ అయింది అంటాం. కృత్యాద్యవస్థ అంటే కార్యారంభములో పడే కష్టం. నా కెన్నిసార్లు ఆలోచించినా, కావ్యారంభమనే తోస్తుంది. కార్యారంభానికి కష్టం లేదా, అంటే, ఉంది. దానికి విఘ్నేశ్వర పూజాదులతో ఆ కష్టం తీరుతుంది. కావ్యారంభానిగ్గూడా తీరుతుంది గదా అనవచ్చు. మన తెలుగు కవులు చాలా మంది అట్లాగే తీర్చుకున్నారు. సంస్కృతంలో లేని కృతి యివ్వడమనే సాంప్రదాయంతో తెలుగు కవులకాచిక్కు వదిలింది. కథారంభంలో ఆ చిక్కు మళ్ళీ వస్తే మనవాళ్ళు తేలిగ్గా దాటుకుపోయినారు. ఆ వూరు కోట వర్ణించడం, వప్రపరిఖలను వర్ణించడం, నాల్గువర్ణాల వారినీ వర్ణించడం, ఆ వూళ్ళో ఒక రాజున్నాడు అని పేదరాసి పెద్దమ్మ కథవలె అందరు కవులూ తయారు చేశారు. అందుచేత వాళ్ళ కావ్యాలను నిందించడం లేదు. కావ్యాల్లో తక్కిన భాగాలన్నీ జగదద్భుతకరంగా చేశారు. కాని కృత్యాద్యవస్థ అనేదాన్ని పడ్డారుకాదు.

తెలుగులో ఒకరిద్దఱు కృత్యాద్యవస్థ పడ్డవాళ్ళూ ఉన్నారు. పింగళి సూరన వారిలో ప్రధానుడు. ఆయన కళాపూర్ణోదయ, ప్రభావతులు రెండింటిలోనూ కృత్యాద్యవస్థ పడ్డాడు. కళాపూర్ణోదయంలోకన్న ప్రభావతిలో యీ అవస్థ యెక్కువ హృదయంగమంగా ఉంది. కల్పనలో యెక్కువ ప్రసన్నత వుంది.

సంస్కృత కవులు, అందులో నాటక కవులు పడ్డ యీ అవస్థ శిల్పాచార్యకమా అన్నట్లుంటుంది. ఆ కవులు మొదలు పెడుతూనే అగాధమైన విషయంతో మొదలు పెట్టడమో, ఒక్కసారిగా పఠితను రసాబ్ధిలో మధ్యభాగంలో దించడమో చేస్తారు. వాళ్ళు

కావ్యాన్ని చూచే వైఖరియే వేఱు. షేక్సుపియరు నాటకాల్లో ఆయన రాబోయే కథలో వుండే సమస్యాఘట్టాన్ని మొదటి రంగాల్లో ప్రదర్శించి వదిలిపెడతాడు. తక్కిన నాటకం యీ సమస్యాపూరణం. ఆయన కథలో అన్ని భాగాలూ ఒకదానితో ఒకటి అతికితే అతుకవచ్చు, అతక్కపోతే అతక్కపోవచ్చు. పాశ్చాత్య గ్రంథాలు చాలా భాగం యిలా వున్నట్లు తోస్తుంది. కొన్ని అత్యుత్తమ గ్రంథాలూ వున్నవి. ఇబ్సెన్ వ్రాసిన 'Lady of the Sea' చాలా అద్భుత రచన కలది. Silas Marner ఒకటి, అటువంటిది. ఇంకా ఉన్నవి. ఈ గ్రంథాల్లో ఉన్న గొప్ప యేమిటంటే ఆ గ్రంథకర్తల దృష్టి సర్వతోముఖమైనది. ఏ నాల్గు ఘట్టాలో రమ్యంగా వర్ణించి కావ్యం పూర్తయిందని అనుకోరు. వారు సృష్టినంతా ఒక అనంతరితమైన సూత్రంగా భావిస్తారు. ఈ సూత్రంయొక్క ఆది మధ్యాంతాలు అన్యోన్య నివిష్టాలుగా ఉంటవి. ఆది అంతమునందు, అంత మాదియందును ప్రతిబింబిస్తవి. ఒకే వస్తువుయొక్క పరిణామం కాని, భిన్న వస్తువుల సమాహారం కాదు. ఇది వాళ్ళ సృష్టి వైలక్షణ్యం. ఇది సంస్కృత నాటక కవులు, ప్రధానంగా కాళిదాస భవభూతులు చేసిన సృష్టి. పాశ్చాత్యులలో ప్రధాన నిర్దిష్ట వస్తువు లోకవర్తమాన ప్రదర్శనమే అవటంచేత యీ శిల్పపు బిగువు వస్తుబలము లేక సన్న గిల్లినట్టు కనబడుతుంది. కొన్నిచోట్ల అదీ బాగానే వుండవచ్చు.

ఇట్టి సృష్టిని కావ్యమునందు నిక్షేపించడంలో రెండు పద్ధతులు కనబడుతున్నవి. ఒకటి కావ్యాదియందు కావ్యప్రధానోద్దేశ్యము వ్యంగ్య భూతంగా నిక్షేపించి తక్కిన కావ్యం కావ్యంగా వ్రాసుకుపోవడం. రెండవది కావ్యముయొక్క సర్వాకృతి ఒక మహార్థానికి వ్యంగ్య రూపంవలె చెయ్యడం. ఈ పద్ధతిలో కవికి కృత్యాద్యవస్థయే కాదు, కృతి మధ్యాంతావస్థలు కూడా తప్పవు. ఈ రెండో రకాన తన కృతిని దీర్చిన ప్రభువు ఋషిప్రథమ గణంలో చేరుతాడు. వారిద్దఱూ కాళిదాస భవభూతులు. శాకుంతలోత్తర రామచరితలలో వారిట్లాంటి సృష్టి చేశారు. ఈ చెయ్యడంలో వారిద్దరి మధ్యా కొంత వైలక్షణ్యం లేకపోలేదు.

ఇందులో మొదట చెప్పినటువంటి సృష్టి వారిద్దరినీ మినహాయిస్తే మరికొంత మంది చేశారు. భాసుడు, భట్టనారాయణుడు మొదలైనవారు కృత్యాద్యవస్థ మాత్రమే పడ్డారు. ఈ యవస్థ కలికాలములోనే మొదలు పెట్టలేదు. త్రేతనాటి వాల్మీకి, ద్వాపరమునాటి

వ్యాసుడూ దీనికి మార్గదర్శకులు.

వాల్మీకి రామాయణము నారంభిస్తూ ఎల్లా ఆరంభించినాడు? అయోధ్యాపుర వర్ణనలతో ప్రారంభించలేదు. రాజును వర్ణించి కథ మొదలు పెట్టలేదు. మునిపుంగవుడైన వాల్మీకి వాగ్విదాంవరుడైన నారదుని 'కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్ ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కో2నసూయకః' అని ప్రశ్నించి తన మహాకావ్య పరమార్థంలోనే మహానాయకుణ్ణి కూడా సంకల్పించాడు. ఆత్మవాన్ అని పరమేశ్వరుణ్ణి ఉద్దేశించాడు. ఈ కావ్యారంభం యుగాలు చన్న తరువాత సామాన్యంగా గోచరిస్తుంది. చిన్నప్పుడు చదివిన మనుచరిత్రలో పద్యాల్లోని అందం పెద్దయిం తర్వాత తెలియునట్లు. కాని దానిలో వున్న ప్రత్యగ్రత భావిస్తే గోచరిస్తుంది. అది అల్పమైన విషయం కాదు. కావ్యదృష్టితో గాకుండా, పురాణ దృష్టితో చూస్తే ఆయన అడిగాడు, ఈయన చెప్పాడనటం మాత్రమే పరమార్థం. అది అట్లాగే జరిగినా దాన్ని కావ్యాదియందు నిక్షేపించడం మాత్రం కవితాత్మను దర్శించడం.

ఇటువంటి కావ్యాదిసృష్టి యుగధర్మభేదంవల్ల మారుతుంది. వేద ఛందస్సులు మాత్రమే తెలిసివున్న ఆ రోజుల్లో కావ్యాది యిట్లా చెయ్యడమే ఘనం. పైగా ఆ కాలంలో వుండే ధర్మపు బిగువు కాలం గడచినకొద్దీ వచ్చిన ధర్మచ్యుతి లేకపోవడంవల్ల కావ్యంలోగూడా ప్రతిబింబిస్తూ వుంటుంది. నిత్యధర్మాసక్తుడికి వ్యంగ్యం తక్కువ కావాలి; వ్యంగ్యం ద్వారా రససిద్ధి అల్పసంస్కారికి.

ఇంక వ్యాసుని కావ్యారంభం చూడాలి. వ్యాసుడి నాటికి ద్వాపరం చివరికి వచ్చి కలి ముట్టుకోబోతోంది. ధర్మమంతా ఉత్సన్నమైంది. అందుచేత ధర్మబోధనం చేస్తూ సృష్టియొక్క పరమ రహస్యం భారతం చెప్పవలసి వచ్చింది. ఆరహస్యం వాల్మీకి నాటికి విస్మృతిపథంలో పడిపోలేదు. వ్యాసుడి నాటికి పడ్డది కనుక ఆ రహస్యాన్ని వ్యాసుడు తన భారత గ్రంథంలో సర్వధా పరామర్శిస్తూ కావ్యపరమార్థం మరో రీతిగా భావించకుండా గ్రంథాది యందే సర్పయాగ కథద్వారా ఉపదేశించాడు. భారతమంతా కర్మప్రాధాన్యాన్ని బోధించే గ్రంథం. కర్మ అంటే నిత్యనైమిత్తికం కాదు. ఆగామిసంచిత ప్రారబ్ధాలు. సృష్ట్యాది నుండీ తనయందు ప్రతిఫలించిన బ్రహ్మపదార్థం కలిగిన మూల ప్రకృతి యెల్లా పరిణమిస్తుందో, అందులో బహుజీవుల కర్మసూత్రం యెల్లా నడుపుతుందో

కర్మకు మొదలు చివరా యెక్కడో యీ విషయాలన్నీ ధ్వనితాలయ్యే సర్పయాగ కథను యీ మహా విషయాలనే బోధించే భారత గ్రంథాదియందు ఆ మహర్షి నిక్షేపించాడు.

ఆయన భారతాన్ని శంతనుడున్నాడు అని కాని, భరతుడు దగ్గర నుంచి కాని మొదలెట్టి కథ చెప్పలేదు. హస్తినాపురాన్ని వర్ణించనూ లేదు. అయితే సర్పయాగం కథాముఖంగా యెందుకు చేశాడు? సర్పయాగంయొక్క బీజాలు కొన్ని వేల ఏండ్లకు పూర్వం పడ్డవి. సర్పయాగం కల్యాదిలో జరిగింది. సముద్ర మథనం త్రేతాదిలో జరిగింది. సముద్ర మథనమైన తరువాత ఉచ్చైశ్శ్రవము ఆ తీరాన మేస్తోంటే కద్రూవినతలు చూచి పన్నిదం చరిచారు. ఆ సందర్భంలో కద్రువ తన కొడుకులు జనమేజయ సర్పయాగంలో చచ్చేటట్టు శాపమిచ్చింది. ఈ శాపం తరువాత కొన్ని లక్షల యేండ్లకు యాగం జరిగింది. కర్మసూత్రం రకరకంగా సాగుతోంది. ఇందులో ఉదంకుడి కథ అనుస్యూతమైంది. రురుప్రమద్వరల కథ కలిసిపోయింది. ఆస్తీకుడు వచ్చాడు. పరిక్షితుడు చచ్చిపోయిన పామును ఋషిమెడలో వేశాడు. ఇట్లా బహుకథోపనదులను సంగ్రహించుకొని యీ కర్మ కథా ప్రవాహం భారతసముద్రాభిగామిని అయింది ప్రారబ్ధకర్మను మనం గుర్తుపట్టలేము. దారిలో ఆగామి సంచితాలు వస్తవి. ఇవ్వన్నీ కలిసి యేం పరిణామం పొందుతవో తెలియదు. మొత్తానికి యీ సృష్టి అంతా చుట్టిన చాపవంటిది. పఱచినకొద్దీ పోయి చివర కనపడాలిసిందే తప్ప అంతవఱకూ కనపడదు. అయితే ఆ చివర పఱచినప్పుడు మాత్రమే లేదు చుట్టినప్పుడూ ఉంది. ఆదిమధ్యంతముల సమష్టి సంక్షిప్తి యీ సృష్టి అనడం యీ సృష్టి రహస్యాన్ని తమ కావ్యాల్లో వ్యంగ్యభూతంగా ఉంచటం యీ కర్మభూమిలో ఉన్న మహాకవులకు తెలిసినదీ చేసినదీ, అయిన విషయం. అనుశాసనిక పర్వంలో మొదట గౌతమీలుబ్ధక సర్ప మృత్యుసంవాదమని ఒక ఉపాఖ్యానం ఉంది. అది అనుశాసనికంలో మొదటిది. భారతంలో అనుశాసనిక శాంతిపర్వాలు రెండూ ధర్మాల కాయువుపట్టులు. శాంతి ఆధ్యాత్మిక విద్యనెంత చెబుతుందో, అనుశాసనికం ఆధిభౌతికాన్ని అంత చెబుతుంది. ఈ గౌతమ్యాదిసంవాదంలో గౌతమి కొడుకు పాము కఱచి చస్తాడు. కిరాతకుడు ఆ పామును కట్టి తెచ్చి చంపుతానంటాడు. గౌతమి వద్దంటుంది. పాము, నాదేం తప్పుంది, మృత్యువు కరవమన్నాడు, కరిచానంటుంతది. మృత్యువు వచ్చి నేను కాలుడి ఆజ్ఞ చేశానూ, నాదేం తప్పూ అంటుంది.

కాలుడు వచ్చి యీ కుర్రవాడు పాముకఱచి చనిపోయే దుష్కర్మ చేశాడు; ఇట్లా చచ్చాడు' అంటాడు. "తన యెఱుకయు దేవాలాపములు నొక్క తెఱగై యున్నన్" గౌతమి యిట్లా అంటుంది. వాడు అల్లాంటి కర్మచేసి పాముచేత కఱవబడ్డాడు, నేనిటువంటి కొడుకును కనే కర్మచేసి యిట్లా కొడుకును కోల్పోయానంటుంది. ఇది భారతంయొక్క పరమార్థం. దీన్నే వ్యాసుడు తన కావ్యాదియందు సర్పయాగ కథ ద్వారా ధ్వనితం చేశాడు. ఆయన పడ్డ కృత్యాద్యవస్థ యిది. కొందరాధునికులు పాండవులది న్యాయమా, కౌరవులదా అనీ, అర్జునుడెక్కువ వీరుడా, కర్ణుడా అనీ, యిందులో బ్రాహ్మణ బ్రాహ్మణేతర కక్షలు ఉన్నవనీ బహువిధాలుగా ఆలోచిస్తున్నారు. ఈ ఆలోచన యీ కాలాన్నిబట్టి తగినదే కాని వ్యాసుడి కీ గోల తెలియదు. తెలుసునని కూడా ఆలోచిస్తే ఆలోచించవచ్చు. వ్యాసుడు జరిగిన కథలో ఆధ్యాత్మికాధి భౌతిక విషయాలు కొన్నిచోట్ల కథారూపంగానూ కొన్నిచోట్ల వ్యంగ్యభూతంగా పరమార్థదృష్టితోనే వ్రాశాడు. దీనికి భారతంలో ఉన్న బహుకథలూ, తద్గ్రంథానికి తిలకాయమానంగా వుండి, యిట్లాంటి ఉద్దేశం వ్యాసుడికి లేకపోతే తన్ముఖమునందు నిక్షేపించడం వ్యర్థమూ గుణరహితమూ అయ్యే సర్పయాగ కథ, వ్రాయడు.

కావ్యకళ కల్యాది నుండియే మిక్కిలి విజృంభించిందని చెప్పాలి. తత్పూర్వం వేదానికి ఋక్కులకే ప్రాశస్త్యం. సృష్టిలో అదేమి చిత్రమో ఆదియందు సంపూర్ణత్వం, పోనుపోను ఛిద్రత్వం కనబడుతోంది. అన్ని జాతులలోనూ మహాకవులు తజ్జాతి సారస్వతోదయ ప్రథమ కాలాల్లోనే పుట్టారు. అట్లాగే కాళిదాసున్నూ. ఆయన శాకుంతలంలో తీర్చిన తీర్పు అద్వితీయంగా ప్రకాశిస్తోంది. ఆయన తీసుకొన్నది ఒక రాజు కథ మాత్రమే. చేసిన సృష్టి శంభుతనువు. దానిలో యజమాని, హోత, సూర్యచంద్రులు, పంచభూతాలూ యిమిడిపోయినవి. ప్రస్తావన నాటకానికి ముఖం కాబట్టి మనకావ్యార్థ సూచనం దానిలో ఉండాలి కాబట్టి ప్రస్తావన యెవళ్లైనా కొంచెం కవులైతే బాగా వ్రాయవచ్చు. కాని కథారంభం చేయడం మాత్రం కాళిదాస భవభూతులకు మాత్రమే తెలుసు. కాళిదాసు వ్రాయబోయేది శృంగార రస విషయం. తక్కిన రసములకూ శృంగారానికీ చాలా భేదం ఉంది. రౌద్రాదిరసాల్లో ఉదాత్తత్వం కొంచెం తగ్గినా తగ్గినట్లు కన్పించదు. శృంగార రసం యేమాత్రం పొల్లువచ్చినా అనుదాత్తతవచ్చి గ్రామ్యమైపోతుంది. రచనలోనే కాదు,

అభినయంలో కూడాను. చాలా మంది నటులు ఉదాత్తతాగ్రామ్యతల మధ్య కల పొలిమేర గుర్తెఱుగక రసాభాసం చేస్తారు. ఇట్టి శృంగార రసాన్ని కాళిదాసు పట్టుకొని కావ్యం యెల్లా ఆరంభించాలో తెలియక చాలా గగ్గోలు పడ్డాడు. ఎకాయెకి శకుంతలను ప్రవేశపెడితే దుష్యంతుడిచేత ఎల్లా మాట్లాడించాలో తెలియదు. దుష్యంతుడే ప్రవేశించినా ఎల్లా చెయ్యడమో కష్టం. ఈ కష్టాన్ని తప్పించుకునేందుకు ఆయన ఒక యెత్తు యెత్తాడు. దుష్యంతుడు లేడిని తరుముతున్నట్లు.

రంగముమీద రథమెట్లా పరుగెత్తుతుందీ? లేడి యెట్లా పరుగెత్తు తుందీ? వాడు పూర్వుడు గనుక సరిపోయింది. ఆధునిక రంగానికి ఇటువంటి పరిస్థితులు పనికిరావు. వాళ్ళ వుద్దేశం వేరు. లేడి పరుగెత్తటం, రథం పరుగెత్తటం కవి పాత్రలచేత వర్ణింపించి సామాజికుల భావనలో ఆ పరుగెత్తటం కనిపింపచేస్తాడు. దానికి ఆ కాలపు నటకులూ సామాజికులూ కావాలి. ఈ లేడిని యింత మాత్రం కోసమే ప్రవేశపెట్టాడా? పెడితే మాత్రం శిల్పం కాదు. శిల్పమేం చేస్తుందంటే బహు విషయాలను స్ఫురింపచేస్తుంది. స్ఫురితాలూ, వ్యంగ్యాలూ, ధ్వనులూ అధికంగా ఉన్నకొద్దీ అధికమైన శిల్పం. అదే సౌందర్యం. అనగా భావనా సౌందర్యం. ఈ లేడి కాని రథాశ్వాలు కాని కాళిదాసు కావ్యవస్తువును ధ్వనిస్తున్నవి.

"గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి స్యందనే బద్ధదృష్టిః, పశ్చార్ధేన ప్రవిష్ట శ్శరపతనభియా భూయసా పూర్వకాయం"; ఆ లేడి మాటిమాటికి వెనుకకు తిరిగి చూస్తోందిట. పశ్చార్ధభాగాన్ని పూర్వార్ధకాయంలో ప్రవేశపెడుతోందిట. కవి తన కావ్య కథను యిట్లాగే ధ్వనించాడు. తన కావ్య పశ్చార్ధ భాగము పూర్వార్ధభాగంలో ఉంది! తన కావ్యం మాటిమాటికీ వెనక్కి తిరిగి చూస్తూ లక్ష్యాన్ని వదిలిపెట్టకుండా పోతోంది. ఉదగ్రప్లుతాలతో ఆకాశం మీద యెగిరి పోతోంది. ఈ ఉదగ్రప్లుతఘట్టాలు, స్తోకంగా ఉర్విని స్పృశించే ఘట్టాలు, శాకుంతల విమర్శ విషయాలు. కవికే తన కావ్యారంభంలో తానెటువంటి కష్టంలో ఉన్నాడో తెలుసు. అందుకనియే 'ఉద్ఘాతినీ భూమిరియం' అన్నాడు. నేల మిట్టపల్లాలుగా వుందిట. ఇది తన కథలోని యిక్కట్టు. శృంగారరసం ప్రారంభించటం కష్టమని ధ్వనించటం. తాను రథంమీద పోయే వేగాన్ని చెపుతూ కూడా దీన్నే ధ్వనిస్తాడు.

'య దాలోకే సూక్ష్మం వ్రజతి సహసా త ద్విపులతాం

య దర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధానమివ తత్"

ఏది సగంలో తెగిపోతుందో అది మళ్ళీ కలుసుకున్నట్లే వుంది. శకుంతల ఉంగరం పారవేసుకోడం మూలంగా కథ తెగిపోయింది. కాని ఉంగరం దొరికి రాజుకు మళ్ళీ స్మృతి రావడంతో కథ కలిసింది.

'ప్రకృత్యా యద్వక్రం తదపిసమ రేఖం నయనయోః' స్వభావంగా యేది వంకరగా ఉందో అది మళ్ళీ చూస్తే సాపుగా ఉంది. దుష్యంతుడు శకుంతలను తిరస్కరించడం వక్రంగా కన్పించినా, దూర్వాసుని శాపం వల్ల, దుష్యంతుడి ధర్మబుద్ధివల్ల న్యాయంగానే తోచింది. శకుంతల వక్రమార్గం వడుతోందని దుష్యంతుడికి కనిపించినా అంగుళీదర్శనంతో అది రాజుకు మళ్ళీ సరిగ్గానే కనిపించింది.

ఇల్లాగా కొన్నిచోట్ల సువ్యక్తంగా, కొన్నిచోట్ల వ్యక్తావ్యక్తంగా కాళిదాసు తన కథను పూర్వభాగమంతా ధ్వనిస్తూనే వచ్చాడు.

'తేన మృగ ఏష విప్రకృష్టాంతర స్సంవృతః' ఈ వాక్యం కూడా దానినే ధ్వనిస్తోందది. ఈ కష్టపు భూమి దాటింతరువాత తన కావ్యం యెల్లా నడుస్తుందో యిల్లా చెప్పాడు.

'ముక్తేషు రశ్మిషు నిరాయతపూర్వకాయాః

నిష్కంపచామరశిఖా నిభృతోర్ధ్వకర్ణాః'

తన కావ్యం క్లిష్టఘట్టం దాటితే అంత దర్జాగా పోతుందట. ఈ వాక్యానికి ఆయన చతుర్ధాంకంలో ఉన్న రచన, సప్తమాంకపు రచన చాలా నిదర్శనం. ఇంక తరువాత ప్రతి చిన్నవాక్యమునందు వస్తుధ్వనులు నించి కావ్యాన్ని బిగించాడు. శకుంతల చీర పొదమీద పడ్డది. మళ్ళీ ఆవిడ తీసుకొంది. అప్పుడామె చెలికత్తె 'పరిముక్తాసి' అన్నది. వదిలిపెట్టబడ్డావు అని అర్థము. ఎవరిచేత? ఒక్క పొదచేతనే కాదు. కాశ్యపునిచేత కూడా. దుష్యంతుడు శకుంతలను 'అపి తపో వర్ధతే' అని అడుగుతాడు. తపస్సు సాగుతోందా అని. ఎవరి తపస్సు. ఎటువంటి తపస్సు? కణ్వునిదా? ఆశ్రమంలోదా? కన్యాత్వ తపస్సా? దీని అర్థం బహుముఖంగా ఉంటుంది?

ఇల్లా కాళిదాసు కృత్యాద్యవస్థ పడ్డాడు. ధ్వనికి అవధి అయిన అతని రచనలో అవస్థ అవస్థకాదు. ఊరికే నామమాత్రం.

ఇట్లాగే భవభూతి కూడా ఉత్తర రామచరిత్రలో చేశాడు. సంస్కృత నాటకాలంటే కృత్రసంక్షిప్తితో కూడిన రచనలు. ప్రవేశ నిష్క్రమణాల దగ్గర నుంచీ అర్థవంతాలుగా ఉంటవి. ప్రత్యక్షరమూ ప్రయోజనకారిగా ఉంటుంది. ఉత్తర రామచరితలోని ఆద్యంతాంకాలు మంత్ర శాస్త్రం వంటివి. వర్ణ సమామ్నాయంలో ఆద్యక్షరమైన అకారమూ, అంత్యాక్షరమైన క్షకారమూ కలిసి అక్షమాల అయినట్లుగా భవభూతి ఆద్యంతాంకాలు రెండూ అల్లా చేశాడు. ఒకరు భవభూతి ప్రథమాంక నిర్దిష్టాలను బహువిషయాలు చివరి అంకాల్లో వాచ్యంగా చేశాడన్నారు. ఒక దృష్టికి అది వాచ్యంగా కనపడుతుంది. కాని లక్షణోదిత ధ్వనుల కతిశయించి శ్రీరామచంద్రుడి పరమ పురుషత్వం మహాధ్వనిగా కావ్యంలో కనిపిస్తుంది. మొట్టమొదటనే

కిం త్వనుష్ఠాన నిత్యత్వం స్వాతంత్ర్య మపకర్షతి
సంకటా హ్యాహితాగ్నీనాం ప్రత్యవాయైర్గృహస్థతా

గృహప్రస్థితుడైన జనకుని మూలంగా సీత విషాదం పొందుతూంటే రాముడామె నిట్లా ఓదార్చాడు. అనుష్ఠాన నిత్యత్వము స్వాతంత్ర్యమును లాగి వేస్తుందిట. రాముడు రాజ్యానుష్ఠాన నిత్యత్వం కలవాఁడు. తనకు స్వాతంత్ర్యంలేదు. అందుకనియే సీతాదేవిని కూడా వదిలిపెట్టవలసి వచ్చింది. ఈ ధ్వని యిందులో లేకపోతే అది శిల్పమనిపించుకోదు. ఒక ధర్మాన్ని చెప్పడం మాత్రమే అవుతుంది. భవభూతి ప్రథమాంక మంతా చిత్రపట దర్శనం చేస్తూ మాట్లాడిన మాటల్లో రాబోయే సీతా వియోగాన్నే సూచిస్తాడు. ఇది పూర్వార్ధంలో పశ్చార్ధం ప్రవేశించి కావ్యాన్ని కర్మసూత్రంతో కట్టివెయ్యటం. కథలు భేదమే తప్ప ఆ మహానుభావుల దృష్టి అంతా ఒకటే. కాళిదాసు రఘువంశంలో దిలీపుణ్ణి రాజ్యాశ్రమముని అన్నాడు. అది భవభూతి రామచంద్రుడి కెంత తగిపోతుంది?

సంస్కృత నాటకాలు చదువుతోంటే కావ్యం యిల్లా ఎందుకు మొదలు పెట్టాడు, ప్రతి అంకమూ ప్రవేశకం కూడా యిల్లా యెందుకు చేశాడు, ఈ మాట యిల్లా యెందుకనిపించాడు, అన్న ప్రశ్నలకు సమాధానాలుగా బహుప్రయోజనాలు కనబడుతూంటవి.

ఇది ఒక మహాశిల్ప లక్షణం. ఇది సంస్కృత నాటక సారస్వతంలో నిండి నిబిడీకృతమై వుంది. భాసుని ప్రతిమలో వల్కల వృత్తాంత మిట్లాంటిది. అది దీనికన్న తక్కువ రకం.

రౌద్రమంతా కృత్యాద్యవస్థా విషయం. ఆ అంకంలో భట్టనారాయణుడు చూపించచిన నేర్పు తక్కిన అంకాల్లో లేదు. ఆ అంకం వ్రాసిన యెత్తుగడలో తక్కిన పుస్తకం సంబాళించుకోలేకపోయినాడనిపిస్తుంది.

తక్కిన చాలా మంది కవులు యీ క్లిష్టమార్గాన్ని పట్టక పాత్ర పోషణాదులు, అలంకారాదులు సంవిధాన కల్పనలతో తమ నాటకాలు రమ్యంగా చేసుకుంటూ వచ్చారు. ఈ మార్గం వ్యాస కాళిదాస భవభూతులది. తక్కిన వారు చేతనైనంతమట్టుకు కొద్ది కొద్దిగా సవరించుకొన్నారు.

తెలుగులో పింగళిసూరన్న తన కథా కల్పనావైదుష్యంచేత కొంత కొంత యీ మార్గాన వెళ్ళాడు. కాని ఆయన ఉపశ్రుత్యాది శబ్దాలు నిక్షేపించి ఆ రెండవ రకపు చేతలోనే కొంత వాచ్యం చేశాడు.

తిక్కన్నగారు తాను భారతము వ్రాస్తూ ఉపాఖ్యానాల్లోనే కావ్య రచనా వైదుష్యం వెల్లడిస్తూ వచ్చాడు. ఆయన మరుత్తుని కథ ఒకటి అట్లాంటిది. భవిష్యత్కథా సూచన, ఆగావమి కథాంశ స్ఫురణచేసే మాటలు ప్రయోగించడం ఆయన చాలాచోట్ల చేశాడు. పది పద్యాలు చాలిన ఉపాఖ్యానంలో కూడా తిక్కనలో యీ పద్ధతి కనపడుతూ ఉంటుంది.

ఇది భారతతీయ శిల్పానికి ఉత్కృష్ట స్వరూపం అనుకోవాలి. అలాంటి రచనలో సృష్టి రహస్యం గోచరమవుతూ ఉంటుంది గనుక ఒక రకంగా చూస్తే యిది కావ్యగుణాపాదనమే అనిపించవచ్చు. కాని భవభూతి కాళిదాసాదుల తరగతులలో వారియందే కనబడుతున్నది. ఇట్టి రచన కొన్ని పాశ్చాత్య గ్రంధాల్లోనూ కనబడుతోంది. కాని వాళ్ళ ప్రధానంగా ప్రతిపాదించే విషయాలు రసప్రధానాలు కాకుండా భావప్రధానాలవడంచేతనూ, వారి పరమోద్దేశాలు సంఘటన క్లిష్ట పరిస్థితుల విమర్శించుట కావడంచేతనూ వారికి భారతతీయులకు వలె ధర్మప్రాధాన్యబుద్ధి లేకపోవటంచేతనూ, ఇట్టి పద్ధతిలో ఆ కొద్ది మంది మహాకవుల రచనా కించి దూరంగా కనబడుతుంది. వట్టి కావ్యరచనా శిల్పం తీసుకొంటే అందు యీ పద్ధతులు కొద్దిమంది మహానుభావులలో లేకపోలేదు.



# ఆరంభం పెద్ద అవస్థ!

(ఈ రచన ఆకాశవాణి నుంచి ప్రసారితం. పరిశోధన పత్రికలో ప్రచురితం సం॥.)

శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు

"రావద్దు రావద్దు లోనికి
రాస్తున్నా నొక గీతం
రావద్దు రావద్దు లోనికి ....
ననుచూడ, కాదిదివేళ
నా మనః కార్మిక శాల
క్రక్కేది చండాగ్ని సెగలు

సరే, ఏమయితేనేం? లోనికి రావద్దని మొదటే చెప్పి తర్వాత లోపల జరుగుతున్నదేమిటో వర్ణించబోవడం, అందుకే ఆరంభించిన గీతం పూర్తికాలేదు. ఈ విధంగా నేను మొదలుపెట్టి వదలిపెట్టి పెట్టిన గీతాలు చాలా ఉన్నాయి.

"తలలో పుట్టి
కలలో పెరిగి
ఉద్రేకంతో నిండి
ఉన్మాదంలో పండి
కాలకూటపు గాటపు పొగలలో
గంధక ద్రావక కాసారంలో

గండభేరుండాల కౌగిలింతలలో..."

తర్వాత జ్ఞాపకం లేదు.

"వాకిట్లో చీకట్లో ఎవరా కేక?

నేనేలే... నేనేలే.... నేనే...."

అసంపూర్ణంగా ఉండిపోయేవి ఒక్క గీతాలే కావు. కధానికలూ. ఉదాహరణకి, గురజాడ అప్పారావుగారు ఎన్నో కథల కోసమని నోట్సు రాసి పెట్టుకున్నారు. చిత్రకారుని రచనలూ, మాటవరసకి! "ఈ బొమ్మ చాలా బాగుందండీ. పూర్తి చెయ్యలేకపోయారా?"

ఎలాగైనా ఆరంభం పెద్ద అవస్థ.

"క్షితిజ రేఖకు ప్రారంభం ఎక్కడ" అన్నాడొక కవి.

కాని అసలు ఆరంభమనేది ఉన్నదా అని వేదాంతితోపాటు మనం ప్రశ్నించుకోవాలి. "సాయంకాలమైంది. పూటకూళ్లమ్మకు సంతలో సామాను కొనిపెడతానని..." అని ప్రారంభమవుతుంది కన్యాశుల్కం నాటకం. కాని అప్పటికే ఎంతో కథ అయిపోయింది. ఈ సంతలో సామాను కొనిపెడతాననడమే ఒక నెల రోజుల కిందట! గిరీశం ప్రవేశించడమే బోలెడంత పూర్వకథతో ప్రవేశిస్తాడు. అలాగే ఆ నాటకంలోని ప్రతీపాత్రా కూడా.

అలాగే కావ్య ప్రపంచంలోని ప్రారంభానికి ముందే పుష్కలమైన పూర్వకథ ఉంటుంది. "దూరాన నారాజు కేరాయిడౌనో" అని ఎంకి ఆక్రోశించినప్పుడు మొదటి మాటలోనే మనం యెంకికీ నాయుడు బావకీ మధ్యనున్న దూరాన్ని గ్రహించుకుంటాము.

"మరో ప్రపంచం

మరో ప్రపంచం పిలిచింది."

ఈ విధంగా ప్రారంభించిన గీతానికి పూర్వం నా మనస్సులో ఏం జరిగింది?

ఈ గీతాన్ని నేను 1934వ సంవత్సరం ఏప్రిల్ నెల 12వ తేదీనాడు రాశాను. దీన్ని రాయడానికి నాకు అయిదు నిమిషాల కంటె ఎక్కువ పట్టలేదు. మరో ప్రపంచం అని ప్రారంభించి ఘుగఘుగలు అని ముగించేదాకా పెన్సలు ఆపలేదు.

ఔను. ఈ గీతాన్ని పెన్సలుతోనే రాశాను. ఒక వ్యాసం రాద్దామని "మరో ప్రపంచం" అని శీర్షిక కాగితం మీద రాసే సరికి కలంలో సిరా అయిపోయింది. సిరా

పోస్తూ ఆలస్యం చెయ్యడమెందుకని కాపీయింగ్ ఇంక్ పెన్సులు తీశాను. నాన్‌స్టాప్‌గా నడచిన పెన్సల్ భుగభుగలు అనే మాట దగ్గర హఠాత్తుగా ఆగిపోయింది. రాసిందంతా చదివేసరికి అక్కడితో గీతం అంతమయిందని తెలిసింది.

ఒక్క మార్పు కూడా చెయ్యకుండా మర్నాడు యీ గీతాన్ని ఒక సుప్రసిద్ధ మాస పత్రికకి పంపించాను. పంపిన మూడవరోజుకి "రిటరన్డు విత్ థేంక్సు" అనే వర్తమానంతో గీతం నా దగ్గరికి తిరిగి వచ్చింది. అప్పటి కీ గీతానికి "మహాప్రస్థానం" అనే పేరు లేదు. తర్వాత గీతంలో ఒకే ఒక్క మార్పు చేశాను.

"కదం తొక్కుతూ పదం పాడుతూ
కాండ్రు కాండ్రుమని గర్జిస్తూ..."

తొలి పాఠం ...

కాండ్రు కాండ్రుమని పులికేకకీ, గర్జించడం సింహం చేసే ధ్వనికీ ఉపయోగిస్తాం కాబట్టి ఈ ప్రయోగం నాకు సంతృప్తికరంగా లేక పోయింది.

"కదం తొక్కుతూ పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ"

అని మార్చాను.

ఈ గీతం రాసి కొన్ని నెలలయిపోయిన తర్వాత మహాప్రస్థానం అనే శీర్షికతో జ్వాల పత్రికలో ఇది ప్రకటితమయింది. అంతకుముందు సంచికలో వేదుల వారి "కాగడా" అనే గేయం, దానికి ముందు సంచికలో అడివి బాపిరాజు గారి "ఎగురనివ్వండోయ్ జ్వాలల్" అనే గేయమూ పడ్డాయి. అయితే మరో ప్రపంచం పాట విశాఖపట్టణం టర్నరు సత్రంలో నేను చదివి వినిపించిన తర్వాతనే తాను జ్వాలకి పాట రాసినట్లు బాపిరాజుగారు ఒప్పుకున్నారు.

ముందుగా అడవి, వేదుల వారి పాటలు వెయ్యడమేకాక, మహాప్రస్థానం ప్రకటించిన సంచికలోనే దానికన్న ముందు పుటలో "జ్వలనా" అనే అనుకరణ రచన ముద్రించటంలో జ్వాల సంపాదకునికి గాని అప్పట్లో అతనికి సలహాలు చెబుతూ వచ్చిన వారికి గాని దురుద్దేశాలున్నాయనని నేనారోపించను. జరిగిన యీ సంగతులను నేను గుర్తించానని మాత్రం చెబుతున్నాను.

ఈ పాటలోని ఆవేశానికి ప్రధాన ప్రోద్బలాలు లా మర్సెయ్యే, లా ఇంటర్ నేషనల్, బరస్సు కవి రచించిన 'బెన్నాక్ బరన్' అలెగ్జాండర్ బ్లాక్ వ్రాసిన "ది ట్వెల్వ్" దరిమిలాని యీ ట్వెల్వ్‌ని నేను

'నల్లని రాత్రి

తెల్లని మంచు

ప్రభంజనం, ప్రభంజనం'

అని ప్రారంభించి కొంతవరకు తెనిగించాను. హరీంద్ర కవి 'షురూ హు ఆ హై జంగ్' అనే పాటా నజ్రుల్ ఇస్లామ్ గీతాలూ నా మనస్సులో ఏవో మారుమోగుతూ ఉండి ఉండాలి. అలాగే కవి కొండల కవి కంఠం కూడ. ఫలానా చోట అని చెప్పడానికి లేకుండా మొత్తం నా కవితా వ్యాసంగం అంతటి మీదా ఎడ్గర్ ఆల్లన్ పో, గురజాడ అప్పారావుల ప్రభావం పనిచేస్తుంది. ఇంచుమించు ఆ రోజుల్లోనే వేమన్నని నేను మహాకవిగా శిరసావహించాను. లేకపోతే

"తలుపు గొళ్ళెం

హారతి పళ్ళెం

గుర్రపు కళ్ళెం

కాదేదీ కవితకనర్హం

ఔనౌను శిల్ప మనర్ఘం."

అనగలిగిన పాటి ధైర్యం వుండేది కాదు.

మరో ప్రపంచం గీతం రాయడానికి ముందు 1934వ సంవత్సరం ఫిబ్రవరి నెల 18వ తేదీని ఎడ్గార్‌పో గంటలని అనురణిస్తూ (అనువదిస్తూ కాదు) ఒక గేయం రాశాను. అందులో

"హరోం హరోం హర హర హరహర

హరోం హరా అనే పలికే గంటలు"

అన్న పాదాలు తతిమ్మా గేయంతో బేలన్సు కాకపోవడం వల్ల వాటిని ఉపసంహరించాను. రెండు నెలల ఆ 'హరోం హరోం హర' నించే మరో ప్రపంచం

గీతం వెలువడిందనీ అనవచ్చును.

ఇదే విధంగా ధ్వని సామ్యాన్నే వెతుక్కుంటూ వెళ్లితే అప్పట్లో బరంపురం నవ్య సాహిత్య పరిషత్తులో శ్రీ శివశంకర శాస్త్రి గారు చదివిన

"'మారో మారో, మారో మారో,

ఒకటి రెండు మూడూ నాలుగు,

మారో మారో మారో మారో'"

అనే శిష్ట్లా ఉమామహేశ రచన కూడా ఒక ప్రోద్బలమే అని చెప్పాలి.

భావకవిత్వ పద్ధతులూ, గ్రాంధిక భాషలో పద్యరచనా వదిలిపెట్టి వ్యావహారిక భాషలో నవీన ధోరణిలో సాగించిన నా మొదటి రచన –

"నేను సైతం

ప్రపంచాగ్నికి

సమిధ నొక్కటి ఆహుతిచ్చాను"

అన్నది. దీన్ని 1933 జూన్ 2వ తేదీన రాశాను. అప్పటికే శిష్ట్లా ఉమామహేశ విలక్షణమైన ఒక నవీన ధోరణిలో రచన సాగిస్తున్నాడు. కాని సరాసరిగా అవి నా రచనను ప్రేరేపించలేదు. శిష్ట్లా ప్రభావంతో ముద్దు కృష్ణ వ్రాస్తున్న వచన గీతాలు ఎప్పటికప్పుడు ముద్దు కృష్ణ ముఖతానే నేను వినేవాడిని. వచన గీతాన్ని కళారూపంగా తీర్చి దిద్దడానికి మున్ముందుగా నేను కొంత శోధనా, సాధనా సాగించాను. హరీంద్రనాథ్ గీతాలూ, మరికొన్ని ఆంగ్ల గీతాలూ తెనిగించడం ద్వారా యీ పరిశోధన చేశాను. స్వతంత్రంగా రాసిన నా మొట్టమొదటి వచన గీతం విద్యున్మాలికలు.

"బారులు బారులుగ తీరిన

మబ్బు గుబ్బలు దారుల

దారి తప్పి చరించే ఆ రేయి

తరళ సరళేరమ్మదములు...."

ఇత్యాది గీతం. ఇది గ్రాంధిక భాషలో ఉండడం ఇక్కడ గుర్తించాలి. ముద్దు కృష్ణనీ శిష్ట్లానీ ప్రేరేపిస్తూన్న పాశ్చాత్య కవుల దగ్గరికి సరాసరిగా వెళ్లాను. ఆంగ్ల కవులతో సంతృప్తి కలుగలేదు. ఫ్రాన్సు జర్మనీ దేశాల కవుల ఆకర్షణకి ముగ్ధుణ్ణయాను.

ప్రపంచ విశాలమైన దృష్టితో అంతటా కలయజూస్తేనే గాని కావ్య స్వప్నం సఫలీకృతం కాదని అప్పటికీ, ఇప్పటికీ నా అభిప్రాయం. ప్రపంచం అంతటా అభివృద్ధిని కాంక్షించే కవుల స్వప్నాలు రష్యన్ విప్లవంలో ఆకృతి ధరించడం నాకు కనబడింది. సామాజిక విప్లవానికి పురోగామిగా సాహిత్య విప్లవం సాగాలన్న దృఢనిశ్చయం ఏర్పడింది.

ఒకసారి గురజాడ వర్ధంతి సభలో కొంతమంది విద్యార్థుల ఎదుట ఉపన్యసిస్తూ నేను "ఆడంబరంతో ఆర్భాటంతో కూడుకున్న సంస్కృత ఛ్ఛందస్సులను నిరాకరించి ముత్యాల సరాన్ని చేపట్టడం జాతీయ జీవితంలో గాంధీ మహాత్ముడు అన్ని రకాల దుస్తులూ మానివేసి అంగవస్త్రాన్ని ధరించడం వంటి"దన్నాను. నిజానికి గాంధీజీ యీ పని చెయ్యడానికి అనేక సంవత్సరాల కిందట గురజాడ కావ్యరంగంలో విప్లవ మార్గం తెరిచాడు. దేశీయ ఛ్ఛందస్సులలోనే అచ్చమైన తెలుగుతనం ఉందని నిరూపించాడు. అవే ప్రజల జీవితానికి అత్యంత సన్నిహితమైన వాహనాలని మరచిపోయిన సంగతిని మళ్ళీ జ్ఞాపకం చేశాడు.

"ముత్యాల సరం : ఒక కృషి" అని ఆ రోజుల్లో నేను వ్రాసిన వ్యాసం ఒకటి ఉదయిని పత్రికలో వచ్చింది. మరో ప్రపంచం ఛందస్సు మీద కూడా అంత సమగ్రంగానూ చర్చించడానికి వీలుంది. అయితే అదిప్పుడు కాదు. ఇక్కడ సూచనప్రాయంగా మాత్రమే పరిశీలిస్తే చాలుననుకుంటాను.

చతురశ్రగతిలో నడిచే ఎనిమిది మాత్రల ఛందస్సు మరో ప్రపంచం. 'పుత్తడి బొమ్మా పూర్ణమ్మా' అనే పాటలోని ఛందస్సు కూడా ఇదే. బొబ్బిలిపదం కొయ్యోడిపాట ఒకటేమిటి, ఎన్నో జానపద గేయాలు స్త్రీల పాటలూ యీ ఛందస్సులోనే వున్నాయి. మహాప్రస్థానం, జ్వాలా తోరణం, నవకవిత, ప్రతిజ్ఞ, శైశవగీతి మొదలైన నా రచనలూ.

"అలసిన కన్నులు కాంచేదేమిటి?

తొణికిన స్వప్నం!

తొలగిన స్వర్గం!"

అనే గీతికలోని ప్రశ్నోత్తర పూర్వకమైన విరుపులు యీ ఛందస్సులో వైవిధ్యం సాధించడానికి నేను చేసిన ప్రయత్నం.

"ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన

సోమరులారా చావండి!

నెత్తురు మండే శక్తులు నిండే

సైనికులారా రారండి!"

అన్న చోట అంతఃప్రాసలూ, అంత్యప్రాసలూ "గీతగోవిందం" లోని

"ముఖర మధీరం త్యజమంజీరం

రిపుమివ కేళిషులోలల

చలసఖి కుంజం సతిమిర పుంజం

శీలయ నీల నిచోళం"

అన్న పోకడతో పోలికకు వస్తాయి.

"మరో ప్రపంచం మరో ప్రపంచం

మరో ప్రపంచం పిలిచింది"

అని ప్రారంభంలో ఒకే పద సముచ్చయాన్ని ముమ్మారు పలికించడంలో

"భజగోవిందం భజగోవిందం

గోవిందం భజ మూఢమతే"

అనే శ్రీ శంకర భగవత్పాదుల అమేయ గేయం స్ఫురణ కొస్తుంది. మూడవసారి కూడా భజగోవిందం అనకుండా గోవిందం భజ అని తిప్పికొట్టడంలో ఆచార్య శంకరుల అసాధారణ ప్రజ్ఞ సుస్పష్టమవుతుంది.

"సముద్రం స్మేర సముద్రం

వినీల విశాల విలోల సముద్రం"

అని నేను ప్రారంభించి పూర్తి చెయ్యని ఇంకోగీతం వుంది. ఇంగ్లీషులో సరిగా ఇదే విధంగా "ది సీ ది సీ ది స్మైలింగ్ సీ" అని ప్రారంభమయ్యే ఒక గీతాన్ని చూసిన తర్వాత నా పాట పూర్తి చెయ్యాలనే ధ్యాస పోయింది.

మరో ప్రపంచానికి అంధానుకరణ ప్రాయంగా "మరో వసంతం" అని ఒకరిద్దరు రాశారు. అంతకన్న

"పొగాకు తోటలు

పొగాకు తోటలు

పొగాకు తోటలు పండింతున్"

అని ఎవరైనా పేరడీ చేస్తే నేను ఎక్కువ సంతోషించి ఉందును.

పద్యాన్ని గద్యం నించి వేరు చేసి చూపేది ఛందస్సే అయినా ఛందోననుబద్ధంగా రచన సాగించి కావ్యత్వం సాధించడం సాధ్యమే అని వచన గీతాల సంవిధానం రుజువు చేస్తుంది. సెమాంటిక్స్ అనే కావ్యానుశీలన విధానాన్ని పాశ్చాత్య కవితా కళాభిజ్ఞులు ఇటీవల చాలా విస్తరంగా అభివృద్ధి చేశారు. ముఖ్యంగా ఆంగ్ల కవయిత్రి ఎడిత్ సిట్‌వెల్ తన గీతాల సంపుటి ఒకదానికి ఉపోద్ఘాతం రాస్తూ యీ నూతన విమర్శలో కొత్త కొత్త లోతులు చూపించింది.

సెమాంటిక్స్ అంటే కవిత్వం చేసే సవ్వడి.

"త్రిభువన శుక దృఢ పంజర
విభవ మహితునకు సమస్త విష్టప నిర్మో
క భుజంగపతికి, నిఖిలజగ
దభిన్న రూపునకు –

అని ఛందోబద్ధమైన కంద పద్యంలోనే కాక

"ఆ చెలరేగిన కలగాపులగపు
విలయావర్తపు
బలవత్ ఝురవత్ పరివర్తనలో
నే నేయే వీధులలో
చంక్రమణం చేశానో"

అన్న గణబద్ధం కాని పాదాలలో కూడా యీ సవ్వడి వినిపిస్తుంది. తిక్కన మహాభారతంలోని ఎన్నెన్నో వచన గమకాలలో కవన మణిగణ రణన గణగణలు వినపడతాయి.

వచనాన్నే పిన్న పెద్ద పాదాలుగా పంచి రాసినంత మాత్రం చేత వచన గీతం సిద్ధించదు. లేదా ఏకంద పద్యాన్నో ఇక్కడో మాత్రా, అక్కడో గణం లాగేసి కుంటించినా వచన గీతం కాదు. వచన గీతానికి లక్షణం ఏమిటని అడిగితే నిర్వచించడం కష్టమే.

కవిత్వం అంటే ఇదీ అని నిర్ధారణగా చెప్పగలిగినప్పుడే వచన గీతం అంటే ఇది అని చెప్పవచ్చును. చాలామంది మాత్రా ఛ్ఛందస్సులో గేయానికి వచన గీతానికీ ఉన్న తేడాని తెలుసుకోలేరు. కొన్ని మాత్రం ఛందోబద్ధమైన గేయాలు అక్కడక్కడ విరిగిపోయి వచన గీతానికి చేరువగా వస్తాయి.

"ఎగిరించకు లోహ విహంగాలను
కదిలించకు సుప్త భుజంగాలను
ఉండనీ,
మస్తిష్క కులాయంలో
మనో వల్మీకంలో."

అనే గీతంలో మధ్యని పడ్డ ఉండనీ అనే మాట అంతకు ముందు వచ్చిన రెండు పాదాలనీ అడ్డగించి నిలబెడుతుంది. స్థూల దృష్టికి ఇది ఇందాకా నేను చెప్పిన కంద పద్యాన్ని కుంటించడం లాంటిదే. కాని ఇక్కడ ఒక ప్రయోజనంతో ఈ పని జరిగింది. ఈ గీతాన్ని మాత్రాచ్ఛందంలోనే చేర్చాలి గాని వచన గీతం అనడానికి వీల్లేదు.

'మహాప్రస్థానం' గీత సంపుటిలోని చాలా రచనలు ఒక్కమాటు ఒక్కచోట ఒక్క పూటలో రాసినవే. కాని నాలుగైదు గీతాలు మాత్రం మొదట ప్రారంభించి తర్వాత కొన్నాళ్లకు పూర్తి చేసినవి. "దేశచరిత్రలు" వరుసగా రెండు రోజులు కూర్చుని రాశాను. ప్రారంభించిన తేదీ కాక పూర్తి చేసిన తేదీనే విషయానుక్రమణికలో ఇచ్చాను. మొదట కొంత వరకు రాసి, తర్వాత చాలా కాలానికి పూర్తి చేసిన గీతాలలో ముఖ్యమైనది 'జగన్నాథుని రథచక్రాలు.' ఇది ఎప్పటికీ అసంపూర్తిగా ఉండిపోతుందేమో అని ఒక్కొక్కప్పుడు నాకే సందేహం కలిగేది. ఇది లేకుండా మహా ప్రస్థానం పూర్తి కావడానికి వీల్లేదు. కాని తొందరపడి ఏదో విధంగా రాసెయ్యడానికి యిష్టం లేదు. మహాప్రస్థానం సంపుటిలో మొట్టమొదటి గీతం మహాప్రస్థానం, చిట్టచివరి గీతం జగన్నాథుని రథచక్రాలు ఉండాలని ఉద్దేశం. ఎలాగైతేనేం అనుకొన్న విధంగా 1940లో ఒకరోజు రథచక్రాలు రాయడం పూర్తి అయింది. కాని తర్వాత పదేళ్ల వరకు గాని గ్రంథం అచ్చు కాలేదు.

అందుచేత 40 తర్వాత వ్రాసిన నీడలు, నిజంగానే, గర్జించు రష్యా అనే గేయాలు కూడా యీ సంపుటిలో చేర్చాను. 1930 నుండి 50 దాకా చాలా అధివాస్తవిక గీతాలూ, హాస్యపద్యాలు వ్రాసినప్పటికీ వాటిని విడివిడిగా అచ్చు వెయ్యవలసి ఉంటుందని మహాప్రస్థానం సంపుటిలో చేర్చలేదు.

ఇదీ నా కవితా ప్రస్థానం కథ. అయితే 1930కి పూర్వం వ్రాసిన పద్యాలను గురించి గాని, 50 తర్వాత రాస్తున్న రచనలను గురించి గాని ఇక్కడ ప్రస్తావించలేదు. కవిత్వమే కాదు ఏది రాద్దామనుకున్నా కృత్యాద్యవస్థే. అయిదు నిమిషాలలో రాసినా, అయిదేళ్లలో రాసినా కృత్యాద్యవస్థే. ఒకసారి నేను ఒక్కరోజున పది సినిమా పాటలు రాశాను. పదిపదిహేను ఏళ్ల నుంచీ రాయాలనుకున్న 'సదసత్సంశయం' కిందటేడే ప్రారంభించాను. ఇంకా పూర్తి చెయ్యలేదే మని కొందరు మిత్రులు విసుగ్గా అడుగుతారు. వారికేమని జవాబు చెప్పడం? మరికొంచెం వ్యవధి ఇవ్వండని అడగడం తప్ప?





# మను చరిత్ర కథాసంవిధానము-శిల్పము

## విమర్శ - సమాధానము

శ్రీ టేకుమళ్ళ అచ్యుత రావు

కృష్ణదేవరాయల కాలమువరకు, ననగా, పదునేఁడవ శతాబ్దాంతము వరకు సామాన్యముగ నాంధ్రకవులు గీర్వాణ గ్రంథముల నాంధ్రమునకు పరివర్తనఁజేయుటయే ముఖ్య కర్తవ్యముగా నెంచు కొనిరని స్థూలదృష్టిని చెప్పవచ్చును. అయినను ఆ కాలమందలి కొన్ని గ్రంథములకు గీర్వాణమాతృకలు గాన్పింపకపోయినను, నీ యభిప్రాయము నిరవశిష్టమనియే నమ్మవచ్చును. నన్నెచోడుని 'కుమారసంభవము' సుప్రసిద్ధమగు కాళిదాసుని 'కుమారసంభవము' నకు భాషాంతరీకరణముగాదని నిర్ణయింపఁబడినది. అట్లయినను వేరొక గీర్వాణమాతృక యుండవచ్చునని విమర్శకులు నమ్ముచున్నారు. ఏలయన సామాన్యముగ నాకాలమున నాంధ్రకవీశ్వరులు స్వతంత్ర గ్రంధములను రచించుటకు సాహసించి గడంగుటలేదని చూపట్టుటయే. అట్లయిన నీ గ్రంథమునకు (మనుచరిత్ర) మాత్రము గీర్వాణ మాతృక లేదు.

ఈ భాషాంతరీకరణ యుగము సామాన్యముగా శ్రీనాథుని కాలము తో నంతమొందెనని దిక్సూచకముగా జెప్పవచ్చును. అతని 'హర విలాసము' కేవల మాంధ్రీకరణముగాక, స్వకపోల రచితాఖ్యాయికల గుచ్ఛము. ఇంక నాఖ్యాయికల నుంచి యాఖ్యానమునకు మఱియొక చిన్న మెట్టు. ఆ మెట్టును పినవీరభద్రుఁడెక్కలేకపోయినను, నంది సింగన్న, ఘంట మల్లయ్యలను జంట కవులు యెక్క ప్రయత్నించిరి. వారి వరాహ

పురాణమందలి 'దుర్జయోపాఖ్యానము' కొంచె మెచ్చు తక్కువగ స్వతంత్ర ప్రబంధమనియును, ప్రబంధరచనకు మొదటి దృష్టాంతమనియును నేను దెలియపరచితిని. కావున పదునేనవ శతాబ్దాంతమునకు స్వతంత్ర ప్రబంధ నిర్మాణము మార్గశ్రమమునసుండి గమ్యస్థానమున కించుక దరిని జేరుచున్నదని చెప్పవలసియున్నది.

ఇట్టి వ్యవస్థలో నాంధ్ర భోజుడగు శ్రీకృష్ణదేవరాయ లవతరించెను. సంస్కృతగ్రంథములకు నాంధ్రభాషావేషము నిచ్చుటతోఁ దృప్తినొందక స్వతంత్రాంధ్ర గ్రంథముల వ్రాయ ప్రోత్సహించెను. ఆయన 'ఆముక్తమాల్యద'యో, లేక, పెద్దన్నయొక్క 'మనుచరిత్రయో' ఆ ప్రయత్నమునకు మొదటి ఫలముగా నుండనోపును. ఆముక్త మాల్యదయందలి కథాప్రణాళికతో నున్న యొక సంస్కృత గ్రంథమును చిన్నతనమున నైజాము రాజ్యములో సంచరించుచు నొక వైష్ణవ గృహమున దాను జదివినట్లు కొంత జ్ఞాపకమున్నదని శ్రీ మానవల్లి రామకృష్ణయ్యగారు నాతో నొక సమయమునఁ జెప్పిరి. వారుఁ జెప్పిన ప్రకారము గీర్వాణ మాతృకయుండినయెడల నాముక్తమాల్యదగాక మనుచరిత్రమే మొదటి స్వతంత్రాంధ్ర ప్రబంధమనియెడు యశస్సున కర్హమై యుండును.

ఇంతియుగాక నాకాలమందలి గ్రంథములలో ప్రధానస్థానము నలంకరించుటకు మనుచరిత్రమునందు మఱియొక యపూర్వాతిశయముగూడనున్నది.

ప్రపంచమందంతటను మానవకోటిచే నైక్యకంఠముగాఁ బొగడ్తకెక్కిన సుప్రసిద్ధ గ్రంథరాజములలో నొక విశేషాంశము సమాన ధర్మముగా నున్నది. అదియేదన; మానవకోటి యంతటిచే నేకగ్రీవముగా నంగీకరింపఁబడిన పరమ పవిత్ర మానవ జీవితాదర్శముల కాగ్రంథములు నిదర్శనములై, దేశకాలభేదములు లేక సమస్త జనులచేతను పూజింపఁబడుచున్నవి. అట్టి యుద్గ్రంథములైన హోమరుని 'ఈలియడ్' 'వాల్మీకి' కవి 'రామాయణము', డాంటీ 'డివైన్ కామెడి' మున్నగు పవిత్ర ప్రబంధరాజములు, శ్రుతిగ్రంథములగు వేదములు, భగవద్గీత, బైబిలు, ఖురాను మొదలగు ప్రమాణ గ్రంథములవలెనే ఒక్క నిత్యనిర్వికల్పనిరామయంబగు మానవ జీవితాదర్శమును సువ్యక్తపరుచుచున్నవి.

హోమరుని 'ఈలియడ్'నందు త్రిలోకసుందరియగు 'హెలెను' కామాసక్తురాలై, తన పతినివీడి, అతి లోకసుందరుఁడగు 'ప్యారిసు'తో లేచిపోయెను. అట్టి యధర్మ

కర్మమువలనఁగలిగిన విపత్పరంపరల యొక్కయు, తుట్టతుదకు ధర్మమునకుఁగలిగిన విజయముయొక్కయు చరిత్రయే 'ఈలియడ్.'

ఇంక రామాయణమున సీతాదేవియొక్క సౌందర్యముచే మోహితుఁడై రావణుఁడు, ధర్మాత్ముఁడగు శ్రీరామునినుండి యాతని ధర్మపత్నిని నూడఁబెరికి బలవంతముగాఁ గొంపోవుటచేతఁ గలిగిన విపత్పరంపరలును, తుట్టతుదకు ధర్మమునకుఁ గలిగిన విజయమును నుద్ఘోషింపఁబడినవి.

డాంటి రచించిన 'డివైన్ కామెడి'లోఁగూడ నింద్రియలోలత్వము కంటె ధర్మబంధమే యెక్కుడు పవిత్రమని డాంటె, బియాట్రిసుల ప్రేమ సౌశీల్య ముగ్గడించుచున్నది. ఈ విషయమునే భగవద్గీత పలుసారు లుద్ఘోషించుచున్నది.

శ్లో. ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ ! దుష్పూరేణా నలేనచ.

శ్లో. ఇన్ద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్విమోహయత్యేష జ్ఞాన మావృత్యదేహినమ్,

శ్లో. తస్మా త్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజాహిహ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్.

**భగవద్గీత – కర్మయోగం.**

ఈ విషయమే టెన్నిసను మహాకవిచే తన పౌరాణిక ప్రబంధమగు 'ఆర్థరు' రాజుకథలలో (Idylls of King Arthur) విశదీకరించబడెను. దీనిని ఆ మహాకవి, Sense at war with Soul" "ఇద్రియములకు నాత్మకుఁగల పోరాటము"ని సంక్షేపముగా నుడివెను.

ఇట్లు మానవజీవితములో నిరంతరము నాత్మేంద్రియములకుఁ గలుగుచున్న సంగ్రామమే యీ మనుచరిత్రమందును నభివర్ణితమైనది. పైనఁబేర్కొనిన మహా గ్రంథములతోఁబాటు నీ గ్రంథమందును మానవ ప్రకృతియందలి నిత్యసత్యము ప్రకాశింపఁచేయబడినది. వరూధినీ ప్రవరుల ప్రసంగము ఆత్మేంద్రియముల సంగరమని యెవరికి ద్యోతకముగాదు? ఈ మహద్విషయము కడుంగడు సమర్థతతోఁ జిత్రింపఁ బడిన కారణమున మనుచరిత్రము ఆదర్శప్రాయములగు గొప్ప ప్రబంధముల వరుసలో

లెక్కింపఁదగియుండి, ముఖ్యముగా నానాటిగ్రంథములలో మిన్నయని చెప్పదగియున్నది.

**ప్రస్తుత విషయము:-** ఇట్టి సార్వజనీన ప్రేమభాజనమగు కథయుండుటచేతనేగదా, కవిప్రవరుఁడగు కృష్ణదేవరాయలును, ఆంధ్ర కవితాపితామహుఁడగు పెద్దనార్యుఁడును నేకగ్రీవముగా దీనిని ప్రబంధ రచనకు నిర్ణయించుకొనిరి.

ఇప్పుడు మనకు కృష్ణదేవరాయల పలుకుయందలి స్వారస్యము బోధపడినది. రససమంచితకథలను గలిగి, కలిధ్వంసకమును నైయుండుట అనగానేమో మనకుఁ దెలియవచ్చినది. ఏ కారణమున చతుర రచ్చయితయయిన పెద్దన్నకు నీ కథయెక్కువగననుకూలించెనో ద్యోతకమయినది. ఇట్లు మానవ జీవితమునంతను నడుగంట సంక్షోభించి దాని నిజమైన లోతును కనుఁగొనఁగల కథను నిర్ణయించి, మెచ్చి, మెడఁగట్టి, పైగా ముగుదాడు బిగించి రాయలవారు పెద్దనార్యుని విడిచిరి.

మార్కండేయ పురాణోక్త ప్రకారముగా నీ కథను జెప్పవలెను. మార్కండేయ పురాణమనగా వ్యాసరచితమైన సంస్కృత గ్రంథమే.త ఆ గ్రంథమందున్న ప్రకారము కథను పెంచి, ప్రబంధరూపముగా నాంధ్రమున వ్రాయవలెనని కృష్ణరాయల తలంపు. అయితే నిక్కడొక చిన్న చిక్కు తటస్థించినది. ఈ సంస్కృత మార్కండేయపురాణమును తిక్కనసోమయాజి శిష్యుఁడగు మారనమహాకవి శ్రీకృష్ణరాయలకు బూర్వమే యాంధ్రీకరించెను. ఈ యాంధ్రీకరణము మాతృక కంటె ననేక విధముల మెరుగుగా నుండుట చేత మార్కండేయ పురాణ కథలను తెలుఁగు ప్రబంధములుగ వ్రాసెడువారు తప్పక చదివితీరవలెను. మఱియు మారనకవి తన గ్రంథమున స్వారోచిష మనుసంభవకథను ప్రత్యేకాభిమానముంచి రసవత్తరముగ రచించుటచే నా కథను తరువాత వ్రాసినవారు మారన మార్గము ననుసరింపక తప్పదు. ఈ విషమస్థితిలో నుచితజ్ఞుఁడగు పెద్దన్న యొకవిలక్షణ మార్గము నవలంబింపక సంస్కృ తాంధ్ర గ్రంథముల రెంటియందలి యుత్కృష్టరస భాగముల మార్గములనే దానును అనుసరించి, బహుస్వల్పమార్పులు మాత్రమే చేసి, తన గ్రంథమును పూర్తిచేసెను. ఇట్లు చేయుట ప్రతిభా విశేషమేగాని గ్రంథ చౌర్య మెంతమాత్రముగాదు.

ఇట్లు జెప్పుటలోఁ బెద్దనార్యుఁడు మాతృకకు ప్రతిబింబముగా తన గ్రంథమును రచించెనని యూహింపఁగూడదు. కథాక్రమము రెండు, మూడు స్వల్ప విషయములలోఁ

దప్ప కేవలము మాతృకానుసరణమే. కథాకల్పనలును జాలవరకు మాతృకలోనివియే.

పెద్దనార్యుని శిల్పితనము కథాశరీరమును పోషించి యలంకరించుటలో ముఖ్యముగా కానిపించుచున్నది. అతని సంధాన నైపుణ్యము ముఖ్యముగా స్వాభావిక వర్ణనల యందును, పాత్ర సంభాషణములందును, నానాభావ ప్రకటనలయందును జూడనగును! 'అల్లసానివాని యల్లిక జిగిబిగి' అని యున్నదిగదా! కథయందలి అల్లిక ప్రత్యేకముగా పురాణములోనిదే. కథ కదు దీర్ఘమైనదగుటచే నాఱాశ్వాసముల గ్రంథమునకు పూర్తిగా సరిపోయెను. కాబట్టి కథను పెంచి యల్లవలసిన యవసరము లేకపోయెను. అయితే నీ కవివరుఁడు గనుపరచిన విశేషములు జిగియు, బిగియు; జిగియనగా కాంతి, బిగి యనగా సాంద్రత. రసపుష్టి మూలముగా జిగియు, భావసంభృతి మూలముగా సాంద్రతయు కథావల్లిక యల్లికకుఁ జేర్పఁబడినవి. ఇట్లు రసభావములను సువిశేషముగాను, స్వాభావికముగాను పెంచి విస్తరించుటలో బెద్దనార్యునికంటె పెద్ద ఆంధ్ర కవులలోఁ గాన్పింపడు.

పెద్దనార్యుని కావ్యసంధానమును గుఱించి బ్ర॥ శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రిట్లు వక్కాణించిరి. "లోక స్వభావమునకు సరిపోవు సంవిధానముతో నయ్యైపాత్రముల నెలకొలిపి, యౌచితికెందును భంగము రాకుండ దత్తద్రూపచేష్టాదుల నమర్చి యేపట్టునఁ జూచిన నాపట్టున నద్దిరా యనవలయునట్టు లితివృత్తమును నడిపించు నేర్పు పెద్దనకుఁ గుదిరినట్టు మఱియొక కవికిఁ గుదిరినదికాదు. నిగూఢములుగానుండి మనోభావములను స్ఫుటపఱిచి, చప్పున విప్పి చెప్పినట్లు పద్యమున నీతఁడు నిరూపించును." ఈయభిప్రాయముతో నేనెంతయు నేకీభవించుచున్నాను. అయినను శ్రీకాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి వ్యతిరేకాభిప్రాయమును సహేతుకముగా విమర్శించి పెద్దనార్యుని కథాసంధానచతురతను సమర్థించితిని.

మార్కండేయ పురాణోక్తముగా కథేతివృత్తమును రచించినను తన బుద్ధిచాతుర్యమున రసపుష్టికొఱకును, ఔచిత్యము కొఱకును గొన్ని చిరుమార్పుల నచ్చటచ్చటఁ గావించెను. ఈ మార్పు లన్నిటిలో నొక్కటి దక్క మిగిలినవి చాల స్వల్పములును, కొద్దివియును. ఈ మార్పులు చేయుటలో సంస్కృతమాతృకను, మారన యాంధ్రీకరణమును గూడ జాగ్రత్తగాఁ బరిశీలించి తన యుదారబుద్ధికిఁ దోచినరీతి నాస్వల్ప మార్పులను జేసినట్లు

గాన్పించుచున్నది. ఈ మూడు గ్రంథముల యందలి సామ్యభేదములను స్థాలీపులాకముగా నిచ్చటజూపించెద.

1. సిద్ధప్రవరుల సంభాషణము

1. మూలము:-

శ్లో. అనేక దేశదర్శిత్వే నాతిశ్రమసమన్వితః
త్వంనాతి వృద్ధోవయసా నాతివృద్ధశ్చయౌవనాత్
కథమల్పేన కాలేన పృథ్వీమటసిద్విజ
మంత్రౌషధ ప్రభావేన విప్రాప్రతిహతాగతిః
యోజనానాం సహస్రంవా దినార్ధేనప్రజామ్యహం.

1. మారన:-

ఉ. వాయుపు రజ్జులేల? మునివల్లభ! వృద్ధుఁడ వొండెఁ గావు లేఁ
బ్రాయపువాఁడ వద్రివనరమ్యములైన యనేక దేశముల్
ధీయుత! యల్పకాలమునఁ ద్రిమ్మరశక్యమె? నీకు నెమ్మెయిన్
వేయును నేల? నమ్మ నెద నీ పలుకన్న మునీంద్రుఁ డిట్లనున్.

ఉ. ఏనొక సిద్ధుఁడన్ విను మహీసురశేఖర! ధాత్రియంతయున్
మానుగ! బాదలేపమను మందుప్రభావమునం జరించితిన్
దానిఁ బదంబులందుఁ దగఁ దాల్చిన నంతయు నిర్జితశ్రముం
డై నరుఁ డేగు యోజన సహస్రము నాపగలింటిలోపలన్.

3. పెద్దన్న:-

చ. వెఱవక మీకొనర్తు నొక్కవిన్నప మిట్టివియెల్లఁ జూచిరా
నెఱకలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లను బట్టుఁబ్రాయపుం
జిఱుతతనంబు మీ మొగము సెప్పక సెప్పెదు నద్దిరయ్య మా
కెఱుఁగఁదరంబె? మీ మహిమ లీర యెఱుంగుదు రేమిచెప్పుదున్.

కం. అనినఁ బరదేశి గృహపతి
కనియెన్ సందియముఁ దెలియనడుగుట తప్పా!
వినవయ్య జరయు రుజయును

జెనకంగా వెఱచు మమ్ము సిద్ధుల మగుటన్
మ. పరమం బైన రహస్యమౌ నయిన దాపంజెప్పెదన్ భూమి ని
ర్జరవంశోత్తమ! పాదలేపమను పేరంగల్గు దివ్యౌషధం
పు రసం బీశ్వర సత్కృపంగలిగెఁ దద్భూరి ప్రభావంబునన్
జరియింతున్ బవమాన మానస తిరస్కారిత్వరాహంకృతిన్.

మూలములోఁబ్రవరుఁడు సిద్ధుని గుఱించి మాట్లాడుచునాసిద్ధుఁడతి వృద్ధుడుగాఁ గాన్పింపలేదు, యౌవనమునునతిక్రమించునట్టుగాఁ గన్పించలేదు; కావున స్వల్పకాలములో సమస్త దేశముల నెట్లు జూడఁగలిగెనో యని ఆశ్చర్యము మాత్రముఁ గనపరచెను. మారన దీనిని కొంత మార్చుచు సిద్ధుడు తాననేక దేశములుఁద్రిమ్మరితినని చెప్పినమాట లబద్ధములనియు, దాను నమ్మలేదనియుఁ జెప్పుటచే మూలములోనున్న యుభయుల గౌరవమును జెడగొట్టిన వాఁడయ్యెను. మునీంద్రుఁడు కల్లరియనియు, బ్రవరుఁడు మునుల శీలమునెఱుంగని వాఁడనియుఁ దేల్చుటచే నుభయుల పాత్రపోషణము నయోగ్యమైనది.

పెద్దన్న యీ సంభాషణమును గొంతవఱకు మార్చి పెంచినను, ముని, ప్రవరుల శీలము నెంతమాత్రముఁజెడగొట్టక మూలముకంటె మఱికొంత మెఱుఁగుఁబెట్టినవాఁడయ్యెను. ఎట్లనఁగా యోగసిద్ధునితో నీ చిన్నిపాపఁడు మాట్లాడుటకే వెఱచుచున్నట్లును, నాసిద్ధుఁ డన్ని దేశములు దిరిగినను జిఱుతప్రాయము దాటలేనట్లును గాన్పించుట తన కాశ్చర్యముఁగల్గించుచున్నది, కాని మునిసత్తముల మహిమలు తెలిసికొనుట యశక్యమని సవినయముగాఁ జెప్పికొనెను. ఈ సంబంధము చాలా దృష్టి కరముగానున్నది. గురువునొద్ద శిష్యునికుండఁదగిన వినమ్రతను, భక్తినిఁ జూపించుచున్నది.

**2. వరూధినీ ప్రవరుల సంభాషణము.**

**1. మూలము:-**

శ్లో. అభీష్టాః గార్హపత్యాద్యః సతతమేత్రయోగ్యయః
రమ్యం మామగ్ని శరణం దేవీ విస్తరణీప్రియా.

**2. మారన:-**

అనలునియందు రేపును మాపు వేల్వంగఁ

బడు హవ్యములఁజేసిపడయవచ్చు
పుణ్యలోకంబులు పొలఁతి నీవెఱుఁగ వీ
త్రిజగంబు హవ్యప్రతిష్ఠితంబ
యనిన నాయింతి నాయందు నిగ్గిరియందు
నీకుఁబ్రియం బేల నెలవుకొనదు
విద్యాధరాదుల విడిచి మనుష్యుల
కడకేల యరుగంగఁగడఁగెదనిన
గీ. వినుము దర్భలు నరణులు వేదికలును
నగ్నులును నాకుఁగరము ప్రియంబొనర్చు
గాని యొండెందుఁ బ్రియమెదఁ గలుగదనిన
నవ్వరూధిని యిట్లను నతనితోడ.

**3. పెద్దన్న:-**

మ. తరుణీ! రేపునుమాపు హవ్యములచేతన్ దృప్తుఁడౌవహ్ని స
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియములై నట్లన్యముల్ గా వౌ డల్
తిరమే చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్.

**3. ప్రవరుఁడు హవ్యవాహనుని స్తుతించుట.**

**1. మూలము:-**

శ్లో. ఇత్యుక్త్వా సమహాభాగః స్పృష్ట్వాపః ప్రయతః శుచిః
ప్రాహేదం ప్రణిపత్యాగ్నిమ్ గార్హపత్య ముపాంశునా
భగవన్ గార్హపత్యాగ్ని యానిస్త్వం సర్వకర్మణామ్.

యుష్మదా ప్యాయనాద్దేవా సృష్టిస్యది హేతవః
భవంతి సస్యాదఖిలం జగద్భవతి నాన్యతః
ఏవం తత్త్వోభవత్యే త ద్వేనసత్యేన వైజగత్
తదాహమద్యస్వంగేహం ప శ్యేయంపతిభాస్కరే

యథాపై వైదికం కర్మస్వకాలేనోజ్ఝితంమయా
తేన సత్యేనపశ్యేయం గృహస్థోద్య దివాకరమ్
యథాచ నపరద్రయే పరదారేచ మేమతిః
కదాచిత్సాభిలాషా భూత్ తథైవసిద్ధిమేతుమే.

2. మారన:-

అనియమ్మహాభాగుఁ డాచమన మొనర్చి
నియతుండు శుచియునై నిలిచి గార్హ
పత్యాగ్నిఁ దనమది భావించి వందన
మొనరించి యిట్లను ననిలమిత్ర !
నీయంద యాహవనీయాగ్నియును దక్షి
ణాగ్నియుఁ బ్రభవించె నఖిల దేవ
తలకును దృప్తి నీవలన సిద్ధించును
సకలలోకముల కాశ్రయము నీవ

గీ. నిత్యసత్యమూర్తి నీ ప్రసాదంబున
నినుఁడు గ్రుంకకుండ నిపుడ యింటి
కరుగువాఁడఁగాక యాగమోదితకర్మ
జాతనైష్ఠికుండ నైతినేని.

క. పరనారీ పరధన రతి
పరత్వ మెన్నఁడును నాకుఁబొటిల్లనియా
స్థిరసత్యమహిమనతి స
త్వరితగమన సిద్ధి గలుగవలయు హుతవహా!

**3.** పెద్దన్న:-

గీ. ... ... ... ..... ...

... వార్చి ప్రవరుడు గార్హ పత్య
వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి

మ. దివిషద్వర్గము నీ ముఖంబున తృప్తిజెందు నిన్నీశుఁగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్త జగదంతర్యామివిన్ నీవ యా
హవనీయంబును దక్షిణాగ్నియును నీయందుద్భవించున్ గ్రతూ
త్సవసంధాయక నన్నుఁ గావఁగదవే స్వాహావధూవల్లభా!
ఉ. దానజపాగ్ని హోత్ర పరతంత్రుఁడనేని భవత్పదాంబుజ
ధ్యానరతుండనేనిఁ బరదారధనాదులగోరనేని స
న్మానముతోడ నన్ను సదనంబుననిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయ మున్ను రయంబున హవ్యవాహనా!

దీనినిబట్టి చూడగా వరూధినీ ప్రవర సంభాషణములో మూలములో నున్న విషయములను యథావిధిగా మారనయుఁ బెద్దన్నయుఁ గూడ పరిగ్రహించిరి. మార్పులు లేవనియే చెప్పవచ్చును.

**4. మనోరమా కన్యాప్రదానము.**

**1. మూలము.**

శ్లో. దత్వా విద్యాం తతఃకన్యాం సదాతుముపచక్రమే
తమాహసాతథాకన్యాజనితారం స్వరూపిణం
అనురాగో మయాప్యత్రతాతాతీవమహాత్మని
దర్శనాదేవసంజాతో విశేషేణోపకారిణి.
కిన్త్వేషామే సఖీసాచ సత్కృతే దుఃఖపీడితే
అతోనాభిలషేభోగాన్ భోక్తుమే తేనవై సమం
ఽసతా
స్వభావరుచిరైరాత్మదృక్ కథంయోషిత్ కరిష్యతి
సాహంయథాతేదుఃఖార్తే మత్కృతే కన్యకేపితః
తథాస్థాస్యామితద్దుఃఖేతచ్ఛోకానల తాపితా॥

**2. మారన**

వ. స్వరోచికి నాయుర్వేద విద్యనిచ్చి యక్కన్యక నీయ నుపక్రమించిన తండ్రికినామె యిట్లనియె.

ఉ. మనకుపకారియైన సుకుమారుని నీతనిఁజూచినప్పు నా
మనమున రాగమైనయది మానుగ నైనను తండ్రి నా కతం
బునఁ బటురోగదుఃఖములఁబొందుచు
మనసిజభోగలీలకును మానస మెమ్మెయి ీకు నూల్కొనున్.

**3.** పెద్దన్న

కం. ఈయుపకారమునకుఁ బ్రతి
సేయఁగశక్యంబె? జంభజిన్నిభ శఫరా
త్యాయతలోచన యైన మ
దీయాత్మజ నీకు నిత్తు దేవీమణిఁగన్.

కం. ఆయుర్వేదముఁగైకొని
యీయింతినిఁ బెండ్లియాడు మెలమి రమానా
రాయణపరిణయగేయ వి
గాయనగంధర్వమైన కవ్వపుగొండన్.

అని మాత్రమే చెప్పి యిందీవరాక్షుఁడు మనోరమతో వెంటనే తన పట్టణమునకుఁ బోయెను. మనోరమ యచ్చట నేమియు మాటలాడుటలేదు.

ఈ మనోరమా కన్యాప్రదాన సందర్భములోఁ బెద్దనార్యుఁడు మూలముకంటెను మారన కంటెను బ్రత్యేక భిన్నమార్గమునఁ బోయెను. మూలములో నున్న ప్రకారమే యించుకయుఁ దప్పకుండ మారన తెనిఁగించినట్లు స్పష్టమగుచున్నది. అనగా నిందీవరాక్షుఁడాయుర్వేదముతోఁ బాటు తన కూతురగు మనోరమను స్వరోచి కిచ్చుటకు వాగ్దత్తముజేసిన వెంటనే ప్రక్కనున్న మనోరమ తన యభిప్రాయము తండ్రికిని స్వరోచికినిఁ దెలియఁజెప్పెను. తన కుపకారముఁజేసిన స్వరోచియందామె కనురాగము పొడమిననుఁదనమూలముగ నార్తింబొందిన సఖులు రోగబాధితులైయుండఁ దనకుఁ బరిణయసౌఖ్య మెట్లురుచింపఁగలదని దీనాలాపముల బలికెను. పెద్దనార్యుఁ డీసమయమునఁ బ్రత్యేకముగా వేఱు మార్గమునఁ బోయెను. ఇందీవరాక్షుఁడు స్వరోచిఁ దనకుమార్తెను బరిణయముకై యిచ్చెదనని ప్రతిజ్ఞసేసినపుడు మనోరమ దగ్గరనేయున్నను నించుకైనను మాటలాడలేదు. పెండ్లిమాటలుజెప్పి వెంటనే స్వస్థానమునకు

బయలుదేరుచున్న తండ్రితోఁ దానును బయలుదేరి వెళ్లినట్లు పెద్దన రచించెను. తండ్రితోఁగాని స్వరోచితోగాని యొకమాటయైనను బలుకలేదు. ఇట్టి ముఖ్యమైన మార్పుఁజేయుటకుఁ గారణమేమి? మనుచరిత్ర కధాక్రమము యావత్తును బహుజాగ్రత్తగను, సూక్ష్మదృష్టితోను మూలానుసారముగ నడిపించిన పెద్దనార్యుఁడు ఈ విషయమున మరచిపోయెననిగాని ప్రమాదవశమునఁ దప్పిపోయెననిగాని చెప్పవలనుపడదు. ఏలయన మనోరమ తన మనోవిచారమును వివాహానంతరమున భర్తతోనేకాంతముగ నున్నప్పుడు విన్నవించుకొన్నటులు పెద్దన్నయే రచించినాఁడు. కాబట్టి మనోరమ వాక్యములను పెద్దన్న యుద్దేశపూర్వకముగ స్థలాంతరమునకు మార్చినాఁడని చెప్పుకొనవలసియున్నది. అనగా తన్ను స్వరోచికిఁ బెండ్లిచేయుటకు నిశ్చయించుకొని తండ్రి వాగ్దత్తమునుచేసినపుడు తాను మిన్నక యూరుకొని వివాహానంతరము తనపతితోఁ గేళీమందిరమున నుండ భర్తను వేడుకొనెను. ఈ మార్పు యొక్క యుద్దేశమును స్వారస్యము మనము గ్రహింపవలెను.

వివాహమునకుఁ బూర్వమేమియు మాటలాడక వివాహానంతరము పతి రతికుతూహలుఁడై యుండ నాతనిని నానమయమున వేడుకొనుట వెలయాలి వర్తనమనియు, మనోరమ భోగస్త్రీవలె నటించినదనియు బ్ర.శ్రీ. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు తీవ్రముగా నాక్షేపించిరి. కాఁబట్టి యీ విషయములో మనోరమ శీలమెట్టిదియో పెద్దనార్యుఁడీ మార్పేలఁజేసెనో మనము పరిశీలింపవలెను. తన తండ్రి తనను స్వరోచికిఁబెండ్లిచేయ నిశ్చయించుకొని వాగ్దత్తము జేయుచున్నప్పుడు దానేమియుఁ బలుకక, యిష్టానిష్టములేవియుఁ దెలియఁజేయక మిన్నక యూరకొని తండ్రితోఁగూడ వెడలిపోయెను. అనఁగా దనతండ్రికిని బెండ్లికుమారునకునుజరిగిన సంభాషణములోఁ దానేమియుఁ బాలుగొనలేదు. తనను బెండ్లిచేయుట తన తండ్రి పనియేగాని తానావిషయములో నేమియుఁగలుగఁజేసికొనుట యుక్తముగాదని తలఁచి యూరకున్నదా? వివాహ నిర్ణయము కేవలము మాతాపితృసంబంధమేనా? లేక కన్యాభిప్రాయముతో నేమైన సంబంధించి యున్నదా? ఇదియే మనము ముఖ్యముగా నిర్ణయింపవలసిన విషయము. మన హిందూ సంప్రదాయములో నగ్రవర్ణములలో గొప్ప కుటుంబములందు జరుగుచున్న వివాహ సంబంధములెట్లు నిర్ణయింపఁబడుచున్నవో

మనము యూహింప వలసియున్నది. ఈ కాలమునఁ గొంచెము మార్పున్నను యింతకుఁబూర్వము రాజకుటుంబములలోని కుమారితలను వివాహము జేయునపుడు, పెండ్లిమాటలు జరుగుచున్నపుడు, పెండ్లికాఁదగుకన్య లేపైనను వారి యభిప్రాయములను బెండ్లికుమారునియెదుటఁగాని, వారి బంధువులయెదుటఁగాని బాహాటముగాఁజెప్పుట మన దేశాచారముగానున్నదా? అను విషయము మనము ముఖ్యముగా నాలోచింపవలసియున్నది. అట్టి యాచారము మన దేశములో లేనియెడల మనోరమ తన పెండ్లి మాటల సమయముననేదైన మాట్లాడుట కవకాశమెట్లుండును? కులీనులగు కన్యలు తమ వివాహ సమయమునఁ దమ యభిప్రాయములను గాఁబోవు భర్తలయెదుటఁ గాని వారి యాత్మీయబంధువుల యెదుటఁగాని యెన్నడును మాట్లాడుట కేవలము దూష్యమనియు, నశ్లీలమనియు నభిప్రాయము లో మనమున్నాము. మన దేశాచారమునకు ననుగుణముగానే మనోరమ కూడా తన యభిప్రాయములు మనసులో దాచుకొని వివాహమైన తరువాత బతికి నేకాంతముగా నివేదించుకొనినది. ఇది గొప్ప కుటుంబములలోని కన్యల సౌశీల్యమేఁగాని వెలయాలి వర్తనముగాదని మన దేశాచారమును, మనవ్యవహార పరిజ్ఞానమును గలవారొప్పుకొనకతీరదు.

అయితే దీనికొక యాతంకమున్నది. ఈ యాచారము మన దేశములో ననాదిగానున్నదా? లేక యిటీవల నుత్పన్నమైనదా? అనాదిగా నున్నయెడల మార్కండేయపురాణములో రాజకన్యయగు మనోరమ యెట్లు తన యభిప్రాయము వెంటనే తెలుపఁగలిగెను? అని ప్రశ్నింపవలసివచ్చును. పౌరాణిక కాలములో మన దేశమందు గన్యలకు వాక్క్రియా స్వాతంత్ర్యము లెక్కువగా నుండెనేమో యని మనమూహించుట కవకాశము గలదు. ఆ కాలపు వ్యవహారములను బట్టి మనోరమ తండ్రియెదుట స్వరోచితోఁ దన యభిప్రాయము స్పష్టముగాఁ జెప్పఁగలిగెను. కాని యిప్పటికాలమువలెనే పెద్దన్న కాలమందును రాజకన్యలు వివాహ సందర్భములలోఁ దమ యభిప్రాయములు వెల్లడిగా మాట్లాడుట యనుచితమని సంఘ మర్యాదలలోఁ గట్టుబడియున్నవారే! కావునఁ దన దేశ కాలవ్యవహారబులఁబట్టి పెద్దన్న యీ పెద్ద మార్పుఁ జేసినవాడయ్యెను. పౌరాణిక కథను బౌరాణిక నియమముల నుండి తప్పించి తన కాలానుసరణముగ వ్రాసినాడని పెద్దనార్యుని నిందింపవచ్చును. కాని మనోరమ

వర్తనము వెలయాలి వర్తనమనియు, భోగస్త్రీవలె నామె స్వరోచిని వంచింపఁ దలచినదనియు నిత్యాది ప్రసంగములు చేయుట చాలా యనుచితము, అసహ్యము, అని మనవి చేయుచున్నాను. తన్ను స్వరోచికిఁ బెండ్లిసేయుదునని తండ్రి చెప్పిన క్షణమునుండి యామెస్థితి పూర్ణముగ మాఱినది. స్వరోచి తనకు భర్తయైనవాఁడే; పాణిగ్రహణము కాకపోయినను మనస్సంకల్పమున నాతఁడు భర్తయయ్యెను. కావునఁ బతితో వెల్లడిగఁ దండ్రి సమక్షముననైనను మాటలాడయోజింపదు. కావున మనోరమ మిన్నకుండెను. కాని చెలికత్తెలకుందు ఆమెదెందము నెట్లు కొందలపెట్టుచుండెనో శయ్యాగృహమునఁ బతితో నేకాంతముగ మాట్లాడుట కవకాశము గలిగిన వెంటనే ద్యోతకపరచినది. అంతకుఁ బూర్వమామె యాప్రసంగము జేయుటకుఁ గొంచెమైనను పై కారణములచే వీలుకలుగలేదు. వీలుకలిగిన వెంటనే మొదటి పనిగఁ దన చెలికత్తెల రుజనుగుఱించి పతిని బ్రతిమాలుకొనినది. కావునఁ బెద్దన్నగారు చేసిన మార్పు మన కులాచారమునకును, మన సంఘమునకునుఁ దగినట్లుండుటకే యాతడు మనః పూర్వకముగఁ జేసినాఁడని మనవి జేయుచున్నాను.

కావున కథా సంవిధాన విషయములో పెద్దనార్యుని కూర్పు చాలావరకు మూలానుసరణముగ నున్నను, అతడు చేసిన కొలది మార్పులను ఔచిత్య మర్యాదలను మించకుండ కథానిర్మాణమున కొకవిధమైన స్వాభావికత్వమును, సౌమనస్యతను కలుగఁ జేసినవని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ఈ కథానిర్మాణ సందర్భములో పెద్దనార్యుడు చేసిన మరికొన్ని చిరుత మార్పుల యౌచిత్యమును సమర్థించుచూ నా వ్యాసములో విపులముగ వ్రాయవలసి వచ్చినది. రసవిషయములో నచ్చటచ్చట స్ఖాలిత్యములున్నను, కథానిర్మాణములో మాత్రము అనౌచిత్యదోష మెచ్చటను జూడబోమని నిస్సంశయముగాఁ జెప్పగలను. "అనౌచిత్యాదృతే నాన్యత్ రసభంగస్యకారణం" అని క్షేమేంద్రుడు చెప్పినాడుగదా!

**కావ్యరచన: శైలి**

ఆంధ్ర కవిత్వమున మొట్టమొదట రాజమార్గము జూపినవాఁడు నన్నయభట్టారకుఁ డైనను కవిబ్రహ్మయగు తిక్కన సోమయాజియే మొదటి యాచార్యుఁడని చెప్ప వలసియున్నది. తిక్కనసోమయాజి యనేక శిష్యులకును, ప్రశిష్యులకును నాంధ్ర

కవితామృతమును ధారపోసి పోషించి యొక యాంధ్రకవితాశాఖను(School of Poetry) స్థాపించెను. కేతన, సోమన, మారన, మంచన మున్నగు మహాకవులామహాత్ముఁడు జూపిన దారినేబోయి యనేక యుద్గ్రంథములు రచియించి, యాంధ్రకవిత్వమును చిరస్థాయిగా నెలకొల్పిరి. తిక్కనసోమయాజి యా దర్శనశక్తి సుమారు రెండు వందల సంవత్సరములవరకు నాంధ్రకవులయుల్లములలో పల్లవించుచుండినది. అతని కవితాపద్ధతి ముఖ్యముగా రసపోషణయందును భావవిస్ఫురణయందును నెక్కువ ప్రాముఖ్యముజూపుచుండెను. భాషావిషయికములగు శైల్యలంకారములవైపు నాతఁడు దృష్టిమరల్చలేదు. తాను, "ఉభయ కావ్యప్రౌఢి బాటించు శిల్పమునన్ బారగుఁడనని" చెప్పి ముఖ్యముగా కావ్యశిల్పమునకే ప్రాముఖ్యమునిచ్చెను. శైలీవిషయమంతయు శిల్పమున కధీనమేగాని యధిక మని తలంచినవాఁడుగాడు. కావున నతని కవితారీతి ననుసరించినవారందరు భాషకంటె భావమునకే యెక్కువయాదరముకనుపర్చిరి.

ఇట్లుండఁగ్రమక్రమముగఁ దిక్కయజ్వపద్ధతులు ప్రాతగిల్లినవి. ఆంధ్రకవులు గ్రొత్తదారులకొఱ కెదురుజూచుంచుండిరి. మఱియొక మహానుభావుఁ డుదయించి దారిఁ జూపినగాని సామాన్యులకుఁ ద్రోవతెన్నులు గాన్పింపవుగదా?

శ్లో: యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః

సయత్ప్రమాణంకురుతే లోకస్తదనువర్తతే. (భగవద్గీత)

మ॥ అమలోదాత్త మనీషి నే నుభయ కావ్య ప్రౌఢిఁబాటించు శిల్పమునం బారగుఁడన్ గళావిదుఁడ (తిక్కన: నిర్వచనోత్తర రామాయణము) (ఇక విమర్శ)

శ్రీశాస్త్రిగారి విమర్శనము నాల్గు శీర్షికల క్రింద విభజింపవచ్చును. 1. కథాసంవిధానము, 2. రసము, నీతి 3. పాత్రపోషణము 4. శైలి.

1. కథాసంవిధానము:- మనుచరిత్రమునందలి కథాసంవిధానము గుఱించి శ్రీశాస్త్రిగారు వ్రాసిన విషయములు. "స్వారోచిషమనుసంభవము రస సమంచిత కథల నొప్పునది గానఁ దన రచన కనుకూలమఁట. 'సహజముగ రస సమంచితత్వముగల కథలేవో యెంచికొని వానినిదన రచనలోఁబెట్టి రసము పుట్టించు సామర్థ్యము తనలో నంతగ లేదు.' ఈ విధముగాఁ బెద్దనార్యుని కథాసంవిధానముఁగూర్చి శ్రీశాస్త్రిగారు వ్రాసిరి. మనుచరిత్రకథ నెంచికొనుటలోఁ బెద్దనార్యుని కెంత మాత్రము నధికారము లేదనియు,

నా పనిని శ్రీకృష్ణదేవరాయలవారే చేసి పెద్దన్ననుఁ బ్రబంధము రచియింపుఁడని యాజ్ఞాపించిరనియు మనుచరిత్రము జాగ్రత్తగాఁ జదివినవారికి స్పష్టమగును. అది యట్లుండ నీవాదమెంత నీరసముగా, నెంత విపరీతముగా నున్నదో యోజింపుడు. మహాకవులు రసవంతమైన కథల వెదకికొని కావ్యములు రచియించుటకుఁ గారణము వారు రసహీనము లగుకథలను రసవంతములుగఁ జేయలేకపోవుటయె యని శ్రీశాస్త్రిగారి మతము. కాళిదాసు, భవభూతి, షేక్సుపియరు, మిల్టను మున్నగు మహాకవులుఁ శ్రీశాస్త్రిగారి మాటలు వినినచోఁ దలలు వంచుకొని సిగ్గుపడవలసినదే! ఏలయన నీ మహాకవులందఱు రసవత్తరమైన కథలనే వెదకి వానిని నాటకములుగాఁగాని ప్రబంధములుగాఁగాని వ్రాసినవారే. వీరి పనివంటి పనిని శ్రీశాస్త్రులుగారు నిరసించుట చాల నాశ్చర్యముగ నున్నది. ప్రపంచములో ధనికులును దరిద్రులును జక్కని పిల్లలను వెదకి వివాహములు చేసికొందురు. శ్రీశాస్త్రిగారు చెప్పిన కారణమేమనఁగా వారు కురూపులగు పిల్లలకు నగలు నాణెములు పెట్టి దృష్టికింపుగాఁజేయలేరు, గాన సహజ సౌందర్యముగల పిల్లలనే వెదకి పెండ్లియాడుచున్నారని. ఈ వాదము గుఱించి యింతకంటె నెక్కువగా వ్రాయనక్కరలేదు. కేవలము జ్ఞానశూన్యుడుగాని యేమనుజుఁ డైనను శ్రీశాస్త్రిగారి వాదము నంగీకరింపఁడని నొక్కి వక్కాణింపవచ్చును.

ఇఁకఁ బెద్దనార్యుడు చేతగానివాఁడై రససమంచిత కథలతో నొప్పారు స్వారోచిష మనుసంభవమను కథను గ్రహించి ప్రబంధము రచింపఁబూనెను. కాని "మూలము నందున్న కథనైనను సందర్భశుద్ధిగఁ జెప్పలేకపోయినాడు." ఇది శాస్త్రిగారి యభిప్రాయము. దీనికి వారిచ్చిన హేతువులు.

కుతపకాలము- మధ్యాహ్నము. ప్రవరునియింటఁ గుతపకాలమున- అనఁగా, పదు నొకొండు-పండ్రెండు గంటల మధ్యను - ఒక యోగి సిద్ధుఁడు వచ్చి యాతిథ్యమునొందెనని కాన్పించుచున్నది. భోజనానంతరమునఁ గొంతసేపు ప్రసంగములు జరిపి, సిద్ధునిచేఁ బాదలేపముఁ బొంది ప్రవరుఁడు హిమగిరికిఁ బోయి, యచ్చటఁ జోద్యములు చూచి మధ్యాహ్నమైనట్లు కనిపెట్టినాఁడని గ్రంథమందున్నది. కుతపకాలమునకు మధ్యాహ్నమునకు నడుమ నిన్నిపనులుజరుగునా? కావునఁ బెద్దన్న కాల నిర్ణయములఁ బొరపడెనని కొందఱును, లేదని కొందఱును, వాదోపవాదములు

జరుపుచున్నారు. శ్రీశాస్త్రిగా రెదిరి వాదముల నన్నింటిని ఖండించి పెద్దన్న యసందర్భము చేసెననీ స్థిరపఱిచిరి. ఈ వాద ప్రతివాదముల బుద్ధిచాతుర్యముతో నాకుఁబనిలేదు. ఈ కుతపకాల విషయము పెద్దన్న గ్రంథమందొక కళంకముగాఁ జెప్పనంతటి గొప్ప విషయమా! ఇది యీ మహాప్రబంధమునందొక తృణలేశముకన్న నల్పతరమైన యంశముగాదా? దీనిని గుఱించి మనుచరిత్ర విమర్శకులందఱు మహాబుద్ధిశాలు లెంతెంత ప్రయాసములఁ బొందిరో చూడం జూడఁ జోద్యముగనున్నది. "ఇది యొక ప్రమాదము. అంతగాఁ బ్రజ్ఞాలోపముఁ దెల్పునది గాద"ని చెప్పి శ్రీశాస్త్రిగారే యౌదార్యముఁ గనుపఱిచిరి.

**2. కలి యను గంధర్వునికథ:–** ఈ కథను మనుచరిత్రమునఁ బెద్దన్న సరిగా నతుకలేదని శ్రీశాస్త్రిగారి యభిప్రాయము. "ఏ గంధర్వుఁడు తద్విలాసముల మున్వీక్షించి తానెంతయున్ రాగాంధుండయి" అని యీ గంధర్వునిగూర్చి హఠాత్తుగ నెత్తికొనినాఁడఁట, కాని యతని పేరు, నాతని పూర్వవృత్తాంతము, వరూధినికిని నతనికిని నదివఱలో జరిగిన మోహాతిరస్కార మిత్యాది విషయములు కథారూపముగఁ జెప్పఁబడలేదఁట! ఇదియొక యసందర్భమఁట.

వరూధినీ ప్రవర సంవాదము సంపూర్ణముగ వర్ణించి, ప్రవరుఁడు వరూథినియొక్క కాముక ప్రయత్నముల నన్నింటి నుల్లంఘించి యామెను వీడిపోయెనని చెప్పి తదుపరి కథను సాగించుటలో ముఖ్యముగ మఱియొకఁడు ప్రవరవేషము దాల్చి వచ్చి వరూథినిదృష్టి నాకర్షించెననియు, నామె యాతఁడు ప్రవరుఁడేయని భ్రమపడి యాతనితో భోగించెననియుఁ దత్కారణమున స్వరోచిపుట్టె ననియుఁజెప్పుటయె ముఖ్య విషయమగును. కాని యామాయా ప్రవరుని పూర్వ వృత్తాంతమంతయుఁజెప్పుట యంత ముఖ్యముగాదు. పూర్వోత్తర సందర్భములనుఁ గథాప్రణాళిక కొఱకుఁ గొంచెము సూచించినఁ జాలును, మాయా ప్రవరుఁడు కేవలము క్రొత్త పురుషుఁడు కాఁడనియుఁ బూర్వము వరూథినిని వరించిన యొక గంధర్వుఁడనియుఁ గవి యొక పద్యములోఁ జెప్పవలసిన దంతయు గ్లుప్తముగఁ జెప్పినాఁడు. అంతఃకథను బెంచి ముఖ్యకథ కంతరాయము గలుగఁ జేయకుండుట కథాసంవిధానమున నొక గుణ విశేషమై యుండనోపు!

'కలి'యను గంధర్వుని పేరెత్తకపోవుట యేలయని శ్రీశాస్త్రిగారు ప్రశ్నించిరి. దానికొకకారణము నాకు స్ఫురించుచున్నది. సహృదయుల రయుదురుగాక! 'కలి'యను పేరంత మనోహరమైనది కాదు. ఈ నామము సమస్త దుర్గుణ సమూహ సూచకము. ఈ పేరిటివాఁడు స్వరోచికిఁదండ్రియయ్యెనని చెప్పిన నగౌరవముగ నుండనోపునని తలఁచి కవి పేరిడ మానెనేమో! మఱియొక చిన్న సూచన, ప్రారంభములో నీ స్వారోచిష మనుసంభవ కథను బ్రబంధముగ రచియింపవలయునని శ్రీకృష్ణదేవరాయలు కోరినప్పు డాచక్రవర్తి చెప్పినట్లీమాటలు వ్రాయబడినవి.

"మనువులలో స్వారోచిషమనుసంభవము... విననింపు కలిధ్వంసకము–" కలి ధ్వంసక మగుకథలో 'కలి'యను పురుషుఁడు స్వరోచికిఁ దండ్రియగుట యెట్లు పొసఁగును? ఇది స్వవచన వ్యాఘాతముగ నెంచఁబడవచ్చును. ఈ సూక్ష్మాంశమును గుఱించి సహృదయు లాలోచింతురుగాక!

3. ఈ గంధర్వుఁడు ప్రథమమునఁ బలికిన పలుకు లసందర్భముగ నున్నవని శ్రీశాస్త్రిగా రాక్షేపించిరి.

"ఒక్కొక వేళఁ బద్మముఖు లొల్లమిఁజేయుదు రొక్కవేళఁబెన్మక్కువ గారవింతురు క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్.... సుఖింపఁగాఁదగున్.

ఈ మాటలు పూర్వపరాజితుఁడగు గంధర్వుఁడు చెప్పవలసిన మాటలుగాని తన రూప మున మార్చుకొని మఱియొక రూపము దాల్చిన వాఁడు చెప్పవలసిన మాటలు గావని వారి యాక్షేపణము. ఈ యాక్షేపణము సమంజసముగానే యున్నది. ఈ మాటలు సందర్భమునకుఁ దగియున్నట్లు కాన్పింపవు.

ఇంక మఱికొన్ని స్వల్పాంశములనుగూడ నసందర్భములుగ సూచించిరి. అచ్చరల "అస్వేదత"యొకచోట, "స్వేదత" మఱొకచోట– ప్రవరుఁడు, అప్రతిగ్రహీతయని యొకచోట, కాసువీసములు దొరకక పోవుటచేఁ గలిగిన దారిద్ర్య ప్రశంస యొక చోట–ఇయ్యది స్వల్పాంశములను మాత్రము సూచించి కథాసంవిధానమును బెద్దన్న సందర్భశుద్ధిగ వ్రాయలేదనియుఁ గథను బాడుచేసెననియు నిర్విష్ట నిరసోక్తులఁ దెగనాడిరి. పైనుదాహరించిన యంశములన్నియుఁ గొంచెమెచ్చుతగ్గుగాఁ తృణలేశములు, నెరసులు. ఇవి కథకు నేవిధమైన బాధఁగాని యనౌచిత్య దోషముగాని యంతరాయము

గాని కలుగఁజేసినవికావు. ఈ స్వల్పస్ఖాలిత్యములవల్లఁ గథయందు సందర్భశుద్ధి యేమితగ్గినది! ఇటువంటి నలుసులు ప్రతి మహా గ్రంధమందును గొంచెమైన నుండక తప్పవు. "బళిబళి మంచి మాటయె ప్రబంధమునా జలరాశి దానిలోపల నెరసుల్ గణింతురె యపారములౌ మణు లెల్లనుండఁగన్" అని కమసాలిరుద్రయ్య చెప్పినటు లీనలుసులను బట్టియొకయద్గ్రంథమునంతయుఁ దెగనాడుట విమర్శనౌదార్యమును గాని పరిణామ పరిజ్ఞానమునుగాని సూచింపవు.

**4. రసము–నీతి,** మనుచరిత్రమునందలి రస విమర్శనమందును, నీతివిచారణమందును శ్రీశాస్త్రిగారు చాలవఱకుఁ బొరపడినారు. వారు చేసిన తప్పిదములు బడిపిల్లలు చేయఁ దగినవి కాని యనుభవశాలులును విమర్శవిశారదులునగు శ్రీశాస్త్రిగారు చేయఁ దగినవిగావు.

వీరు చేసిన పొరపాట్లు సామాన్యదృష్టిని రెండు విధములుగా విభజింపవచ్చును.

1. దేశకాలపాత్రముల నాలోచింపకుండుట 2. కథాపాత్రములు వారి వారి యవస్థలతోఁ జెప్పిన మాటలను గేవలము కవిహృదయమనియే దురభిప్రాయపడుట.

ఈ రెండు విధములగు పొరపాట్ల మూలకముగ వారీ కావ్యము నీతి బాహ్యమనియుఁ దుచ్ఛశృంగార రసభరితమనియు స్థిరపఱిచిరి. వీరి యభిప్రాయములను బ్రతిఘటించుట కాంధ్రగీర్వాణ వాణీ విషయమై కొంత ప్రస్తావనగాఁ జెప్పవలసియున్నది.

ప్రపంచములో నేవాఙ్మయమును జూచినను శృంగారరసమే ప్రధాన రసముగ నున్నది. ఆ శృంగారరస మనేక విధములఁ బ్రదర్శిత మగుచున్నది. దేశభేదమునుబట్టి శృంగార రసవర్ణనాభేదము చూపట్టుచున్నది. పాశ్చాత్య దేశములలో శృంగారరసవర్ణనము ప్రాచ్యదేశములందలి శృంగార రసవర్ణనమును బోలదు. మన హిందూ దేశములోఁ బ్రాచీన కాలమునుండియు శృంగార రసవర్ణమునకు నాయికానాయకుల బాహ్యావయవవర్ణనము ముఖ్య విశేషముగా నిర్ణయమైనది. పురుషులలో నవయవ సౌందర్యము స్త్రీలలోఁ గచకుచాదివర్ణనములు శృంగారరసమున కుద్దీపనములై యుపాంగములైనవి. ఈ యాచారము సంప్రదాయసిద్ధమైనది. మహాకవులందఱు నెంత నీతిప్రబోధకులైనను గచకుచాదివర్ణన నెంత మాత్రము దుర్నీతిప్రేరకమని యెంచియుండలేదు. ఈ సంప్రదాయము తొలుదొల్త సంస్కృతవాఙ్మయమునందుఁ

బుట్టినది. సంస్కృతము మాతృక కాన దేశ్యవాఙ్మయపుత్రికలందుఁగూడ నీవాడుకయే ప్రసరించినది. కావునఁ గచకుచాదివర్ణన మీ కాలము వఱకుఁ గవులలో ననివార్యమైన కావ్యరీతిగఁ బరిగణింపఁబడినది. ఇప్పుడిప్పు డాంగ్లేయసంసర్గమునఁ గొంతవఱ కీ సంప్రదాయము మాఱుచున్నది. గాని, మన దేశమందలి ప్రాచీన వాఙ్మయముఁ బరిశీలించుచున్నపు డీనాఁటి రసప్రమాణములనుపయోగపఱుచుట యన్యాయము.

మఱియు వాఙ్మయాభిరుచి ప్రమాణములు ప్రతి దేశమందును గాలభేదమునుబట్టి భేదించుచుండును. వాఙ్మయాభిరుచి కాలానుసరణమై యనేక కారణములచే మాఱుచుండును. ఈ భేదములఁగూడ వాఙ్మయ విమర్శకులు గుర్తించుచుండవలెను. మన యాంధ్రదేశములోఁ బండ్రెండవ శతాబ్దమునకును బదునాఱవ శతాబ్దమునకు సారస్వతమున విభిన్నత విస్పష్టముగాఁ గాన్పించుచున్నది. పదునాఱవ శతాబ్దినుండి యీ యిరువదవ శతాబ్దికి నంతకంటె నెక్కువైన భేదము కాన్పించుచున్నది.

ఈ మనుచరిత్రము పదునాఱవ శతాబ్దినాఁటి గ్రంథము. ఆ కాలమున రాజులు శృంగారరస ప్రియులగుటచేఁ దదాశ్రితులగు కవీశ్వరులును శృంగారరస లాలసులు కావలసివచ్చినది. శృంగారరసము లేని స్థలములయందు సైతమేదో యొక విధముగా శృంగారరసము చొప్పింపవలసియుండెను. శృంగారరసము వర్ణింపలేక కవిగాఁ డను నభిప్రాయ మతివ్యాప్తమైనట్లు కాన్పించుచున్నది. పెద్దనవలెనే యతని సమకాలీనులగు ముక్కు తిమ్మన్న, ధూర్జటి వారి వెనుక సమీప కాలములో వెలసిన రామరాజభూషణుఁ డు, పింగళి సూరన్న యిత్యాది మహాకవులందఱు శృంగారరసభూయిష్ఠంబులగు గ్రంథములను రచించిరి. కావున, పెద్దన్న శృంగారరసము చిత్రించుటలోఁ దన కాలమునఁ బ్రకటితమగు రుచి ప్రమాణముల మించెనో లేక వ్యక్తి వ్యత్యయముల నతిక్రమింపక మానవజాతికి నిత్యానుభవమగు రీతినిఁ బెంపొందించెనో నిర్ణయింప వలసియున్నది.

ఇంకఁ బాత్రముల గుఱించి కొంత యోజించెదము. ప్రతి దేశమునందును గథాపాత్రము లనేకములుగా నుండును. గుణదోషములు కేవలము వ్యక్తిగతములేగాక జాతిలక్షణములుగాను జూపట్టును. ఈ పాత్ర గుణనిర్ణయ సంప్రదాయ మన్ని దేశముల

యందు నన్నివాఙ్మయములయందుఁ గాన్పించుచున్నది. ఆయా వివరణములన్నిటినిఁ జెప్పుట ప్రస్తుత మనవసరము.

మన దేశ వాఙ్మయములో గీర్వాణ వాఙ్మయ సంప్రదాయముంబట్టి మనుష్యజాతి నాయికానాయకులే గాక దివ్యజాతి స్త్రీ పురుషులు గూడఁ దఱచుగాఁ గథాపాత్రములుగాఁ బ్రవేశపెట్టఁబడుచుందురు. దివ్యజాతుల చరిత్రములు పౌరాణిక ప్రసిద్ధములు, దేవతలు గంధర్వులు కిన్నరులు కింపురుషులు రాక్షసులు నిత్యాదులను మన మెవ్వరము మన జీవితములోఁ జూడకపోయిననుఁ బౌరాణిక సంప్రదాయ ప్రసిద్ధులు గాన వారివారికి నిర్ణీతములైన గుణదోషము లను మనము ప్రామాణికముగా నొప్పుకొనవలసియున్నది. ప్రస్తుతము మన మనుచరిత్రలో నప్సరసలు గంధర్వులు నాయికానాయకులుగ నున్నారు. వారి వర్తనములు మానవజాతి వర్తనములలోఁ జేరఁదగినవిగావు. ప్రత్యేకముగా మానవజాతికిఁజెందినవాఁ డొక్క ప్రవరుఁడు మాత్రమే కాబట్టి యప్సరో గంధర్వుల విహారవ్యవహారములు మనుష్యులమగు మన కాదర్శములు కావు.





# విద్యాప్రవృత్తి

శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డి

మనుష్య మూలాధార ప్రకృతులు రెండు : జ్ఞానము, కర్మము. జ్ఞానమనగా దెలివి; వస్తు స్వభావమును గనుగొనుట. కర్మమనగా కార్యము; చేయుపని.

వీనియం దెయ్యదిప్రధానము? జ్ఞానమా? కర్మమా? పర్యాయపదముల మూలముగ విచారించిన నీవిషయమింకను విశద మగును. జీవితమున నాద్యమెయ్యది ః? బుద్ధియా! నడతయా? యోజనయా? చరితమా? నోటిమాటలా? చేతియాటలా?

సర్వము దెలిసినవారయ్యును మూఢులవలె, దుర్మార్గులవలె, నర్తించువారులేరా? అపురూపులా? అట్టివారిని గృతకృత్యులని యెవరైన శ్లాఘింతురా? మఱియు, నేమియు దెలియని వారయ్యును సన్మార్గమున దమనైజమునుబట్టి పోవువారెందఱో యున్నారు. గ్రామములలోనుండు బీదసాదలు తఱచు ధర్మనీతి తత్త్వముల నెఱిగిన వారు గాకున్నను, వర్తనమునందు బండితులకంటె మొత్తము మీద శ్రేష్ఠులని యనేకులనమ్మిక. జనులతారతమ్యము నిరూపించునప్పుడు చర్యలను గణింతుముగాని విద్యను గణింపము. మనలో గొందఱు "సుజ్ఞానమున్న జాలును, సిద్ధులు చేకూరును" అని వచించెదరు. అదియెట్లో, నాకు జక్కగ బోధపడమికి జింతిల్ల వలసి యున్నాడను. "ధైర్యగుణమియ్యది, దాని లక్షణము లియ్యవి; తన్మూలమున బ్రచలించుకార్యము లియ్యవి" యని మంచి శైలిని, అమూలాగ్రముగ విచారణ నడిపి,ప్రసంగింప గలవారందఱును ధైర్యమును నడత యందుఁ బ్రకటించుట నిత్యమా? జ్ఞానమును బడసిన మాత్రమునఁ జరిత్రము చక్కఁ బడునేని, హిందూదేశ చరిత్ర మిట్లేలయున్నది? ఇది నిష్కారణవిచిత్రమా? జ్ఞానయోగముచేఁ బరలోకమున సర్వమంగళ ములు తటస్థించునఁట! అవునో కాదో నాకుఁ దెలియదు కాని యొక్కటిమాత్రము సత్యము; వట్టి జ్ఞానమీలోకమున నేసాధనకును బనికిరాదు. దీనిఁబట్టి చూడఁగాఁ బరలోకము మెత్తనిదనియు, నోటి

లోఁ వెన్నమూడికిఁ గరఁగునంత సరళమనియు, సూక్ష్మమనియు, నీపాడు ఇహలోకమువలె కాఠిన్యము, పౌరుష్యము, స్థౌల్యమునులేని దివ్యపదమనియు. నెట్టి నమ్మికలేని వానికైనను దటుకున్నఁ దట్టక మానదు. పరలోకదృష్టితో నీ విషయముఁ బరిశీలించుట యిట నప్రకృతముగావున సామాన్యదృష్టితో నారయుదము.

ఆద్యప్రకృతి కర్మంబు. ఇటఁ గర్మంబనఁగా 'కర్మకాండ' మనఁబడుదానికిఁ జేరిన వైదికక్రియగాదు. జ్ఞానము ద్వితీయము. ద్వితీయం బనుటచే గౌరవహీనమని భావించుట తప్పు. ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాఁడికావా? జన్మాదిగా జ్ఞానశక్తి, పూర్వము కపిలుఁడు, ఘటోత్కచుఁడు, మొదలగువారికి సద్యోయౌవనము తోడవచ్చినట్లు, ఈ కలియుగములో నెవ్వరికిని లభింపదు. కాని పుట్టినక్షణముగోలె నేవేని క్రియలు ప్రవర్తింపకుండినచో బ్రాణములు నిలువవు. శిశువు పాలుద్రావక సమాధిఁ దాల్చునేని యదియోగమా? 'కాదు; ప్రాణత్యాగము. ప్రాణకార్యములు నిత్యసంయోగములు; ప్రాణములున్నఁ గార్యములు, కార్యములున్న ఁబ్రాణములు నుండియే తీఱవలయును. ప్రాణములులేనిచోఁ గార్యములు, కార్యములులేనిచో బ్రాణములు నుండవు. కర్మమువలె జ్ఞానమారీతిని బ్రాణాధారముగాదు. పశుపక్షివృక్షసంతానములలోఁ బ్రాణములును గార్యములును బలసి యున్నను, విద్యలున్నవా?

కార్యాచరణమునందలి యిక్కట్టులు, సందియములు మొదలగు నడ్డంకులు, యోజనలు ప్రభవిల్లుటకు మూలములు గాకున్నను తరుణములు. ఏ కష్టమును లేక మనకు నూపిరి యాడునట్లును, హృదయము గొట్టుకొనునట్లును, స్వచ్ఛందముగా నిత్యసారళ్యముగఁ గార్యములు నడుచునేని, యే యోజనకు నవకాశమును నావశ్యకతయు నుండవు. అట్లగుట నాలోచనలు పుట్టవు. పక్షి మృగముల జీవితముల యందు వ్యాపారములు మెండయ్యును జిక్కులు లేనివి. కొన్ని గతుల సంచారములచే నవి ప్రాణయాత్ర నీడేర్చికొనును. అట్లు మనుష్యజీవితము సుసాధముగాదు; మనలనావరించి యుండు స్థితిగతులు సంఖ్య యందు మిక్కిలియు నధికములు, సంశ్లిష్టములు; ఎక్కువ చిక్కును దాల్చినయవి. కావున యోజనాశక్తి నేమాత్రమును బ్రయోగింపని యెడల

మనకును మనసంతతికిని బ్రదుకు దక్కదు. మనుష్యజీవిత ముత్కృష్టమును, శాశ్వతమునైనదశం జెందవలయునన్న, విజ్ఞాన మఖండముగఁ బర్వవలయును. జ్ఞానయోగవాదులలోనుండు సత్య మింతియే కాఁబోలు! అయిన నొక జాగ్రత్త: విజ్ఞానముండినమాత్రమున జన్మసాఫల్యము కలుగఁబోదు. ప్రకృతి సిద్ధాంతమేమనఁగా, జన్మసాఫల్యమున కావశ్యకములగువానిలో జ్ఞానము నొక్కటియని. ఇంతకంటె నెక్కువ మహాత్మ్యము నారోపించుట నిర్హేతుకము.

యోజనాశక్తి యొక్క ముఖ్యోద్దేశము కార్యసౌలభ్యము. కార్యములు దుర్ఘటములుగనున్న, "నేరీతి నలవరించుకొనవచ్చును దైవమా!" యని భక్తి యోగ జ్ఞానయోగముల రెంటిని బ్రకటింతుము. కార్యములు సరసరమని నిర్నిరోధముగ జరుగుచుండెనేని, యే యోజనములులేక నెమ్మదిగ నుందుము. చూఁడుడు; శిశువునకుఁ బ్రాణములెట్లు నిలుచును? పాలను గ్రోలుటచేత. ఈ ప్రాణాధార క్రియకుఁ గావలసిన జ్ఞానమెయ్యది? స్తన్యము గుర్తెఱుఁగుట. శిశువులయందింతకంటె జ్ఞాన మాదియందు గానఁబడదు. త్రోవ తెలిసినవాఁడు, నడచుచుండుటయైన గమనింపక, పరచింతఁ దాల్చినవాఁడై, కాళ్లీడ్చి కొనిపోవఁ బోవుచుండును. తెలియనివాడు మాటిమాటికిని ద్రోవను గూర్చిన యోజనలకుఁ గడఁగుచుండును; నాలుగుదారులు గలసిన చోటికి వచ్చెనేని 'ఏదబ్బా, దిక్కు!' అని తలబ్రద్దలుగునట్లు వితర్కించును. ఏయుపాధులునులేక కార్యములు నడుచునేని యోజనా శక్తికి 'రజా' యిచ్చినవారమై, శిరోభారపీడనములేని జీవనముఁ బడయఁజాలుదుము.

నాగరకత యెక్కువ యగుకొలఁది బ్రదుకుపాటుల స్థితిగతులింకను జిక్కునుదాల్చును. తళుకులు, బెళుకులు, కోరికలు, కష్టములు, సుఖములు, సాధ్యములు అన్నియు హెచ్చును. అసాధ్యములని యెన్నఁ బడువాని సంఖ్యామాత్రము తగ్గను. పూర్వము దేవుఁడొసగిన రెండు కాళ్లతో నెల్లరును బ్రయాణములను మెల్లఁగఁ దిన్నఁగ, జరపుకొను చుండిరి. ఇప్పటి యానోపాయములెన్నియని చెప్పవచ్చును? వ్యోమ యానము, భూయానము, భూగర్భయానము, సముద్రయానము, సముద్రగర్భయానము – ఓరామా! తలఁచుకొన్న నొడలు గడగడ వడఁకును! మనుష్యుఁడు సర్వసంచారప్రభావుఁడై యున్నాఁ

ము. ఈ సౌకర్యములతోడఁ, దోడునీడలట్లు, కావలసినన్ని యుపాధులున్నవి. పూర్వము పరూపమి జనసంఖ్య ప్రకారము జాతిప్రాబల్యము, దేశగాంభీర్యము నేర్పడుచుండెడివి. ఇప్పుడన్ననో, ప్రకృతిశాస్త్రజ్ఞులచేఁ గనుఁగొనఁబడియెడు ఫిరంగులు, తుపాకులు, బాంబులు మొదలగు వినాశక్రియాసాధనయంత్రములచే, జనసంఖ్యల ప్రభావము దినదినక్షయంబు గాంచుచున్నయది. గొఱ్ఱెలెన్నియున్న నేమి? ఒక్కపులి చాలదా వానిపనిఁ దీర్చుటకు? యంత్రబలములేని వారెన్ని కోట్లైననేమి? పురాణపురుషులుగా నున్న యెడలఁ బ్రకృతిశాస్త్ర ప్రయుక్తకళాకోవిదులైనవారి నోటిలోఁ బడక తప్పించుకొని పోఁజాలరు. సారముపోయిన పిప్పివంటిది సంఖ్య; దానికంటె సత్త్వము ప్రధానము. బుద్ధిబలమును గార్యశూరత్వమును ననుసరించి సత్త్వముండును. ఒక్క బుద్ధియున్న మాత్రమునఁ జాలదని యడుగడుగు నకుఁ దెల్పవలయునా? మన దేశముయొక్క దౌర్భాగ్యమునకుఁ గారణము మంచియోజనలు లేమికాదు; యోజనతోఁ దీటగునడవడి లేమి. మాటలకు నాటలకు సంయోగములేని బ్రదుకు కడతేరుటెట్లు? తేర్చుటెట్లు? నాగరకత వృద్ధియగుకొలఁదిని మనుష్యజీవితమెక్కువ సంశ్లిష్టమగును; మన రక్షణముకొఱకు గమనింపవలసిన విషయముల సంఖ్య హెచ్చును. ప్రాఁతరీతి నొకటి రెండు త్రోవలలో, "గ్రుడ్డెద్దు జొన్న చేనిలోఁ బడినట్లు" పోవుచుండినఁ జెటుతప్పదు; సంఘము మునుపటికంటె నెక్కుడుక్రియలసాధింపవలయు; కార్యభారమన్ని దిక్కులను ఘనతరమగును; నిమిష నిమిషమునకు నూతనమార్గముల నవలంబింపవలసివచ్చును; ఏ మార్గము మంచిది; యెయ్యది చెడ్డది; ఇది సరియా; యది సరియా; యని క్షణక్షణమునకును సంశయము లుదయించును; చింతాపరంపరలు మిక్కుటములగును; ఈ కష్టములకుఁ దగిన ఫలము లేకపోలేదు గాని, యూరక హాయిగాఁగూర్చుండి కాలక్షేపముఁ జేయుటయే మోక్షమనువారి కీలోక మావరప్రసాదము నేనాఁటికి నియ్యదు. అట్టివారికి పరలోకమో, పారతంత్ర్యమో, బహుశః రెండునో, గతి. వృద్ధిహెచ్చుగుకొలఁది యోజనాశక్తియు నెక్కువ బలవంతమగును; కావలసివచ్చును. చూడుఁడు; ఒకటి రెండు విధముల యాగమముల ప్రకారము వర్తించు గ్రామీణులో బుద్ధివికాసమునకు నావశ్యకతయు నవకాశమును గలదా? కావుననే వారి బుద్ధియు, నడతయు మందములై యుండును. పట్టణవాసులలోఁ జర్యావిధానములసంఖ్య హెచ్చియుండును గాన,

నచ్చటివారు మాటల యందును, మూలంగూర్చుండి యోజించుటలందును, వలదన్నను బలాత్కారముగ నితరులకు బుద్ధిఁజెప్పుటయందును గడుసమర్థులుగానుందురు.

జ్ఞానకర్మంబుల రెంటియు ముఖ్యోద్దేశము ప్రాణరక్షణాభ్యుదయంబులు. మోక్షమనుట యీనాటి మాటగాదు; ఏనాఁటిమాటయుఁ గాదని చెప్పిన బాపమా? మోక్షముఁ గోరువారును నేదో శాశ్వత మైనస్థితి నాశించువారేకదా! ఈ స్థితి జడస్థితియా ? ఱాళ్లఱప్పలవలె నుండవలయుననియా వారికోరిక? మఱి చైతన్యసమేతమా? అది యట్లుండె. అన్నిటికంటె మించిన మహత్తు ప్రాణము. ప్రాణము ద్వివిధము· తనయొక్కయు, తనజాతియొక్కయు నని. ఎల్లపృథక్పాత్ర ములయందలి ప్రాణములుఁ బోయిన జాతియుండదు; ఇఁక జాతి దుర్బల మగుడుఁ బ్రతియొకనికిని ముప్పుదప్పదు. జాతియుఁ బ్రజయు నన్యోన్యాశ్రయములు. జాత్యభివృద్ధికి విరుద్ధములైన ధర్మములును, నీతులును నాత్మహత్యతో సమానములు. ప్రాణముయొక్క ముఖ్యగుణము కర్మము; జ్ఞానము భృత్యప్రాయము. జ్ఞానము పుట్టినది కర్మగర్భము నుండి; కాని బిడ్డలు తల్లిదండ్రుల నాడించునట్లు కర్మమును వశము చేసికొనుప్రభావముఁ గలయది. ఉత్పత్తి నెట్లుండినను నీనాఁటి ప్రచారములఁబట్టి చూచిన నవిరెండును బరస్పరకారణములు; ఇతరే తరోద్దీపకములు. కార్యము ననుసరించి యోజనలు సాఁగుటయు యోజనల ననుసరించి కార్యములు సాఁగుటయు, రెండును బ్రత్యక్షములు. అయిన నొక్కటి; యోజనలు కార్యములుగఁ బరిణమింపకున్న క్షేత్రమున నాటఁబడని బీజములట్లు నిష్ఫలములగును. గొడ్డువోయిన జ్ఞానమెక్కడ దట్టముగనుండునో యాదేశము మానసనక్షయవ్యాధి బాధితమని దృఢముగఁ జెప్పవచ్చును.

జ్ఞానములోని జాతులు రెండు: భూత (స్థితి) జ్ఞానము, భావ్య (స్థాతవ్య) జ్ఞానము. భూతమనఁగా నునికికి వచ్చిన వస్తువో, తప్పక సహజముగ వచ్చునదియో; స్థితిం దాల్చినదియును,నవశ్యము దాల్చునదియును. స్థి త్రివిధము : భూతభవిష్యద్వర్తమానములని. ఉదా: మనుష్యులందఱు మర్త్యులు; అనఁగా మరణాధీనులనుట. దీనికి నిర్వచనము – పూర్వులు చచ్చిరి; ఇప్పటివారు చావనున్నారు; ఇఁక ముందటివారును దప్పకచత్తురు. శరీరియొక్క యనివార్యలక్షణములలో

ష్ట త్వ పోకమే. శరీరికి మృత్యువునకు నుండు సంబంధము సర్వదా సిద్ధము. ఒక్కవేళ ఇంకముందు మనుష్యులు పుట్టరనుకొందుము. పుట్టక పోయినను నీన్యాయమునకు బాధలేదు. శరీరులుండినను సరే, లేకున్నను సరే, వారికిని మృత్యువునకు నుండు దాంపత్యము నిత్యమనుట యీ న్యాయముయొక్క నిర్వచనము. ఈ దాంపత్యము సిద్ధము. ఇప్పటి కాలమునుబట్టి చూచిన నెయ్యది భవిష్యత్తో దానిని గూడ సంగ్రహించినట్లు భూతమనుపదము వాడఁబడియున్నది. ఏలన, భవ్యిత్తుగూడ స్థితికిఁ జేరినదిగావున. మఱియుఁ గాలక్రమముగాఁ జూచిన నిఁకముందుఁ బుట్టఁబోవువారు చచ్చుట యిప్పటిపని గాకున్నను, ఏన్యాయముంబట్టి వారిమరణము మన మనుమానింపనగునో, యాన్యాయ మిఁకముందుఁ బుట్టఁబోవునది కాదు; అదియెప్పుడో పుట్టి నది; శరీరితో నవతరించిన కవలబిడ్డ. ఇప్పుడు సత్యము; రేపు సత్యము; శ్రీరాములనాఁడును సత్యము. అనఁగా నియ్యది శాశ్వతము; స్వభావలక్షణము. ప్రకృతి శాస్త్రన్యాయములన్నియు నీవర్గమునకుఁ జేరినయవి. ఉదా: ఆధారములేని పదార్థము భూమ్యాకర్షణశక్తిచేఁ గ్రిందఁ బడును; అగ్నిలోఁ జేయిపెట్టిన నొప్పియగును; ఉష్ణముచే వస్తువుల యాకృతులు పెద్దవగుట బహుళము, ఇత్యాదులు. ఇఁక భావ్య (స్థాతవ్య) జ్ఞానమును విమర్శింతము. భావ్య మనఁగా, వచ్చినదికాదు; తనంతట, తప్పక, స్వభావసిద్ధముగ రానున్నదికాదు; మఱి యవశ్యము రాఁదగినది; మనచే రప్పింప బడవలసినది; ఎయ్యదియుండిన బాగని మనము కోరుదుమో, యెయ్యది తప్పక రాఁదగినదని మనము నిర్ణయింతుమో, యయ్యది భావ్యము. నాకు టెక్కలు రావలయుననుట భావ్యముగాదు. ఏలన, నది యవశ్యము కాఁదగినవస్తువుగాదు. భావ్యజ్ఞానమున కుదాహరణము: అందఱు సత్యము చెప్పవలయును. దీనికి నిర్వచనమెట్లనఁగా, నందఱును నత్యము చెప్పుట పూర్వముప్రసిద్ధికిచ్చిన వృత్తాంతము గాదు; ఇప్పుడు వచ్చియుండలేదు; ఇఁకముందు వచ్చుటయు సందిగ్ధమే; అయిన నొక్కటి; వచ్చినను సరే, రాకున్నను సరే, లవమాత్రమైనను సిద్ధింపకున్నను సరే, అందఱును సత్యమును జెప్ప వలయుననుట శాశ్వతన్యాయము. ధర్మములను నీతులను బోధించు న్యాయములన్నియు నిట్టివి. ఇవి బోధించునవి కృతంబులుగావు; కర్తవ్యములు. ఈ న్యాయములకును రాజశాసనములకును గొన్ని విధముల సామ్యమును గొన్నివిధముల వైషమ్యమును గలదు. అయ్యది నా

యర్థశాస్త్రమున విమర్శింపఁబడియెఁ గాన, నిట ననావశ్యకము. ఈ నీతి న్యాయము లకును బ్రకృతిస్థితికిని నే సంబంధమును లేదా? అనఁగా నవి నిష్ప్రయోజనములా? ఏనాఁటికినిగావు. అందఱు సత్యము చెప్పకున్నను, జెప్పవలయుననుట సర్వత్రసత్యము. ఈ సత్యముండుటంబట్టియె లోకమునందుఁ గొంతకుఁ గొంతయైన సత్యము ప్రవర్తిల్లు చున్నది. సత్యము ధర్మమగుటచే దత్ప్రకారము వర్తింప మనము ప్రయత్నింతుము. ఈ యత్నమునకును, దన్మూలమున సిద్ధించు ఖండమో, పూర్ణమోయైన చరిత్రస్థితికిని, ఆ నీతియే బీజము. ఆ నీతియొక్క ప్రతిబింబమట్లు వర్తమానమును దీర్పఁజూతుము. ఆనీతి ప్రభావముచే వర్తమానము మన ప్రయత్నానుసారముగ మాఱును. అట్లగుట, స్థితిని నిర్ణయించు శక్తులలో భావ్యములకును స్థానమున్నది. స్థితిస్థాతవ్యములు రెండును సత్తులే. స్థాతవ్యములు మిథ్యలుగావు. అవి, ప్రకృతిశక్తులట్ల మనుష్యప్రయత్నము లేకయ, యమోఘముగ వర్తింపనేరవు. మన శక్తికొలఁది వాని విజృంభణ ముండును. కార్యసాధనమునకు భూతభావ్యజ్ఞానములు రెండును నావశ్యకములు. స్థితిజ్ఞానముచే మనయొక్కయుఁ బ్రకృతియొక్కయు శక్తులు గోచరించును. స్థాతవ్యజ్ఞానముచే నేయేయర్థములకై మన శక్తియుక్తులఁబ్రయోగింపవలయుననుట యేర్పడును. "నాలాభార్థమై నాచాతుర్యమును వినియోగింతునా? దేశ శ్రేయమునకై పాటు పడుదునా? నాకైకాక పరులకై నేనేల శ్రమింపవలయును? స్వార్థ త్యాగ మేల విధియయ్యె? దేశము నశించిన నేను నాశములేక యుండుట సాధ్యమా? మనుష్యమహాసంఘములో నిమిడియుండు నణువువంటివాఁడనా నేను?" ఇత్యాదితర్కములు స్థాతవ్యపరిశోధనలకుఁ జేరినయవి. పురుషార్థముల నిర్ణయించునది నీతి. ఆ యర్థసాధనకైవలయు నుపకరణముల వివరించునది ప్రకృతివిద్య. "ఉండు వానిఁ గూర్చిన జ్ఞానము" వలనక్రియలయుఁ, దత్ఫలములయుఁ దెఱంగును "ఉండఁదగినవానిఁ గూర్చినజ్ఞానము" వలన యుక్తాయుక్తములును, గర్తవ్యములును దేటపడును.

ఇఁకఁ గర్మమునంగతికిఁబోదము. ప్రకృత్యాది శాస్త్రంబులలోఁ గనుఁగొనఁబడిన న్యాయంబులను, మనుష్యప్రయోజనార్థక కార్యంబులఁ బ్రయోగించు మార్గంబుల నాదేశించి, మనలసార్థకశ్రములను జేయు నది కళ. జ్ఞానమునకు యోజనాశక్తి యొందు

చాలును. సత్కళాసామ్రాజ్యమునకు వలయుగుణము లెవ్వియనఁగా –(1) యోజనా శక్తికిం జేరిన ప్రకృతి శాస్త్రజ్ఞానము. (2)ప్రకృతి న్యాయప్రయోగజ్ఞానము (3) త్రియుక్తాయుక్తజ్ఞానము ఇది తెలియకున్న మనచాతుర్య మంతయుఁ జెడ్డకార్యముల కల్పింతుమేమో! వివేకములేనిది "ఇది తగు నిదితగ" దని యెట్లు నిరూపింపనగును? (4) వివేకముండిననే చాలునా? మంచిచెడ్డల నరసియుఁ జెడ్డయేచేయు దుర్మార్గు లెందఱులేరు.? కావున ధర్మనిరతియు నావశ్యకము. (5) ఇన్ని మనోభాగ్యములుండినను శరీరపరిశ్రమము లేనిది యేకళయు సాగదు. ఆరోగ్యము, బాహుబలము, పట్టుదలయును భాగ్యగుణమ్ములలోఁ బ్రధానవర్గములకుఁ జేరినయవి. ఆత్మకృషితప్ప నింకేకృషియు లేనియెడలఁ. గోఁతకాలము నందు బొల్లిమాటలుదప్పఁ దక్కినపంట లేవియు లభింపవు. మనః కృషి తోడ, నేత్రహస్తాదీంద్రియ కృషియు లేకున్న నేమిఫలము? దేహక్షయము, దేశక్షయముఁ బ్రాపించును. బుద్ధి నొక్కదానిని సవిస్తారముఁ జేసిన మాత్రమున నన్నివిధముల మేలులును దమంతలు వచ్చినోటఁబడునని కన్నులు మూసికొని, చేతులు కట్టుకొని, పరధ్యానముఁ జేయు వారికంటె మూఢులీ లోకమున నుండరు. మనః కృషియు, హస్తకృషియుం గలియకయున్న నేర్పడునది "కళ" గాదు; "కళంకము".

ఈ తత్వము దెలిసినవారికిఁ బ్రకృతము హిందూ దేశములో నవతరించి యుండెడు సర్వకళాశాలలు సరిపూర్ణములుగావని తోఁపక మానదు. వానియందలి లోపము లనేకములు. కళాకృషి మిక్కిలియు న్యూనము. ఆధునిక పాశ్చాత్యసర్వకళాశాలలు విద్యాబోధనశాస్త్ర ప్రకారనిర్మితములును, సర్వప్రజాభివృద్ధికరములును, హృదయానంద కరములునై యుండఁగా, మన కళాశాలలింకను బౌరాణిక పంకనిర్మగ్నములై యుండుటఁ జూడఁ గోపతాపంబులు మనస్సును గలంచుచున్నయవి. వీనివలన మనకుపకారము లేకపోలేదు; కాని యది చాలదు. మఱియుఁ బూర్వమెప్పుడో మంచిచేసెనని యెల్లకాలము కృతజ్ఞతాసూచకముగా వందిమాగధస్తోత్రములు చేయుచునో, చేతులుగట్టుకొని, నోరుమూసికొని భక్తి నమ్రతను జూపుచునో యుండుటకుఁ బౌరుషవంతుఁడెవ్వడును సమ్మతింపఁడు. చిన్నప్పు డక్కఱమైఁ బెంచి పెద్దవానినిగాఁ జేసిరిగదా యని జన్మమంతయు నవ్వలకు నాహుతిగా నియ్యఁబోలునా? కృతజ్ఞత యెంతో మంచిగుణము; అయినను భావికిఁ బ్రతికూలముల విధించునెడల దాని ననుసరించుట యన్యాయము.

పూర్వులయెడ మనము చూపవలసిన భక్తికంటె, నింకముందు మనచే సృజింపఁబడు సంతతివారి పురోవృద్ధికై వలయు సన్నాహముల నొడఁగూర్పఁ బ్రయత్నించుట ప్రధానతరకృత్యము. రక్షించుటకు శక్తిలేనిచో సృష్టించుట మహాపాతకము. మన పూర్వులు మనల నీలోకమునకుఁ దెచ్చిరి; శక్తికొలది భరించిరిగాఁబోలు; అది వారి ధర్మము; దానిని వారు చెల్లించుకొని పోయిరి; వారు చేసిన మేలు మఱవఁగూడదు; అట్లనుటచే మనమెవ్వారిమేలునకై యుత్తర వాదులమో యట్టి మన సంతతివారేక్షేమముల నారసి యాచరించు విధమునఁగాక,ప్రాచీనుల మతప్రకారము వర్తింపవలయునని యర్థము చేయుట మూఢభక్తి. సంతతివారి క్షేమార్థములైన ధర్మముల కంటె మిక్కిలిగా నుపాసింపఁ దగిన ముఖ్యధర్మము లెవ్వియును లేవు. "ఉన్నవి; నాయాత్మను నేను గాపాడుకొనుట ప్రధానధర్మము," అనువారుందురయేని, అట్టివారు సంతానము వడయుట కనర్హులనియు హక్కులేని వారనియుఁ దోఁపకున్నె? తనగతి మోక్షములకై సంతానముఁ బడయవలె నన్న, నాకుఁ జూడ నియ్యది పరోపకారధర్మమునకు విఘాతుకమైన తలంపుగఁ గన్పట్టెడిని. అది యట్లుండె; వర్తమాన కాలముయొక్క ముఖ్యకర్మము, భూతకాలములో వేల్వఁబడుట కాదు; భవిష్యత్తును భూతవర్తమానములకంటె నున్నతముఁ జేయుత్రికరణశుద్ధిగ బరిశ్రమించుట.

కావున గృతఘ్నత యనునిందకు భయపడక, సర్వకళాశాలా సంస్కారమున కుద్యోగింపవలయును. మొదటి వ్రేటునకు దీనికి మించిన లక్ష్యము లేదు. ఈ విషయమై " ఆంధ్ర పత్రిక" యొక్క యీ సంవత్సరాది సంచికలో నాకుఁ దెలిసినంతమట్టుకు నిదర్శనములతో వ్రాసి యున్నాను. దానిం దిలకింప విద్యాసంస్కారోద్యోగులు ప్రార్థితులు. ఇఁక వేఱుగ నిట దీర్ఘ వాదమునకుం బూనుట నాకు చర్వితచర్వణమే కాదు, మీకు శ్రవణబాధకమును. కావున నింతకాలము నోపికతో నా వ్యాసము నవధరించినందులకు వందనము లర్పించుచు, మీయనుజ్ఞమై నింతట విరమించెదను.





# శిష్టభాష

శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రి

శ్రీ రావుసాహెబు, మహోపాధ్యా, హిందూకేసరి గిడుగు వేంకటరామమూర్తి నాకు పాతిక సంవత్సరాల నుంచి విశిష్ట పరిచయము కలదు. వ్యావహారిక భాషావివాదమునకు అంకురారోపణము చేసిన మహోత్సవములో నేనున్నూ చందన తాంబూలా లందినవాడనే. ప్రారంభదశలో వారి వాదము నొల్లక తీవ్రముగా ఎదుర్కొనుటకు నేనుద్యమిస్తిని. పంతులుగారు నా అభిప్రాయము గ్రహించి వ్యావహారిక భాషలో ముద్రితములున్నూ అముద్రితములున్నూ అయిన వైద్యజ్యోతిషధర్మశాస్త్ర గ్రంథాలను, వ్యాఖ్యానములను, శాసనములను వేవేలు నాకు చూపి నా అభినివేశమును సడలించినారు. నాడు మొదలుగా వారి అనుచర వర్గములో చేరి నా ఉడతాభక్తి చూపుచుంటిని. ఆ దినములలో పెక్కుండ్రు పండిత ప్రకాండులు పంతులుగారిపై తమ వాగ్వజ్ర వర్షధార నిరంతరము కురిపించిరి.

అయినా పంతులుగారు మహామేరువువలె చలింపక తాము పూనుకొన్న కార్యము దక్షతతో సాగించి నేడు వార్తాపత్రికలూ, నవలలూ, చరిత్ర గ్రంతములూ, వ్యాఖ్యానములూ మొదలయిన వన్నీ వారి యశఃపతాకలై దశదిశల నెగురుతున్నవి. వేనవేలు విపక్షులు సపక్షులైనారు. ఆగ్రహమనుగ్రహమైనది. అపశబ్దము సుశబ్దమైనది. మ్లేచ్ఛు లార్యులైనారు. సర్వమూ తారుమారై తారకము ముట్టినది. సభాముఖమున పంతులుగారిని ఎదుర్కొనే గ్రాంథికాభిమాని నేడరిది. స్వపక్షాభిమానముతో కొంత మంది పండిత కవిచంద్రులు పగటింటి చంద్రులై వెలవెలబారి కనబడుతున్నారు. స్వార్థపరత, దంభము, మోసము ఎంతో కాలము నిలిచి ఉండలేవు. తత్త్వము తలలలో నాటుకొన్నది.

శ్రీరామమూర్తి పంతులుగారి వాదములో సత్యమున్నది. దేశ పరిస్థితులలోనూ భాషా పరిస్థితులలోనూ కూడా పూర్వాచార పరాయణులు మార్పులకు సహించరు. సంస్కర్తలు రెండింటిలోనూ ప్రకృతి కనుకూలమయిన మార్పులంగీకరిస్తారు. పూర్వాచార పరాయణు లేవిషయములోనూ స్వాశయమును నిర్ధారణగా చెప్పరు.

తెలుగుభాషకు నన్నయగారి భారతభాగము సమగ్ర లక్ష్యమున్నూ చిన్నయసూరి వ్యాకరణము సమగ్ర లక్షణమున్నూ కాజాలవు. నన్నయ భారతములో నూటికి 20 సంస్కృత పదములున్ను 30 తెలుగు పదములున్ను కదా ఉన్నవి! సూరిగారి వ్యాకరణము తన నీతిచంద్రికరూపములకయినా సరిపడక ఉన్నదికదా! జావద్భాషలు అర్థములోనూ, శబ్దస్వరూపములోనూ, పదప్రయోగ విధానములోనూ కూడా మారుతూ ఉంటవి. హిందీ భాషలో 'య'కార స్థానమున 'జ'కార ముచ్చరిస్తారు; 'కృష్ణ' శబ్దమునకు 'క్రుష్ణ, క్రిష్ణ, కిత్త' మున్నగు అపభ్రంశరూపములు పెక్కులు తెలుగులో వచ్చినవి. 'అనుమానము' సంస్కృతములో ప్రమాణ విశేషము; తెలుగులో సందేహము. ఈ విధముగా భాషలో మార్పులు కనబడుతున్నవి. సంస్కృత భాష కూడా వ్యవహారములో ఉన్నంతవరకూ మార్పు పొందుతూనే వచ్చినది. వైదిక కాలములోని సంస్కృతము వేరు; లోకములోని సంస్కృతము వేరు. వాటికి అనుశాసనములు వేరు వేరుగా ఉన్నవి. వ్యాకరణము లన్నీ ఒకనాడు పుట్టినవి కావు. ఒక కాలమున అసాధువులయిన శబ్దములు కాలాంతరమున సాధువులవుతవి. కాళిదాసుని 'విశ్రామ' శబ్దప్రయోగము పాణినీయము ప్రకారము అసాధవు; కాని వ్యాకరణము కూడా మారవలెను. ఒకే వ్యాకరణము భాషకు శాశ్వతముగా మంగళసూత్రము కట్టి స్వాధీనము చేసుకొనజాలదు. కుమ్మరి కుండలనువలె వైయాకరణుడు శబ్దములను పుట్టింప జాలడు. భాషావశిష్టులు (లోకజ్ఞానము గలవారు) సభలలో వాడే భాష "భాష"గాని కేవలము పామరులు వాడే భాష "భాష"కాదు. అట్టి శిష్టభాషనే గ్రంథములలో వాడుల సంప్రదాయము. కాలాను సారముగా మారిన భాషకు వ్యాకరణములు వ్రాయుట కూడా ప్రాచీన సంప్రదాయమే. ఇందుకు "ననుగాత్రి" మొదలయినవి తార్కాణములు. ఇంతేకాక ఏ అనుశాసనమైనా భాషను సమగ్రముగా సంస్కరింపజాలదనీ, అట్టి విశిష్ట వ్యవహారమే సంస్కారముగా గ్రహింపదగినదనీ పాణిని "పృషోదరాదీని యథోపదిష్టమ్" అను సూత్రముచే సోదాహరణముగా సూచించినాడు. ఈ యాశయమునే "భవేద్వర్ణా గమాద్ధంసః సింహో వర్ణవిపర్యయాత్! గూఢోత్మావర్ణవికృతేః వర్ణనాశాత్ పృషోదరమ్"॥ అని అభియుక్తులు వివరించి ఉన్నాడు. శిష్ట వ్యవహారములో వర్ణా గమవిపర్యయ వికారలోపములు కనబడితే అవి దూష్యములు

కావని మనము గ్రహించడమే న్యాయము.

నన్నయాదులకు అప్రసక్తములయిన పదపదార్థములు వేవేలుండిపోయినవి. నేడు నవీనములయిన భావములూ, పదార్థములూ కుప్పతిప్పలుగా ఉదయించినవి. పూర్వాచార పరాయణులు నవీన శబ్దసంతతికి ప్రాచీన వ్యాకరణ పద్ధతి ననుసరించి ప్రకృతి ప్రత్యయ విభగాదులు చేస్తూ ఉన్నారు. అట్లు కాగా శబ్దము నవీనమున్ను ప్రకృతి ప్రత్యయవిభాగాది రూప సంస్కారము ప్రాచీనమున్ను అయి శ్రావ్యతకు భంగము గలిగిస్తున్నది. శ్రావ్యత ననుసరించే భాషను సంస్కరించవలెను. తమ ఆశయములను పరులకు వెల్లడించడమే భాషయొక్క ముఖ్య ప్రయోజనము. అదే సిద్ధింపకపోయే యెడల భాష వ్యర్థము. విశేషించి మాతృభాషలలో ఝుడిత్యర్థస్ఫూర్తికే ముఖ్యస్థానమివ్వ వలెను. 'ఫిజిక్సు' మున్నగు శాస్త్ర విషయములను నన్నయాదుల భాషలోగాని కేవల పామర భాషలోగాని వ్రాస్తే అర్థస్ఫూర్తిఆక పరివర్తన ప్రయోజనమే క్షీనిస్తుంది. విజ్ఞానాభివృద్ధికిన్ని వ్యవహార సిద్ధికిన్ని శిష్టభాషే ఉపకరిస్తుంది. భాషకు విచ్ఛిత్తిని శేషమును కలిగించడము కూడా ఒక ప్రయోజనమే. తార్కికుడు "శుష్కో వృక్షః తిష్ఠ త్యగ్రే" అని చెప్పగా కవి "నీరసతరు రిహ నివసతి పురతః" అని చెప్పెనట. వీటిలో అర్థమొక్కటే అయినా విచ్ఛిత్తిలో అంతరమున్నది. కవులు తమ రసముల కనువైన భాషను వారే సేకరించుకొంటారు. శృంగార రసములో అతిదీర్ఘసమాసాదులు ప్రయోగిస్తే అందులో రసాస్వాదమే కలుగదు. ఏ పద్ధతిలో, ఏ సందర్భములో రసపుష్టి కలుగుతుందో అది కవులకే తెలుస్తుంది. నిఘంటువులు అల్లకల్లోలముగా ఉన్నవి. అట్టి కోశముల సాహాయ్యముతో తమకు అసహజమైన భాషలో కవిత్వ మల్లితే అది రసాస్వాదన కలిగిస్తుందా? తమ కావ్యరచనకు రసానుకూల మైన భాషను కవులే చూచుకొనవలెను. వారు నిరంకుశులు. ఈ భాషా వివాదములతో కవులకంతగా ప్రసక్తిలేదు. శాసనములలోని భాష, ప్రాచీనాంధ్రలేఖలు, ప్రాదెనుగుగమ్మ, అప్పారావుగారి భాష- ఇవన్నీ ప్రాచీనాంధ్ర భాషా పరిణామములే. "గ్రాంథిక భాషే అందరికీ సుబోధముకాని వ్యావహారిక భాష అన్ని మండలముల వారికీ సుబోధము కాదు" అని గ్రాంథికవాదులు వాదిస్తారు. మాండలిక భేదములుంటే నిఘంటువులు వ్రాసి వాటిని చూపండి. గ్రాంథిక భాషకు

మాత్రం మాండలిక భేదము తప్పేదికాదు. భాషకు ప్రకృతి ప్రత్యయ విభాగము తెలియని వక్రగతి తెచ్చి పెట్టడము మంచిదికాదు. నేడు వార్తాపత్రికలలోనూ గ్రంథాదుల లోనూ "గౌరవనీయులు" అనే పదము ప్రాయకముగా స్వేచ్ఛగా వాడుక చేస్తున్నారు. గౌరవ శబ్దముపైని 'అనీయర్' ప్రత్యయము చేర్చుట కృతకము; కేవలము తప్పు. ఇట్టివే ప్రాముఖ్యత, ఏహ్యాము మొదలయినవి పెక్కుపదములు కనబడుతున్నవి. ఇట్టి కృతకభాషను ఆమోదించేవారు శిష్టవ్యవహార భాషను అంగీకరించడానికి వెనుకాడుట న్యాయము కాదు. పామరులు సరిగా ఉచ్చరించలేక తారుమారు చేసిన శబ్దమును సేకరించుకాని, శిష్టభాషను పరిహరించుటకాని– రెండున్నూ యుక్తి సహములు కావు. అర్ధానుస్వారాది పీడవల్ల సహృదయముల భావములు లోలోపల సమసిపోకుండా వ్యవహారిక భాషలోనే వ్రాయుటకు అవకాశము ప్రసాదింపవలెను. "నన్నయ చిన్నయల మార్గానువర్తులే పండితులు; అ్యలుకారు" అని చెప్పుట సమంజసముకాదు. వ్యాకరణ విరుద్ధమైన భాష అంతా నిషిద్ధమే అంటే సంస్కృతేతరములయిన భాషలన్నీ అపభ్రంశములే అవుతని. అవన్నీ నిషిద్ధములే! ఆపక్షమున సర్వవ్యవహారహాని సంభవిస్తుంది. అందువల్ల శిష్టవ్యవహార భాషను కాలానుసారముగా సేకరిస్తూ దానినే సంస్కరిస్తూ ఉండవలెను. ఇదే ప్రాచీన భాషా వ్యాకరణ సంప్రదాయము; ఇదే శ్రీరామమూర్తి పంతులుగారి వాదము.

వారి వాద స్వరూప సంగ్రహము

వైదిక లౌకిక భాషలకువలెనే గ్రాంథిక భాషకూ వ్యావహారిక భాషకూ కొంత అంతరము ఉన్నది. వ్యావహారిక భాషను గ్రామ్యమని పేరుపెట్టి నిరసించుట తగనిపని. శిష్టవ్యవహారములో ఉన్న భాషలో గ్రంతములు రచించడమున్ను, వాని కిటీవల వ్యాకరణములు పుట్టమున్ను సర్వదేశ భాషాసత్సంప్రదాయము. ఏసుక్రీస్తు దేశభాషలోనే తన పరమధర్మము ఉపదేశించినాడు. బుద్ధదేవుడు అహింసాధర్మములను నాటి వ్యావహారిక భాష అయిన పాళీభాషలోనే ఉపదేశించినాడు. రవీంద్ర కవీ, ఆచార్య గిద్వానీ, గాంధీ మహాత్ముడూ మొదలయిన పండితవరేణ్యులందరూ తమ తమ వ్యావహారిక భాషల్లోనే గ్రంథములు రచించి వాసికెక్కి ఉన్నారు. నన్నయాదులు తమ కాలములో శిష్టవ్యవహారమున ఉన్న

పదములనే సేకరించి గ్రంతములు వ్రాసినారు. వారి కాలములో ప్రాదెనుగు, క్రొందెనుగు అని రెండు లేవు. వారి తెనుగు నేటివారికి ప్రాదెనుగు అయినది. తమ భారతపు తెనుగునే చెక్కుచెమర్చకుండా ఆచంద్రతారకముగా వాడవలసినదని వారు అనుశాసించి ఉండలేదు. గ్రాంధికమునే సర్వత్ర వాడవలసినదని అనుశాసించేవారు దాని నిజస్వరూపమును స్పష్టముగా నిరూపించి అది సామాన్యముగా అందరికీ అలవడుటకు సాధనములుగా కోశములూ వ్యాకరణములూ మొదలయినవి నిర్మించి దేశము ముంగిట పెట్టవలెనుగదా!

నేడు నిలిచి ఉన్న నిఘంటువులున్ను వ్యాకరణాదులున్ను ప్రాచీన భాషా స్వరూపమును నిస్సంశయముగా చూపలేవు. పూర్వ గ్రంధముల అచ్చుప్రతులకూ, తాళపత్ర ప్రతులకున్నూ చాలా భేదము కలదు. ఏ పాఠము విశ్వసనీయమో తెలియదు. అచ్చుపడని తాళపత్ర గ్రంతములు వేవేలున్నవి. ఔప విభక్తికములు, శకట రేఫము, పదమధ్యమందుండే అచ్చులూ, జాత్యేకవచన బహు వచనములూ, మున్నగువాని నిజస్వరూపము నిర్ణయించడము ఎవ్వరికీ తరముకాదు. పెక్కు క్రియలకు ప్రేరణార్థక రూపము లేవో తెలియవు. ప్రాచీన కారకమెవ్వరికీ సరిగా పట్టుపడదు. ఇట్టి దుస్థితిలో తెలిసీతెలియని సందిగ్ధ ప్రాచీన భాషలో గ్రంథములు రచించిన ప్రయోజనమెవ్వరికీ కానరాదు.

నేటి పండితులు వ్రాస్తూ ఉన్న భాష కృతకభాషగాని వ్యవస్థ గల వాస్తవ భాష కాదు. తమకు సుపరిచితముకాని భాషలోగ్రంథములు రచించడము హాస్యాస్పదమే! గ్రాంథికాంధ్ర భాషారచనకు మార్గదర్శకులగు పరవస్తు చిన్నయసూరిగారి కృతులలో కూడా తప్పులు వెలసినవి. ఇటీవలి మహాపండితుల రచనలలోనూ తప్పులు మితిమీరి ఉన్నట్లు పంతులుగారు వేనవేలు దృష్టాంతరములు చూపి తమ వాదముయొక్క సత్యతను లోకములో కరతలామలకము చేసినారు. వాడుక భాషలో పలు విధములగు గ్రంతములు రచించుట ప్రాచీన సంప్రదాయ విరుద్ధము కాదని తాళపత్ర ప్రతులూ, తామ్రశిలా శాసనాదులూ, వీధినాటకములూ, యక్షగానములూ, నీతికథలూ, వ్యాఖ్యానములూ, పిల్లల కథలూ మున్నగువాటిని చూపి తమ వాదములోని సత్యతను పెక్కు విధముల రుజువు చేసినారు. ఇటీవల పరిష్కర్తలు

వాటిని తారుమారుచేసి పరిష్కరించి అచ్చొత్తించి భాషకు మహద్రోహము చేసినారు. నేటి వ్యావహారిక భాషను గ్రాంథిక భాషగా అంగీకరిస్తేనే కాని దేశమునకు సర్వవిధములా అభివృద్ధి చేకూరదు. ఎట్టి మహా భాషాపండితుడైనా సర్వవ్యవహారములనూ ఎన్నడూ గ్రాంథిక భాషలో చక్కబెట్టుకోలేడు. ప్రాచీనాంధ్రము అన్యభాషవలె అభ్యసించ వలసినదే కాని మాతృభాషవలె స్వయముగా మనలను వరింపదు. దానిలో భావము లుదయింపకుండా ఉండడమే ఇందుకు తార్కాణము. కాబట్టి శ్రీశ్రీ ప్రభుత్వమువారున్ను, ఆంధ్ర విశ్వ విద్యాలయమువారున్ను, ఆంధ్ర సాహిత్య పరిషత్తువారున్ను, ఆంధ్ర లోకమున్ను సత్యమును గ్రంహించి వ్యవహారిక భాషకు గ్రామ్యాప వాదమును తొలగించి ఆంధ్ర వాఙ్మయములో సముచితమైన స్థానమును దానికివ్వవలసినదని పంతులుగారి వాదముయొక్క సంగృహీతమైన సత్యస్వరూపము.

– నా మనవి –

క్రూరశాసనములు తలలెత్తినకొద్దీ నిరంకుశత్వము చెలరేగి దేశమును విప్లవసాగరములో ముంచివేస్తుంది. అట్లే గ్రాంథిక వాదులు భాషావిషయములో చేసే నిబంధనలున్నూ నిరంకుశత్వ మున్నూ భాషాప్రపంచమునకు విప్లవము తెచ్చిపెట్టుతున్నవి. నిమ్నగామిని అయిన భాషాస్రవంతికి సైకతసేతువు కట్టుటవల్ల ప్రయోజన మణుమాత్రమూ ఉండదు. ఆ గట్టు నిలువజాలదు. నిలిచినా పొంగి పొరలి జనపదమును ముంచివేస్తుంది. అనువగు తావులందు ఆనకట్టలు కట్టి కాలువలు తీసి జనపదమును నదీ మాతృకగా చేయడమే సరళసరణి.

నన్నయాదులు తమ కథావస్తువుకు అనువైన ఏ కొలది పదములనో స్వీకరించి కృతులు నిర్మించినారు. ఆపదజాలమునకే భాషా సామ్రాజ్యములో పట్టముగట్టి ఆచంద్రతారకముగా రాజోప చారములు చేస్తూ, మిగిలినపదములను వెలివేయుట అభ్యుదయ హేతువు కాదు. పామరు లుచ్చరింపజాలక తారుమారుచేసిన పదసంతతికి నియంతృత్వమిచ్చి మిన్నకుండుట కూడా మంచి పద్ధతి కాజాలదు.

తిక్కన నానాజాతివృత్తుల పనిముట్లకున్నూ ప్రాచీన నవీన భావములకున్నూ వాచకములగు పదములను సర్వవిధములా సేకరించి తన కృతులలో ఉపయోగించి తెలుగుభాషకు పరిపూర్ణతను కలిగించి కవిబ్రహ్మ బిరుదము పొందినాడు. అట్లే

ఆయా కాలములందు ఆయా నూతన వస్తువులకున్ను నూతన భావములకున్ను సంబంధించి పదములను శిష్యవ్యవహారము ననుసరించి సేకరించి భాషాసేవ చేయడము తెలుగువారి విధి. పూవులోని మకరందము నాస్వాధింపవలెను; పరియళము నాఘ్రాణింపవలెను; అంతేకాని రేకుల అందచందములకై తగవు లాడుట వృధాప్రయాసము.

శ్రీరామమూర్తిపంతులువారి వాదలక్ష్మికి "చెవగండములు" దాటినవి. ఆమె శైశవము వీడి ప్రౌఢయై, జగన్మోహినియై విబుధులకూ పామరులకూ భాషామృతము పంచిపెట్టుతూ ఉన్నది. తన హావభావవిలాసములతో సహృదయుల హృదయాలను చూరగొంటూ ఉన్నది.

పండిత ప్రకాండులూ, కవిచంద్రులూ కూడా ఆమెకు జోహారు లర్పిస్తున్నారు. పత్రికా ప్రపంచమూ వాఙ్మయ ప్రపంచము కూడా ఆమె కనుసన్నల మెలగుతున్నవి. పంతులుగారి వాదలక్ష్మికి దిగ్విజయము చేకూరినదని ఘంటాపథముగా చెప్పుతున్నాను. ఈ లౌకిక వైదిక విద్వత్పరిషత్తు సమక్షమున ఆమెను సర్వజనాంగీ కారముతో సింహాసనమున కూర్చుండబెట్టి సామ్రాజ్యపట్టభద్రను చేస్తున్నాను. ఓహోమో జయజయధ్వానములు! చారిత్రక చతురా ననులు శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు ముదిమిచే వణకు చేతులతో ఆమె శిరముపైని మంగళాక్షతలుంచి చిరాయువు గా దీవిస్తున్నారే! ఆమె ద్వాదశ రాజమండలము నునుదాసీనస్థానము నాక్రమించినదే! ప్రతిపక్షులు కన్ను లెఱ్ఱచేసినా, పండ్లు పటపట కొరికినా, పరుషవాక్కులతో ధూళిరేగించినా మరి ప్రయోజనము లేదు. గ్రహాయానానద్వైధీభావములకు కాలము గడచిపోయినది. సంధికింకా తరుణము మించలేదు. ఈ సంధి సత్రయాగమునకు అధ్వర్యవము చేసేవారెవరో తాము చూచుకొనవలెను. కాదేని కొలదికాలములో సమాశ్రయణమే కర్తవ్యమగును.

కనుక అన్యభాషల మ్యద ననుసరించి గ్రాంథిక వ్యావహారిక వాదులు ఒక విద్యాపీఠమున చేరి సమరసభావముతో మెలగి విప్రతిపత్తులు వీడి సర్వగమ్యమగు తోవ నిర్మించుట లెస్స అని విన్నవిస్తున్నాను. ఇదే నేన్పంచు మంగళహారతి!



# శ్రీరాముడు - రామాయణ రామణీయకము

శ్రీ రత్నాకరం బాలరాజు

భారతీయాత్మ స్వరూపమైన వేద ఇతిహాస పురాణోపనిషత్తుల సమ్యగ్దర్శన మూర్తిమంతం వర్తమాన కాలంలో శ్రీరత్నాకరంవారు. బౌద్ధదర్శనంలో వారికన్న తెలుగునాట ప్రామాణికులు మరొకరులేరు. వేదాంత, తత్త్వచింతనలలో పురాభారతీయ సంస్కృతి అధ్యయన అధ్యాపనలలో వారు సర్వశ్రేష్ఠులు. శ్రీ రత్నాకరం బాలరాజుగారి సీతారామాంజనేయసంవాద కావ్యసమాలోచనాత్మక అధ్యయనం నుంచి ఈ రచన స్వీకృతము. ఇది పాతికేళ్లనాటి రచన.

ధర్మవిగ్రహుడగు శ్రీరామచంద్రుని చారిత్రరూపమగు శ్రీమద్రమాయణమును, మధుమయ ఫణితులకు మార్గదర్శియగు వాల్మీకి మహర్షి రచించినాడు. ఏ భాషయు నీకావ్యభాషకంటె నతిశయ విశుద్ధము, పావనము, మనోరమము, సరళాతిసరళముగా నుండజాలదు.

'No language can be purer, none chaster, none more beautiful and at the same time simpler than the language in which the great poet has depicted the life of Rama' (Complete works of Swami Vivekananda-Vol iii=P. 255)

శ్రీమద్రామాయణముకాక, మరియే ఇతర కావ్యమును భారతజాతికి శ్రీరామచంద్రునివంటి మహాత్వ పరిపూర్ణమగు మూర్తిమత్వమును ప్రసాదించలేదు. యుగములెన్ని గడిచినను, ఆ మహనీయమూర్తిమత్వము సామాజిక జీవనమునకును, వైయక్తిక ప్రవర్తనకును, సదాచారమును, శీలసంపదను ఉద్దీపింపజేయుచునే యున్నది. శ్రీరామనామము విన్న మాత్రముననే జనులకు శరీరము

రోమాంచితమై ఆనందబాష్పములు కల్గుచున్నవి.

తమ్ముడగు లవునకును, లక్ష్మణ తనయుడగు చంద్రకేతువునకును పోరుగల్గుచున్నదనివిని, కోపోద్రేకముతోవచ్చి కుశుడు, అచటనేయున్న శ్రీరామదేవుని గాంచినాడు. ఆ మహనీయుడు తన తండ్రియేయని కుశుడెరుగడు. కాని ఆ పావన మనోజ్ఞ రూపమును గాంచినంతనే కుశుని మానసికోద్వేగములన్నియు నంతరించి హృదయమున పరమ ప్రశాంతి భాసించినది. అంతకుమున్ను లవునకును అట్టి అనుభూతియే కల్గినది.

స్నేహ (భక్తి) పూర్వకములైన ధ్యానములకు శ్రీరాముడానంద రూపము. భక్తి ధ్యానము లన్యత్ర చేసినచో విషయ దోషము వలన అవి దుఃఖమునే కల్గింపవచ్చును. శ్రీరామునియందు చేయబడిన భక్తిధ్యానాదులు విషయ సౌష్ఠవమువలన ఆహ్లాదమునే కల్గింపగలవు. లోకోత్తర ధర్మమునకు శ్రీరాముడు మనోజ్ఞమైనమూర్తి.

"ఆ శ్వాస ఇవ భక్తీ నా మేక మాయతనం మహత్॥"

"ప్రకృష్టస్యేవ ధర్మస్యప్రసాదోమూర్తి సుందరః!" (ఉ. రా.చ. 6-20 -10)

ఇది లవుని యనుభూతి. శ్రీరామదర్శనమున కుశుడు శాంతితోపాటు, విస్మయమును బొందినాడు.

"అహో! ప్రాసాదికం రూపమనుభావశ్చ పావనః!

స్థానే రామాయణ కవీర్దేవీం వాచమవీవృథత్॥ (ఉ.రా.చ. -20)

రూపము ప్రసాదగుణబంధురము; ప్రభావము పావనము; రామాయణ ప్రణేతయైన వాల్మీకి మహర్షి వాగ్దేవికి సార్థక్యమును సమకూర్చినాడు. రామాయణమును ధారణమొనరించిన కుశలవులకు శ్రీరామదర్శనము, లక్షణములను లక్ష్యముతో సమన్వయింపజేసి, పరమాహ్లాదమును, విస్మయమును గలిగించినది.

నేటికాలమున సైతము వివేకవంతులము, హేతువాద నిష్ణాతులము నని విర్రవీగుచుండువారును తమ వార్ధక్యమున జీవన చరమ సంధ్యలో అనుపమాన ధర్మసుందరుడైన శ్రీరామునకు ను రామాయణమునకును వశులై జీవనము గడుపుచు శాంతిని బొందుచున్నారు.

ఉత్తర భారతమున అన్యమతమునకు జెందిన కబీరు వంటివారిని

శ్రీరాముడాకర్షించినాడు. దక్షిణాపథమున పూర్వము మధురాంతకము నకు 'కలెక్టర్'గా నుండినయొక ఆంగ్లేయుడు శ్రీరామదర్శనమును బొందినాడు. తుపాను చెలరేగిన సందర్భమున ఒక చెరువుకట్ట తెగిపోకుండునట్లు ధనుర్బాణధారియై దానిని రక్షించుచున్నట్లు శ్రీరాముడాతనికి దర్శనమొసగెను.

క్రీ.శ. మొదటి శతాబ్దము నుండి కాంబోడియా నుండి జావావరకు శ్రీరామ ప్రభావము వ్యాపించినది. వాల్మీకికి సైతము ఆలయములు వెలసినవి. దేవాలయములలో రామాయణ పారాయణము జరిగినది. ఇండోనేషియా ద్వీపములందు మతాంతరులగు మహమ్మదీయులు సైతము నేటికిని రామనాటకముల్లనాడించి ఆనందించుచున్నారు. దక్షిణ భారతము "చక్రవర్తిత్తిరుమహన్" అని ప్రఖ్యాత యశస్వియగు యువరాజుగా నారాధించినది.

రాజ్య పరిత్యాగ సందర్భముననను, శ్రీరాముని వదనశోభయందే మార్పునురాలేదు. అనంత భోగాస్పదమైన వసుంధరను త్యజించు నపుడును, వనవాసమునకు వెళ్ళునపుడును ఆ మహాత్ముని చిత్తము శాంతమై, నిర్వికారమై యుండెను.

'నచాస్య మహతీం లక్ష్మీం రాజ్యనాశోపకర్షతి!
లోక కాంతస్య కాంతత్వాచ్ఛీతరశ్మేరివ క్షపా!!
న వనం గంతు కామస్య త్యజతశ్చదే వసుంధరామ్!
సర్వలోకాధిగస్యేవలక్ష్యతే చిత్తవిక్రియా (వా.రా. II-19-32,33)
'దధతో మంగళక్షౌమే వసానస్య చ వల్కలే!
దదృశుర్విస్మితా స్తస్య ముఖరాగం సమం జా నాః(ర.వం. 12-8)

దీనికి కారణము, వికృతిరహితమగు పరమజ్ఞానమును నాతడు వసిష్ఠ మహర్షిని సేవించి పొందియుండెను. తరువాత ప్రాపంచిక జీవితమును, దాని సర్వవిధ కర్తవ్యములను, విశాలదృష్టితో స్వీకరించెను. (యో.వా.) చిత్తప్రసాదకరమగు శాంతి శాస్త్రమును, ఆత్మవిద్యను పరిపూర్ణముగా నాత డభ్యసించెను. ఆత్మజ్ఞానము వలన మానవుడు ప్రాపంచిక విషయముల సారహీనతను, సంతృప్తిని కలిగించుట కసమర్థగువాని నిజస్వరూపమును, నెరుగుట మాత్రమేకాక మానవ పరిణామగతియందు సహాయకములగు పదార్థ జాతములకు గల యథార్థ స్థానమును దెలిసికొన గలదు.

(Sri Ramachandra the Ideal King: AnneBesant)

శ్లో॥ నోదేతి నాస్తమాయాతి సుఖదుఃఖేముఖప్రభా!

యధాప్రాప్త స్థితిర్యస్య న జీవన్ముక్త ఉచ్యతే!! (సర్వవేదాంత సిద్ధాంత సారసంగ్రహము–968)

సుఖదుఃఖములయందు సముడై యథాప్రాప్తమగువ్యవహారము నిర్వహించు మహాత్ముడు, జీవన్ముక్తుడని శాస్త్రములు చెప్పుచున్నవి. శ్రీరాముడు జీవన్ముక్తుడనుట విశదము.

ఉత్తర భారతమున శ్రీరాముడు 'రాజారాముడు'గా జనహృదయ ముల నేలుదాచున్నాడు. శ్రీరాముని భావించుచు శ్రీరామరాజ్యమున నుండు ప్రజలు, పరస్పర హింసాదూరులై, ప్రేమమూర్తులై యుండగలరు. అట్లుండిరను వాల్మీకి వాక్యమిందుకు ప్రమాణము.

"సర్వం ముదిత మేవాసీత్ సర్వో ధర్మపరోభవత్!
రామమేవానుపశ్యంతో నాభ్యహింసన్ పరస్పరమ్
రామో రామో రామ ఇతి ప్రజానామభవన్ కథాః
రామభూతం జగదభూద్రామేరాజ్యం ప్రశాసతి!!
ఆసన్ వర్షసహస్రాణి తథాపుత్రసహస్రిణః!
నిరామయా విశోకాచ్ఛ రామే రాజ్యం ప్రశాసతి!!
నిత్యపుష్పా నిత్యఫలాస్తరవః స్కంధవిస్తృతాః
కాలే వర్షీచ పర్జన్యః, సుఖస్పర్శశ్చ మారుతః!!
ఆసన్ ప్రజా ధర్మరతా రామే శాసతి నానృతాః!
సర్వే లక్షణ సంపన్నాః సర్వే ధర్మపరాయణాః!!(వా.రా. 6)

శ్రీరాముని కథలే ప్రజలకు ఇష్టకథలైనవి. పృథివి సశ్యశాలిని. వృక్షములు శాఖోపశాఖలుగా పెరిగి, నిత్యము ఫలపుష్పములతో నిండి యుండినవి. వర్షములు సకాలమున గురిసినవి; గాలులు సుఖ స్పర్శముగా వీచినవి. అసత్యపరులును, అధర్మాత్ములును లేరు. అందరు లక్షణ సంపన్నులు. నిరామయులు, సంతోషవంతులు, ధర్మపరాయణులు. కృతయుగము మరల వెలసినది. రామరాజ్యము నీవిధముగా వాల్మీకి

చూచి, వర్ణించినాడు. జాతిపితయగు మహాత్ముడు గాంధీ, కలలుగాంచిన దీ రామరాజ్యమునేకదా! అది నెరవేరినదా? యని ప్రతి భారతీయుదును ఆలోచించి తత్సిద్ధికి నిరంతరము కృషిచేయవలయును.

సంస్కృత నాటకములలో శ్రీరామకథాత్మకములగునవియే అధికము. శ్రీరామునివంటి సమస్త కల్యాణ గుణాభిరాముడైన నాయకుడు, జగమున నన్యుడెవడును లభింపమిచేత, మహాకవులకు శ్రీరాముని వర్ణింపకున్నచో నాత్మతృప్తి సిద్ధింపదని అనర్ఘ రాఘవ నాటక కర్త, మహాకవి మురారి యన్నాడు.

'అయంచ ప్రాచేతసీయం కథావస్తు బహుభిః ప్రణీతమపి,
ప్రయుంజానో నాపరాధ్యతి శ్రోత్రియ పుత్రః, పశ్య.
యది క్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్యచరితం
గుణైరేతావద్భిర్జగతి పునరన్యోజయతికః!
స్వమాత్మానం తత్తద్గుణ గరిమ గంభీరమధుర –
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యంతి కవయః!!'

తమ సూక్తులకు పాత్రుడు శ్రీరాముడొక్కడే యగుట వలన, కవులందరాయననే వర్ణింతురు. అది కవుల దోషముగాదు. గుణగణముల అవగుణమే. శ్రీరాముడు సమస్త గుణధాముడు. సుందరములైనవానియందే జనుల మనస్సు ముదము బొందగలదు. తన ప్రసన్నరాఘవ నాటకమున మహాకవి జయదేవుడిట్లన్నాడు.

'స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం!
కవీనాం కో దోషః సతుగుణగణానామవగుణాః!!'
'యదేతైర్నిశ్శేషై రపర గుణలుబ్ధైరివజగ
త్యసావేకశ్చక్రే సకలగుణ సంవాసవ సతిః'
"చంద్రేచ, రామచంద్రేచ, కాంతానాం చ దృగంచలే!
నీలోత్పల సుహృత్కాంతౌ కస్య నోమోదతేమనః॥"

అష్టాదశ పురాణములన్నియు భారతముతోపాటు శ్రీరామకథను చెప్పుచున్నవి. ఉత్తర భారతమున శ్రీరామారాధనను, రామా నందీయులు (13వ శతాబ్దము) అధికముగా పెంపొందించినారు. రామానందుడు, తులసీదాసు, కబీరు,మొదలగు మహాత్ములు,

వాఙ్మయ శోభకు మెరుగులుదిద్ది, కృతులు సంతరించినారు. వీరికి అధ్యాత్మ రామాయణము ముఖ్య ప్రమాణమని చెప్పవచ్చును. శ్రీరామకథారమ్యములగు ఆనంద, అద్భుతాది రామాయణములు ప్రసిద్ధములు. వాల్మీకియే శతకోటి ప్రవిస్తరముగా రామాయణమును రచించెననియు, భారతీయుల విశ్వాసము. అగస్త్య సంహితాదులు శ్రీరామభక్త్యారాధనల నుపదేశించును. ప్రసిద్ధమగు 'ఆపదుద్ధారక స్తోత్ర' మగస్త్యసంహితలోనిదే. బృహద్ధర్మ పురాణమును శ్రీరామారాధనను విస్తరించి చెప్పును. ఆధ్యాత్మ రామాయణమందలి శ్రీరామహృదయము శ్రీసీతారామాంజనేయ సంవాద కావ్యమునకు మూలము. అందలిదే శ్రీరామగీత (అ.రా. 4-5వ సర్గ.) శ్రీరామరహస్యోప నిషత్తునందును నిర్దేశింపబడినది. ఉపనిషత్తు, శ్రీరామ సహస్ర నామమును సైతము నిర్దేశించును. శ్రీరామ సంబంధములగు ఉపనిషత్తులు మూడు, అష్టోత్తర శతోపనిషత్తులయందున్నవి. అవి ముక్తిక, రామరహస్య, రామతాపిన్యుపనిషత్తులు (పూర్వోత్తరములు) 'వాఘేల' (బుందేల్ఖండ్) పాలకుడు, విశ్వనాధ సింహుడను రాజు రామభక్త్యారాధనల ప్రబోధములందు, శ్రీకృష్ణభక్తి ప్రబోధములందు ప్రసిద్ధులైన బోపదేవాదులను, శ్రీచైతన్య మహాప్రభు శిష్యులు రూపగోస్వామ్యాదులను బోలును. బృహత్సంహితయందు వరాహమిహిరుడు, శ్రీరామ విగ్రహముల గురించి చెప్పును.

శ్రీరామసంబంధియగు వాఙ్మయము దక్షిణా పథ భాషలందును నధికమే. తమిళమున కంబ రామాయణము ప్రసిద్ధము. జైనాదులు సైతము శ్రీరామగుణాకర్షితులై కావ్యముల రచించుకొన్నారు. కన్నడ భాషయందు అభినవ పంపడను జైనకవి 'రామచంద్ర చరిత పురాణము'ను రచించెను. వానరులిందు కోతులుగా కాక కపిధ్వజులగు జనులుగా వర్ణింపబడినారు. హనుమంతుడు హనువరద్వీప ప్రభువట. కన్నడమున వాల్మీకిననుసరించి కుమార వాల్మీకి యను కవి, తరువాతి కాలమున కావ్యమును రచించెను. విమలుడను జైన కవియు 'ప ఉమచరియ'మను పేర క్రీ.శ. మూడవ శతాబ్దమున శ్రీరామకథను మహారాష్ట్రి ప్రాకృతమున రచించెనని కె.యం.మున్షీ మహాశయుడు పేర్కొనును. కన్నడమున నేడు కె.వి.పుట్టప్ప రామాయణ దర్శనము ప్రసిద్ధము. కృత్తివాసుడను కవి, వంగ భాషయందును, అనంతకందలియను కవి, అస్సామీ భాషయందును, ప్రేమానందుడను కవి గుజరాతీ భాషయందును

రామాయణములు రచించినారు. వాల్మీకి రామాయణమును స్వకీయమొనరించుకొనని భారతీయ భాష యొక్కటియులేదు. నేడు రష్యా భాషయందును రామాయణము రచింపబడినది. ఆంగ్ల భాషయందు గ్రిఫిత్ మహాశయుడు మొదలగువారు రచించినారు. రమేష్‌చంద్ర దత్తు ఆంగ్ల రామాయణ, భారతములు (సంగ్రహములు) ప్రసిద్ధములు. శ్రీరాముని రూపగుణసంపదయొక్క ప్రబలాకర్షణమున కింతకంటె నిదర్శన మనవసరము.

ఆంధ్ర వాఙ్మయమున గోన బుద్ధారెడ్డి, భాస్కరుడు మొదలుకొని నేటి కవి సమ్రాట్టు శ్రీవిశ్వనాథ సత్యనారాయణ వరకు రామకవు లెందరో గలరు. వెనకటి శతాబ్ద్యంతమునను, ఈ శతాబ్ది ప్రారంభముననుగల శ్రీరామకవులలో గోపీనాథము వేంకటకవి, ఆంధ్ర వాల్మీకి శ్రీమాన్ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసస్వాములు) శ్రీజనమంచి శేషాద్రిశర్మ, స్మరణీయులు. త్యాగరాజస్వామి కృతులు, భద్రాద్రి రామదాస కీర్తనములు రామభక్తి నిర్భరములు.

'మానక కర్మభూమి పయిమానుష వేషముతో హితాహిత
జ్ఞానమెరుంగు బ్రాహ్మణుడు, చారుకవిత్వమునేర్చి, జానకీ
జానికథల్ రచింపక, యసత్కథలెన్ని రచించెనేనియున్
వాని కవిత్వమేమిటికి, వాని కవిత్వ మహత్వమేటికిన్
'శ్రీకర రామమంత్ర జపసిద్ధి బ్రసిద్ధి వహించి వెన్క వా
ల్మీకి రఘుప్రవీరు కథలే రచియించి గదా చెలంగె ము
ల్లోకములందు నెల్లమునులుం గొనియాడగ నట్టి దౌట బు
ణ్యాకరమైన రామకథ హైన్యము మాన్పదె యెట్టి వారికిన్ '

(ఉ.రా. పీఠిక 15,16)

అను ఉత్తర రామాయణ కవి కంకంటి పాపరాజుతో రామకవులందరు నేకీభవింతురు.

వ్రాసిన రామచంద్ర కథ వ్రాసితి నంచనిపించుకో వృథా
యాసముగాక కట్టు కథలైహికమా పరమా యటంచు దా
జేసిన తండ్రి యానతియు, జీవుని వేదన రెండు నేకమై
నా సకలోహ వైభవ సనాథము నాథకథన్ రచించెదన్' అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణకవి, శ్రీరామాయణ కల్పవృక్ష కావ్యమున జెప్పియున్నారు.

శ్రీరాముని రూపము సైతము మధురాతి మధురము. సచ్చిదానందములు సాక్షాత్కరించినచో కల్గు మాధుర్యానుభవము మాటలకందనిది కదా! శ్రీరాముని దివ్యత్వమును, భగవదవతార తత్త్వమును, వాల్మీకి రామాయణము కొన్నిచోట్ల ప్రకాశముగను, మరి కొన్నిచోట్ల నిగూఢముగను చెప్పును. రామశబ్దము పరబ్రహ్మ వాచకముగా ఉపనిషత్ప్రసిద్ధము.

'రమంతే యోగినో ౽ నంతే సత్యానందే చిదాత్మని'

ఇతి రామపదేనా సౌ పరం బ్రహ్మాభిధీయతే!! (రామపూర్వతాపిన్యుపనిషత్తు 1-6) సీతారామాంజనేయ సంవాద కావ్యము (1-47-48) రామశబ్దము 'ఆది పంబ్రహ్మ ప్రతిపాదకము' అని చెప్పును.

శ్రీరామగుణసంపదలో మొదట భాసించునది రూపము. వాల్మీకి రామ శబ్దార్థమును 'రామో రమయతాంవరః' అని వివరించినాడు. మనోరమ రూప సౌందర్యము వలన రాముడని వాల్మీకి వాక్యమునే కాళిదాసు మరింత విశదముగా వ్యాఖ్యానించినాడు.

'రామ ఇత్యభిరామేణ వపుషా తస్య చోదితః'

నామధేయం గురుశ్చక్రే జగత్ప్రథమ మంగళమ్!! (రఘు.వం.9-68)

రూపౌదార్యగుణములవలన మనుజుల దృష్టిని చిత్తమును మిక్కిలి ప్రియదర్శనుడు, చంద్రబింబ సదృశ సుందర వదనుడునైన శ్రీరాముడాకర్షించువాడు.

'చంద్రకాంతాననం రామ మతీవ ప్రియదర్శనమ్!

రూపౌదార్య గుణైఃపుంసాం దృష్టి చిత్తాపహారిణమ్'!! (వా.రా.11-3-29)

శ్రీరామునిచే చూడబడనివాడును, శ్రీరాముని చూడనివాడును శాపగ్రస్తుడు. అతని యాత్మయే యాతని గర్హించును.

'యశ్చరామం నపశ్యేత్తు యం చ రామోనపశ్యతి!

నిందితః సవసే ల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే" (వా.రా.11-17, 14, 15)

రామ యను మధుర నామమును - రామేతిమధురాంవాణీం - పిలుచుట తలిదండ్రులగు కౌసల్యాదశరథులకు మాత్రమేకాక విశ్వామిత్రాది మహర్షులకు సైతము, ఎంతో ఆనందకరము. (వా.రా. 1-22) రాముడు మధురభాషి, సర్వజనసముడు, సులభుడు, సర్వప్రాణి హితరతుడు, ధర్మాత్ముడు, సత్యసంధుడు, పవిత్రుడు అని అనేక

విధముల వాల్మీకి మహర్షి శ్రీరామగుణగాన మొనరించినాడు.

'బుద్ధిమాన్ మధురాభిషీపూర్వభాషీ ప్రియంవదః'(11-1.10)

'మృదుపూర్వంతు భాషతే'(11-1.10)

'ఉచ్యమానోపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే' (I-1-10)

'దీనానుకంపీ'(11-1-15) 'శుచిర్వశ్య సమాధిమాన్'(1-1-12)

'పౌరాన్ స్వజనవన్నిత్యం కుశలం పరిపృచ్ఛతి'(11-2-38)

'రామః సత్పురుషోలోకే, సత్యధర్మపరాయణః'

సాక్షాద్రామా ద్వినిర్వృత్తో ధర్మశ్చాపిశ్రియాసహః(11-2-29)

'న రామః పరదారాంశ్చ చక్షుర్భ్యామపిశ్యతి (11-72-49)

'వ్యసనేషుమనుష్యాణాం భృశం భవతి దుఃఖితః'

ఉత్స వేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి' (11-2-40, 41)

లోకారాధనకు సమస్తమును త్యజించిన ఆ మహనీయుని జీవితము, ధర్మముయొక్క కఠోరత్వమును దెలుపుచున్నది. పదవుల కోసము నిరంతర స్వార్థదూషితులైనవారు శ్రీరాముని హృదయమును, జన్మ కర్మముల రహస్యమును నెట్లెరుగగలరు? అనుసరింపగలరు? వారాంగనా సదృశములైన క్షుద్రరాజకీయములే జీవిత లక్ష్యములుగా గొని పరమార్థమును మరచిన నేటి ప్రజానాయకుల నుండి భారతావని యెపుడు విముక్తమగునో?రామరాజ్యమెపుడు సిద్ధించునో!

'స్నేహం దయాంచ సౌఖ్యంచ యదివా జానకీమపి'

ఆరాధనాయ లోకస్య ముంచతోనాస్తిమే వ్యధా" (ఉ.రా.చ 1-12)

ధర్మానుష్ఠానము నిజముగా అసిధారావ్రతము.

'సతాంకేనోద్దిష్టం విషమమ సిధారావ్రతమ్'

'ఈ అసిధారావ్రత చర్య యెవ్వడు మహార్య శ్రేణికిందెల్పెనో?'

స్వచారిత్రము వలన ధర్మమార్గమును, స్వనామము వలన జ్ఞాన మార్గమును, శ్రీరామ ప్రభువుపదేశించును. శ్రీరామ ధ్యానము వలన వైరాగ్య సిద్ధియు, పూజనము వలన సమస్తైశ్వర్యములును సిద్ధించునని శ్రుతులు చెప్పుచున్నవి.

'ధర్మమార్గం చరిత్రేణ జ్ఞాన మార్గం చ నామతః!

తథాధ్యానేన వైరాగ్య మైశ్వర్యం స్వస్య పూజనాత్" (రా.తా. ఉ.1-4-5)

శ్రీకృష్ణలీలా మాధుర్య రసపానమత్తుడగు వ్యాసర్షి తన భాగవత ప్రబంధమందును, భారతమందును శ్రీరామ చారిత్రమును హృదయంగమముగా వర్ణించినాడు. భాగవతమున శ్రీరామునిట్లు మహర్షి స్తుతించును.

'త్యక్త్వా సుదుస్త్య జ సురేప్సిత రాజ్యలక్ష్మీం!

ధర్మిష్ఠ ఆర్య వచ సా యదగాదరణ్యం

మాయామృగం దయిత యేప్సిత మన్వధావద్

వందే మహాపురుషతే చరణారవిందమ్' (భాగ ll-5-34)

ధర్మ విగ్రహుడైన శ్రీరాముడు మర్యాదా పురుషోత్తముడని స్తుతింపబడినాడు. శరణుజొచ్చినవారి కభయ మొసగుటలో శ్రీరామదేవునకు సాటి మరెవ్వరును లేరు. ఒక్కసారి నీవాడనని చెప్పినను శ్రీరాముడభయమొసగి రక్షించును. అది ఆయనకు వ్రతము.

'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతీ చయాచతే!

అభయం సర్వభూతే భ్యో తదామ్యేత ద్వతం మమ!! (వా.రా. 6-18-, 33, 34)

వాల్మీకి రామాయణముపై ప్రపత్తి - శరణాగతి రహస్యార్థము లతోగూడిన సంప్రదాయము - శ్రీరామానుజాచార్యులకు ఆధ్యాత్మిక 'వారసత్వము'గా సిద్ధించినది. శ్రీమద్రామాయణము శరణాగతి కావ్యముగా శ్రీరామానుజానుయాయులకు పరమ ప్రమాణ గ్రంథము.

'తద్వీక్షితః సన్ కమలా నివాసం ప్రపద్య తత్పూర్ణవరాద్యతీశః

రామాయణం తద్వివిధైర్మహార్థైః సంవత్సరం తత్రవసన్న గృహ్ణాత్" (యతి రాజవైభవము)

యతిరాజు (శ్రీరామానుజుడు) శ్రీనివాసునకు శరణాగతుడై ఒక సంవత్సరము వేంకటాద్రియందు వసించి శ్రీశైలపూర్ణుని కరుణకు పాత్రుడై మహాత్ముడగు నాతని వలన శ్రీమద్రామాయణ రహస్యార్థములను గ్రహించెను.

'నమ ప్రసన్నఃసకృదేవ నాథ

తవాహ మస్మీతి చ యాచమానః

తవాను కంప్యః స్మరతః ప్రతిజ్ఞాం
మదేకవర్జం కిమిదం వ్రతంతే' (స్తో.ర. 64)

ఓ నాథా! ఒక్కసారి నీవాడనని నిన్ను శరణుజొచ్చినవానిని, నీ ప్రతిజ్ఞను స్మరించి, కృపతో జూచుచున్నావు. నీ శరణాగత రక్షణ ప్రతిజ్ఞా వ్రతము నన్నొక్కని వదలివేసినదా? అని మహాత్ముడైన యామునాచార్యుడు శ్రీరాముని స్తుతించినాడు.

వేదవేద్యుడగు, పరమపురుషుడు శ్రీరాముడుగా నవతరింపగా వేదము వాల్మీకి మహర్షి వలన రామాయణ స్వరూపమున నవతరించినదని ఈ పురాతన శ్లోకము చెప్పుచున్నది.

"వేద వేద్యే పరిపుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"॥





# తిక్కన - కన్నడ భారతాలు

శ్రీ గడియారం రామకృష్ణశర్మ

తెలుగులో కవిత్రయము మహాభారతరచన పూర్తిచేయటకు ముందే పొరుగున ఉన్న కన్నడములో పంప మహాకవి 10వ శతాబ్దంలో "విక్రమార్జున విజయ" మను పేరుతో సమస్త భారతమును రచించెను. 15వ శతాబ్ధివాడైన కుమారవ్యాసుడు "భారత కథామంజరి" పేరుతో 10 పర్వముల మహాభారతమును రచించినాడు. ఆ తరువాత 16వ శతాబ్దిలో శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ఉన్న తిమ్మణకవి "కృష్ణరాయ భారత"మను పేరుతో 8 పర్వాల భారత శేషాన్ని పూరించినాడు. తనకు పూర్వుడైన పంప కవి వ్రాసిన 'ఆదిపురాణ' - 'సమస్తభారతా'లను తిక్కన బాగా చదివి తన భారత భాగాలను వ్రాసినాడు. కుమార వ్యాస, తిమ్మణలు తిక్కన తరువాత ఉన్నవారు. తిక్కన భారతాన్ని చదివి వ్రాసినారు. ఈ ఇద్దరు కన్నడ కవులూ విజయనగర రాజుల కాలములో ఉన్నవాళ్ళు కాబట్టి తిక్కన భారతాన్ని తప్పక చదివినారని గ్రహించవచ్చు. కన్నడ భారతకర్తలు – తిక్కన పరస్పరము ఎట్లా అనుసరించినారో మూలాన్ని ఎట్లా మలిచారో తెలపడమే ఈ రచనోద్దేశము.

## పంపకవి - తిక్కన

పంపకవి 10వ శతాబ్దిలో ఉన్న మహాకవి. ఆయన పూర్వులు వేంగీ మండలంలోని వంగీ పురం నుంచే కన్నడ దేశానికి వలస పోయినవాళ్ళు. వేంగి మండలము ఆనాడు కృష్ణా గోదావరుల నడుమ ఇటు తూర్పు కోస్తా – అటు బిచ్చిసాయిరం (కరీంనగర్ జిల్లా) గుంటూరు మండలం వరకూ వ్యాపించిన దేశం. పంపని పూర్వుల నివాసమయిన 'వంగిపఱ్ఱు' ఇప్పుడు నర్సారావుపేట తాలూకాలో ఉండే వంగీపురమే. ఆయన తండ్రి జైన ధర్మాన్ని స్వీకరించిన తరువాత ఆ పరిసరాల అగ్రహారాలలో అగ్రగణ్యులుగా

ఉండిన ఈ వంశీయుల గౌరవం తగ్గి కన్నడ దేశంలోని 'వనవాసి' ప్రాంతానికి వలస పోయినారు. పంపకవి క్రీ.శ. 902 దుందుభి సంవత్సరంలో పుట్టినాడు. అప్పుడా ప్రాంతాలను రాష్ట్రకూట చక్రవర్తులు పాలిస్తున్నారు. వాళ్ళకు సామంతులు బంధువులు అయిన వేములవాడ చాళుక్యులతో పంపకవికి సాన్నిహిత్యం కలిగింది. ఆ వంశంలోని రెండవ అరికేసరితో ఏర్పడిన స్నేహితం వల్ల పంపడు తెలంగాణము లోని వేములవాడకు తరలివచ్చినాడు. అక్కడ ఉండి కన్నడంలో ఆదికావ్యాలైన 'ఆదిపురాణ – విక్రమార్జున విజయా'లను రచించినాడు. అందుకు ఫలముగా అరికేసరి పంపకవికి ధర్మపురి అగ్రహారమును ధారపోయగా అందు చిరకాలం ఉండి చివరి వయసులో బోధనులోని తన గురువువల్ల సన్యాసం తీసుకొని అక్కడనే సమాధి అయినాడు.

వేద వ్యాసుడు వ్రాసిన మహాభారతం లక్ష శ్లోకాల మహాగ్రంథం. పంపడు దాన్ని సంక్షేపించినాడు. అందువల్ల పద్ధెనిమిది పర్వాల మహాభారతం పంపని చేతిలో పద్నాలుగాశ్వాసాల కావ్యమైంది. కన్నడ సాహిత్య ప్రపంచంలో ఇది అద్వితీయ తేజోరాశిగా వెలుగుతున్నది.

తిక్కన నెల్లూరు నుండి రాజకార్యానికై ఓరుగంటికి వచ్చినపుడు స్థానికులైన జైన కవుల సాహచర్యంతో పంప కవి రెండు కావ్యాలనూ చదివినట్లు తెలుస్తున్నది. ఇంతవరకూ పంప భారతాన్ని నన్నయభట్టారకుడు, నారాయణభట్టు సాయంతో చదివి తన భారత రచన చేసినాడని తెలుసుకున్నాం. తిక్కన పంప భారతాన్నేకాక అతని ఆదిపురాణాన్ని కూడా బాగా చదివినాడని తెలుస్తున్నది. తిక్కన ఆది పురాణాన్ని అనుసరించిన ఒకటి రెండు ఉదాహరణలు గమనించండి.

"కరి కరశీకర, మదజల,
తురంగ లాలాంబు సేకదిం దురాదురది
ర్ధరజం నరేంద్ర చామర
మరుదభి హతియం తెరళ ధూళ్దత్తా, గళ్, (ఆదిపురాణం)

(రాజులకు వేసే చామరాల వల్ల పైకి లేచిన రణస్థలములోని ధూళి ఏనుగు తొండాల తుంపురులచేత, మదజలంచేత, గుఱ్ఱాల నోటి నురుగుల చేత, అణిగి పోతున్నది)

యుద్ధానికి వెళ్ళేరథికునికి సారధి దొరకడమే కష్టమైతే, చామరాలు వేసేవాళ్ళెవరు? ఇంతకూ యుద్ధభూమిలో చామరాలు వేయించుకోవడమా? ఇది అసంభవమూ, అనౌచిత్యమూ

దీనికి తిక్కన అనుసరణ

కం॥ కరికరశీకర తురగో
త్కర లాలాజాల రక్తధారాపటలీ
పరిషిక్తంబై సంగర
ధరణీ రజమడగె నద్భుతం బెసలారన్॥

పంప కవి పదాలను భావాన్నీ గ్రహించి తిక్కన యుద్ధభూమిలోని ధూళి అణగడానికి, ఏనుగు తొండపు జల్లులనూ గుఱ్ఱాల లాలాజలంతో బాటు క్రొత్తగా రక్తధారలను గ్రహించి మదజలాన్నీ నరేంద్ర చామర మరుదభిహతినీ వదలిపెట్టి ఔచిత్యవంతం చేసినాడు. ఇంకొక పద్యం చూడండి.

ఆదిపురాణములోనిదే ఈ పద్యమూ

"తరళ తరంగ తురంగం,
గిరి మకర కరీంద్రం, అఖిల శఫర పదాత్యు
త్కరం, ఉగ్రగ్రాహరథం,
భరతం గిత్తుదు పయోధి బళవిళసనమం॥

అన్నదమ్ములైన భరతుడు, – బాహుబలి యుద్ధం చేసినప్పుడు సముద్రుడు భరతునకు సమకూర్చిన సైన్యవర్ణన ఇది. ఆ సైన్యంలో చంచల తరంగాలే తురంగాలు, కొండలూ తిమింగలాలే కరులు, అన్నిరకాల చేపలే, పదాతులు, మొసళ్ళేరథాలు.

తిక్కన అనుసరణ

కం॥ అరదములు దీవు, లున్నత
కరులు గిరులు, హరులు వీచికలు, నాసుభటో
త్కరముగ్ర సత్వములుగా
శరనిధి గతి పాండు పుత్ర సైన్యం బొప్పెన్॥

పంపకవి సముద్రాన్ని చతురంగ బలాలతో పోల్చగా తిక్కన క్రమమును మార్చి

సైన్యమును సముద్రముతో పోల్చినాడు. తిక్కన సైన్యము రథాలనే దీవులతో, ఏనుగులనే కొండలతో, గుఱ్ఱాలనే అలలతో, కాల్బలమనే తిమి తిమింగలాలతో సముద్రంవలే ఒప్పిందట. ఈ మార్పు సరసంగా ఉన్నది. పంపని ఆదిపురాణమును తిక్కన కవి చదివినాడనడానికి ఈ ఉదాహరణలు చాలు.

ఇంక పంప భారతాన్ని అనుసరించిన విధం తెలుసుకుందాం.

శ్రీకృష్ణుడు రాయబారానికై హస్తినాపురానికి పోయినపుడు పంపకవి భీముణ్ణి ఈ విధంగా పొగడించినాడు.

“బక కిమ్మీర జటాసురోద్ధత జరాసంధర్కళం సందకీ
చకరం నూర్వరుమం పడల్వడిసి దీ త్వచ్చండ దోర్దండ ము
గ్రకురుక్ష్మాప మహీరుహ ప్రకరమం, మత్తేభ విక్రీడిత
క్కె కరం పోల్వెగెవందు భీమరణదోళ్ నుర్గాడదేం పోకుమే॥ (9–ఆశ్వాసం)

తిక్కన అనుసరణ

“బక విధ్వంసి, జటాసురాంతకు, హిడింబాప్రాణహారీణు, కీ
చక నిర్మూలన కేళిలోలు, సమరోత్సాహైక శీలప్రవ
ర్తకు, నాగాయుత సామ్యకీర్తిత బలోదగ్రుం, ప్రతివ్యూహదా
హకు, భీముం గొనివచ్చు ధర్మజుడు బాహాటోపముం జూపగన్॥ (ఉద్యోగపర్వం)

ఈ ఇద్దరు కవులూ చేసిన భీముని వర్ణనల్లో చాలా భేదమున్నది. పంపని భీముడు ‘బకాసుర, జటాసుర, జరాసంధ కీచక శతాలను చంపినవాడు. ప్రచండమైన భుజబలం గలవాడు. అందుకే కౌరవులు అనే వృక్షాలను చెండినవాడు. ఆ భీముడు యుద్ధంలో శత్రు సైన్యాలను నుగ్గాడక ఉంటాడా” అని కృష్ణుడంటాడు. తిక్కన భీముని వర్ణించిన తీరే ప్రత్యేకము. భీముని శత్రుసంహార ఘట్టాలను ఒకదానికంటె మరొకటి గొప్పదిగా వర్ణించి ఎదుటివారికి హడలు పుట్టిస్తాడు. “ఈ భీముడు బకాసురుని ధ్వంసం చేసినవాడు. జటాసురుని హతం చేసినవాడు. హిడింబాసురుని ప్రాణాలు తీసినవాడు, కీచకులను నిర్మూలించడమనే క్రీడచేసినవాడు. యుద్ధమంటే మహోత్సాహం కలవాడు. పదిలక్షల ఏనుగుల బలముతో భయంకరుడైనవాడు. శత్రువ్యూహాలను ఛేదించేవాడు. ఇట్లాంటి భీముణ్ణి ధర్మరాజు తమ బలం చూపడానికి తీసుకొని వస్తాడు” అంటాడు. సాధారణంగా

కన్నడ కవులకు ముద్రాలంకారంమీద మోజు ఎక్కువ. ముద్రాలంకారమంటే తాము వ్రాస్తున్న పద్యంలో ఆ వృత్తం పేరును సమయోచితంగా చెప్పడం. పంపని పద్యం 'మత్తేభవిక్రీడితం'. ఆ పేరు రావడానికి ఆ భీముడు ఉగ్రకురుక్ష్మాప మహీరుహ ప్రకరము చెండాడుతూ మత్తేభ విక్రీడితం చేయవలసి వచ్చింది. తిక్కన కట్లా మోజులేదు. ఆయనకు భీముని వైరి దుర్వారగర్వ నిర్వాపణముచేసే భీకర స్వభావాన్ని చిత్రించడమే లక్ష్యము. అదే చేసినాడు.

పంపకవి మహాభారత కథను సంగ్రహంగా చెప్పదలచినవాడు. అతడు మూలంలో కొన్ని శ్లోకాలలో చెప్పిన విషయాలను కథాగమన దృష్టితో ఒకే పద్యంలో ముగిస్తాడు. దుర్యోధనుని వేగులవాళ్ళు అజ్ఞాతవాసం చేస్తున్న పాండవులను కనుక్కోవడానికి అన్ని ప్రాంతాలూ తిరిగివచ్చి వాళ్ళు కనబడలేదని చెప్పుతూ విరాట నగరంలో ఒక స్త్రీ కోసం ఒక గంధర్వుడు నూర్గురు కీచకులనూ చంపిన సంగతి తెలుపుతాడు. ఆ విషయం కురురాజు భీష్మునితో అంటాడు.

"ఇదు దల్‌చోద్య, మతర్క్య, మద్భుత, మసంభావ్యం విచారక్కెబా
రాదు దెంతెం దొడె, సందసింహబలనం కొల్వన్నరార్, భీమన
ల్లదవర్ కీచక భీమశల్య బలదేవర్కళ్ సమానర్కళ
వ్పుదటిం తోళ్ఫలదొళ్ పెఱంగమరదీ విక్రాంతముం గర్వాముం॥
(విక్రమార్జునవిజయ)

(ఈ వార్త విచిత్రమైనది. తర్కించరానిది, అద్భుతము, అసంభావ్యము, ఆలోచనకు రానిది, ఆ సింహబలుణ్ణి చంపిందెవరు? భీముడుకాక, భుజబలములో భీమకీచక శల్యబలరాములు సమానులుగదా! ఇతరులకు ఈ విక్రమమూ గర్వమూ ఉండవు.)

ఇందుకు వ్యాస మహాభారతంలో ఇట్లా ఉంది.

"సాంప్రతం మానుషేలోకే సదైత్య నరారాక్షసే!
చత్వారస్తునర వ్యాఘ్రాః, బలే శక్రోపమా భువి॥

(ఇప్పుడు రాక్షసులతో కూడిన నరలోకంలో మానవశ్రేష్ఠులు, బలంతో ఇంద్రునితో సమానమైనవాళ్ళు నలుగురున్నారు.)

"బలదేవశ్చ భీమశ్చ మద్రరాజశ్చ కీర్యావాన్

చతుర్థః కీచక స్తేషాం, పంచమం నానుశుశ్రుమః॥

(బలరాముడు, భీముడు, శల్యుడు, కీచకుడూ వీళ్ళే నల్గురు. వీరికి సాటివచ్చే అయిదోవాణ్ణి వినలేదు.)

"అన్యోన్యానంతర బలాః, పరస్పర జయైషిణః,

బాహుయుద్ధమభీప్సంతో, నిత్యం సంరబ్ధమానసాః,

(వాళ్ళు ఒకరికొకరు తీసిపోనివాళ్ళు. ఒకరినొకరు జయించాలను కుంటారు. బాహు యుద్ధాన్ని కోరుతుంటారు. ఎప్పుడూ వాళ్ళ హృదయాలు ఉత్సాహంతో ఉంటాయి.)

"తత్రాహం కీచకం మన్యే, భీమసేనేన మారితం,

సైరంధ్రీంద్రౌ పదంమన్యే, నాత్రకార్యా విచారణా"

(అక్కడ కీచకుడు భీముని చేతనే చచ్చినాడని నా అనుమానం. ఆసైరంధ్రి) ద్రౌపదే. ఇంక విచారించవలసిన పనిలేదు.)

"కోహిశక్తః పరోభీమాత్ కీచకం హన్తుమోజసా"

(కీచకుణ్ణి చంపడానికి భీమునికంటే ఎవనికి శక్తి ఉంది?)

ఈ సందర్భాన్ని వ్యాసుడు 15 శ్లోకాలలో చెప్పితే పంప కవి ఒకే పద్యంలో చెప్పగా ఈ ఘట్టాన్ని తిక్కన 5 పద్యాలలో చెప్పినాడు. తిక్కన దుర్యోధనుడు వితర్కించిన విధం చూడండి.

గీ॥ ఇవ్విధంబున తమ తమ యెరుగు తెఱగు
లందఱును జెప్ప విని కురునందనుండు
తగ విచారించి కార్యంబు తెగువ గాంచి
యెలమి వారల గనుగొని యిట్లలనియె॥

ఆ॥ సింహబలుడు భీమసేనుండు శల్యుండు
హలధరుడు సమాన బలమువార
లొండురులను గెలుచు నుత్సాహమును గల
రుద్ధతులును బాహుయుద్ధవరులు॥

కం॥ ఈ నలువురు భుజశక్తుల
తో నెనయగ జాలునట్టి దోర్బలమెందున్

గానము కావున వీరల
లోననె యొండొరుల కని గెలుపు సమకూరున్

ఉ॥ తక్కిన వారలాతనికి దవ్వుల చోటులవారు వాయుజుం
డొక్కడ యింక సింహబలు మద్దతిమాన్చిన మాన్చువాడతం
దక్కడ నిల్చె గావలయు, నాసతి ద్రౌపది గాగనోవు, వే
రొక్కరు డాజి కీచకుల నోర్వగజాలమి మీరెరుంగరే॥

కం॥ గంధర్వులను నెపంబున
అంధ తమస గూఢవృత్తి ననిల సుతుడు గ
ర్వాంధమతియైన సూతు స
బాంధవముగ జంపెగాక, పరులకు వశమే॥ (విరాటపర్వం.)

మూలంలోవలే విస్తరము కాకుండా పంప కవివలే ఒకే పద్యంలో మరీ సంగ్రహం కాకుండా తిక్కన చక్కగా విషయాన్ని తేటపరచినాడు.

**తిక్కన – కుమారవ్యాసుడు**

కన్నడంలో మొదటి భారత కర్త పంపకవి జైనుడు. వైదికులకు వేదం వంటిదైన మహాభారతం జైనులకు లౌకిక కావ్యం. పంపని భారతంలో కౌరవ పాండవుల కథకే ప్రాముఖ్యం. కాని అందులోని ధర్మాలకు కాదు. తనకు ఆశ్రయదాత అయిన అరికేసరి మహారాజును అర్జునునితో పోల్చి ఈ కావ్యం వ్రాసినట్లు పంపడే చెప్పినాడు. అందువల్ల వైదిక ధర్మాన్ని అనుసరించే వాళ్ళకు ఇంకొక భారతం అవసరమైంది. 15వ శతాబ్దిలో కుమార వ్యాస బిరుదం ఉండే గదగు నారాయణప్ప దేశిచ్ఛందస్సైన 'భామనీ షట్పది' లో వేద ధర్మాను సారముగా మహాభారత రచన ప్రారంభించి 10 పర్వాల వరకూ వ్రాసినాడు. కన్నడ దేశంలో కుమార వ్యాస భారతం జనప్రియమైనది. దాన్ని 'భారత కథామంజరి' అంటారు. గనుక కళను తెలిసినవాళ్ళు శ్రుతిలయలతో ఆ భారతాన్ని చదువుతూ ఉంటే పౌరాణికులు అర్థం చెప్పి అలరిస్తూ ఉంటారు.

కుమార వ్యాసుడు విజయనగర చక్రవర్తి ప్రౌఢదేవరాయల కాలం వాడు. అందువల్ల అతడు వ్యాసభారతాన్నీ, తెలుగు భారతాన్నీ చదివి ఉంటాడు. కుమారవ్యాసునికి గ్రంథాన్ని విస్తరించడమంటే మహాప్రీతి. తిక్కన మహాకవికి ఉండే సందర్భశుద్ధి.

సంయమము. అతనికి లేవు. అవసరమైనచోట సంగ్రహం చేస్తాడు. అనవసరమైన చోట పెంచుతాడు. కొన్ని ఘట్టాలను చూడండి.

సైరంధ్రి కీచకునిచేత పరాభవించబడి వాని ఇంటి నుండి పరుగెత్తి వచ్చి విరాటరాజు సభను చేరిన సందర్భములో తిక్కన చూపిన ప్రతిభ అనన్యమైనది. ఆ స్థితిలో ఉండే ద్రౌపదిని చూచి భీముడు పొందిన కోపాటోపాన్ని అసదృశముగ అభివర్ణించినాడు తిక్కన.

చం॥ కనుగొని కోపవేగమున కన్నుల నిప్పులురాల, అంగముల్
కనలగ, సాంద్ర ఘర్మ సలిలంబులు గ్రమ్మ, నితాంత దంత పీ
డన రటదాస్య రంగ వికటభ్రుకుటీ చటుల ప్రవృత్తన
ర్తన ఘటనా ప్రకార భయదస్ఫురణా పరిణద్ధ మూర్తియై॥

సీ॥ నేలయు నింగియు తాళముల్గాజేసి,
యేపున రేగివాయించియాడ
మిగిలి బ్రహ్మాండ భాండంబు పగుల వ్రేయ
అప్పళించుచు ప్రళయకాలానలమున
గండరించిన రూపంబు కరణి భీము
డతి భయంక రాకారత నతిశయిల్లె॥

వ॥ ఇట్లు పేర్చిన కోపాటోపంబున నవిచారిత సమయవర్తనుండై
వృకోదరుండు కీచకుని కీటడగింపజూచి తత్సంబద్ధ బద్ధుండుగావున
మత్స్యపతి తన అలుకలోని వానిగా దలంచి, అచ్చేరువున ఉన్న వృక్షంబు నిరీక్షించి,
ఆగనంబు పల్లటిల్ల ధర్మతనయుం గనుంగొనిన అతండు తన నయనా కారంబున వారించి ఇట్లనియె.

మ॥ వలలుండెక్కటజూచె నొండెడ ననేవ్య క్ష్మాజముల్ పుట్టవే
ఫలితంబై వరశాఖలొప్పగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతి గావింపగా
గల ఈ భూజము పంటకట్టియలకున్ ఖండింపగా నేటికిన్

అనగా భీముడూరకుంటాడు. ఈ ఘట్టములో మూలము ఇట్లుంది.

"తాంచాసీనౌ ద దృశతుః భీమసేన యుధిష్ఠిరౌ,

అమృష్యమాణౌ కృష్ణాయాః కీచకేన పరాభవం.

(అప్పుడు అక్కడ కూర్చున్న భీమసేనుడూ, ధర్మరాజూ కీచకుని చేత ద్రౌపదికి కలిగిన పరాభవాన్ని చూచి క్రోధము పొందిరి.)

"తస్యభీమో వధం ప్రేప్సుః కీచకస్య దురాత్మనః

దంతైర్దంతాం స్తదారోగాన్నిష్పిపేష మహామనాః॥

(దుర్మార్గుడైన ఆ కీచకుని చంపగోరి పెద్ద మనస్సు కలవాడైన భీముడు రోషంతో పండ్లు పటపటకొరికెను)

"ధూమచ్ఛాయా హ్యభజతాం, నేత్రేచోచ్ఛ్రిత పక్ష్మణీ,

సస్వేదాభ్రుకుటీచోగ్ర, లలాటే సమవర్తత॥

(విప్పారిన రెప్పలుకల కండ్లమీద పొగచారలు క్రమ్మెను. నొసటి మీద చెమటతో కూడిన భయంకరమైన బొమముడి ఏర్పడినది.

"హస్తేన మమృజే చైవ లలాటం పరవీరహా,

భయశ్చ త్వరితః క్రుద్ధః, సహసోత్థాతు మైచ్ఛత॥

(శత్రువులను నాశంచేసే భీముడు పట్టలేని కోపంతో చేతితో నొసటిని రుద్దుకున్నాడు. తొందరతో ఒక్కపెట్టున లేవడానికి యత్నించినాడు)

"అథావమృదంగుష్ఠం, అంగుష్ఠేన యుధిష్ఠిరః,

ప్రబోధన భయాద్రాజా భీమం తం ప్రత్యషేధయత్॥

(అది చూచి ధర్మరాజు బొటనవ్రేలిని బొటన వ్రేలితో నొక్కు తున్నాడు. తాము బయటపడిపోతామనే భయంతో భీముణ్ణి వారించినాడు)

"తం మత్తమివ మాతంగం, వీక్షమాణం వనస్పతిం,

సతమావారయామాస, భీమసేనం యుధిష్ఠిరః॥

(మదించిన ఏనుగువలె భీముడు అక్కడుండే మహావృక్షాన్ని చూస్తుండగా ధర్మరాజు ఈ విధంగా వారిస్తాడు)

"ఆలోక యసికిం వృక్షం, సూద! దారుకృతేనవై

యది తే దారుభిఃకృత్యం, బహిర్వృక్షాన్ని గృహ్యతాం॥

(ఓ వంటవాడా! కట్టెలకొరకు ఈ చెట్టును చూస్తున్నావా? నీకు కట్టెలు కావాలంటే బయట ఎన్నో చెట్లున్నాయి కొట్టించుకో)

"యస్యచార్ద్రస్య వృక్షస్య, శీతచ్ఛాయాం సమాశ్రయేత్

నతస్య పర్ణంద్రుహ్యేత పూర్వవృత్తమను స్మరన్"

(పచ్చని చల్లని నీడనిచ్చేదీ అయిన చెట్టును ఆశ్రయిస్తాము. ఆ ఉపకారాన్ని తలచుకొని దీని ఆకునుకూడ తెంపరాదు)

'ఇంగితజ్ఞః సతుభ్రాతుః, తూష్ణీమాసీత్ వృకోదరః॥

(అన్నగారి ఇంగితం తెలుసుకొని భీముడు ఊరకున్నాడు)

కుమార వ్యాసుడీ ఘట్టాన్ని ఇట్లా వ్రాసినాడు.

"నొందళకటా సతియెనుత మన

నొందు సైవెరగాగి ఖతియలి

కంది నసు మైబాగి రోషదొళౌద నొడెయవుచి,

మంది యరియదవోలు కుచేష్టయొ

ళొంది మెల్లనె బాగి నోడిద

నందు రాజాలయద ముందణ మరన నాభీమ॥

(ఆ భీముడు ఆకటా! ఈమె బాధపడెనే అని తానూ మనసులో బాధపడి సహింపనివాడై కోపంతో ఒడలు పెంచి రోషంతో ఔడుగరచి ఇతరులకు తెలియకుండా ప్రతీకారం తలపెట్టి మెల్లగా పోయి రాజసభాంగణం ముందుండే చెట్టును చూచినాడు.)

"ఒళగె నిశ్శైసిదను మొదలలి

హిళిదు హిందువె నివళ బడిదీ

ఖళన నివనొడహుట్టిదర నివనఖిళ బాంధవర,

బళికె విగడ విరాటరాయన

కొలువె నరియద మున్న కౌరవ

కులవ సవరువె నెండు కిడికిడి యొద నాభీమ॥

(ఆ భీముడు ద్రౌపది భంగపాటును తీర్చడానికి మొదట ఈ ఖలుణ్ణి, వీని తమ్ములనూ, వీని బంధువులనూ పట్టి పిండుతాను. తరువాత చేతకాని విరాటరాజును చంపుతాను.

ఈ విషయం బైటికి పొక్కక ముందే కౌరవ కులాన్ని నాశనం చేస్తాను అని మండిపడుతూ మనసులో నిశ్చయించినాడు)

"ఆత నింగిత దనువనరితు మ
హీతళాధిప ధర్మసుత నతి
కాత రిసదిరు, వలల సైరిసు, సైరి నకటెనుత
ఈ తరువ మురియదిరు సుజన
వ్రాత కాశ్రయ వూరహొరగె మ
హాతిశయ తరువుంటు నిన్నయ బాణసిన మనెగె॥

(అతని ఆలోచనలను తెలుసుకొని మహీతలాధిపుడైన ధర్మరాజు వలలా! ఉద్రేకం పొందకు. ఓర్చుకో! ఓర్చుకో! అంటూ ఈ చెట్టును త్రుంచవద్దు. ఇది సుజనులకు ఆశ్రయమైనట్టిది. నీవంట యింటికి ఊరిబయట చాలా గొప్ప చెట్టుంది. అన్నాడు)

"ధర్మమయ తమ ఎదను మురియ ది
రెమ్మనూతను కేళెనలు మిగె
సుమ్మనోలగ దింద సురిదను భీమ దుగుడదలి॥

(ఈ చెట్టు ధర్మమయమైంది. విరవకు. నా మాట విను: అని చెప్పగా భీముడు మౌనంగా విషాదంతో సభ నుండి వెళ్ళిపోయెను.)

వేదవ్యాసుని భీముడు పండ్లు పటపట కొరికినాడు. నొసటిమీద చెమటపట్టి బొమముడి పడింది. కోపంతో నొసలు రుద్దుకున్నాడు. తిక్కన భీముడు కోపాటోపంతో భయంకరాకారంతో దుర్నిరీక్షుడై ఆకాశాన్ని-భూమిని తాళాలు చేసి వాయించడానికీ, బ్రహ్మాండ భాండాన్ని పగలకొట్టడానికీ సిద్ధమైనాడు. కుమారవ్యాసుని భీముడు నీలిగి పెదవులు కొరుక్కోవడంతో సరిపెట్టుకున్నాడు. తిక్కన ధర్మరాజు భీముని కోపతాపం విరాటునికీ సభాసదులకూ తెలియకుండా నర్మగర్భముగ మాట్లాడితే కుమార వ్యాసుని ధర్మరాజు భీమునితోనే లౌక్యం లేకుండా మాట్లాడినాడు. ఈ ఉభయ కవుల రచనల్లోని తారతమ్యాన్ని రసజ్ఞులు గ్రహిస్తారు.)

ఆ తరువాత జరిగిన కథను తిక్కన సరససంభాషణలతో వ్యంగ్యోక్తులతో నిర్వహించినాడు.

## శ్రీ గడియారం రామకృష్ణశర్మ -

వ॥ "ద్రౌపది కోపమున్ సమయభంగ భయంబును యుల్లంబున పెనంగగ పతులన్ సభ్యుల జూచుమాడ్కి రూక్షంబుగ చూచి, పతులును మత్స్యనాథుండును వినంగ నిట్లనియె.

గీ॥ దుర్దమ ప్రతిభట మర్దన క్రీడమై – చతురుడుగా నెందునుతికి నెక్కి................

సీ॥ ఉన్న గంధర్వు లేవును నన్ను నిట్టు

లొకడు వరుపంగ నూరక యునికి సూడ

నచ్చెరువుగాదె యెవ్వరి యాంధ్రురింక

పరభవంబును బొందక బ్రతుకువారు॥ అనిన,

ఉ॥ అప్పుడు ధర్మ సూతి హృదయంబు గలంగ, లలాట భాగమున్

గప్పగ ఘర్మవారి, యధికంబగు రోషము నొంది యుండియున్

తప్పుగద్రోచికొంచు, తన ధైర్యము పెంపున నిర్వికారుడై.,

యెప్పుడు దాను పల్కు నెలుగేర్పడ ద్రౌపది తోడ నిట్టనున్॥

సీ॥ జననాయకుండు నీ సభవారు నీదగు

తెరగెల్ల నెరిగిరి తెరవ ఇంక

మానక ఈ పలుమాటలాడగ నేల – చనుము నీవు సుదేష్ణ సదనమునకు

నీ పరాభవమున కోపింపనేరరే – గంధర్వులకు తరిగాదు కాక

సమయమెయ్యది యేని తమకును నీకుగ–ల్గిన యట్టులైనను కినియరిచట

గీ॥ గాన నాథుల దూరంగ గాదు వినుము

సతికి తానెంత పడియును సభలలోన

తడవుగా నిల్చి యిట్టు లుదగ్రవృత్తి

శంకసెడి ధిక్కరింపగ జనునె చెపుమ॥

కం॥ పలుపోకల పోవుచు వి

చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున నిచట.

గులసతుల గఱువ చందము

తొలగగ ఇట్లునికి తగునె తోయజవదనా! అనిన విని పాంచాలి ఇట్లనియె.

ఆ॥వె॥ నాదువల్లభుండు నటుడింత నిక్కమ్ము

పెద్దవారి యట్ల పిన్నవారు
కాన పతుల విధమ కాక యేశైలూషి
కాదనంగరాదు కంకభట్టు॥

మ॥ అట్లగుటంజేసి నాకు నాట్యంబును పరిచితంబ మత్పతి శైలూషుండ కాడు, కితవుండును. కావున జూదరియాలికి గఱువ చందం బెక్కడిది అనుచు నచ్చోటువాసె॥
(విరాటపర్వం)

"ఈ సందర్భములో సంస్కృత మూలములో ఇట్లుంది.
సంప్రేక్ష్యచ వరా రోహా సర్వాంస్తత్ర సభాసదః!
విరాటంచా హ పాంచాలీ, దుఃఖేనావిష్ట చేతసా"
(పాంచాలి సభలో ఉన్నవాళ్ళందరినీ చూచి దుఃఖావేశ హృదయంతో విరాటరాజుతో ఇట్లన్నది)

"యేషాంవైరీ నస్వపితి, షష్టేపి విషయేవసన్
తేషాం మాం మానినీం భారాకామ్, సూతపుత్రః పదావధీత్
(ఎవరి శత్రువు అయిదు దేశాలు అవతల ఆరో దేశంలో ఉన్నా సుఖముగా నిద్రపోలేడో అట్లాంటి గంధర్వుల భార్యను నన్ను మానవంతురాలిని కీచకుడు కాలితో తన్నినాడు.)

"కథంతే సూతపుత్రేణ వధ్యమానాం ప్రియాంసతీం
మర్షయంతి యథాక్లీచాః, బలవంతో మితౌజసః
(తమ ప్రియ భార్యను కీచకుడు హింసిస్తుండగా బలవంతులు, తేజశ్శాలురు అయిన గంధర్వులు నపుంసకులవలె ఎట్లు సహిస్తున్నారో)

"ఏవం సంపూజయంతస్తే కృష్ణాంప్రేక్ష్య సభాసదః
యుధిష్ఠిరస్య కోపాత్తు లలాటే స్వేద ఆగమత్"
(సభలోని వారంతా ద్రౌపదిని గురించి గొప్పగా భావించినారు. ధర్మరాజుకు మాత్రం కోపంవల్ల నుదుటిమీద చెమటపట్టింది)

"అథాబ్రవీ ద్రాజపుత్రీం కౌరవ్య మహిషీం ప్రియాం,
గచ్ఛ సైరంధ్రి మాత్రస్థాః, సుదేష్ణాయా నివేశనం॥
అంత ధర్మరాజు ప్రియమైన రాణీ ద్రౌపదిని జూచి 'ఓ సైరంధ్రీ వెళ్ళు, ఇక్కడ

నిలవకు సుదేష్ణం భవనానికిపో)

"మన్యే నకాల క్రోధస్య, పశ్యంతి పతయస్తవ,

తేన త్వాం నాభిధావంతి, గంధర్వాః సూర్యవర్చసః॥

(నీ భర్తలు సూర్యతేజస్సుగల గంధర్వులు. అంతా చూస్తూనే ఉంటారు. ఇది కోపానికి సమయం కాదనుకొని నీరక్షణకు పరుగెత్తి రాకుండవచ్చు.

"యదితే సమయః కశ్చిత్, కృతో హ్యాయతలోచనే

తం స్మరస్వ క్షమాశీలే, క్షమాధర్మోహ్యా నుత్తమః

(ఓ సైరంధ్రీ! ఒకవేళ నీ భర్తలు ఏదైన నియమం చేసుకున్నారేమో! ఓర్పుగలదనా గుర్తు చేసుకో. ఓర్పును మించిన ఉత్తమ ధర్మంలేదు.)

"ఇత్యేవముక్తే తిష్టంతీం పునరేవాహ ధర్మరాట్"

(ఇంతగా చెప్పినా అట్లే నిలిచి ఉన్న ద్రౌపదితో ధర్మరాజు మళ్ళీ అంటున్నాడు)

"అకాలజ్ఞాసి సైరంధ్రి శైలూషీవ విరోదిషి

గచ్ఛ సైరంధ్రి గంధర్వాః, కరిష్యంతి తన ప్రియం"

(ఓ సైరంధ్రీ, నీవు సమయా సమయాలు తెలియకున్నావు. నాట్యకత్తెవలే పెద్దగా ఏడుస్తున్నావు. వెళ్ళిపో గంధర్వులు నీకు మేలు చేస్తారు) అంటే ద్రౌపది అంటుంది.

"అతీన తేషాం ఘృణినాం, మన్యేహం ధర్మచారిణీ!

తస్వతస్త్వైవతే వధ్యా యేషాం జ్యేష్ఠో క్షదేవితా"

(నేను చాల దయగలవారి భార్యను అనుకుంటున్నాను. వాళ్ళలో పెద్దవారు జూదగాడు! అతడు ఎప్పుడూ తక్కిన వాళ్ళను బాధిస్తూ ఉంటాడు.)

"ఇత్యుక్త్వా ప్రాదదత్ కృష్ణా సుదేష్ణాయా నివేశనం"

(ఈ విధంగా అంటూ ద్రౌపది సుదేష్ణ యింటికి పరుగెత్తెను)

వేదవ్యాసుడు ఈ ఘట్టాన్ని 42 శ్లోకాలలో రచించగా తిక్కన 8 గద్యపద్యాలతో సరసముగా రచించినాడు. కుమార వ్యాసుడు ఈ భాగాన్ని ఇట్లా రచించినాడు.

కుమార వ్యాసుడు:

"కర్మ ఫలవిదు నినగె మానిని

నిమ్మ భవనకె హోగు శిక్షిస

లమ్మదీ సభె బగెయ నాతను మత్స్యభూపతియ"

(ఓ మానవతీ! ఇది నీ కర్మఫలము. నీ యింటికిపో. ఇతడు విరాట రాజుకు ఆత్మీయుడు ఇతన్ని ఈ సభ శిక్షించలేదు)

"కోపకవసర వల్ల పతిగళు
కా పురుష రే నిన్నవరు పరి
తాప వను బేళ్కొడు పతివ్రతె పుణ్యవధునీను
దీపవల్లా! క్షమె యఖిళ దో

రూపునెలె యాక్షమె యెనలు బళికింద ళిందుముఖి"

(నీ భర్తలు అధములు కారు. కోపమక్కరలేదు. పరితాప పడవద్దు. పతివ్రతవు, పుణ్యస్త్రీవి. దీపంవంటిదానవు. ఓర్పు దోషాలు పోగొట్టేది. శౌర్యధర్మాలకు రూపమూ, స్థానమూ ఓర్పే, అని చెప్పగా ఆమె ఇట్లన్నది)

"సై రణెగె తానవధి యిల్లా
పౌరుషవు కడు బంజె యాయితు
ఆరియకెయలి జుణిగి జారువి రెంద ళిందుముఖి"

(సహనానికి హద్దులు లేవా? పౌరుషము గొడ్డుబోయింది. అన్నీ తెలిసి కూడా అసమర్థులవలె జారుకుంటున్నారు అన్నది.)

"అరెరె హెంగసు దిట్టె మోనదొ
ళిర లిదానంతరవు రాయన
హొరెయ లే బాయ్బడిక తన గరువాయి యే యెనలు,
కెరళిదళు లలితాంగి యిల్లియ
హిరియరలి హురళిల్ల మారుతి
గరుహువెను బళికాదుదాగలి యెనుత తిరుగి దళు"

(ఔరా ఆడది చాలా దిట్టగా ఉందే! మౌనముగా ఉండలేదు. తన అంతరువు తేలీదు. రాజు సన్నిధిలో ఈ వాచాలత్వము గరువ తనమేనా? అనగానే ఆమెకు కోపం వచ్చి

ఇక్కడి పెద్దలలో పసలేదు. భీమునికి చెప్తాను. అయ్యేదేదో కానీ, అంటూ వెళ్లిపోయింది)

తిక్కన ఈ ఘట్టంలో కంకుభట్టుకు, సైరంధ్రికీ జరిగిన వాగ్వివాదాన్ని మహాచాతుర్యంతో వ్యంగ్యోక్తులతో నిర్వహించిన తీరు సరసజన సమ్మోదకరమైంది. వేదవ్యాసుడు 42 శ్లోకాలతో విస్తరించి చెప్పిన విషయాలను తిక్కన 8, 9 గద్య పద్యాలలో చెప్పితే కుమారవ్యాసుడు ముచ్చటగా మూడు షట్పదులలో ముగించినాడు. మూలంలో ద్రౌపది తన పతుల గొప్పతనాన్ని తలచుకొని ఏడుస్తుంది. అసమర్థుడైన విరాటరాజును దూషిస్తుంది. సభలోని వారంతా సైరంధ్రికి జరిగిన అవమానాన్ని గుర్తిస్తారు. సానుభూతి చూపిస్తారు. తిక్కన సంగ్రహంగానే ద్రౌపది దుఃఖాన్నీ, ధర్మరాజు అనునయ వాక్యాలనూ చెప్పి అప్పటికీ పోకపోతే కోపం పొందుతాడు. మూలంలోని విరాట రాజదూషణాన్నీ – సభాసదుల సానుభూతినీ వదలిపెట్టినాడు. చివరకు వేదవ్యాసుని ధర్మరాజు కోపంతో ద్రౌపదిని 'నీవు నాట్యకత్తెవలే సభలో ఏడుస్తున్నావు. మర్యాద తెలీదు. వెళ్ళిపో' అంటే అందుకు ద్రౌపది 'నా భర్తలు చాలా దయగలవాళ్ళు. వాళ్ళలో పెద్దవాడు జూదగాడు. ఎప్పుడూ తక్కినవాళ్ళను బాధిస్తాడు అంటూ వెళ్ళిపోతుంది.

తిక్కన ధర్మరాజు కోపంతో 'నీవు నాట్యం చూపే విధంగా సభలో అసభ్యంగా ప్రవర్తిస్తున్నావు. ఇది కులస్త్రీలకు మర్యాదకాదు వెళ్ళిపో అంటే ద్రౌపది 'నా భర్త నటుడు.' నేను నాట్యకాత్తె కావడంలో తప్పులేదు. అంతేకాదు నా భర్త జూదగాడు కూడా. జూదగాని భార్యకు మర్యాద ఎక్కుడుంటుంది' అని దెప్పిపొడిచి వెళ్ళిపోతుంది. ఈ సంభాషణ సభ్యులకు విపరీతార్థాలు కలిగించదు. సహజంగానే ఉంటుంది. ఈ దెప్పిపొడుపులు – ధర్మరాజుకు ద్రౌపదికి మాత్రమే అర్థమౌతాయి. అంత చతురంగా సాగింది. కుమార వ్యాసుడు మూలాన్నిగానీ, తిక్కననుగానీ అనుసరించలేకపోయినాడు. ఆ సంభాషణ చాదస్తంగా ఉంది. ధర్మరాజే 'ఈ సభ కీచకుణ్ణి శిక్షించలేదు. అతడు రాజుకు చాలా కావలసినవాడు' అంటాడు. రాజు విని ఊరకుంటాడు. ద్రౌపదిని 'పతివ్రతవు నీ భర్తలు గొప్పవాళ్ళే. వాళ్ళకు సమయం కాదు ఓర్చుకో ఇక్కడినించిపో' అంటాడు. ద్రౌపదికి కోపం వస్తుంది. సహనానికీ హద్దులుంటాయి, ఇక్కడ పౌరుషం చచ్చిపోయింది. నా అవస్థను చూస్తూ నా భర్తలు అసమర్థులై జారుకుంటున్నారు, అంటుంది. ధర్మరాజు

కోపంతో ఈ ఆడది గట్టిదే. తన అంతరమేదో తెలుసుకోకుండా రాజసభలో వాగుతున్నది. అంటాడు. అందుకు ద్రౌపది ఇక్కడి పెద్దలలో పసలేదు. నేను మారుతికి చెప్పుకుంటాను. ఏమైతే అది కానీ అంటూ వెళ్ళిపోతుంది. కుమార వ్యాసునికి వ్యంగ్య మర్యాద తెలీదు. వాచ్యంగా చెప్పడమే ఇష్టం. 'సభలో ద్రౌపదిచేత మీకు చేతకాదు, భీమునికి చెప్పుతాను' అనిపించడం అనౌచిత్యమూ, అసందర్భము అని అతనికి తెలియలేదు. ఊరకే కథను చెప్పుకుంటూపోవడమేగాని కథా కథన నైపుణి ఎరుగడు.

## తిక్కన - తిమ్మణ కవి

శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన కవి అయిన 'తిమ్మణ' కుమార వ్యాసుడు మిగిల్చిపోయిన 8 పర్వాలు పూరించి మహాభారతాన్ని ముగించినాడు. కృష్ణరాయలకు అంకితమిచ్చి దానికి 'కృష్ణరాయభారత' అని పేరు పెట్టినాడు. రాయల ఆస్థానములోని అష్టదిగ్గజాలతో కలసి మెలసి ఉన్నందువల్ల తిక్కన భారతాన్ని బాగా చదివినాడు. అందుకే సంస్కృత మూలాన్నికాక తిక్కన భారతాన్నే పూర్తిగా అనుసరించినాడు. అయితే తిక్కన మహాకవిలోని ప్రతిభాపాండిత్యాలు తిమ్మణలో లేవు. కుమార వ్యాసునికి ఉందే పాండిత్యమూ అతనిలో లేదు. అతనికి కవిసార్వభౌముడనే బిరుదూ ఉంది. ఆయన తిక్కనను అనుసరించిన విధం తెలుసుకుందాం.

తిక్కన అనుశాసనిక పర్వంలో గరుడోపాఖ్యానాన్ని ఇట్లా వ్రాసినాడు. కథను మాత్రమే చెప్పవలసినచోట అనవసర వాక్యాలు లేకుండా చిన్న చిన్న మాటలతో చెప్పుకుంటూ పోవడం తిక్కనకు ఇష్టం.

"కశ్యపు భార్యలు కద్రువ వినత నా
కలరు - తపస్వి వారలకు వరము
కరుణ ఇచ్చెదనన్న - కద్రువవేవుర - వినతయిద్దర వేడికొనిరి, సుతుల
మునియు అట్లగుగాక అనియె, పదంపది-అండముల్ వేయును అండ యుగము
వరుసగ ఆ కద్రువకు వినతకు పుట్టె - అవికుండములనిడి అరసియుండిరి
అహిసహస్ర మేనూరేండ్లు అంత నుదయ
మయ్యె అవ్వేయిగ్రుడ్డుల అధిక బలము

తేజమును కల్గి ఆ సర్పరాజ ఒప్పు
చుండె, ఆ రెండు విరియక యుండె మరియు॥ ఈ పద్యానికి తిమ్మన అనుసరణ
"ఎతెన్నృపతి కశ్యపనగిబ్బరు
లలనెయరు, కద్రువెందొ
బ్బెళిగె నామవు వినతె యెందొబ్బళభిదాన,
సలె వరవ పతి కేళెనలు మ
క్కళు సహస్రవ కద్రుబేడిద
ళొలిదు మక్కళిబరనె ఆ వినతె బేడిదళు,
"మునిప నారీతియలి కరుణిసి
దను బళిక అండగళు సాసిర
జనిసిదవు కద్రువిగె అండద్వితయ జనిసిదుదు
వినతెయగ రక్షిసుత లిరె-యిరె
ఘన వెనిసి దైనూరు వరుషకె
ఫణిగళాదరు మిగె సహస్రగళాగి కద్రువిగె॥
"అరసఖగ వాద తేజది
నరిదేనిప బలదింద కాకో
దరసహస్ర గళెసెదుదు అండగళెరడు బిరియదిరె॥

మక్కికి మక్కిగా అనుసరించినా తిక్కన ఒక్క సీసంలో చెప్పిన విషయాలను తిమ్మణ అనవసరమైన మాటలతో రెండున్నర షట్పదులకు పెంచినాడు. ఆ తరువాతి కథను తిక్కన ఇట్లా చెప్పినాడు.

కం॥ తన సవతియైన కద్రువ - గనివగపును, మత్సరంబు గదిరెడు మదితో,
వినత కడున్ వేగిరపడి - అనీతి నొకయండ మవియ నడచె నరేంద్రా॥

కం॥ పులుగొక్కడు పూర్వాంగముతో
కలిగి జనించుటయు వానిగని ఆ సతి క
న్నుల నశ్రుజలంబులు పె
ల్లొలుకన్ శోకమునమునుగు నుల్లముతోడన్॥

**తిమ్మణ అనుసరణ**

"పిరిదు చింతిసి వినతె సుతరా
దరు సపత్నిగె మొదలెనుత మ
త్సరతెయలి నెరెమరగి సుయ్దుళు బళికలా వినతె"
"మన దొళగె బేగె బట్టా
వినతె ముని దొందండవను చి
క్కనె బికివవొలు మురియ హొయ్దుళనీతి యిందాగ
తనుజ నూరుగళిల్ల దొబ్బనె
జనియిసిద నదనోడియే మా
నిని దృగంబుళొసరె పలవందదలి మరుగిదళు"

(వినత తన సవతికి సంతానము కలిగింది, నాకు కలగ లేదని చింతించి మాత్సర్యంతో తపించి, తన రెండు గుడ్లలో ఒకదానిని 5 వందల యేండ్లకే పగులగొట్టినది. అందుండి తొడలు లేని ఒకడు పుట్టెను. వానిని చూచి వినత కన్నీళ్ళు కారుస్తూ విలపించింది)

తరవాత అయిదు నూరేండ్లకు ఆ గ్రుడ్డులో నుంచి గరుడుడు పుట్టిన విధానాన్ని తిక్కన సుందరంగా వర్ణించినాడు.

చం॥ ఘనతర కంధరుండు, దృఢకాయుడు, దీప్తముఖుండు, రక్తలో
చనుడు, మహోత్త మాంగకుడు, చారుసుసంగత పక్ష సార మం
దనుడు, పరిస్ఫురద్ద్యుతి విడంబిత బాల దివాకరుండు, లో
కనయన పర్వ నిర్వహణ కారి, సుపర్ణుడు పుట్టెభూవరా"

## తిమ్మణ అనుసరణ

"ఘన దవళ కంధరను, దృఢకా,
యను, సురక్తేక్షణను, దీప్తా
ననను, మృదుమస్తకను, పక్షద్విత‌య రంజితను"
తను సముజ్వల కాంతి నిర్జిత
దినకరను బహుసత్వ సంయుత

ననఘు నధిక భుజప్రతాపను గరుడనొప్పిదను."

తిక్కనకు ఈ కథలో ఇప్పుడు వర్ణనకు అవకాశం లభించింది. చక్కగా వర్ణించినాడు. తిక్కన పద్యంలో ఉండే సార్థకాలైన సరసోక్తులను అవగతం చేసుకోకుండా పద్యాన్ని తిమ్మణ నిరర్థక పదాలతో పూర్తిచేసినాడు.

తిక్కన గరుడుడు మహోత్తమాంగకుడైతే ఇతని గరుడుడు మృదుమస్తకుడు. అతడు చారు సుసంగత పక్షసారమండనుడైతే, ఈతడు పక్షద్వితయ రంజితుడు. తిక్కన గరుడుడు తన తేజః కాంతులతో బాల భానుణ్ణి తిరస్కరిస్తే ఈ గరుడుడు తన శరీర కాంతిచేత సూర్యుని జయిస్తాడు. ఇక్కడ సందర్భశుద్ధి లోపించింది. తిక్కన వాడిన 'లోక నయన పర్వ నిర్వహణకారి' అనే విశేషణంలోని సారస్యాన్ని గ్రహించలేక తిమ్మణ తీసివేసినాడు. దానికి బదులుగా 'బహుసత్వ సంయుతుడు, అనఘుడు, అధిక భుజప్రతాపనుడు' అని చేర్చినాడు. ఇవన్నీ 'దృఢకాయుడు'లో సరిపోతాయి. కాని తిమ్మణకు తెలియలేదు.

ఈ కథలోనే తిక్కన కద్రూ వినతల సముద్రతీర విహారాన్ని మనోజ్ఞంగా వర్ణించినాడు.

సీ॥ చుంచుల జిగురాడు జించి యాడుచు నలి –
నెలుగించు గండుకోయిలల సొంపు,
అలరు తేనియగ్రోలి అన్ను పొలంబుల
మురియు తేటుల నునుమ్రోతయింపు,
తనిపండ్ల రసమాని తమలోన జెలగుచు
పలికెడు రాచిల్క పదువురంగు,
కొలకుల కెలకుల కూడ క్రీడించు చుం
డెడు నంచ తడంబు నడబెడంగు,
గీ: తరగ దేలుచు పూగీవ తగుల బడుచు
వచ్చు చిఱుగాలి సోకును మెచ్చిమెచ్చి
తగిలి కొనియాడుచు నువినతయును కద్రు
వయును మున్నీటి చేరువ వనమునందు" మెలగుచుండి.

**తిమ్మణ – అనుసరణ**

"బళిక కద్రూ వినతెయరు కే

ళొలిదు తత్సమయదలి వారిధి
లలిత వేలావనకెపోగి విలాస దెసకదలి,
తళిరుగళ చివుటుత్త, హూసహూ
గళను కొయ్యుత భృంగ కోకిల
కలరవంగళ నాలిసుత, విహరిసుత లిరుతిహరు"

తిక్కన 'వనంలోని వింతలూ విశేషాలు రమ్యంగా వర్ణించినాడు. "ముక్కులతో చిగురాకులు చీలుస్తూ కూస్తున్న కోయిలలనూ, పూదేనెలను గ్రోలి తమ ప్రియలతో మురుస్తున్న తేంట్ల మ్రోతలను, తని పండ్ల రసాలు త్రాగి సంతోషముతో పలుకుతున్న చిలుకగుంపుల రంగులనూ, కొలనులలో క్రీడిస్తున్న హంస గుంపుల నడక సొగసులను, అలలమీద తేలుతూ, పూదీగలను తాకుతూ వీస్తున్న మందానిల స్పర్శలనూ మెచ్చుకుంటూ కద్రూ వినతలు విహరించినారు"

తిమ్మణ పద్యంలో "కద్రూ వినతలే సముద్ర తీరంలోని వేలావనానికి పోయి చివుళ్ళను త్రుంచుతూ, విచ్చుతున్న పువ్వులను కోస్తూ, తుమ్మెదల, కోకిలల కలరవాలను వింటూ" విహరించినారు. "తిక్కనను అనుసరించినా ఆ కవితలోని అర్థగౌరవాన్నీ భావసౌకుమార్యాన్నీ తిమ్మణ అవగాహన చేసుకోలేకపోయినాడు. తిమ్మణ భారత భాగమంతా తిక్కన రచనకు రసహీనమైన అనుసరణగా సాగింది.

మహాభారతాన్ని గూర్చి తిక్కనకూ, కన్నడ భారత కవులకూ అభిప్రాయాలలోనే భేదముంది. వాటిని గమనించడం అవసరము.

పంప కవి భారతఫలశ్రుతిని ఈ విధంగా చెప్పినాడు.

"పుదిదిరె రాగముర్కె పొసవేట దలంపుగళెల్ల మోదిద
ర్గె దరనుయాయి గల్గె సెవుదార గుణం సకళావనీశ్వర
ర్గ దట నళుర్కె భృత్యనివహక్కె చదుర్ గణికా జనక్కె కుం
దదె నెలసిర్కె యీ మహితళక్కె మదీయకృతి ప్రబంధదిం"

(ఈ మహీతలంలో నా కావ్యం చదివినవారికీ, వారి అనుయాయులకూ నిండారిన ప్రీతి, అనురాగ సంతోషాలు, సకల రాజన్యులకు ఉదారగుణము, సేవకులకు పరాక్రమము, వేశ్యలకు చాతుర్యములోపం లేకుండా ఉండుగాక)

"కరమఱ్కర్తు సమస్త భారత కథాసంబంధమం చాజసల్,
బరెయల్ కేళలొడర్చువంగ మిదరొళ్ తన్నిష్ట మప్పన్న ము
త్తర మక్కుం ధృతి తుష్టి – పుష్టి విభవం సౌభాగ్య మిష్టాంగనా
సురతం కాంతి యగుంతి శాంతి విభవం భద్రం శుభం మంగళం

(ఎక్కువ ప్రీతితో నా భారత కథలను చదివినా, వ్రాసినా విన్నా వాళ్ళకు అభీష్టాలు సిద్ధిస్తాయి. ధృతి – తుష్టి –పుష్టి–విభవమూ సౌభాగ్యాలూ తాను కోరిన స్త్రీ సౌఖ్యమూ, కాంతి–శాంతి–భద్రం– శుభం–మంగళాలు కల్గుతాయి.)

**కుమార వ్యాసుని ఫలశ్రుతి**

నన్నయ్య–తిక్కనల వలెనే కుమారవ్యాసుడు కూడా వైదికుడే. భారతాన్ని వేదముగా భావించేవాడే. నన్నయ్య వేదవ్యాస భారతాన్ని గూర్చి ధర్మ శాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రం చని, అధ్యాత్మవిదులు వేదాంతమనియు, నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవి వృషభులు మహాకావ్యమనియు – గొనియాడుచుండ వేదతత్త్వవేది వేదవ్యాసుడు, విశ్వజనీనమై పరగుచుండజేసె భారతంబు" అని గొప్పగా ప్రశంసిస్తే కుమారవ్యాసుడు తన భారతాన్నే గొప్పగా పొగడుకున్నాడు.

"అరసు గళిగిదు వీర, ద్విజరిగె
పరమవేదదసార, యోగే
శ్వరద తత్త్వ విచార, మంత్రీజనకె బుద్ధిగుణ,
విరహిగళ శృంగార, విద్యా
పరిణతరలంకార, కావ్యకె
గరువెనలు రచిసిద కుమార వ్యాస భారతవ॥

(రాజులకిది వీరము, బ్రాహ్మణులకు వేదసారము, యోగీశ్వరులకు తత్త్వవిచారము, మంత్రులకు బుద్ధివర్ధకము, విరహిజనులకు శృంగారము, విద్యావంతులకు అలంకారము కావ్యానికి గురువు అనేట్లుగా కుమార వ్యాసుడు భారతాన్ని రచించినాడు)

ఇదిస్వాతిశయమే అయినా అతనికి భారతంమీద అపారమైన భక్తి ఉందనడంలో సందేహంలేదు. ఇందుకు అతడు చెప్పిన ఫలశ్రుతే నిదర్శనము.

"వేదపారాయణదఫల, గం
గాది తీర్థస్నానఫల, కృ
చ్ఛ్రాది తపసిన ఫలవు, జ్యోతిష్టోమ యాగఫల,
మేదినియ నొలిదత్తఫల, వ
స్త్రాది కన్యాదానఫల వహు
దాదరిసి భారతదొళొందక్షరవ కేళ్దరిగె"

(శ్రద్ధతో భారతంలో ఒక అక్షరం విన్నవాళ్ళకు కూడ, వేద పారాయణ ఫలమూ, గంగాది పుణ్యతీర్థాలలో స్నానం చేసిన ఫలమూ, కృచ్ఛ్ర-చాంద్రాయణాదివ్రతాలూ, తపస్సు చేసిన ఫలమూ, జ్యోతిష్టోమ యాగ ఫలమూ, భూమిదాన ఫలమూ, వస్త్రదాన, కన్యాదానాదుల ఫలం లభిస్తుంది.)

**తిక్కన ఫలశ్రుతి చూడండి.**

గీ॥ అమల ధర్మార్థ కామ మోక్షముల గురిచి
యెలయు తెరువెద్దియన నిందుగలుగు, నదియె
యొండెడలగల్గు, దీన లేకుండుచొప్పు
దక్కొకంటను లేదు వేదజ్ఞులార"

ఉ॥ భారతమర్థితో వినిన భక్తిపఠించిన శ్రీయునాయువున్
భూరియశంబునుం బ్రమదమున్ దృఢవిద్యయుగల్గు, వారికే
కోరికలైన వేగమొనగూడు, సుపుత్రునిగాంచు, సద్వరున్,
గారవ మొప్పగా బడయు, గర్భిణియున్ వరుసన్ కుమారి యున్"

**తిమ్మణకవి ఫలశ్రుతి**

"ఘనచతుర్వార్గక్కెకారణ,
వనఘవీకథె, యిదరొళిల్లం
దెనిప కథెగళ కాణెని తరపురాణ జాలదలి,
మనుజరీ ఇతిహాస రత్నవ
ననవరత కేళిదడె దురితగ
ళనితు కెడువవు, హెచ్చుతిర్ప వనేక సుకృతగళు"

## శ్రీ గడియారం రామకృష్ణశర్మ-

(చతుర్వర్ణాలకు కారణమైన ఈ కథ ఘనమైనది. ఇందులో లేని కథలను ఇతర ఏ పురాణంలోనూ చూడలేము. మానవులు ఈ ఇతిహాస రత్నాన్ని నిత్యము వింటే పాపాలు నశిస్తాయి. సుకృతాలువృద్ధి పొందుతాయి)

కన్నడ కవులు సమర్థులే అయినా మహాభారతాన్ని అవగాహన చేసుకొని వ్యాస హృదయాన్ని ఆవిష్కరించలేదు.

తెలుగులో కవిత్రయ భారతాన్ని చదివిన వారికి కన్నడంలోని పంప భారతంగానీ, కుమారవ్యాస – తిమ్మణల భారత భాగాలు కానీ సంతృప్తినీ సమ్మోదాన్నే కలిగించ లేవు అని చెప్పడంలో అతిశయోక్తి కానీ, దురభిమానంకానీ లేదని సవినయంగా మనవి చేసుకుంటున్నాను."

"యదిహాస్తి తదన్యత్ర
యన్నేహాస్తి నతత్ క్వచిత్ "



# వచన పద్య పంచకం

శ్రీ మాతలపాటి గంగాధరం

**శ్రీశ్రీది 'కవితా! ఓ కవితా!' మాత్రమే. ఆద్యం కాకపోయినా గుణ ప్రాధాన్యతను బట్టి ఆరాధ్యమైనదే**

## 1

**శ్రీశ్రీ** మొదట రాసిన వచన కవిత 'ఆకాశదీప'మే అయినా, తర్వాతి కవులకు మార్గదర్శకమైనదే గురుపీఠాన్ని అలంకరించడం లోక న్యాయం. కనుకనే 'కవితా! ఓ కవితా!' తెనుగు సాహిత్యంలో మొదటితరం వచన కవితా స్వరూపానికి సంకేతంగా నిలుస్తున్నది. అందులో 'శ్మశానాలవంటి నిఘంటువుల దాటి, వ్యాకరణాల సంకెళ్ళు విడిచి, ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి' - వస్తున్నానని తన్ను తాను నిర్వచించు కోవడమూ, రావాలని ఎదుటివారికి చాటిచెప్పే లక్షణ ప్రబోధమూ ఉన్నది. పైది భాషా ఛందస్సుల విషయంలో అయితే, వస్తు విషయంలో కూడా 'నా రచనలలో లోకం ప్రతిఫలించి, నా తపస్సు ఫలించి, నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ నా జాతి జనులు పాడుకొనే మంత్రంగా మ్రోగించాలనినా ఆకాశాలను లోకానికి చేరువగా నా ఆదర్శాలను సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వల జడిగా' ఉండాలని స్పష్టం చెయ్యడం శ్రీశ్రీ సంస్కారానికి నిదర్శనం. ఈ లక్షణానికి లక్ష్యాలా అన్నట్టు రచించిన ప్రతిభావంతమైన శ్రీశ్రీ భావకవితకు నిదర్శనాలైన పంక్తులుగూడా ఈ ఖండికలోనే ఉన్నాయి. 'నడిరేయి నిద్దురలో అపుడే ప్రసవించిన శిశువు నెడద నిడుకొని రుచిర స్వప్నాలను కాంచే జవరాలి మనఃప్రపంచపు టావర్తాలు; శిశువు చిత్ర నిద్రలో ప్రాచీన స్మృలూతుచే చప్పుడు!

వైద్యశాలలో శాస్త్రకారుని మహేంద్రజాలంలో చావుబ్రతుకుల సంధ్యాకాలంలో కన్నులు మూసిన రోగార్తుని రక్తనాళ సంస్పందన; కాలువ నీళులలో జారిపడి కదలగనైనా చాలని త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన ప్రేలాపన, కడుపు దహించుకుపోయే పడుపుకత్తె రాక్షస రతిలో అర్ధనిమీలిత నేత్రాల భయంకర బాధల పాటల పల్లవి! ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం! ఉన్మాది మనస్సినీవాలిలో ఘూకంకేకా! భేకం బాకా! సమ్మె కట్టిన కూలీల, సమ్మెకట్టిన కూలీల భార్యల, బిడ్డల ఆకటి చీకటి చిచ్చులు...' మొదలైన హాహాకారాలు, ఆర్తారావాల వాస్తవ దృశ్యాలెన్నో తర్వాతి కవులకంతా మార్గదర్శ కాలయ్యాయి.

భావుకత జలపాతం వంటిది! అది మహా ఆవేశంతో దూకుతుంది. ఆయన సంస్కారం కూడా బలమైనది కాబట్టి దాన్ని సరైన పద్ధతిలో వినియోగించుకుంటుంది. సంస్కారం రెండు పనులు చేస్తుంది. ఒకటి – భావుకతను ఎప్పటికప్పుడు హితమైన నవతవైపు నడిపిస్తుంది. రెండు – భావుకత నుంచి ఆవేశంలో దూకిన ప్రతి శబ్దాన్నీ, ప్రతి భావాన్నీ ఔచిత్యం హద్దుగా, ఆలోచన ఎత్తుగా సంస్కరిస్తుంది. సంస్కారాన్ని భావుకత మించితే తిలక్ అవుతాడు. భావుకతను సంస్కారం మింగితే ఆరుద్ర అవుతాడు. రెండూ సమపాళ్లలో మేళవిస్తే శ్రీశ్రీ అవుతాడు. ప్రపంచ వ్యాప్తంగా సాహిత్యంలో ఎన్నో యిజాలు తలచూపాయి. వాటిలో కొన్ని శ్రీశ్రీ సంస్కారంచేత అంగీకారం పొందినవి. తన భావుకతమీద అధికారం చూపించినవి. ఇట్లా శ్రీశ్రీ మీద ప్రభావం చూపిన యిజాల బీజాలన్నింటికి ఈ కవిత పాదుకావటం మరొక విశేషం. కమ్యూనిస్టు మ్యానిఫెస్టో పరిచయం పిమ్మట శ్రీశ్రీ కవితా సౌధానికి మార్క్సిజమే పునాది అయిపోయింది. మార్క్సిజం పోకడలకు ఈ ఖండికలో ప్రతి వాక్యమూ దర్పణంగా నిలుస్తుంది. పోతే యిజాలలో మార్క్సిజం తర్వాత శ్రీశ్రీ మీద అంతటి ప్రభావం చూపిన 'సర్రియలిజం' ఈ ఖండికలో – 'అగ్ని సరస్సున వికసించిన వజ్రం! ఎగిరే లోహశ్యేనం! ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం!' అన్న పంక్తుల వెనుక చోటుచేసుకున్నది. శ్రీశ్రీమీద పాశ్చాత్య ఉద్యమాల ప్రభావం ఎంత వున్నా మొదటగా ఆయన భారతీయ సంప్రదాయానికి చెందిన వ్యక్తి. సనాతన సంప్రదాయం నుంచి వచ్చిన వ్యక్తి. మన

సంప్రదాయాన్ని అంటిపెట్టుకున్న జన్మపరంపరల విశ్వాసం కూడా 'శిశువు చిత్ర నిద్రలో ప్రాచీన స్మృతులూచే చప్పుడు –' అన్న ఊహలో చోటుచేసుకున్నది. అయితే శ్రీశ్రీకి మన సంప్రదాయపు చేలాంచలముల విసరుల కొసగాలులు' గూడా అంటడానికి సుతరామూ సమ్మతింపని కొందరు పై ఊహ ఫ్రాయిడ్ ప్రభావ జనితమని సమర్థిస్తున్నారు. ఏది ఏమైనా శ్రీశ్రీ అన్ని అవతారాల సాక్షాత్కరం ఈ కవితలో ప్రదర్శింపబడింది. తర్వాత విస్తరించిన అన్ని ఉద్యమాల వ్రేళ్ళు గురజాడ కవితలో నిక్షిప్తమైనట్లు, శ్రీశ్రీ యుగంలో అల్లుకొన్న అన్ని యిజాల బీజాలకు శ్రీశ్రీ 'కవితా! ఓ కవితా!! ఖండిక పాదువంటిది. అభ్యుదయ, వచన కవిత్వోద్యమాలకు ఈ ఖండిక మానిఫెస్టోలాంటిది.

## 2

## కుందుర్తి – నగరంలో వాన

వచన పద్యం ఎంత సహజమైన ఛందస్సో, ఈ 'నగరంలో వాన' ఖండికలోని రచన కూడా అంత సహజంగా రూపుదిద్దుకొన్నది. అస్పష్టత శూన్యం. పులుముడు హుళక్కి, సర్కసు ఫీట్లు నాస్తి. ఛందస్సుల సర్పపరిష్వంగాలనూ, వ్యాకరణాల సంకెళ్లనూ, నిఘంటువుల శ్మశానాలనూ దాటి వస్తున్నానని శ్రీశ్రీ చెప్పినా, ఆ పని చేసింది మాత్రం కుందుర్తే! కుందుర్తిలో శ్రీశ్రీలోని ఆవేశపూరితమైన ప్రౌఢ సమాస రచనా వుండదు. ఆరుద్రలోని ఆంగ్ల పదప్రయోగ వైచిత్రీ ఉండదు. తిలక్‌లోని రొమాంటిక్ శబ్ద విన్యాసమూ ఉండదు. అజంతాలోని క్లిష్టమైన ఇమేజరీ ఉండదు. ఈ రకమైన పేటీజోలికీ పోక కుందుర్తి తన తనం నిలుపుకుంటూ తియ్యదనం ఊరించే తెలుగుతనం శైలిని నిర్మించుకున్నాడు. కుందుర్తి భాష ప్రజల భాష. అతని అలంకారాలు నిత్య వ్యావహారి కాలు. అతని పదబంధాలు తెనుగు నుడికార జన్యాలు. ప్రజల సమస్యలను ప్రజల భాషలోనే ప్రజలకు సన్నిహితమైన శైలిలో చిత్రించి వచన పద్యాన్ని తెనుగు జాతీయ ఛందస్సును చేసిన ఘనత కుందుర్తికే దక్కింది. ఈ లక్షణాలన్నీ 'నగరంలో వాన'లో పరిపక్వతకు సిద్ధింపజేసుకొన్నాయి.

# 3

# ఆరుద్ర - చిరంజీవి మానవునికి మృత్యువు

అభ్యుదయ కవుల్లో ఆరుద్ర ద్వితీయుడంటున్నారు కానీ, అతని శైలి మాత్రం అద్వితీయం. చలం తెలుగు నుడికారంమీద కసి తీర్చుకుని ఒక కొత్త శైలిని నిర్మించుకున్నాడు. ఆరుద్ర కావ్య భాషా సంప్రదాయం మీద కసి తీర్చుకుని ఒక విశిష్టమైన శైలిని రూపొందించుకున్నాడు. కుందుర్తి శైలి భాషలోని ప్రతిభను ఆవిష్కరిస్తే ఆరుద్ర శైలి కవి ప్రతిభను ప్రతిబింబిస్తుంది. ఆరుద్ర స్వచ్ఛందమైన శైలిలో భాషా భావ ఛందఃపరమైన ఎన్నో కొత్త టెక్నిక్‌లు దర్శనమిస్తాయి. ప్రాయికంగా టెక్నిక్‌మీది వ్యామోహం రసాన్ని బలిగొనే ప్రమాదం వుంది. ఆరుద్ర ఈ ప్రమాదానికి ఎక్కడా గురికాలేదు. అందుకు ఆయన భావుకత బలంగా అడ్డునిలిచి గెలిచింది. ఆరుద్ర సంస్కారం మరీ గాఢమైనది. భావుకతను సంస్కార బలంచేత కొత్త ఆలోచనలతో నింపి, ఆ ఆలోచనలను తను సృష్టించుకొన్న శబ్ద జాలంలో బంధించి అందిస్తాడు. అందరిలోకంటే ఆరుద్రలో ఆలోచనలపాలు ఒక బెత్తెడెత్తు. తన ఊహలూ, టెక్నిక్‌లూ అన్నీ తన సంస్కారం నుంచి ఊడిపడ్డవే! అన్నీ ప్రపంచానికి కొత్త. వచన ఛందం మనకెంత కొత్తో ఆరుద్ర కవిత అంత కొత్త.వచన ఛందస్సుకి రెడీమేడ్ నిబంధనలేవీ లేవు కాబట్టే ఆలోచనల నుంచే కొత్తగా తనకు ఉపయుక్తమైన లయను వెతుక్కుని వస్తుంది. అందుకే వచన పద్యానికీ, ఆరుద్ర కవితకూ అంత లంకె!

'చిరంజీవి మానవునకు మృత్యువు' ఖండిక 'త్వమేవాహం' కావ్యంలో ఉపనదుల శీర్షిక కింద వచ్చినా, తనకు తానే ప్రత్యేకంగా ప్రకాశించగల కావ్యఖండిక. ఉపనదులు అంటేనే ప్రవాహంతో సంబంధం లేకుండా దేనికది విడిగా ప్రవహించి వచ్చి, ప్రవాహంతో కలసిపోయేవి. ఈ ఉపనదులు మూడు. ఒకటి - భయం(నిన్న). రెండు - కామం (నేడు), మూడు - ఆకలి (రేపు). భయం-విష్కంభం! కామం-ప్రళయం! ఆకలి-నరకం! ఈ మూడు విభాగాల్లోనూ ఒకటే ఊహలు పరిణామ క్రమంలో ప్రవహిస్తాయి, అన్ని నదుల్లోని నీరు ఒకటే అయినట్లు

ఈ గేయంలో అన్వయ కాఠిన్యం కొంత ఉంది. అది మనకు సులభం కావాలంటే

– ఒక తెల్లకాగితం మీద మూడుగళ్ళ పట్టీ గీసుకుని, కావ్యం తీసుకుని ఈ ఖండికలోని విష్కంభ భాగాన్ని మొదటి గడిలో, ప్రళయం భాగాన్ని రెండవ గడిలో; నరకం భాగాన్ని మూడవ గడిలో వ్రాయండి. మొదటి గడిలో ఒక కల్పన తీసుకుని రెండవ గడిలో దాని మార్పును, అలాగే మూడవ గడిలో మార్పును పరిశీలించండి. లేదా మూడు గళ్ళలోని సమానార్థకాలైన పంక్తులకు క్రీ గీతలు గుర్తిస్తే ఇంకా మంచిది. ఇలాగే మిగతా కల్పనలను కూడా! నేనిట్లా చెబుతుంటే మీరొక ప్రశ్న వెయ్యవచ్చు – 'ఇట్లాంటి కవిత్వానికీ, మన ప్రాచీనులు చెప్పిన చిత్రబంధ కవిత్వానికీ భేదమేమిటి?' అని. చతుర్విధ కవిత్వానికీ దీనికి సంబంధం లేదు. అయితే ఇది మన ప్రాచీనులే చెప్పిన శతాధిక అలంకారాలలో ఒకటి కావచ్చు. ఈ ఖండికలో మూడు కాలాల పరిణామ క్రమాన్ని ఒకే కల్పన ద్వారా సూచించడంలో కవి క్రమాలంకారాన్ని పాటించి ఉన్నాడు. ఇక్కడ 'అలంకారం కవిత్వం అవుతుందా!' అనే ప్రశ్న జనించవచ్చు. అలంకారం ఒక్కటే కవిత్వం కాదు. అయితే ఔచిత్యవంతమైన, ఔచిత్య పోషకమైన అలంకారాన్ని చెప్పడంలో గడుసైన శిల్పం ఉందనడం పైమాట ఏమీకాదు. 'శిల్పం కవిత్వం అవుతుందా?' అని మళ్ళీ ప్రశ్నిస్తే – జవాబు చెప్పడం బుద్ధి తక్కువ. కవిత్వానికి ప్రాణభూతమైనది రసపోషణ అనండి. రసావిష్కరణ అనండి – అది శిల్పం ద్వారానే సాధ్యమవుతుంది. ఇక్కడ ఒకే కల్పనను మూడు దశలుగా విశ్లేషించి మూడు కాలాల స్వరూపాన్ని రూపుకట్టించడంలోనూ, సమాహారంగా అనంతకాల స్వభావాన్ని, త్రైకాలిక సారభూతమైన మానవ చైతన్యాన్ని ఆవిష్కరించడంలోనూ ఆరుద్ర కవిత్వ శిల్పాన్ని మహాగడుసుగా పలికిస్తున్నాడు. రసావిష్కరణ శిల్పంద్వారానే సాధ్యమవుతుందను కొన్నప్పుడు ఆరుద్ర టెక్నిక్‌లోని గురుత్వమూ, గాఢత్వమూ ఎంతటివో మనకు తెలిసివస్తాయి. శిల్పమూ, టెక్నిక్కూ పర్యాయ పదాలే అయినా మన తెనుగు కవులు అంతవరకు చూపిన కవిత్వ శిల్పం వేరు. ఆరుద్ర కవితా శిల్పం వేరు. ఆ విలక్షణత్వాన్నే 'టెక్నిక్' అనడం ద్వారా తెలియపరుస్తున్నాడు.

## తిలక్ శిఖరారోహణ

'అమృతం కురిసిన రాత్రి' కవితా సంపుటి 'నా కవిత్వం కాదొక తత్త్వం' అన్న

వాక్యంతో ప్రారంభమవుతుంది. తిలక్ కవిత్వం అన్ని తత్వాలనూ తాకుతుందికానీ, ఏ తత్వానికీ నిలబడదు. 'అయితే నువ్వొక సిద్ధాంతం మీద కదా ఈ ఎన్నిక చేస్తున్నావు. ఏ సిద్ధాంతమూ పట్టని తిలక్ కవితనెట్లా ఎన్నుకొన్నావు?'' అని ప్రశ్నించవచ్చు. ఏ సిద్ధాంతమూ పట్టనివాడు కాదు తిలక్ – కట్టుబడనివాడు మాత్రమే! పట్టిన సిద్ధాంతాన్ని బలంగానే చెప్పాడు. అయితే, ఏ సిద్ధాంతానికీ కట్టుబడని తిలక్, వ్యాఖ్యానం విషయంలో నా సిద్ధాంతానికి కూడా కట్టుబడలేదు. ఇంతవరకూ ఎన్నుకున్న కవితలో వ్యాఖ్యానం ప్రారంభమై దాని కవి దగ్గరకు వెళ్లటం జరిగింది. తిలక్ వ్యక్తిత్వం బలమైనది. ఆయన కవిత్వాన్నంతా అదే నడిపించింది. ప్రతి అక్షరంలోనూ దాని ముద్ర మనకు కనిపిస్తుంది. ముందు అతని వ్యక్తిత్వమూ, అది కవిత్వంలో ఎలాంటి లక్షణాలూ, గుణగణాలూ ప్రతిపాదించిందో తెలుసుకుంటేగాని ఆయన శిఖరారోహణలోని అసాధారణ ప్రజ్ఞ ఏమిటో మనకు తెలియదు. అందుకనే ఇక్కడ వ్యాఖ్యానం కవి నుంచి కవిత దగ్గిరకు నడువవలసి వచ్చింది.

ప్యూర్‌పొయెట్రీ (Pure Poetry) వినగానే గుండెను రెపరెపలాడిస్తుంది. తిలక్‌ది ప్యూర్ పొయెట్రీ. దానికి కారణం – అతనిలోని సంస్కారం చాల సోమరిపోతు అని చెప్పుకోవడం కన్న అతనిలోని భావుకత ఊహకందనంత పదునైనదని చెప్పడంలో ఎంతో నిజం ఉంది. అందరూ ఆలోచనల నుంచి అనుభూతిని పిండుకుంటే – తిలక్ అనుభూతిలోంచి ఆలోచిస్తాడు. శ్రీశ్రీ యథార్థ జీవితాలను చూచి ఆవేశపూరితుడవుతాడు. తిలక్ క్షతజగత్తును చూచి కరుణతో కరిగిపోతాడు. అందుకే శ్రీశ్రీ కవిత పరిత్పలోకాన్ని ఉద్వేగపూరితం చేస్తుంది. తిలక్ కవిత కరిగించివేస్తుంది. తిలక్ ప్రేమగీతం రాసినా, ఆర్తగీతం రాసినా, పద్యం రాసినా, వచనం రాసినా అన్నివేళలా శైలి ఒకటే! ఆ శైలిలోనే ఉంది అతని వ్యక్తిత్వం! అగ్నిజల్లినా, అమృతం కురిసినా అందం, ఆనందం దాని పరమావధి. ఆ పరమావధికి, తను ఎంత ఉన్నతమైన లక్ష్యాన్నైనా బలి చెయ్యడానికి వెనుదీయడు. ఆ అందం ఆనందం కలిగించడానికి సత్యవర్తనే అక్కర్లేదు. 'అబద్ధాన్ని ఆశ్రయించిన సుఖం నిజాన్ని నిరూపించే నరకం కన్న వెయ్యిరెట్లు నయం' అంటాడు. కవితావస్తువుమీద తిలక్ అభిప్రాయం యిది. తిలక్ తనే చెప్పుకున్నట్లు – 'ఆనందం మనిషైనవాడు, కలల పట్టుకుచ్చు లూగుతున్న కిరీటం ధరించాడు. ఎవరికీ దొరకని

రహస్యాల్ని వశపరచుకున్నాడు'. 'శిఖరారోహణ' ఉగాది నాసరా చేసుకొని లేచిన కవితాశిఖరం. ఉగాది రైలు వచ్చింది స్టేషన్‌లోకి. పాతమాటలతో కవులూ, వట్టి మాటల సంచులతో రాజకీయ వేత్తలూ మొహమాటం లేకుండా ముందే ఎక్కి కూర్చున్నారు. రైలింగ్ అవతల టికెట్లు దొరక్క ప్రజలు దిగాలుపడి నుంచున్నారు. ప్రజలు లేకుండా ప్రగతి ప్రయాణం సాధ్యమేనా? అందుకే 'రేపటి ఉదయానికి వేసిన పట్టాల్ని ఎవరో తొలగించి వేశారు!' ఈ సంఘటనతో ప్రారంభమవుతుంది ఖండిక. తర్వాత నేటి సమ్మెలూ, అల్లరులనూ ప్రకృతిపరంగా వ్యంగ్యంగా వివరిస్తాడు. ఆ పిమ్మట కొత్త సంవత్సరాన్ని కాపురంలో అడుగు పెడుతున్న కొత్త కోడలిగా సంకేతించి కాపురంలోని అవకతవకలు వర్ణిస్తూ దేశంలోని రాజకీయ కల్లోలాన్నీ, సంక్షోభాన్నీ ధ్వనింపజేస్తాడు. తర్వాత 'క్షితిజరేఖ వెనుక నిలిచి పిలిచే రత్నకంకణహస్తం' కనిపిస్తుంది. చరిత్ర విచిత్ర సముద్రం విరిసిన తుంపరల్లో తడుస్తాము. భవిష్యద్గగనం వంగి చెవిలో చెప్పిన రహస్యం వింటాం. ఈజిప్టు పిరమిడ్ల మధ్యా, బాబిలోనియా స్థూపాల మధ్య, మొహంజొదారో శిథిలాల మధ్య నిలిచి కలలు కంటాము. ఇంకా ముందుకు ప్రయాణం చేసి సృష్టి సింహం చేసిన ప్రథమగర్జన వింటాము. లుంగలు చుట్టుకుపోతున్న భూమి పేగుల్నీ, ఎగుడు దిగుళ్ళ దారిలో గిజగిజలాడుతూ పెనుగుతూన్న ప్రాణహరితాన్నీ, సూర్యుడి సంతోషపు వెలుతురునూ, విచ్చిన ప్రాణం చుట్టూ ఉబికిన వెచ్చని ఎర్రని నెత్తురునూ ఆదిమానవుడు నిలిచి పూరించిన శంఖమూ, సీజర్ కౌక్షేయధారా, అలెగ్జాండర్ అశ్వరింఖా ఘట్టనా, రాజ్యం, రమణినీ మించిన రమ్యభావనా—అన్ని దృశ్యాలూ మనల్ని ఊపివేస్తాయి. యుద్ధకాండలూ, కళాఖండాలూ అన్ని నిరంతర నూతన పరిశోధనలు! సత్యసౌందర్యాన్వేషణలు. ఒక్కొక్కడూ ఒక్కొక్క అన్వేషణలో ఒక శిఖరాన్ని ఆరోహణ చేస్తున్నాడు. ఈ ఖండిక ద్వారా తిలక్ మనల్నీ, మన సాహిత్యాన్నీమరో 'శిఖరారోహణ' చేయించాడు.

## 5

# అజంతా – చెట్లు కూలుతున్న దృశ్యం

'చెట్లు కూలుతున్న దృశ్యం' శీర్షికలాగే ఆ ఖండికలోని కవితా శైలి కూడా విలక్షణ

మైనది. అంతర్వీక్షణనుంచి సమాజాన్ని దర్శించే వచన కవితా శాఖకి ఈ ఖండిక అధ్య క్షత వహిస్తున్నది. అంతర్వీక్షణలో అజంతా భావుకత బలంగా పలుకుతుంది. సమాజాన్ని దర్శించే విధానంలోనూ, ఆ దర్శనను వినియోగించుకునే ప్రయోజనంలోనూ కవిసం స్కారంలోని సునిశితత్వం వెల్లడవుతుంది. 'ఆదర్శాలన్నీ ఆచరణలో కల్లలైపోగా అతడు చతికిలపడ్డాడు. విఫలమైన ఆదర్శాలే అతన్ని బాధించసాగాయి' – అన్న విషయాన్ని ఆవిష్కరించడంలో అజంతా తన కల్పనా బలంతో దాన్నొక దృశ్యంగా మన కళ్లముందు ఎట్లా రూపు కట్టిస్తాడో చూడండి. 'తలక్రిందులైన స్వప్నంమీద శల్యాకారంగా కూర్చున్న కుర్రవాడు, ఆపాదమస్తకం సూదులతో ముస్తాబై ఉన్నవాడు'.

శాబ్దికమైన లయకోసం కానీ, ప్రాసకోసం కానీ ఈ ఖండికలో కవి ఎక్కడా కాలాన్ని వ్యయం చేసిన సందర్భం ఒక్కటి కూడా లేదు. భావాన్ని వాక్యాలుగా మలిచి ఎత్తుగడలోనూ, ముగింపులోనూ ఒక సొగసును అందిస్తాడు. ప్రతి వాక్యాన్నీ రసాత్మకంగా తీర్చిదిద్ది కావ్య గౌరవాన్ని కలిగిస్తాడు. తెలుగు పలుకుబడిమీద అజంతాకు ఎంత అధికారం ఉన్నదో 'చెట్లు కూలుతున్న దృశ్యం' నిరూపిస్తుంది. వ్యావహారిక భాష బలంగా, బరువుగా కవిత్వంలో పలికిన విధానాన్ని ఈ ఖండికలో మనం దర్శిస్తాం. ఇందులో కవి వాడిన భాష వచన ఛందస్సు తత్త్వానికీ, వ్యక్తీకరణ వైఖరికీ, పలుకుబడి మర్యాదకూ ఒక అలంకారంగా భాసిస్తున్నది. ఇందులో పొరబాటున కూడా ఒక మారుమూల పదంగానీ, ఒక గ్రాంథిక రూపంగానీ చోటుచేసుకోదు.

ఒక్క నగరంలోనే కాదు దేశం గుండెలలో సాలీడులా అల్లుకున్న నేటి నిరుద్యోగ సమస్యను – 'బాధ అనే దీపం పట్టుకొని, సర్వనాశనం అనే తాళం చెవి పట్టుకొని, వెంకట్రావు జీవితం అనే చీకటి నరక కూపంలో భయంకరమైన ఆశ్చర్యాలు' అనేకం చూపిస్తాడు అజంతా. నేడు భారతదేశంలో నిరుద్యోగి వెంకట్రావులు అడుక్కొక్కరు ప్రత్యక్ష మవుతారు. వీరిని చూచి దేశ స్వాతంత్ర్యానికి చిహ్నమైన, ప్రభుత్వ భవనాలమీద జెండా సిగ్గుతో తలవాల్చుకున్నా ఆశ్చర్యంలేదట. మిత్రుడు వెంకట్రావు నిరుద్యోగి కాకుంటే – 'ఎంతో అందమైన సాయంత్రం కదా ఇలా అపస్వరాలు వినపడడం జరగదు. రోడ్డుమీద ధూళీ, దారిద్ర్యం సమస్తం మిత్రుడు వెంకట్రావు ముఖంమీదనే పరవళ్ళు త్రొక్కడం సంభవం కాదు' అంతేకాదు – 'నిరుద్యోగి వెంకట్రావు నగరం నడివీధిలో

తన జీవితాన్ని తెరుస్తుంటే, ఎందుకో అకారణంగా సూర్యుడు ఖిన్నుడౌతాడు, చెట్లమీద ఆకుసైతం అల్లల్లాడదు, టెలిఫోన్ తీగలలో వార్తాప్రసారం సాగదు' నిరుద్యోగి దౌర్భాగ్యం దేశంలో ఇంకా ఎంత సంక్షోభాన్ని కలిగిస్తుందో చూడండి– 'నిరుద్యోగి వెంకట్రావు గాలిలో, ధూళిలో ఎండుటాకుల సుడిగుండాలు తిరుగుతుంటే, గృహస్థులు ఆ రోజు సన్యాసం స్వీకరిస్తారు. పిల్లలుగల తల్లులు బావిలో దూకుతారు. విద్యార్థులు నడివీధిలో పుస్తకాలు తగులబెడతారు'. నేడు దేశంలో ఇంతకంటె ఏం జరుగుతున్నది. నిరుద్యోగం బాధలు మరచిపోవడానికి వెంకట్రావు మనస్సు గతంలోకి వెళ్ళి 'తన బాల్యస్మృతులు తలచుకుంటూవుంటే' నగరంలో పసిపిల్లలు ఆ పూట అన్నం ముట్టరు. పువ్వులు కోసుకుంటున్న పిల్లలు ఇంటికెలా చేరుతారు? అంతటా వ్యాపించిన రాజకీయాలు అజంతా దృష్టి నుంచి మాత్రం ఎట్లా తప్పించుకుంటాయి? 'నిరుద్యోగి వెంకట్రావు తన ఆకలిని రాళ్ళలో, రప్పలలో దాచుకొంటూవుంటే, రాజకీయవేత్తలు వాటిని వేలంపాటలో కొనుక్కుంటారు'. ఇంత భయంకర దృశ్యం మార్కెట్టులోనూ కనిపించకపోవచ్చుకానీ, జీవితంలో అడుగడుగునా మనం ఎదుర్కొనే నిత్యసత్యం. వెంకట్రావు విషాదం రంగు ఎలా ఉంటుందో తెలుసుకోవడానికే 'కవులు, చిత్రకారులు అతని కన్నీళ్ళపై పరిశోధనలు జరుపుతున్నా'రట. 'చీకటి పుట్టుపూర్వోత్తరాలను' వెంకట్రావు 'పాదధూళి'లో వెతికితే తెలుస్తుందట.

వెంకట్రావు జీవితం ఇంత భయంకరంగా రూపుదాల్చినా, అతడు చావడట. 'చావడం' అనే మహాపాపం చేయకుండా న్యాయాధిపతులు, ఎల్లవేళలా అతన్ని కాపాడుతూ ఉంటారట. వెంకట్రావు నగరంమీద ఒక మచ్చ. అది మానదు. నేటి సమాజానికి ప్రతిబింబం 'చెట్లు కూలుతున్న దృశ్యం'. నిరుద్యోగి భయంకర జీవిత దృశ్యాన్ని కవిత్వ రూపంలో గీసిన తైలవర్ణ చిత్రం ఇది.



# శ్రీనాథమహాకవి ఖగోళశాస్త్ర

శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావు

(ఇరవయ్యో శతాబ్ది భారతదేశ ఖగోళశాస్త్రవేత్తలలో అగ్రగణ్యులు శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు. భారతీయ పురావిజ్ఞానం విషయమై శ్రీ రాఘవరావు బాలగంగాధర తిలక్‌తో పోల్చగలవారు. 20వ శతాబ్దిలో చెప్పుకోదగిన మహామేధావులైన తెలుగు వారిలో శ్రీ వేలూరి శివరామశాస్త్రి, శ్రీ కోట వేంకటాచలంతో పాటు వీరు పరిగణనీయులని విశ్వనాథ సత్యనారాయణ గారన్నారు. సం॥)

ఏ భాషలోనైనను మహాకవులు రచించిన కావ్యములను చదువు విద్యార్థులకు ఆ కవుల భావములు స్పష్టముగా తెలిసికొనుటకు నక్షత్ర విజ్ఞానము అత్యవసరము. ఒకటి రెండుదాహరణములు చర్చింతము. దశరథునకు లేక లేక కలిగిన సంతానము – రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలువురును 'రుచ్యాప్రోష్ఠ పదోపమ' అనగా పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములు నాల్గింటివలెనే తేజముతో పెరిగి ప్రకాశించుచుండిరని వాల్మీకి రామాయణములో వర్ణించి యున్నాడు.

ఈ భాద్రపద నక్షత్రము లేవో, ఎట్టివో, ఖగోళమున నేవిధమున ప్రకాశించుచున్నవో పరిశీలించి చక్కగా పోల్చి తెలిసికొనినగాని వాల్మీకి యీ ఘట్టమున నీ రమ్యోపమ నేల రచించెనో గ్రహించి యానందింపజాలరు. ఇట్లే పునర్వసు 'మహామీన'మని వాల్మీకియు, సుదక్షిణాదిలీపుల సమాగమము 'చిత్రాచంద్రమసోరివ' అని కాళిదాసును 'క్వచి దంబరశ్రీరివ వ్యాధానుగమ్యమాన తరళతారకామృగః' అని బాణుడును, ఇంకననేక కవులనేక కావ్యములలో చేసిన దివ్యవర్ణనలను, రచించిన రమ్యోపమానములను సరిగా

అర్ధము చేసుకొని కవి భావము చక్కగా గ్రహించి, యానందించుటకు విద్యార్థులకు కూడ నక్షత్ర విజ్ఞానము మిక్కిలి యవసరము. ఇట్టి విజ్ఞానము లేకపోవుటచేతనే నన్నయభట్టారక శ్రీనాథాది మహాకవుల జ్యోతిర్విద్యా ప్రభావము తెనుగునాట నుజ్జ్వలముగా మెరయుట మాని మబ్బుచాటున మరుగుపడుట మన దురదృష్టము.

చుక్కలకు స్వతస్సిద్ధమైన తేజస్సు ఉన్నను, పగటివేళనయ్యది మన కతిసమీపమున నున్న సూర్యుని విశేష తేజస్సుచేత హరింపబడుట చేత నవి మరుగుపడియుండును. పగటివేళ వాని క్షాత్రము – తేజస్సు –ప్రకటితముకాదు. కనుక నవి పగలు క్షాత్రహీనములై నక్షత్రము లైనవని శతపథ బ్రాహ్మణమునందు తెలుపబడినది. రాత్రివేళల నమిత తేజస్సుతో నద్భుతముగా మెరయుచుండిన నక్షత్రములు సూర్యుడుదయమగు వేళకు కాంతిహీనములై కనపడకుండుట ప్రతి దినము ఉదయమున చూచుచున్నాము. ఈ విషయమును అనాది కాలము నుండి అనేక కవివరులు చమత్కారముగా నుత్ప్రేక్షించుచు రసవంతముగా వర్ణించియున్నారు.

“విశ్వమునకు చక్షురింద్రియము వంటివాడగు సూర్యభగవానుని పొడగనినంతనే చుక్కలు దొంగలవలె పారిపోయి అదృశ్యమగు ”నని ప్రస్కణ్వుడను ఋషి ఋగ్వేదములో వర్ణించెను.

దమయంతీ స్వయంవరమునకు వచ్చిన నానాదేశముల రాజకుమారులు, నిషధరాజు నలుడు సభారంగమున ప్రవేశించినంతనే “నలినాప్త సన్నిధి నక్షత్రములు వోలె” కాంతి తరిగి కళావిహీనులైరని శ్రీనాథ కవిసార్వభౌముడు శృంగార నైషధములో చమత్కరించినాడు. మరియు నా నైషధమునందే వేరొకచోట (8–8) సూర్యోదయమును వర్ణించుచు “సహస్రాంశుడను వేటకాడు తన కిరణములనెడు డేగలను, పిట్టల వేటకన్ని దిక్కులకు వదలగా, నక్షత్రములనెడి పావురములీ కిరణపు డేగల రాకకు భయపడి తుర్రుమని ఎగిరిపోయి అదృశ్యములైనవని ఎంతో రమ్యముగా నా కవిసింహుడు వర్ణించెను. ప్రాచీన పురాణగాథలలో ఉత్తానపాదుడను పేరుగల రాజ ఋషికి ధ్రువుడు కుమారుడని చెప్పబడినది. కాబట్టి మనవారు ధ్రువుని ‘ఔత్తానపాది’యందురు. తన సవతి తల్లి యాడిన పాడుమాటలకు రోషించి ధ్రువుడు బాల్యమునందే గొప్ప తపస్సుచేసి

భగవంతుని మెప్పించి దివ్యమైన పదముల బడసి తుదకు ప్రాముఖ్యమైన నక్షత్ర స్థానము నందగలిగెను. ధ్రువుని పరివేష్టించి కొలుచుచున్నవో యన్నట్లు చుక్కలు ధ్రువుని చుట్టు తిరిగి వచ్చుచున్నట్లు మనకగపడును.

కాబట్టి శ్రీనాథ మహాకవి ధ్రువుడు "తారకావళి తులాదండయష్టి' యని కాశీఖండ మునందును, "ఆకాశమండలాస్థాన రత్నము" అని శృంగార నైషధమునందును ఎంతో రమ్యముగా ధ్రువుని వర్ణించి యున్నాడు. నలదమయంతుల వివాహ సమయమునందు ఆ వధూవరులిరువురును 'అర్రెత్తిచూచిరి ఆకాశ మండలాస్థానరత్నం బు నౌత్తానపాది" అని నైషధములో ధ్రువప్రశంస. "త్రైలోక్యమండప స్తంభ సంభారము" "గగన లక్ష్మీకంఠ కనకభూష" ఇత్యాద్యాలంకార భాషా ప్రశంసలలో శ్రీనాథ మహాకవి ధ్రువుని ప్రాముఖ్యము తాను గ్రహించి ఆంధ్ర లోకమునకు చక్కగా వ్యక్తము చేసియున్నాడు.

(సప్తఋషులలో) వసిష్ఠుని ప్రక్క అరుంధతీదేవిని శ్రీనాథ మహాకవి "పరమ పతివ్రతా పరిషచ్ఛిరోమణి" యనియు "త్రైలోక్యపతి దేవతాఫాల తిలకము" అనియును దివ్యముగా ప్రశంసించియున్నాడు. మరియు నా కవిసార్వభౌముడు కనులకు కట్టినట్లు వర్ణించిన విధముగా నలదమయంతులేకాక వివాహ కాలమందు నేటికిని వధూవరులెల్లరును కేలుదోయెత్తి యొాదలగీలుకొలిపి "గగనముని రాజులైన చుక్కలకు" మ్రొక్కుచుందురు. అపుడే అరుంధతీ సాధ్వి దర్శనము చేసికొందురు.

కృత్తిక చుక్కలను శ్రీనాథమహాకవి "వలిపె తెరలోన నున్న భావంబు దోప" అని వర్ణించాడు. మేరుపర్వతముమీది స్పర్ధచేత వింధ్యపర్వతము పెరిగి మిన్నుముట్టి గ్రహనక్షత్ర గమనమును స్తంభింపజేసినపుడు రోహిణి చుక్కలెట్లుండెనో శ్రీనాథుడు వర్ణించినాడు. 'ఒకచో తగుల్పడి యుపకారి కొరటికి తరమైన రోహిణీ తారకంబు' అనగా కొయ్యలకును మేకులకును త్రాళ్ళతో బిగించి గట్టిగా కట్టిన డేరావలె 'రోహిణి' ఖగోళమున నిలిచి పోయెనని శ్రీనాథుని యభిప్రాయము. ఇచ్చటి రోహిణీ నక్షత్రమును గమనించి ఆకాశముమీధ చుక్కలను పోల్చి పరిశీలించినపుడు ఆ కవిసార్వభౌముడీ చుక్కల గుంపునెంత స్వభావ సిద్ధముగ వర్ణించినాడో యని మెచ్చుకోగలము.

శ్రీనాథ మహాకవి కాశీఖండము (3-176)లో వెలుగు 'నిమేషార్ధ మాత్రమున రెండువేల రెండు వందల రెండు యోజనములు' గడచిపోవునని విశదముచేసియున్నాడు. ఈ సంఖ్య

సంస్కృత మూలములో లేదు. (నిమిషమనగా ఇంగ్లీషు 'మినిట్'కాదు. 16/75 సెకండ్ల కాలమని గణించుకోవలెను. నిమేషార్థమనగా ఇందులో సగము 8/75 సెకండ్ల కాలము.)

కాబట్టి గణితరీత్యా ఇప్పటి సెకండుకాలములో సూర్యకిరణములు 1,87,670 ఇంగ్లీషు మైళ్ళు గడచిపోగలవని మన పూర్వుల రచన వలన తేటపడుచున్నది. ఇప్పటి ఇంగ్లీషు వైజ్ఞానికుల నిర్ణయ ప్రకారము వెలుగు కిరణములు ఒక సెకండు కాలములో 1,86,325 మైళ్ళు పోవునని నిశ్చయింపబడినది.

చంద్రమండలము పితృస్థానము. పితృకార్యములలో జనులు 'స్వధానమః' అని విడుచు తిలోదకములు మంత్రబలమున చంద్ర మండలమునకెక్కి పితృలకందునని భారతీయుల విశ్వాసము. శ్రీనాథ కవిసార్వభౌములీయంశముల నీక్రింది పద్యములో చక్కగా విశదీకరించినాడు. 'చంద్ర మండలమిది పితృస్థానమగుట, జన సమార్జితమగు స్వధాసలిలతిలలు, మంత్రబలముననెక్కె' (శృం.నై. 7-190)

దమయంతి నలుని వరించిన తర్వాత సమస్త దేవతాసమక్షమునందు సరస్వతి ఆమె నేమని యాశీర్వదించినదో నైషధము తెలుపుచున్నది. 'ఆదిమశక్తియైన తుహినాచల రాజ తనూజవోలె, ముత్తైదువవై నిజేశ్వరుని యర్ధశరీరము పాలుగొమ్ము' అని దీవించినది. దమయంతికేగాక సమస్త స్త్రీలోకమునకును ముత్తైదువతనమును వరమిచ్చి రక్షింపగల శక్తిమంతురాలు పార్వతీదేవి. ఆ మహాదేవిని, పరమశివుని మన దేశములో ప్రజలెంతో భక్త్యుత్సాహములతో పూజించి గొప్పయుత్సవములు చేయుచుందురు.

ఈ యుత్సవములు ముఖ్యముగా కార్తీక మార్గశిర మాసములలో జరుగుచుండును. ఆ దినములలో సూర్యాస్తమానము కాగానే తూర్పున ముందు వృషభరాశి నక్షత్రములును పిమ్మట మిధునరాశి నక్షత్రములును ఉదయమగును. పరమేశ్వర ప్రీతికరములైన కార్తీక సోమవారములు రుద్రదైవత్యమైన ఆర్ద్రనక్షత్ర దర్శనము కాలభైరవాష్టమి, జ్వాలాతోరణములు, పున్నమనోములు లోనుగ శైవోత్సవములనప్పుడే మన ప్రజలు జరుపుచుందురు.

కార్తీక శుద్ధ ప్రతిపద్దినమున విశ్వేశ్వరుడు కాశీక్షేత్రమునందు ప్రవేశించెను. (చూ. కాశీఖండము -శ్రీనాథ ప్రణీతము 7-220). మార్గశిర శుద్ధ చతుర్దశినాడు, రోహిణీ నక్షత్రమున భీమేశ్వరస్వామి దక్షపురి ప్రవేశించి అచ్చట నభిషిక్తుడయ్యెను. అప్పుడే

దేవేంద్రుడు దాక్షారామ భీమేశ్వరునకు భీమమండలము ధారవోసి సమర్పించెను. (చూ. శ్రీనాథ కృత భీమేశ్వర పురాణము 11-42, 84)

శ్రీనాథ కవిసార్వభౌముని వర్ణనలో పునర్వసు నక్షత్రముల సహజ లావణ్యము చక్కగా స్ఫురించుచున్నది. 'ఒకచో పునర్వసు ఊగె వృక్షము కొమ్మ సుడివడ్డ ముత్యాల సొబగు వోలె' - కాశీ.1-138. మేరు పర్వతముపై ఈర్ష్యచే వింధ్యము పెరిగిపోయి నక్షత్ర మండలము నంటి విశ్వవ్యాపారములను స్తంభింపజేసినపుడు పునర్వసుచుక్కల తళుకు మిణుకులు ఎట్లున్నవనగా - చెట్టుకొమ్మకు తగుల్కొని ఊగుచున్న ముత్యాలహారములో మిలమిలలాడు ముత్యములవలె లావణ్యముతో మెరయుచున్నవని చక్కని యుపమానము. శ్రీనాథుడు చేసిన ఈ పునర్వసు వర్ణనము సజీవము, రసవంతము, సముజ్జ్వలమునై యొప్పుచున్నది. శ్రీనాథుడు వర్ణించిన పునర్వసు ముత్యాలహారమునకు పూర్వశ్వాన నక్షత్రము నాయకమణి యననొప్పును. ఈ నక్షత్రము పదిన్నర వెలుగు వత్సరముల దూరమందున్నది. సూర్యునికంటె అయిదున్నర రెట్లు తేజోధికమైన గోళము.

విశేషించి శ్రీనాథుడు 'హాలహాలంబను నల్లనేరెడిపండు మిసిమింతుడునుగాక మ్రింగినాడు' అని చక్కగా వర్ణించిన భీమ రుద్ర రూపము మృగవ్యాధ నక్షత్రమే.

చిత్రకు అధిదేవత ఇంద్రుడని కృష్ణయజుర్వేదములో చెప్పబడినది; 'త్వష్ట' అధిదేవతయని మరి కొన్ని ప్రమాణములున్నవి. 'త్వష్టానక్షత్ర మధ్యేతి చిత్రామ్' అని మంత్ర పాఠములు తెలుపుచున్నవి. త్వష్టయను నతడు దేవతల దారుశిల్పి; వడ్రపు పనిచేయు వడ్రంగి (Carpenter of gods)

కన్యారాశిలో ముఖ్య నక్షత్రమగుటచేత చిత్ర చాల ప్రసిద్ధమైనది. ప్రపంచ వాఙ్మయములోన నీ కన్యారాశికిగల ప్రాముఖ్యము మరొక రాశికి లేదు. కన్యారాశికి దిగువ విశాఖ చుక్కలున్నవి. విశాఖ ఇంద్రాగ్నీ దైవత్యమైన నక్షత్రము. తులారాశిలో దక్షిణపు సిబ్బి యీ విశాఖ చుక్కలేయగుచున్నవి. విశాఖ కుమ్మరి సారెవలె గుండ్రముగానుండును.

ఈ వర్తులాకారమును శ్రీనాథుడు చమత్కారముగా వర్ణించినాడు. "చిఱుతవోయిన మూకుటి చెలువు దాల్చి హత్తె నొకచో విశాఖ వింధ్యాద్రి యందు' అని వింధ్యపర్వత పుటలజడిలో ఆ పర్వతముపైచిక్కి, చిన్నబోయిన మూకుటివలె విశాఖ నక్షత్రములు

చిక్కుకొనెనని శ్రీనాథుని యుపమానము.

ద్రౌపది రుద్రపత్ని; మహాశక్తి స్వరూపము. బాల, దుర్గ, భవాని, కాళికాదేవి, త్రిపురసుందరి మొదలగు బహునామములచే ప్రశంసించి పూజింపబడు దేవత ఈ కన్యయే. భవానికి తులజయని నామమున్నది. తులజ యనగా తులారాశి నుంచి జనియించినది. అడుగున తులారాశియు ఆపైన కన్యారాశియునుండుటచేత కన్యారాశి 'తులజ' యనియే చెప్పతగియున్నది. మహారాష్ట్ర దేశమున తులజాపురమను గ్రామములో భవానిదేవి వెలసియున్నది. ఈ దేవియే శివాజి మహారాజు ప్రోలసాక్షాత్కరించి తన పేర 'భవాని'యను ఖడ్గరత్నమాతని కనుగ్రహించినట్లు చరిత్ర తెలుపుచున్నది. శివఛత్రపతి హస్తము నలంకరించిన భవానీనామక భయంకర ఖడ్గమాతనికి తులజాదేవి యొసగినదే.

బంగాళా దేశములో దుర్గపూజ యతివైభవముతో జరిపెదరు. దుర్గాదేవికి వాహనము సింహము. సింహరాశిపై కన్యారాశి యుండుట చేత దుర్గకు వాహనము సింహమేయనుట ఒప్పియున్నది. వాహనమే కాదు ధ్వజము గూడా సింహమేయగును. గరుడుడు విష్ణు భగవానునకు వాహనము, ధ్వజముకూడనైనట్లు, వృషభమీశ్వరునికి వాహనము, ధ్వజమునైయున్నట్లు, సింహము దుర్గకు వాహనము, ధ్వజమునై యొప్పుచున్నది.

ఈ యంశమును శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యములో చక్కగా వర్ణించినాడు. (3–98)

'ప్రతిభ సతతంబు గొల్తురా భద్రకాళి
జగతి నేబదియారు దేశములవారు
దశదినంబులు సింహకేతనమునిల్పి
హూణభూమికి దైవమీయుత్పలాక్షి'

సూర్యుడు తులారాశిలో ప్రవేశించునప్పటికి సూర్యోదయాత్పూర్వము కన్యారాశి తూర్పున నుదయించును. 'ప్రాతర్యావాణా ప్రథమాయం జధ్వ'మను వేదవాక్యముననుసరించి మనవారు ఆ దినములలో దుర్గను భక్తితో పూజింతురు. సాధారణముగా నా దినములు ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు దశమి వరకు ఉండునుగాన నప్పుడే దేవీనవరాత్ర ఉత్సవములు జరుగును.

**'హూణభూమికి దైవమీ యుత్పలాక్షి'**

దుర్గరూపధారణియగు కన్యారాశి భరత ఖండస్థులమగు మనకేగాక క్రైస్తవ

మతావలంబకులగు హూణులకు గూడ దైవమని ఐదువందల యేండ్ల క్రిందటనే శ్రీనాధ మహాకవి తెలిపియున్నాడు. ఇటీవల పరిశోధనల వలన నీ వాక్యము గొప్ప సత్యమని ధ్రువపడినది. క్రైస్తవ మతస్థాపకుడగు యేసుక్రీస్తు ఈ 'కన్య' కుమారుడు. అతడు స్థాపించిన క్రైస్తవ మతమిపుడు ప్రపంచమంతటను వ్యాపించి యున్నది. అతని తల్లి Virgin Mary. మేరీ కన్యను మన దేశములో పామరులు కన్నెమారెమ్మ అనుచుందురు. ఆమె భర్త యొక వడ్రంగి. క్రీస్తు ఆమెకు ఈ వడ్రంగి భర్తవలన జన్మించినవాడు కాదు. అతడు భగవదంశ సంభూతుడు.

'ఏ మహోజ్జ్వల గోళమును మనము సూర్యభగవానుడనుచున్నామో ఆ సూర్యభగవానుని తేజోంశ సంభూతుడే ఏసుక్రీస్తని ఎడ్వరుడు కార్పెంటరు Edward Carpenter అను విద్వాంసుడు సిద్ధాంతము చేసినాడు.' అందుకు కారణములీ దిగువ వ్రాయుచున్నాము.

ఏసుక్రీస్తు జన్మము ఇప్పటికి రెండు వేల ఏండ్ల క్రిందట డిసెంబరు నెల 25వ తేదీని జరిగినది. డిసెంబరు నెల హేమంత ఋతువులోనిది. లోకమంతయు చలిచే 'ఉహుహూ'యని వణుకుచుండు కాలమది. అందును ఉత్తరధ్రువ ప్రాంత దేశములకు పోవుకొలది అహః ప్రమాణము తగ్గుచు చలి మిక్కుటమగుచుండును. ఆ దినములలో సూర్యుడు స్వశక్తి గోల్పోయి తేజోహీనుడై చచ్చినట్లే యుండును. అట్లుపడియుండి డిసెంబరు 25వ తేదీని పునర్జన్మము బడసినాడన దగియుండును. ఆ వరకు దక్షిణాయన గతుడైన ఆదిత్యుడు ఆనాటి నుండి ఉత్తరాయణ గతుడగును. అంతవరకు తేజోష్టదూరుడై దక్షిణముగా పోవుచు ఎన్నడో చచ్చినట్లున్న సూర్యుడు యమదిగ్యానము చాలించి దిశమార్చి ఉత్తర దిగ్గమన మారంభించి తేజోవృష్ణ వృద్ధి బడయుచుండును. హస్త సవితృదేవతాకము. అప్పటి కన్యారాశి స్థానమును బట్టి సూర్యుడీ కన్య కుమారుడనిరి. ఆనాటి సూర్యోదయమునకు ముందు కన్యారాశి పూర్తిగా తూర్పుననుదయించి కొంత తడవు మెరసిన పిమ్మట సూర్యుడు ఉదయించుటచే నీయర్కుడు కన్యారాశి కుమారుడనిరి. చిత్రార్థమువరకు – చిత్ర రెండు పాదములు గడచువరకు – కన్యారాశియేగదా! చిత్ర కథి దేవత త్వష్టయను దేవశిల్పి. మేరీ కన్య భర్త వడ్లవాడని బైబిలు నుడువుచున్నది. ఈ వడ్లవాడే దేవతల త్వష్టయని విమర్శకులకు స్ఫురింపకపోదు.

క్రీస్తు జన్మించిన డిసెంబరు 25వ తేదీ నాటికి తొలిదినమున సాయం సంధ్యవేళ

తూర్పుననొక పెద్దచుక్కయు దానికి ముందుగా ముగ్గురు రాజులని చెప్పదగిన మూడు చుక్కలును ఆగపడెనని బైబిల్ తెలుపుచున్నది. పైని వ్రాసిన పెద్ద చుక్క Sirius మృగవ్యాధుడు, చిన్న చుక్కలు మూడును మన రైతులు గొల్లకావిడి చుక్కలని చూపుచుక్కలే.

క్రీస్తు పుట్టిన దినములు క్రిస్మస్ పండుగలు. మరి ఆరువారములకు Candlemas, కొవ్వువత్తి దీపములు వెలిగించి పండుగలు చేయుదురు. ఈ పండుగలు సూర్యుని తేజోష్ణవృద్ధి సూచకములు. మన దేశములో గూడ ఆ రోజులలోనెన్నో దీపములు, జ్యోతులు వెలిగింతురు. మరి కొందరు అఖండ దీపములు, అఖండ జ్యోతులు వెలిగించి కొన్ని రోజులు వరుసగా అవి వెలుగుటకు చమురు పోసి ఆరిపోకుండ శ్రద్ధ వహింతురు.

క్రీస్తును పట్టి శిలువ వేయుట Crucifixion of Christ ఈస్టరు పండుగలు. కొవ్వువత్తుల దీపములు పండుగ అయిన తర్వాత దిన దినమును తేజోష్ణములయందు వృద్ధిగనుచు సూర్యుడు విషువద్వృత్తమును చేరుకొనును. ఈ విషువద్వృత్తము, క్రాంతి వృత్తమును నాడు మేషరాశిలో (Cross) సంధించుచుండెను. మేష రాశిలో సూర్యుడీ విషు వద్వృత్తమును సంధించుట Crucification and Death of Lamb-God అని చెప్పబడుచున్నది.

ఏసుక్రీస్తునకు పండ్రెండుగురు శిష్యులు. ఈ ద్వాదశ సంఖ్య పండ్రెండు రాశులు కావచ్చును. లేదా పండ్రెండు మాసములైను గావచ్చును. శ్రీకృష్ణునకు అర్జునునివలె క్రీస్తునకు జాన్ ముఖ్య శిష్యుడు. ఈ జాన్ శబ్దము 'అర్జున శబ్ద వికృతి' యని కూడా కార్పెంటర్ దొర వ్రాయ సాహసించెను.

పడమట సూర్యుడస్తమించిన పిదప విశాఖపై కన్యరాశి తూర్పుటాకాశమున ఉదయించిన దినమును క్రైస్తవులు ఎసెన్షన్ Ascension దినములుగా భావింతురు. ఎసెన్షన్ దినము ఈస్టరు తరువాత నలుబది దినములకు మే నెలలో గురువారమున సంభవించును. పిమ్మట సూర్యోదయా త్పూర్వము కన్య తూర్పున ముందగపడిన దినము కన్యా జన్మదినము. Nativity of the Virgin. ఇవి సెప్టెంబరు నెలలో వచ్చుపండుగలు. ఖగోళమున కన్యారాశి యొక్కయు సూర్యగోళము యొక్కయు స్థితిగతులను బట్టి ఈ పండుగ లాయా తారీకులను నిర్ణయింపబడినవేగాని యన్యముగాదని కార్పెంటరు

దొరగారు Pagan and Christian Religions; their origin and meaning అను గ్రంథములో సిద్ధాంతము చేసియున్నారు. ఆ గ్రంథ రాజములో ఆ విమర్శకుడు క్రైస్తవ మత ప్రచారకులు తత్పూర్వపు మిత్ర దేవ పూజాకార్యక్రమమును (Mithraic Worship) ప్రాచీన క్రైస్తవేతర మత గ్రంథముల నుండి సంగ్రహించి క్రొత్త క్రైస్తవ మతాంశములుగా పరిణమింపజేసిరని సోపపత్తికముగా రుజువు చేసియున్నారు.

కాశీఖండములో వింధ్య పర్వతపుటార్భాట సందర్భములో 'స్వాతి, చిత్రలు తోరణ స్తంభయుగముననుసరించుచు నొక్కచో నత్తమిల్లె'నని శ్రీనాథ కవిసార్వభౌముడు వర్ణించెను. శృంగార రసార్ణవాధిపతియగు శ్రీనాథుడు నైషధములో మన్మథుని వర్ణించినదీ క్రింది పద్యభాగము.

'గుడుసైన పూవింట గూడి కమ్మని తూపు కటకాముఖపుకేల కరము మెరయ,
కటి మండలంబుపై కనకంపు చెఱగుల జిలుగు పచ్చని పట్టుచేల మమర
నా లీఢపాద విన్యాసంబు శృంగార వీరాద్భుతములకు విందు సేయ
చిన్న చిగురాకు బేర్కోల చేతబట్టి, పేరుటామని రాచిల్క తేరునడుప
నుక్కడీడయి యేతెంచె నుక్కుమిగిలి.....'

(అంతేకాక) శృంగార నైషధములో మన్మథుని దివ్యశరంబులు 'పువ్వుమొగ్గలో యూహ మొనర్పగా పిడుగులో కలశంబులో?' అని పృచ్ఛచేసినాడు.

శివరాత్రి మాహాత్మ్యంలో 'ఇనుడు కోదండరాశి మీదెక్కువేళ, ఇక్షు కోదండవల్లి యెక్కిడె మరుండు' అన్నాడు.

క్షీరసాగరములో శేషశయనముపై విష్ణువు పవ్వళించిన దృశ్యము 'బొజ్జ పెంచిన పెనుపాప సెజ్జమీద పాలమున్నీటిలో శౌరి పవ్వళించు' నన్నాడు. 'అమృత వారాశిలోన శేషాహిమీద పవ్వళించిన కౌస్తుభా భరణుడు' అని శివరాత్రి మాహాత్మ్యములో కూడ వర్ణించినాడు. (ఇవి ఖగోళ దృశ్యములు).

విష్ణుని నాభీకమలము నుండి మరొక చక్కటి దృశ్యము కమల ముద్భవించినట్లగపడును. ఈ కమలము తూర్పుపడమరలకు 'పొడవు మిగిలిన పొందమ్మి పూవు వలెనున్నదని శ్రీనాథుడు చేసిన వర్ణన దీనికెంతయు యొప్పియున్నది.

శ్రీనాథ కవిసార్వభౌముడు కాశీఖండములో వింధ్య పర్వతార్భాట సందర్భములో

'శయనించెనొక చోట శ్రవణ నక్షత్రంబు గుంటి మీదటి ప్రత్తికాదుపువోలె'నని వర్ణించెను. ప్రత్తి చేనిలో కాయలు పగిలి మూడు కొదుప్రలు గాలికెగిరి యొకచోట చేరుకొని నిలిచిన ప్రకృతి దృశ్యము చూచినపుడు ఖగోళ శ్రవణ (నక్షత్రము) రూపమును శ్రీనాథుడెంత చక్కగా వర్ణించెనో బోధపడగలదు.

శ్రీనాథుడు కాశీఖండములో బోధనైకాదశినాడు అప్పుడే నిద్ర మేలుకొనిన విష్ణుభగవానుని దివ్యమూర్తిని వర్ణించినాడు.

శృంగార నైషధములో నలదమయంతుల వివాహానంతరము వరుణుడు స్వగృహోన్ముఖుడై పడమట కరుగు దృశ్యమును ఆకాశ లక్ష్మియను చక్కని స్త్రీయొక్క చెవులను మెరయుచున్న చేపబావిలీల విధమున వరుణ పాశము గగనసీమను మెరసెనని వర్ణించాడు.

మహేశ్వరుని విశ్వరూప విశేషమును నలుడు ఖగోళమున దమయంతికి చూపుచున్నట్లు శ్రీహర్షుడు రచించిన శ్లోకమును శ్రీనాథుడు సొగసుగా తెనిగించినాడు.

పంచఖండ పంచ మహాసముద్ర ముద్రితమైన మన భూగోళము యొక్క వ్యాసము సుమూరు ఎనిమిది వేల మైళ్ళు; చుట్టుకొలత ఇరువది ఐదువేల మైళ్ళు, సూర్యగోళ వ్యాసము ఎనిమిది లక్షల అరువది ఏడు వేల మైళ్ళని నవీన వైజ్ఞానికులు గుణించి తేల్చియున్నారు. "ఆకాశ మధ్యస్థమగు భాను బింబంబు విను లక్షయోజన విస్తృతంబు" అని కాశీఖండమున శ్రీనాథుడు తెలిపెను. ఈ లెక్క ఇంచుమించుగా నేటి లెక్కలతో సరిపోవుచున్నది.



# కన్యాశుల్కస్థ గ్రామ్యభాషావాద విమర్శనము

శ్రీకాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి

కన్యాశుల్కమొక మంచి ప్రహసనము. ఇందుబ్రజల యాచార వ్యవహారములు బాగుగాఁ జదువరుల హృదయముల నాటునట్లు తెలుపఁబడియున్నవి. పాత్రముల వర్తనములు బీజాంకుర న్యాయముగా వరుసగా వృద్ధి చేయఁబడినవి. ఇందువాడఁ బడిన భాష పాత్రోచితముగా నున్నది. అయ్యదిగ్రామ్యము. ఇట్టి ప్రహసనములందు గ్రామ్యము వాడుటయే యుచితము. ఈ ప్రహసనము చదువఁదగినదై యున్నది. దీనిని విరచించినవారు విజయనగర వాస్తవ్యులగు మహారాజశ్రీ గురజాడ అప్పారావు పంతులు బి.ఏ.గారు. రాయబహదరు వీరేశలింగకవిగారి ప్రహసనములకంటె చాలా ప్రౌఢముగా నున్నదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

గ్రామ్యము గ్రాంథిక భాషగా నుండఁదగునా? –

శ్రీమదప్పారావు పంతులవారి రూపకము కన్యాశుల్క విషయమునఁ దగుపని చేయగలిగినను, గలిగింప లేకుండినను, ఏతాదృశ సంస్కారము చేయఁగలిగినను లేకున్నను భాషా విషయిక సంస్కారమును దెచ్చి పెట్టుటలో మాత్రము కొంత జయము నందినది. ఇప్పుడు బడులలోఁ గన్యాశుల్కమునందున్న బాసవంటి బాస బోధింపఁబడ వలెనని తేలుచున్నదఁట! దొరతనమువారి పాఠశాలా పరీక్షకులగు యేట్సు దొరవారు బడులలో గ్రామ్య భాషయే బోధింపఁబడవలయునని తీర్మానించిరట! హాస్య రసప్రధానములు సంఘ సంస్కారపరములు నగు వ్రాఁతలందుగ్రామ్య భాషవాడఁబడిన వాడఁబడుగాక. రూపకములలో నీచ పాత్రములకు గ్రామ్యమే వినియోగింపఁబడుగాక,

ఇది సర్వత్రగ్రాంధిక భాషగా నుండుటకును బదులలో బోధింపబడుటకును మాత్రముతగదు. ఏమన:-

"గ్రామ్యా గ్రామ్య విభాగపరం వ్యాకరణం" - అహోబలపండితీయము.

భాష వ్యావహారిక మనియు గ్రాంథికమనియు రెండు విధములు. వ్యావహారిక భాష హద్దులకు లోనుగాక మంచి సంస్కారముల నందక స్వేచ్ఛా సంచారము కలిగి యందఱినోటంబడి కులటవలె భ్రష్టతనంది యుండును. గ్రాంథిక భాష యున్ననో సదాచార్యులవారివలని సంస్కారములను బొంది హద్దు గలిగిగ్రంథములందు వర్ణితయై సౌష్టవ సౌకుమార్యాదులు గలిగి వీధింబడి సంచరింపక పెద్దల సుద్దులకు లోఁబడి పతివ్రతవలె శుద్ధపద క్రమము గలిగి శోభించుచుండును. భాషాపాతివ్రత్యము నేను క్రొత్తగాఁ దెచ్చి పెట్టినది గాదు."Chastity of Language" (చేస్టిటీ ఆఫ్ లాంగ్వేజ్) అని పాశ్చాత్యులు వాడుదురు. భాషయొక్క పాతివ్రత్యమని దీనియర్థము. అనగా శుద్ధత్వమనుటయే. మనవారును సుశబ్దాపశబ్ద నియమములేకవ్రాయు కవితను గుకవితఁ గా నెంచి దానిని వేశ్యతోఁ బోల్చియున్నారు.

శ్లో॥ గణయంతి నాపశబ్దం నవృత్త భంగం క్షయం నచార్థస్య! రసికత్వే నాకులితా వేశ్యావతయశ్చ కుకవయశ్చ,' అని సుభాషితరత్నాకరమునందుఁ జెప్పినరీతిగా నియమములేని గ్రామ్య భాషను విద్వాంసులాదరించి గ్రంధస్థము చేయఁదగినది కాదు. సమస్త దేశములందును గూడ వ్యావహారిక భాష వేఱుగను గ్రాంథిక భాష వేఱుగను నున్నవి. ఇప్పుడు చాలా పేరును బెంపును గలిగియున్న యాంగ్లేయ భాషయందుఁ గూడ నీ భేదము కలదు. వ్యావహారికాంగ్లేయ భాషకును గ్రాంథికాంగ్లేయ భాషకును జాల వ్యత్యాసము కలదు. ఇప్పుడింగ్లీషు భాషయందు బి.యే.లు; యెం.యే.లుగానున్న వారు కూడ - ఇంగ్లీషువారింటికడ వాడుకొను వ్యావహారిక భాషను - గ్రహింపఁజాలరు. అది మనకింగ్లీషు వలెనే కాన్పింపదు. లాటినో గ్రీకో భాషయో వలెఁదోఁచును. ఈ క్రింది వాక్యములం గనుఁడు.

"Now doan't, Rachel! I Wouldn't ha'done it, only I wanted summut to buy'ee a fairing wi,' and I be as vlush o' meny as a twodo' veathers"

"Thee mind what I tells'ee." - "Tom Brown's School Days."

(1) వ్యావహారిక భాషనే గ్రాంథిక భాషఁగాఁజేయునెడల ముద్దుల మూటకట్టు తెలుంగు భాషయే నశించును. ఒకవేళ నొంటి ప్రాణముతో జీవించినను దొల్లింటి మార్దవమును నిలుపుకొనఁజాలదు. ఈ హిందూ దేశములో నాంధ్రదేశము మిక్కిలి చిన్నది. తెలుంగు మాటలాడువారు చాలా తక్కువ. రాజభాష ఇంగ్లీషు. మూఁడువంతులువ్యవహారము కూడ వీరి చేతులలోనే యుండుటచే వ్యావహారిక భాషయు నింగ్లీషే యగుచున్నది. ఈ స్థానమును దొల్లి తురుష్క భాష పొందియున్నది కావున, వ్యావహారిక భాషలో నిప్పుడు మూఁడు వంతులకంటె! బైఁగా తురక భాష, ఇంగ్లీషు భాష మున్నగునవి వచ్చి పడినవి. ఇప్పుడొక యుత్తరము వ్రాసికొనిన నందుఁ దెలుంగు శబ్దముల గంచుకాగడాలతోఁ బరిశోధింప వలయును. ఒక పత్రము వ్రాసికొనిన నందుఁ దెలుంగు పదముల వెతుక వలయును. దొరతనమువారికి, మనవిని బంపుకొనిన నందుఁ దెలుంగు శబ్దముల గంచుకాగడాలతోఁ బరిశోధింప వలయును. ఒక పత్రమువ్రాసికొనిన నందు నాంధ్ర వాక్కులు మందునకైనను గానరావు. ఇఁకగ్రంథములు కూడా వ్యావహారిక భాషలోనేవ్రాసినయెడలఁ దెలుఁగెక్కడఁ గానంబడును? దానిఁ జూచు భాగ్యము మనకెట్లు కలుగును? దానినాలించు వైభవము మనకెట్లు లభించును. చూడుఁడు. వ్యవహారమున నిప్పుడు మన బాస యెట్లున్నదో! కీర్తిశేషులైన కవి కులచంద్రులగు వావిలాల వాసుదేవశాస్త్రుల వారాంధ్రముంగూర్చి వ్రాసిన వ్యాసములో నిప్పటి వ్యావహారిక భాషా స్థితియిట్లున్నది:-

"ఇంకనిట్టి పదములు సాధారణ వ్యవహారములో నెన్నివాడఁబడునో చూడుండి. పురుషులలో, 'ముసద్దీలు' తెల్లవాఱలేచి 'తుపాకీ' చేతబట్టి వేట 'సికారీ' వెళ్ళి, యందులో 'కులాసా' తీఱినమీఁదట నింట భోంజేసి, 'కుడితినీ' మీఁద 'నంగరకా' తొడిగి, తలకు నొక్క, 'జలతారు,' 'పాగాకు' 'మొగలాయీ' 'మోస్తరు' న జుట్టి, 'దస్త్రమును' జందుగా పెట్టెను దీసికొని 'డలాయతులు' ముందునడువ దిరిచినాపల్లి 'జూతీల జోడు పసందు' మీఁఱఁ బన్నిద్దఱు 'బోయీల' 'బంగాళాసవారీ' నెక్కి, 'పేట'దాటి 'బజారు'లోని 'మసీదు' ముందఱగా 'కచ్చేరీ'కి వెళ్ళుచు మధ్య మధ్యను 'సలాము'లందుచు 'దివాణపు' 'దేవిడీ' యెదుటను దిగి 'డఫేదారు' ఎదురుకొనఁగా లోపలికిఁ బోయి 'తివాసీ'మీఁద

'బాలీసా'నుకొని 'కూర్చుండి' యొక్క 'నౌకరును' 'పంకా' లాగఁజెప్పి గుమాస్తాను బిలిచి 'సిస్తుదస్తు' బేరీజులు 'తనికీ'చేసి 'కిస్తీలు' 'బేబాకీ'గా 'వసూలు' చేయు 'హంగామా, జవాను'లకు 'దస్తకు' లిచ్చిపంపి 'చిట్టాలలో జమాఖర్చులు' 'తావేళ్ళు'వేసి 'దస్కతు'లు చేసి 'వసారాలో' గొంతవడి 'పచారు' చేయుచు గొందఱు 'ఆసామీ'లవల్ల 'అర్జీల దాఖలు' చేసికొని యందులోఁ గొన్నిటిని 'వాఫజు' చేసి యంతటితో నా 'రోజు ఖమాయషుమర్తబు' చేసి, 'మామూలు, చొప్పున 'హవేలు' వెనుకగా 'హుజూరు జవాబు నివీసు' వ్రాసిన 'తపాలాచీటి'లోని కబురులకు మెచ్చుచుఁ ద్రోవఁగనిపించిన 'సాహుకారు'ను హుండీ చెలామణీ రుసుములు 'తాజా'గానున్నవో 'జాస్తి'గానున్నవోయడిగి, 'కుసుంబాగౌనుతానుల యసలు ఖరీదును 'సభా'యును దెలిసికొని 'హాయిగా' నింటికి మరలుదురు."

ఇది యిప్పటి మన వ్యావహారిక భాష, దీనిని మనము తెలుఁగన వచ్చునా? ఇదియా "దేశభాషలలో నెల్లఁ దెలుగు లెస్స," అని కృష్ణదేవరాయలు చెప్పిన తెలుఁగు? "Italian of the East." ఇదియా ఇందు దెలుఁగు పదము లెన్నికలవు?

ఇంకను నిప్పడిప్పు డింగ్లీషు పదములు హెచ్చుగా వాడఁబడుచున్నవి. ఈ విషయమై మన యప్పారావు పంతులువారి కన్యాశుల్కమునుండియే యొక యుదాహరణముఁ దీసికొందుము:-

"గిరీశం - డామిట్, ఇలాటి మాటలంటే నాకు కోపం వొస్తుంది. ఇది బేస్ ఇన్గ్రా ట్యూడ్. నాతో మాట్లాడ్డవేఁ ఒక ఎడ్యుకేషన్ ఈ విషయమై నీకు యెన్ని లెక్చర్లు యిచ్చాను; నా దగ్గర చదువుకున్నవాడు ఒహడూ అప్రయోజకుడు కాలేదు. పూనా డక్కన్ కాలేజీలో నేను చదువుతున్నప్పుడు దిఇలెవెన్ కాజస్ ఫర్ది డిజనరేషన్ ఆఫ్ ఇండియాను గూర్చి మూఁడుఘంటలు ఒక్క బిగిని లెక్చర్ యిచ్చేసరికి ప్రొఫెసర్లు డంగయి పోయినారు. మొన్న బంగాళివాడు యీవూళ్ళో లెక్చరిచ్చినప్పుడు ఒకడికైనా నోరు పెగిలిందీ? మనవాళ్ళు వట్టి వెధవాయలోయ్, చుట్టనేర్పినందుకు థాంక్ చెయ్యక తప్పు పట్టుతున్నావు? చుట్టకాల్చడం యొక్క మజా నీకు యింకా బోధపడకపోవడం చాలా ఆశ్చర్యంగా వుంది. చుట్టకాల్చుబట్టెకదా దొర్లింత గొప్పవాళ్ళయినారు. చుట్టకాల్చని ఇంగ్లీషు వాణ్ణి చూశావూ చుట్ట పంపిణీ మీదనే స్టీమ్ యంత్రం వగయిరా తెల్లవాఁడు కనిపెట్టాడు."

అని అప్పారావు పంతుల వారు కన్యాశుల్క నాటకములో వ్రాయించియున్నారు. వీరి యీ నాటకములో రెండు వంతులకు పైఁగా నింగ్లీషు వాక్యములును నొక భాగమునకుఁబైఁగా తురకమాటలు మున్నగునవియుం గలవు. ఇదియా యాముక్త మాల్యదాకారుఁడు 'దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స'యని చెప్పిన తెలుంగు? దీనినా మన అప్పారావు పంతులవారు "The Italian of the East" అని పీఠికలో వ్రాసినారు? మసీదును గట్టుచు నందు విష్ణ్వాలయపుఱాలను గొన్నింటి తురకలు తగిలించిన కారణమున నా మసీదు విష్ణ్వాయలమగునేని ఇది తెలుఁగు కాఁగలదు.

కన్యాశుల్క నాటకమునందున్న పదములలో మూడుసాళు లింగ్లీషు పదములు తురుష్క పదములునై నోటనుచ్చరింప ననువుపడని యుచ్చారణము కలిగి యున్నవి. ఎచ్చటఁ జూచినను హలంతములే. ఎచ్చటఁ జూచినను శ,ష,వఁం, ఇ మొదలగు సాధారణముగా నుచ్చరింప ననువుపడని వర్ణములే, అయినను యిది యింకను మృదుమధుర భాషయట! పూర్వసువాసిని యనినట్లు "The late Italian of the East" అనవలెను గాని "Italian of the East" అనుటకు వలనుపడదు. వ్యవహారములలో నింగ్లీషు తురుష్క భాష మున్నగునవి వచ్చి యిదివఱకే తెలుంగును ద్రోసిరాజనినవి. ఇప్పుడు గ్రంథము లందుఁ గూడ నీ వ్యావహారిక భాష ప్రవేశించినయెడల నచిరకాలములోనే తెలుంగు నశించు ననుటకు సందియమింతయును లేదు.

"అనియమాద్గ్రామ్యంహి యత్త్వపభ్రంశః" ఆంధ్రశబ్ద చిం॥

వ్యావహారిక భాషయే గ్రాంథిక భాషయైనచోఁ దెలుంగింకను గొంత కాలము బ్రతికియున్నను రూపుమాసి చిక్కితొక్కి చెడియుండును. చెడుటకు మూలకారణము తగు హద్దుననుంచు వ్యాకరణాదులు లేక స్వేచ్ఛకలిగి యుండుటయే. హద్దునందుఁ బెట్టువారొకరు పైనుండి ధర్మముల నేర్పాటుచేసి వాని ప్రకారముగా నడిపింప కుండిన మానవకోటులు సరిగ నడుతురా? అట్లే కొన్ని ధర్మముల నేర్పాటు చేసి భాషను వాని నతిక్రమింపకుండ నడిపింపకుండినచో నయ్యదియును జెడిపోవును. కావుననే భాషను యథాక్రమముగా నడిపించుటకై వ్యాకరణములను శాసనములు పుట్టినవి. ఆ శిక్షాస్మృతి లేకుండిన భాషావధూటి తృటిలోఁ జెడును. 'అపశబ్ధభయంనాస్తి అప్పలాచార్య సన్నిధౌ'

అనినట్టె వ్యావహారిక భాష సన్నిధిని అపశబ్ద భయమెక్కడనున్నది? కలమెట్లు పోయిన నట్లు వ్రాయుటయు మాటలాడుటయుఁ గదా యందుండును. కావున వ్యవహారిక భాషకు వ్యాకరణముండ నేరదు. వ్యాకరణముయొక్క ప్రయోజనములంగూర్చి మహాభాష్య కర్త యిట్లు చెప్పియున్నాఁడు:-

'మ్లేచ్ఛామాభూమేత్య ధ్యేయం వ్యాకరణం!

దుష్టాఇచ్ఛబ్దాన్మాప్రయుక్ష్మహీత్యధ్యేయం వ్యాకరణం!'

(సంస్కారములేని గాసటబీసట మాటలాడు మ్లేచ్ఛులము గాకుందుముగాక యని వ్యాకరణము చదువ వలెను. అపశబ్దములు ప్రయోగింపకుందుము గాక యనుతలంపుతో వ్యాకరణము చదువవలెను. అని దీని తాత్పర్యము. సుశబ్దములేవో యపశబ్దములేవో తెలిపి సుశబ్దములను ప్రయోగింపవలెననియు నపశబ్దములు వాడఁగూడదనియుఁ దెలుపునది యని దీనివలన తెలియవచ్చుచున్నది.)

"ఆంధ్ర వ్యాకరణమనఁగా నాంధ్రమందలి సుశబ్దములఁ దెలుపు శాస్త్రము" అని అబ్బాయినాయుఁడుగారి వ్యాకరణము బోధించుచున్నది.

"Grammar explains the proper use of language"

"English grammar teaches us to speak and write the English language correctly."

(భాషోచితప్రయోగమును తెలుపునది వ్యాకరణము. ఇంగ్లీషు వ్యాకరణము ఇంగ్లీషు భాషను తప్పులేకుండ సరిగ వ్రాయను మాటలాడను నేర్పును) అని ఇంగ్లీషు వ్యాకరణము తెలుపుచున్నది.

అప్పారావు పంతులువారు తమ గ్రంథములో మనయాంధ్ర వ్యాకరణములు సుశబ్దములని బోధించిన పదముల కెచ్చటను బుద్ధిపూర్వకముగాఁ జోచిటిచ్చినట్లు గాన్పించదు. పాత్రములలో నుత్తమాధమ భేదము పెట్టి యుత్తమపాత్రములచే సుశబ్దములను నీచపాత్రములచే నపశబ్దములను బలికింప లేదు. పండితులు (కరటక శాస్త్రి మున్నగువారు) పామరులు (అసిరిగాడు మున్నగువారు) కూడ నింద్యగ్రామ్యమని మన వ్యాకరణవేత్తలు దేనిని దెలిపిరో దానికంటెను విపరీతమైన గ్రామ్యమునే మాటలాడిరి. ఇందు బహుళముగా నున్న యింగ్లీషు వాక్యములు మాత్రము

వ్యాకరణయుక్తముగా నున్నవి! పండితులెట్టు లుచ్చరింతురోయట్టి యుచ్చారణము కలిగియున్నవి. అవి యథాశాస్త్రముగనే యుండవలెను గాఁబోలు! అవి వ్యాకరణ యుక్తముగా నుండకుండిన యుపాధ్యాయులంగీకరింపరు కాఁబోలు. పాత్రముల మాటల కేమి, తమ వాక్యములందైన గ్రంథకర్త గారు సుశబ్దములం బ్రయోగించి యుండలేదు.

అప్పారావుపంతులవారి పుస్తకమునందు పదప్రయోగము కలమెట్లు పోయిన నట్లు పోయినది. ఒక యుక్తి లేదు. ఒక వరుసలేదు. గ్రంథకర్తగారు తమకెట్లు తోఁచిన నట్లు వ్రాసివేసియున్నారు. ఇందులకుఁ గొన్ని యుదాహరణములనిచ్చెద.

మన పెద్దలు తెలుఁగునందు శ ష మొదలగు నక్కరములు లేవని చెప్పియుండిరి, అట్లు తెలుపుటకుఁగల ముఖ్యకారణము ద్విజేతరులు వాని నుచ్చరింప లేకపోవుటయే. కావుననే తెలుఁగున విషము విసముగను యశము అసముగను మాఱుచున్నవి. ఇంక అప్పారావు పంతులుగారన్ననో 'సల'కు 'శలు' పెట్టి 'శా'లకు, 'సా'లుపెట్టి తమ యిచ్చవచ్చినట్లు వ్రాసిరి. వీరు వేశ్యాశబ్దమును 'వేస్య' అని వాడుచువచ్చిరి. (చూడుఁడు పుట 7,45) ఇది మధురవాణియను గణిక పలికిన పలుకఁట! వేశ్య యనినప్పుడు వీరెట్లుచ్చరింతురో వేస్యయనునప్పు డెట్లుచ్చరింతురో తెలియకున్నది. యకారము తుది నుండుటచే సకారము దంత్యము. దంత్యమైన యకారముతోఁగూడిన తాలవ్యమైన యకారము తుది నుండుటచే సకారము సరిగఁదనస్వరము నంతగా నిలుపుకొననేరదు. వేశ్యాశబ్దమున శవర్ణముఁ బలుకలేని మధురవాణి ఆ వాక్యమునందే "ఆశిస్తా"నని 'శ' వర్ణమును సరిగఁ బలుకఁ గలిగినది. "గిరీశంగారు పుంజాలు తెంపుకు పరిగెత్తుతారు" అనియు (పుట 75) 'నిసిరాత్రివేళో' అనియు (130) పలుకగలిగినది. ఇంతయేల, యీ మధురవాణియే "వేశ్యకాఁగానే దయాదాక్షిణ్యాలు వుండవో", అని శవర్ణమునే పలుకఁగలిగినది. ఇంక గిరీశమును బ్రాహ్మణుఁడు "క్రిమినల్ కేసు కావలశిందే" అనినాడట. ఇచట 'స' కారమునకు 'శ' వర్ణమును బెట్టియున్నారు. ఉచ్చారణ భేదమంతగా నుండ నేరదు. పదముల నశాస్త్రీయము చేయుటకు మాత్ర మక్కరకు వచ్చును. 'ఆ పాతు యెక్క తీసి' (80 పుట) అని 'సకారమొక్క చోట,' "క్రిమినల కేసు తేవలశిందే"యని 'శ' యొక్కచోట తమయిచ్చ వచ్చినట్లు గ్రంథకర్తగారు వ్రాసియున్నారు. పోలిశెట్టియని యొకచోట (82 పుట) పోలిసెట్టియని మఱియొక చోట (94)వ్రాసియున్నారు. ఇంకను

'పన్నెండు' అని యొకచోట (90 పుట) పజ్జెండు అని యొకచోట (93) లిఖించియున్నారు. "శెలవు' అని యొకచోట (3 పుట) 'శలవు' అనియొకచోట (3వ పుటయే) ప్రయోగించినారు. అసిరిగాడను కింకరుండు 'సెప్పినాను' (128 పుట) అనినాండు. బ్రాహ్మణుండగు రామప్పపంతులును 'సచ్చాన్రా' 'పేరు చెప్పేసింది!' (11 పుట) అని నుడివినాండు. బ్రాహ్మణుండు సచ్చాననుట యీ ప్రాంతములందు వినంబడదు. కళింగ రాజ్యములోని బ్రాహ్మణులట్లు మాటలాడుదురేమో యనికొందుమనినను ఆ రామప్పంతులే 'తగిలేస్తే ఒచ్చానే' (131 పుట) యని పలికినాండు. కావున గ్రంథకర్త కలమెట్లు పోయిన గ్రంథమట్లు నడచినది. సచ్చుట యనునది గ్రంథములందుండినను వ్యావహారిక భాషలో లేదు.

గవరయగారను వారొకరు 'రెండు మనుష్యుల బలువుందో లేదో చూడండీ' యని నుడివినారు. (పుట 134)

'ఏమిటి'! యనియొకచోట "ఏవింటి" యని యొకచోట "ఏటి", అని యొకచోట నిచ్చవచ్చినట్లెల్ల వ్రాయబడి యున్నది. పాత్రోచితముగాం దెలుపుటయేమో యనుకొందు మనినను నొక్క పాత్రమే – యేమిటి యని కొన్ని మాఱులును ఏవింటి యని కొన్ని సారులును బలుకుచుండును. ఇట్టి వ్రాతంతోడనే గ్రంథమంతయు వ్రాయబడియున్నది. ఈ యుదాహరణముల నేను గ్రంథమునందుం దప్పులు కలవని తెలుపుటకు వ్రాయలేదు. గ్రంథమునందు వ్యావహారిక భాషను వాడితిమని గ్రంథకర్తగారే చెప్పియున్నారుగదా. ఏక్రమమును లేక యిచ్చవచ్చినట్లు వ్రాయంబడియున్నదనుటకై పై యుదాహరణముల నిచ్చితిని. శబ్దశాస్త్రమును బాటింపలేదు. స్వరశాస్త్రము నైనంబాటింప లేదు. ఒకమాఱు "చచ్చా"నననంగలిగిన జిహ్వ మఱియొక మారనలేదా? ఇంక నొకమారు "సచ్చా"నమనా? పాత్రోచిత భాషను వాడుటయుంగాన్పింపదు. ఇంతయేల – ఒక నియమము నేర్పఱచు శాస్త్రమును దేనిని బాటించియుండలేదు. ఇది భాషకు హానిని గల్గించునుగాని లాభమును గల్గింపదు.

(2) వ్యాకరణమును బాటింపకుండినను జిక్కులు మాత్రము హెచ్చు చేసినారు. శబ్దశాస్త్రము విధించువానిలో – లేఖకులకు– జిక్కును గలిగించుచున్నవి అరసున్నయును

శకటరేఫమునై యున్నవి. అయినను నర్ధానుస్వారము పరుష సరళములకు మాత్రమే ముందుండునని శాస్త్రములు విధించుచుండుటచే శాస్త్రీయమైన వ్రాఁతకు దీని బాధ చాల తొలఁగిపోయి యున్నది. అప్పారావు పంతులవారి వ్రాతయందన్ననో నియతి లేకుండ నన్నియక్కరములకును ముందు వాడఁబడియున్నది. 'సిద్ధమైఁయుంటె', 'ఘోరమైఁన', "భూమెఁందుకు" మొదలగురీతిగా నరసున్నలు కుపలు తిప్పలుగాఁ బోయఁబడ యున్నవి. నాసికతో సంబంధమింతయును లేనిచోటఁగూడ నరసున్నలుంచఁబడినవి. "అవుఁధానులు" ఇది సంస్కృత పదము. ఇందు అనునాసికము లేనేలేదు. ఙ, ఞ, ణ, న, మఁలు అనునాసికములు. స్వరశాస్త్రమునుబట్టి వ్యవహారములలో 'మ'చెడి వఁ అయినదనవచ్చును. ఇట నట్టి సందర్భములేదే? ఇచ్చట నరసున్న యెందుకు? "వీఁన్ని బ్రహ్మరథం పట్టనాఁ" అని గిరీశమనెనఁట! 'వీనిని, అనుపదముయొక్క గ్రామ్యరూపమగు వీన్ని(ణ్ణి)లో నర్ధానుస్వారమెందుకో!' "అవుఁనండి" ఇట నరసున్న యెందుకో? పదము అమునుగాదే? కొండుభొట్లు 'అవును' అనలేక అవుఁను అన్నాడనుకొందుమనినను – నే పుటయందు కొండుభొట్లవుఁనన్నాఁడో యాపుట యందే యాతఁడే మరల 'అవును' అన్నాఁడు (చూ॥ పుట 102) ఈ రీతిగా నిచ్చవచ్చినట్టు వ్రాయఁబడియున్నది. కొన్ని తావుల శాస్త్రయుక్తముగా వీ రరసున్న పెట్టియుండిరి. దేవుఁడను శబ్దమునఁ బలుతావుల నరసున్నలుంచిరి. (చూ॥ పుటలు 11, 103, 105, 106, 107) కాని ఇది బుద్ధిపూర్వకముగాఁ బెట్టినది కాదు; కొన్ని తావుల నీ శబ్దమునే నిర్బిందుకముగా వాడియుండిరి (చూ॥ 59 పుట) I employed the Ardhanuswara after a nasalన అని అప్పారావు పంతులవారు వ్రాసిరి. దేవాది శబ్దములందున్న వకారము () అనునాసిక మెట్లగునో తెలియదు.

(3) వీరు శకట రేఫమును గూడ విశేషముగా వాడియున్నారు. యాడాదికో నూఱ్ఱూపాయలు '(15 పుట)' కుఱ్ఱాడికి చదువు చెప్పిస్తాను. (16 పుట) కుఱ్ఱవాడు గదా (15 పుట) కావున వీరివ్యావహారిక భాష నుండి శకటరేఫము తొలఁగిపోయి యుండలేదు. ఇంక దీనియందలి సౌకర్యమెట్టిదో!

(4) అరసున్నల యుప్పెనయు శకటరేఫముల సంకటమునేగాక లోకులు పలుకు పలుకులకు సంజ్ఞ లేర్పఱచుటలో గూడ వీరు చాలా చిక్కు కల్పించిరి. వీరీ విషయమై

తమ పీఠికలో నిట్లు వ్రాసియున్నారు-

వీరికి నుచ్చారణము తెలుపుటకు నక్కరములుఁ చాలినవి కావట. సంస్కృతమున వాడఁబడునవి యేఁబది. తెలుఁగుననే వాడఁబడునని ఆఱు (ఎ, ఒ, చ, జ, ఱ; ౦) ఇన్నియున్నను వీరికింకను సంజ్ఞలు చాలినవి కావు. తెలుగు టుచ్చారణములకే చాలనప్పుడు తురకలు దొరలు తెలుఁగు లుచ్చరించునప్పటి స్వరములు తెలుఁగువారు ఇంగ్లీషు, తురుష్కము మున్నగు భాషలనుచ్చరించునప్పటి స్వరములు కలిసి వేనవేలగును గాన వీనికన్నింటికిని సంజ్ఞలు కల్పించిన సంజ్ఞాసాగర మొక్కటి బయలు వెడలును. ఇది చాలకష్టము కాదా?

(5) జనసామాన్యమేరీతిగా వాడిన నారీతిగాఁ బదముల మనము ప్రయోగింతుమేని శబ్దతత్వశాస్త్రము నశించును. మన తెలుఁగు భాషలో నీశాస్త్రమింకను దలయెత్త లేదనియే మనము చెప్పుకొనవలెను. ఇట్టి స్థితిలోనున్న భాషకిపుడు వ్యావహారికావస్థనే ప్రమాణము చేయునెడల నిక్కమగు శబ్దతత్త్వశాస్త్రము (Philology) ఎట్లు పుట్టఁగలదు? ఒకరు, హిందూ దేశమునందు ప్రభువు నమాత్యుఁడు ననునర్థమునిచ్చు పట్టణమొక్కటి కలదు. అదియెద్ది? అని పొడుపు కథనొకదానినొక్క పత్రికలోఁ (Juvinile Reader) బొడిచి మఱునటి సంచికలోఁ దామే సమాధానము చెప్పవలసి వచ్చుటచే 'రాజమంద్రి'యని వర్ణించిన రాజమహేంద్రపురము (రాజమహేంద్రుని పట్టణము) మన దొరల మూలముగా నిప్పుడు రాజమంద్రియై రాజు మంత్రి యనువ్యుత్పత్తి కలదియను భ్రాంతిని గలిగించు చున్నది. కావునఁ బ్రాజ్ఞులగువారు తమ యిచ్చవచ్చినట్లు లోకసామాన్యమునసుసరించి పద ప్రయోగములఁ జేయకుందురుగాక.

(6) వ్యావహారిక భాషనే గ్రాంథిక భాషగా నుపయోగించు నెడల నయ్యది పలు విధముల మాఱుచున్నది. అరవము కన్నడము మున్నగు భాషలతో సంబంధముగల దక్షిణ దిక్కున (చెన్నపుర్యాదుల) నీభాష యొక విధముగ నున్నది. తురుష్క భాషతో సంబంధముగల పశ్చిమ దేశమున (హయిదరాబాదు మున్నగు తావుల) నీ భాష వేఱొక విధముగనున్నది. మధ్యదేశమున నింకొక విధముగా నున్నది. వీనిలో దేనినవ లంబింపవలసి యుండును? అప్పారావు పంతులవా రాయాదేశములందలి తెలుఁగులం దంతగా భేదము లేదని యీ క్రిందిరీతిని వ్రాసిరి.

"There is not much dialectical difference in the Telugu generally spoken in the various parts of the Telugu country, so a new common literary dialect can be established with comparative ease if only able writers set about it in right earnest."

ఇది సరిగాదు. నేను బైనఁ జెప్పినట్లుగాఁ జాలా భేదము కలదు. వావిలాల వాసుదేవశాస్త్రులవారు తమయుపన్యాసములో నీ క్రింది రీతిని వ్రాయించి యున్నారు:-

'చెన్నపట్టణము ఆ వైపుల వాడుకలలోనున్న తెలుఁగు మన తెలుఁగతో నేమాత్రమును సంబంధింపక యదియొక్క భాషగా వినవచ్చుచున్నది. పడమటి తెనుఁగు కడప ఆ వైపులలో వాడుకలో నున్నది విశేష దీర్ఘాలతో వికారముగా నున్నప్పటికి గ్రామ్యములు మెండుగ లేకయుండును. మరి, అందులోఁ గన్నడపుఁబోలికలు చివరకు నుచ్చారణములోనైనఁబట్టుపడకపోవు. దక్షిణాంధ్ర దేశస్థులు ద్రవిడపదములు కలిసిన తెలుఁగు వాడుదురు. ఉత్తరాంధ్రులు ఓఢ్రోచ్ఛారణములతో మాటలాడుదురు.'

కాన దిక్కునుబట్టి యాంధ్రమునందే చాల భేదములు కలవు. ఒక దిక్కు వారి భాష. మరియొక్క దిక్కువారికి గౌడగోయ గానుండును. ఇందులకుదాహరణముల నిచ్చుచున్నాఁడను.

"వాండు నేఁడు ఆండువాళ్ళని పిల్చుకొస్తుడని వినబడితిని ఈ. అది నేను కొంచువస్తును ఊ. ఇంటిజన్నల్ పెట్టివుంది ఈ. నీ ఆడయాళం తెలియలేదు ఊ. నేరుగా పూడిసినాడు ఊ పోయివిడిచి నాడు ఊ ఎకడ్రా? ఇందా? జాబుల్ వొచ్చిందటనా? ఎవరబ్బా నిన్న వచ్చినాడంట ఆ? నేన్‌దావస్తినిఈ."

– చేగల్‌నాటి తెలుఁగు –

"ఎద్దు మొడుస్తుది. సేత్తో మట్టుకున్నాను. మరో, దీనమ్మడుపాల! అట్టవేసినడితేను. చింతకొయ్య కాసిందా? దాన్ని పెదద్పుఉలడెయ్యా యెద్దుని మళ్ళెళ్ళి"

– గుంటూరు తెలుఁగు –

"ఇట్టా కట్టెల్ కట్టెల్ బెట్టి కట్టానే వీడియమ్మాముల్లెయేం బోయిందా? నేను వస్తిగా"

– కర్నూల్ తెలుఁగు –

"ఇసకనాధవేఁదుండాడు? ఇంటవుండాడా? నయమంగా వుండాదా?

## - కళింగరాష్ట్రపు తెలుఁగు -

'మీకంత భారవఁంతోస్తే బొట్టెనిటు తోలేండి. అదియిలా వెళ్ళి పోయొస్తుంది. మరెం'
అప్పారావు పంతులవారు చెప్పినట్లుగా, నుచ్చారణ విశేషములను సరిగఁ దెల్పుటకుఁ దగు సంజ్ఞలు లేకపోవుటచేతను నేను దేశములు తిరిగిన వాఁడను గాకపోవుటచేతను వివిధ దిక్కులనున్న వివిధాంధ్రముల సరిగ నీయలేక పోయినానుగాని సరిగనిచ్చు నెడల నొకరిమాట లొక్కరి కరబ్బీగాఁ గాన్పించును.ఒక్క తావున దీర్ఘములు మెండుగా నుండును. ఇంకొక్కెడ హ్రస్వములు హెచ్చుగా (కన్యాశుల్కపు భాషలో లావుగా) నుండును. వేఱొక్కచో ననునాసికములు విశేషముగా నుండును. పెక్కేల, ఒకదానికొక్కటి భేదించి యుండును. ఒకమాటకే యొక దేశమందున్న యర్థమిఁక నొక దేశమందుండదు.

ఈ సందర్భములో అప్పారావు పంతులవారొక్క తప్పుకూడఁ జేసియున్నారు. ఈ వివిధ దేశీయాంధ్రములలో గ్రంథములు వ్రాయుటకు మొదలు పెట్టిన యెడల వానినుండి యొక సామాన్యమగు గ్రాంథిక భాష పుట్టునని మీరు వ్రాయించియున్నారు.

ఇది యసంభవము. ఏమన ప్రజలేరీతిగా మాటలాడుకొందురో యారీతినేగదా గ్రంథములు వ్రాయవలెననియు నట్లు వ్రాసిననే రసము పుట్టుననియు వీరు వ్రాసియున్నారు. అట్లయినచో వివిధ దేశములందు వాడఁబడు తెలుంగులలో నుండి యొక సామాన్యభాష పుట్టిన నద్ది వానిలో నేదియునుగాక యన్నిటికిని గ్రొత్తదియగును. అది యిప్పటి గ్రాంథికభాష వలెనే వేఱయిపోవును. నెల్లూరివాఁడు "ఏంది" అనవలెను. కళింగ రాష్ట్రమువాఁడు "ఏవిఁటి" అనవలెను. కావున వీరు సామాన్య గ్రాంథిక భాష పుట్టునని తలంచుట తప్పు. అప్పారావు గారు గిరీశము రాజమహేంద్రవరపు వాఁడని వ్రాసిరికాని యాతని మాటల వైఖరి యట్లులేదు, పూర్తిగాఁ గళింగ రాష్ట్రపువాఁడుగనే యున్నది. ఏ అగ్నిహోత్రావధానులతోఁదాను రాజమహేంద్రపుర వాడనని చెప్పినాఁడో యాయగ్నిహోత్రావధానులతో మాటలాడు నప్పుడైనఁదూర్పుదేశపు యాసమాని రాజమహేంద్రవరపు వానివలె మాటలాడింప వలసినది. ఆ విశేష మీగ్రంథమునందు లేదు. కాన నిదియొక్క గొప్పలోపము. ఇప్పటి విద్వాంసులు కొందఱు గ్రామ్య భాషయే గ్రాంథిక భాషగా నుండవలెననియు నయ్యదియే పాఠశాలలోఁ జెప్పఁబడవలెననియుఁ

సిద్ధిర్లో 'కార్ద్వశ్యా దలంచుచున్నారట! ఇది గొప్ప వింత!!

'మంగలిరంగడు తలగొరుగుతున్నాడ'ని పాఠశాలలో నేర్చికొనవలెనా? ఈ బాస జీతములిచ్చి యింటనున్న మూల్యమునంతను వెచ్చించి నేర్చికొనవలయునా? అక్కఱలేదు. ఇది మహానసమునందే యబ్బును. ఉగ్గుపాలతోనే యలవడును, ఒక పండితమండలాఖండలుఁడు భాషను స్వభావసిద్ధముగాఁ బెరుగనీయక దానిని నిబంధనముల పాలుచేయుట దానిని జంపుటయనియు కాలానుకూలముగాఁ బెరుగుచున్న గ్రామ్యభాషనే గ్రంథములందును వాడవలెనుగాని గ్రాంథికభాష వేఱుగ నుండఁదనియన్నాడఁట! ఇది గొప్ప పొరపాటు.

"సంస్కారారోధనియమః" – ఆంధ్ర శబ్దచింతామణి.

లోకములో సంస్కారము లేక సహజముగాఁ బెరిగిన దేదియును హృద్యముగా నుండనేరదు; అందులకే సంస్కారము పుట్టినది. సంస్కారమనఁగా నున్నదానిని బాడుచేయుట కాదు, ఉన్న దానిని బాగుచేయుట, ఒక మొల్కను యథాసంభవముగా బెరుగనిచ్చిన నయ్యది యడవి చెట్టగును గాని యుద్యానపాదపము కానేరదు. చెట్టననేల మానవుని సహజముగా బెరుగనిచ్చిన నెంత యందముండునో యెరుంగని వారెవరు? కావున నాగరకతగల దేశములన్నిటియందును మానవులకు బాల్యమునందే కేశఖండనాది సంస్కారములు గావింపబడుచున్నవి. కేశఖండన నఖలుంఛనాదులు చేసిన మానవుల భివృద్ధి పొందుటలేదా? అట్లనే తగు సంస్కారములనందిన భాష లేలయభివృద్ధి నందవు? తప్పక యభివృద్ధి నందును. అట్లు సంస్కారములు లేకుండిన నడవి భాషలగును గాని నాగరిక భాషలు కానేరవు. ఆటవికులు కూడ దమ దేహముల నున్నవి యున్నట్లుంచక కొంచమైన దిద్దుకొనుచున్నారుకదా యింక నాగరకులమని పిలుచుకొనుచున్న మనమా సంస్కారములు లేకుండ నెట్లుపెరిగిన నట్లుపెరుగనిచ్చుట! ఇదియనుచితముకాదా? ఏ దేశమునందైన నెప్పుడైన గ్రామ్యభాషయును గ్రాంథికభాషయు నొక్కటిగానున్నవా? అప్పారావుగారి ప్రయోగములె కొన్ని యిచ్చటివారికె తెలియరాకున్నవి. కావున భాషను నెట్లు పెరిగిననట్లు పెరుగనిచ్చిన నియ్యది విశేషముగాఁ బెరుగునుగాని దానివలని ఫలము మాత్రము శూన్యముగా నుండును. అల్లిబిల్లిగాఁ గొమ్మలును దట్టముగా నాకులునుగల చెట్లు చూడసొంపుగనుండును గాని ఫలములమాత్రమీయదు. దానిని

ఫలవంతము చేయదలంచిన గొమ్మలంగత్తిరించి యడవిగాఁ బెరిగిన పెరుగును గొంత తగ్గింపవలెను. అప్పుడు సత్ఫలములు గలుగును.

సంస్కారములేకుండిన నెవరియిచ్చవచ్చినట్లు వారు పదములగల్పింతురు. "వచ్చుచున్నాఁడ"ను పదమును గొందఱు వస్తున్నాడనియు మఱి కొందఱు వత్తున్నాడనియు నిఁకకొందఱు వస్తూ వున్నాఁడనియు వస్తోన్నాడని వేఱొకరును వాడుచున్నారు. ఈ విధమగు నాటకావిభివృద్ధి నిజమగు నభివృద్ధికానేరదు.

"అ హేయమన్యదేశీయం యత్త దేవప్రయుజ్యతే" – అధర్వణుడు

భాష పెరుగుటకై యన్యదేశ్యముల మనము చేర్చికొనవచ్చును అట్లు మన పూర్వ గ్రంథములందుఁ జేర్పఁబడియున్నవి. సంస్కృత పదముల నుండి తత్సమములను తద్భవములను దెచ్చి యెట్లు మీ భాషలో వాడుకొనినారో యెట్లు భళ్యాదుల వాడుకొనినారో యట్లే యింగ్లీషు భాష నుండి కూడ తత్సమములను తద్భవములను తెచ్చి మీ భాషలోఁ బెట్టుకొనుఁడు "లాంతరు" (Lantern) కేసు (Case) రెయిలు (Rail) మొదలగు పదముల గ్రంథములందు వ్రాసికొనుఁడు. భాషాభివృద్ధికై మన భాషయొక్క మార్దవమున కనుకూలించులాగున నన్యభాషాపదముల మీకిచ్చవచ్చినన్ని తెచ్చి పెట్టుకొనుఁడు. దానహానిలేదు, భాషయు నభివృద్ధి చెందును. అంతియేగాని వెళ్లుచున్నాననుటకు వెళ్ళుతున్నాననిన మీ భాష యభివృద్ధినొందనేరదు. భారముగానున్నదనుటకు మాఱుగా భారవంగా వున్నదనిన, బెంపుచెందదు. దాని పేరు వెఱ్ఱితల వేయుటయగును. పైనుదాహరింపబడిన వ్యావహారికపు టింగ్లీషులో ('I tells') అనివాడఁబడియున్నది. ఆ రీతిగా బడిపిల్లలిప్పుడు ('I tells') అని వ్రాసిన యేట్సుదొరవారంగీకరింతురా? వారియింగ్లీషట్లు వ్రాయుటకు వలనుపడనియెడల మన తెలుఁగేల, మనము పాడుచేసికొనవలెను.

చదువరు లిచట నొకయంశమును గమనింప వలెను. సంస్కృతము మన తెలుఁగుభాషకు నింగ్లీషు మున్నగువానివలె పరభాషయేకాదు. తల్లికిని బిల్లలకును నాకారాదులయందుఁ గొంత భేదముండినను నెట్లువారి నిద్దఱిని నొకజాతికి సంబంధించినట్లు తలంతుమో యట్లె సంస్కృతమునకును దెలుంగునకును గొంచెము భేదముండినను నంత మాత్రముఁ బరభాషలఁగా నెన్నరాదు. కాని నింగ్లీషు మున్నగువాని

యందలి పదములఁ దీసికొనుటలో మనము సంస్కృతము నుండి పదములఁ దీసికొనునంత స్వేచ్ఛను దీసికొనరాదు. ఆంధ్రులచేఁ దఱుచుగా వాడఁబడుచు నింగ్లీషు నెఱుంగని యాంధ్రులుకూడ సులభముగా గ్రహింపఁగల పదముల నింగ్లీషు నుండి తీసికొనవలెను. తురుష్క భాషమున్నగువాని నుండియును నిట్లె తీసికొనవలెను.

"The Telugu intellect is also seriously handicapped by the tyranny of authority"

అని అప్పారావు పంతులవారు వ్రాయించినారు. ఇది తప్పు. ఇట్లనుట గొల్లనిచే దొడ్డిలోఁ బెట్టఁడిన మేకపిల్ల గొల్లఁడు బంధించినాఁడనుకొనుటవలె నున్నది. హద్దులేనిదేది? భగవంతునికే హద్దుకలదే. సృష్టియే యొక హద్దున నడచుచున్నదిగాని స్వేచ్ఛగాలేదు. వ్యాకరణము ధర్మమును జెప్పుచున్నదిగాని యధర్మమును జెప్పుటలేదు.

అప్పారావు పంతులవారు "Pandits have relaxed insistence on rigid observance of rules of Sandhi." అని వ్రాయించినారు. సంధుల విషయమునఁ బండితులేకాక శాస్త్రమును పట్టుదలలేనిదిగానే యున్నది. "శ్లో॥ సంహితైక పదే నిత్యా నిత్యాథాతూప సర్గయోః! నిత్యాసమాసే వాక్యేతు సా వివక్షా మపేక్షతే!!" యని శాస్త్రము చెప్పుచున్నది. కావున "రాముఁడెక్కడ ఉన్నాఁడ"నవచ్చును. అది శాస్త్రీయమే; కాని కన్యాశుల్కమునందువలె "రావుఁడు యెక్కడవున్నాఁడు" అని వ్రాయగూడదు. ఇట్లు వ్రాసినఁ బండితులెవరును నంగీకరింపరు. విసంధి దోషముకాకుండుట వచనము నందననేల; పద్యమునందును నట్లుకాదు. పద్యములందు వాక్య విరామమున మాత్రము విసంధియుండవచ్చును.

గ్రాంథికాంధ్రము చాల చిక్కుగానున్నట్లుగా అప్పారావు పంతులవారు వ్రాయించినారు. అది సత్యముకాదు. ప్రౌఢప్రబంధశైలి కఠినముగా నుండునుగాని నన్నయాదుల పురాణశైలి మృదుమధురముగానే యున్నది. అరీతినే మనము గ్రంథములను వ్రాసికొనవచ్చును. గ్రంథముల మనము భాషకొఱకును భావము కొఱకును గూడఁ జదువుకొందుముకాదా. చక్కనిభాష లేని గ్రంథములఁ జదువుకొనిన లాభమేమి? మనకు నాంధ్రకవితాగురుండగు నన్నపార్యుఁడు చెప్పిన 'మదమాతంగతురంగ కాంచనలస న్మాణిక్య గాణిక్యసంపద' అను శైలి గుఱిగాక, ముదమున్ యేనుగ వెళ్ళుతున్నవలెనే

మత్తేభవిక్రీడితా" యను బ్రౌనుదొరవారి శైలి గుఱియగుట శోచనీయముకాదే.

ఇట్లనుటచే అప్పారావు పంతులవారి గ్రంథము బాగుగాలేదని నాతాత్పర్యముగాదు. హాస్యరసప్రధానమై యుబుసుపోకకకుఁ జదువుకొను గ్రంథము గ్రామ్యభాషయందుండఁ దగినదే. అట్లు వ్రాసినప్పుడు హాస్యరసము హెచ్చుగాఁబుట్టును. నాటకములందలి నీచపాత్రములకుఁ గూడ గ్రామ్యముండఁదగిన దనియే నా తాత్పర్యము. ఇట్టిచోట్ల మాత్రమే గ్రామ్యము వాడఁబడుగాకయని నాతలంపు.

తెలుఁగ భాష యందు గ్రామ్యము గ్రాంథికభాషగా నుండఁదగదని యిదివఱకు వ్రాసియున్నాను, గాన నిఁక నింగ్లీషు భాషంగూర్చి కొంచెము వ్రాసెద.

శ్రీమదప్పారావు పంతులవారు పూరాణులలోఁ గావ్యములు గ్రామ్యభాషయందే వ్రాయఁ బడుచున్నవని యర్థము తేల్చుచు వ్రాసియున్నారు. ఇది సత్యముగాఁ గాన్పింపదు. పండితులు విమర్శ కులునగువారు గ్రామ్యమున గ్రంథములు వ్రాయఁగూడదని వారియందుఁగూడ దూషించుచునే యున్నారు. ఈ విషయమై రినాన్ (M.Renan) దొరవారిట్లు వ్రాసియున్నారు:-

"All ages have had their inferior literature, but the great danger of our time is that this inferior literature tends more and more to get the upper place. No one has the same advantage as the Academy for fighting against this mischief."

(ప్రతియుగమునందును అధమ కావ్యములు గలవు. ఇఁక నీ కాలమునందలి గొప్ప చిక్కేదన నీయధమ గ్రంథరచనమే - యీ దినములలో నౌన్నత్యము నందఁ జూచుచున్నది. యీ చిక్కునుండి తప్పించుకొనుటకు సాహిత్యపరిషత్తు ముఖ్యముగా నుండఁదగినది.)

రినాన్ దొరవారు చెప్పిన సాహిత్యపరిషత్తు ఫ్రాన్సు దేశమునందుఁ గల "ఎకాడెమీ"లను విద్వత్సభలై యున్నవి. ఫ్రాన్సు దేశమునందు వ్రాయబడిన గ్రంథము లీవిద్వత్సభకుఁ బంపఁబడును. వారు బాగుగా గ్రంథమును విమర్శించి మంచిశైలి మంచి విషయముగల గ్రంథములను మాత్రమే యంగీకరింతురు. అట్లంగీకారమునందిన గ్రంథములు మాత్రమే ప్రకటింపఁబడును. గ్రామ్య భాషలో వ్రాసిన గ్రంథములను వారంగీకరింపరు. మాథూఆర్నాల్డు మున్నగు పండితులు శుద్ధమగు శైలియుండవలెనని

నొక్కివ్రాసియున్నారు. ఆర్నాల్డు దొరవారు వ్రాసిన యీ క్రింది వాక్యములం గనుండు:-

"In short, where there is no center like an academy, if you have geni(o)us and powerful ideas, you are apt not to have the best style going, if you have precision of style and not geni)o)us, you are apt not to have the best ideas going."

(పెక్కేల, విమర్శించు విద్వత్సభలు లేనియెడల మంచి తెలివి మంచి యూహాలు నుండినను అచట మంచి శైలి యుండనేరదు, మంచి శైలియుండినను మంచి యూహాలు తెలివితేటలు నుండఁజాలవు)

పత్రమైన శైలి (urbanity of style) మంచి యూహ (genius) కవితకు ముఖ్యమని ఆర్నాల్డు దొరవారు వ్రాయించియున్నారు.

వార్తాపత్రికలందు వ్రాయఁబడు వ్రాఁతనుగూడ బండితులు విమర్శిచుచుందురు. ఇంగ్లాండులోఁ బ్రచురింపఁబడు "టైమ్సు" (The Times) అను పత్రికలో "diocese" అను పదము "dioces's" గా వ్రాయఁబడినదఁట. దానిని బండితు లధిక్షేపింపఁగా 1868 సంవత్సరములో టైమ్సు పత్రికాధిపతి తప్పు పదక్రమమును మార్చుకొని గావ్రాయమొదలు పెట్టెనఁట. ఈ విషయమై ఆర్నాల్డు దొరవారిట్లు వ్రాసిరి.

"Every one has noticed the way in which the Times chooses to spell the word "diocese," it always spells it dioces's"

('The Times has now (1836) abandoned this spelling and adopted the ordinary one')

గ్రంథవిస్తర భీతిచే ఆర్నాల్డు దొరవారు వ్రాసిన యంశములన్నిటిని నేనిచ్చట నిచ్చుట లేదు? వలయువారు దొరవారు వ్రాసిన "లిటరెరీ ఇన్ఫ్లూయన్సు ఆఫ్ ఎకాడెమీసు" అను వ్యాసమును జూచుకొందురుగాక.

ఇఁక ఈ విషయమై జూవినైల్ రీడరులో (The Juvenile Reader) వ్రాయఁబడియున్న యంశముల క్రింద నిచ్చుచున్నాను. ఈ పత్రికలో "మంచి యింగ్లీషు" (Good English) అను శీర్షిక క్రింద నీరీతిని వ్రాయఁబడియున్నది.

GOOD ENGLISH

"At the present time when education is making great progress, and we hear of scientific methods of teaching English, it becomes every one who handles a pen or professes to talk the language correctly to pay special attention to the formation of a style free from the errors which

commonly beset the young and inexperienced. The errors referred to are of various kinds, but we shall confine our remarks this month to the one which is the most common, and therefore to be carefully guarded against It is no other than the introduction in conversation and in lighter works such as novels of a kind of semi-slang We have often puzzled ourselves to find out why young men, chiefly of the Eurasian class, take to slang The only solution we can arrive at, is, perhaps, that they fancy that it is essential to manliness that they should be masters of slang. What an erroneous idea! Now just listen for a moment to our fast young Eurasian, or theape of a young Hindu, who thinks to be a good English scholar, he mustspeak in the dark phraseology of slang. If he sees anything remarkably good he calls it a 'stunner' the superlative of which is a 'regular stunner.' If he meets, a savage- looking man, he calls him an 'ugly customer.' Our young friend never scolds but 'blows up' - never pays but 'stumps up.' He never borrows but gets everything 'on tick' - never finds it difficult to pay, but is 'hard up' - never feels tired, but is 'knowed up.' He never goes away or withdraws, but 'bolts,' or 'slopes,' or 'makes himself scarce,' or 'cutshis stick.' The highest compliment you can pay him is to tell him that he is a 'regular brick.' He does not profess to be brave, but prides himself on being 'plucky.' Money is a word which he has struck out of his dictionary, but he talks a good deal about 'tin,' 'the needful' and 'shiners.' When a man speaks the 'spouts', when he holds his tongue he 'stuts up'. To be perplexed is to be 'flummaxed.' To lose any appointment is to be 'disned' - to be cheated is to be 'sold.' He never throws a stone, but always 'chucks' it, and the consequence is, that he gets a good 'hiding' for it fom his 'governor,' if not a 'lambasting.' Whatsoever is fine is 'nobby,' - Whatsoever is shabby is 'seedy,' - Whatsoever is pleasant is 'jolly' - and this we often hear of 'jolly chims,' 'jolly clubs', and a jolly good hiding' too. The words d-n and bl-dy which are unfortunately often uttered by educated Englishmen are a low kind of slang - quite unchristian and vulgar. Englishmen of course are also responsible for all the slang expressions quoted above, and such expressions, too numerous to mention, from the tares among the wheat imported from Old England. For some more specimens of slang against which we wish to gaurd our young Hindu in particular are those given in Daniol's 'Students' Guide.' Teh continuation of the Counterblas' is published in this number, and in it we direct the attention of our readers towards that part of the book."

(గ్రంథవిస్తర భీతిచే దీనిని దెనిఁగింపలేదు)

ఈ విధముగా నింగ్లీషు పండితులు గూడ గ్రామ్యభాషకు విముఖులుగా నున్నారు గాని సుముఖులుగ లేరు. సుప్రసిద్ధ మహా కవులును 'ఆంధ్రవాల్మీకి' బిరుదాంకితులును నగు శ్రీవావిలికొలను సుబ్బారావు పంతులువారాంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో 'మాతృభాష'యను శీర్షిక క్రింద గ్రామ్యమును నిరసించుచు నొక చక్కని వ్యాసమును బ్రకటించియున్నారు. దానిని జదువరులెల్లరుఁ జదువుకొందురుగాక. ఇందరిటులఁ జెప్పుచున్నారు కావున మన కవులు పవిత్రమగు మంచి శైలికయి ప్రయత్నించుట మంచిది.

ఇప్పుడప్పారావు పంతులవారు తమ యభిప్రాయముల మాఱ్చుకొనినారని విని చాల సంతసించుచున్నాను. దైవకృపచే వ్యావహారిక భాషావాదులెల్ల దమయూహల మాఱ్చుకొందురుగాక.

('ఆర్యమతబోధిని' 1910)





# ఇబ్సెన్

- వేలూరి శివరామశాస్త్రి

### పుట్టు పూర్వోత్తరములు

ఇబ్సెన్ అనునతడొక మహాకవి. ఇతనిది నార్వేదేశము. ఇతడు పుట్టి నూతేండ్లు దాటెను.

పదునెనిమిది ఇరువది యేండ్లనందున ఇతడు Brynjolf Byjorme అను చాటుపేరుతో ఒకగ్రంథము రచించి అచ్చొంత్తించెను. అపుడు మున్నూఱు ప్రతులు మాత్ర మమ్ముడుపోయెను. ఆ కాలమున ఐస్‌లెండునందు వోలెన్‌స్లాగార్ అను డేనిష్ కవియొక్క ప్రభావము కైవ్రాలదొడగెను. అపుడచటి పెద్ద లెల్లరును ఇబ్సెన్ ప్రతిభాసూర్యునకు అర్ఘ్యమెత్తమొదలిడిరి.

ఆ యీ సమయమున ఇబ్సెను ఒక నాటకసంఘమునకు నాటకములు వ్రాసిపెట్టుటకు కుదిరెను. అటుపిమ్మట క్రిస్టియానియా మెడికల్ స్కూలులో కొన్నాళ్లు చదువుకొనెను. అచట నతనికి బిజరన్‌సన్, లై అనువారి చెలిమి కలిగెను. ఇపుడు వారిపేరు లెల్లెడలను తెలియును.

ఇబ్సెన్ తనదేశమున అమలులో న్నవియును, తనకాలమునకు అననుగుణములును అగు ప్రాచీనాచారము లన్నిటిమీదను దాడివెడలెను. స్త్రీల జడత్వము, పురుషుల యేకాధిపత్యము, మునిసిపాలిటీలు మొదలుగా గల పౌరవ్యవహారములందలి చండశాసనము, సుష్కవేదాంతముల వాక్చాపల్యము - ఇత్యాదు లితనికి రుచింపలేదు. ఈ లోపముల నన్నింటిని ఇతడు అపూర్వమగు వివేకముచే కనుగొని ప్రతిభచే కథలు కల్పించి నాటకములు రచించెను. అతడీరీతిగా లోకములోనున్న మకిలనంతయు పైకితీసి 'సమాజస్తంభము' అను నాటకమున ఆడించి చూపినపుడు పెద్ద పెద్ద లందఱును

గడబిడపడి ఇబ్సెనును ఈరీతిగా తిట్టిపోసిరి –

'A crazy fanatic....crankly being not only consistently dirty but deplorably dull....'

- 'Ugly, nasty and downright dull. A gloomy sort of ghoul but on grouping for horrors by night and blinking like a stupid old owl when the warm sunlight of the best of life dances into his wrinkled eyes'.

ఈ తిట్లు తినలేక ఇబ్సెను ఇటలీకి పాఱిపోయెను.

మనదేశమునందు నిందపొందిన సుకవులుగాని, కుకవులుగాని హిమాలయమునకుగాని, నీలగిరికిగాని పాఱిపోయినటుల వినము కాని పాశ్చాత్యులకు ఇటలీపోవుట మామూలు. షెల్లీ, బ్రౌనింగ్, కీట్స్ మొదలగు పెద్దలు ఇబ్సెన్ వగైరాలకు ఈదారి చూపిరి. ఇబ్సెను ఇటలీ నీలాకాశము క్రింద చక్కని కొండలోయలలో ఏకాంతవాస మొనరించెను. స్వదేశము నుండి ఇంతదవ్వు వలసపోయినందులకు తగినరీతిగా కఠోరసాధన చేసెను. అతడచట తన అంతఃకరణమున లోక ప్రతిబింబమును ప్రత్యక్షము చేసికొనగలిగెను.

ఇబ్సెనుకు తన శక్తియెడల బ్రహ్మాండమంత నమ్మకము. అతడా నమ్మకముతో యూరపు ఖండమునకు పట్టియున్న 'వాసనామట్టము'ను కడిగివేయ బూనుకొనెను. 'యువక సంఘము' అను నాటకమున ఈయూహ కొలదిగా బయలుదేఱి క్రమక్రమముగా వికసించెను. అతని నాటకముల నన్నిటిని పరిశీలించినచో అతని మనఃపరిణామ మే నాటకమున ఎటులెటులు మాఱెనో సులభముగా తెలియగలదు. ఒక నాటకము రచించిన తరువాత మఱియొక నాటకమునకు వస్తువు తయారుగా నున్నటుల కూడ మనకు గోచరించును.

అతని మున్మొదటి నాటకములలో బుద్ధియొక్క నిశితత్వమును, దీప్తియును కనబడును. కాని కవి కీరెండును చాలవు. ఈ రెండును ధారణతో జతపడునెడల మనదేశమున శతావధానములు చేయుటకు పనికివచ్చును. లోకము తన్నొనరించిన

దూషణవలన ఇబ్సెను యొక్క అంతఃకరణయంత్ర మంతయు నదరెను. అతడాయదరుననే అంతర్ దృష్టిని బడసి సంఘమునందలి గుణదోషములను కనుగొనగలిగెను. సంఘలోప మతనికనుల వ్రేలెను. ఆ లోపమును నివారించు నుపాయ మతనికి దోచెను. ఈ లోపములును, ఈ యుపాయములును అన్నియు గలిసి అతని మనస్సునందు మత సిద్ధాంతములవంటి కొన్ని సిద్ధాంతము లేర్పడెను. అతడా సిద్ధాంతములనే చిత్రించెను.

**కావ్యగుణములు**

సంఘ లోపములను కనిపట్టి తన్నివారణోపాయములను చూపుటకు పెక్కుదారులు కలవు. మన వాఙ్మయమునందు స్మృతులట్టివి. కొన్ని పురాణములలో గూడ వాని ప్రచారము సుప్రచురముగా గలదు. ఈ విషయములను సాహిత్యసీమలోనికి తీసికొనివచ్చినవారిది. సాహిత్యభూమి యంతయు ఆనందరాజ్యము. కావున ఈ విషయము నంతయు ఆనందముగా పరివర్తించుట దుర్లభము.

పాశ్చాత్య ఖండమునందీ రెండు విషయములను సాహిత్య సామ్రాజ్యములోనికి తెచ్చినవారు కలరు. అట్టివారిలో గాల్స్‌వర్ధీ యొకడు కలడుగాని అతని గ్రంథములను పరికించినచో అతడొక Propagandist అని తేలిపోవును. ఇబ్సెన్ గాల్సువర్ధీకన్న కవితా ప్రతిభ గలవాడు. ఇతడు తన సిద్ధాంతములను తగిన భాషలో, తగిన శిల్పములో, తగిన సంవిధానములలో చిత్రించి మహాకవి యని యనిపించుకొనును.

'Art for arts' sake,' 'కావ్యమ్ – సద్యః పరనిర్వృతయే' అను నీ రెండభిప్రాయములును ఏకోదరములు. ఆలంకారికుల కీ రెండును కొట్టినపిండి. ఈ రెండు మాటలును సత్యమే. కాని ఈ యభిప్రాయము నకు సాక్షాత్తు విపరీతముగా గానిపించు మఱియొక యభిప్రాయము కలదు. అది "ప్రయోజనము కొఱకే శిల్పము" – అని అనబడునది. ఈ యభిప్రాయముగూడ సత్యమేకాని యీ యభిప్రాయము మొదటి యభిప్రాయముతో చేరి కావ్యమునందు కనబడని యెడల కవితాశిల్పము సంపూర్ణము కాదు.

కేవలము ప్రయోజన పర్యవసాయి యగు శిల్పము కావ్య మనిపించు కొనదు.

ప్రయోజనము గౌణముగా నుండి రసమునందుగాని, తుదకు వస్తువ్యంగ్యమునందుగాని పర్యవసించు శిల్పమే కావ్య సామ్రాజ్యమున కర్హము. దీనికి భిన్నమగు ఇబ్‌సెన్ శిల్పము కొంత కలదు. అది నకనకలాడుచునే యున్నది.

అందమగు వస్తువెల్లయు తనకొలదిలో తాను సంపూర్ణము. కాని ఆదియే ఆ వస్తువు నెడల పరినిష్ఠితము కాదు. ఆ వస్తువున కొక ప్రయోజనముగూడ గలదు. పూవు అందమయినదే. అది తనకొలదిలో తాను పరిపూర్ణమే. కాని అది పూవిలుతుని చేతిలోనో, పూబోడి వేనలిలోనో పులకింపవలయును. ఇటులు అందమును, అక్కఱయును ఒకే నాణెముయొక్క క్రింది పెడయు మీది పెడయును అయి చూపడిన యెడలనే అది కావ్యము.

గాల్స్‌వర్దీలో అక్కఱయే ప్రధానముగా భాసించును. ఇబ్‌సెన్ రచించిన తొలుతటి నాటకములలో ప్రయోజనము ప్రధానముగా గానిపించును. పిదపటి నాటకములలో వస్తు వ్యంగ్యము కనబడును. పోనుపోను ప్రయోజనానందముల కతడు తన నాటకములను ఏకాధారము చేయగలిగెను.

ఇబ్‌సెన్ - శిల్పమునం దెక్కువపాలు అందమును, అక్కఱయును అనగి పెనగియుండును. అతడు సృజించిన యాడుది అందగత్తెయేకాక ఇల్లాలు. ఆమె లావణ్యముచే ఇల్లంతయు కలకలలాడును. ఆమె గృహకర్మ చేతను, సేవచేతను ఇంటిల్లిపాది హృష్టపుష్టమయి యుండును.

ఇతడు ప్రయోజనమును తన పాత్రలకు ప్రాణవాయువునుగా జేసెను. దానివలన నితని పాత్రములు కేవలము కంకాళావశిష్టులగు కూలివారివలె గాక జగతి కుపకరించు అసలు మనుష్యులవలె కానిపింతురు. సాంఘిక నాటకములను రచించిన పెక్కుమంది పాశ్చాత్యా కవులకును ఇతనికి నిచటనే భేదము. బెర్నార్డ్‌షా భిన్నులగు ఇబ్‌సెన్ సాంప్రదాయికులు అందఱును అతని శిల్పములోని ప్రయోజన మునే పూజింపగలిగిరిగాని దానితో గలిసియున్న సౌందర్యమును వారు చూడజాలకపోయిరి. ఇటలీలోని బెనిడిత్తో క్రోచే అను సుప్రసిద్ధ దార్శనికుడు 'కావ్యము - అకావ్యము' అను

గ్రంథమునందు ఇబ్‌సెనును గురించి యిటులు వ్రాసెను:

- 'His creations are not cold-blooded animals, they are not abstractions, they live and suffer and break into savage cries, into vows trembling with emotion, into solemn utterances'.

**వస్తువు**

ఇతని సాంఘిక నాటకములలో 'సమాజస్తంభము' అను నాటకము మొదటిది. పిమ్మట 1879 సాలున ఇతడు 'బొమ్మరిల్లు' అను నాటకమును రచించెను.

బొమ్మరింటియందు నోరా అనునామె ఒక బొమ్మ. ఆమె మగడు క్రాగ్‌స్టాడ్. అతనికి చాల జబ్బు చేసెను. వైద్యులు సముద్రతీరమున నివసింపుమని సలహా ఇచ్చిరి. అతనికడ అందులకు తగిన ధనము లేకపోయెను. అపుడు నోరా క్రాగ్‌స్టాడుకు తెలియకుండ (చనిపోయిన) తన తండ్రిపేర కొంత ధనమును బాంకులోనుండి తీసికొని సముద్రతీరమునకు అరిగెను. క్రాగ్‌స్టాడు జబ్బు కుదిరెను. పిదప కొన్నాళ్లకు నోరా మగడు బాంకుకు అధికారియై, సరిగా పనిచేయనందున ఒక గుమస్తాను తీసివేసెను. ఈ గుమాస్తా సాయముచేతనే నోరా బాంకులో డబ్బు పడయగలిగెను. ఆ గుమస్తా ఈ కోపముచేత నోరా చేసిన ఫోర్జరీ బయటబెట్టెను. దాన క్రాగ్‌స్టాడు మండిపడి నోటికి వచ్చినటులు తిట్టి నోరాను తన యింటినుండి వెళ్లిపొమ్మనెను. నోరాకు తనహీనత తెలిసివచ్చెను. పురుషునిచేతిలో బొమ్మవలె నిక నాడజాలక మగడు తుదకు బతిమాలినను నోరా అతని గృహమును విసర్జించెను. ఆడువారందఱును మగవారిచేతిలోని కీలుబొమ్మలని ఇబ్‌సెను ఈ నాటకమున నిరూపించెను.

సావిత్రి యముని యనుగ్రహము సంపాదించి సత్యవంతుని బ్రతికించెను. "నాయనుమతి లేకుండ నీవు యముని యనుగ్రహ మేల సంపాదించితివి" అని సత్యవంతుడపుడు సావిత్రికి విడాకు లిచ్చుచో నెటులుండునో ఈ కథయు ఇంచుమించుగా అటులుండును.

ఈ బొమ్మరిల్లు నాటకము నార్వేలో చాలా అలజడి కలిగించెను. "దయయుంచి

యీ నాటకము మాట యెవరును ఎత్తవలదు" అని విందుల సందర్భములందు ప్రకటింపబడెను. 1885 సాలువఱకు ఈ నాటకము లండనులో ప్రదర్శింపబడలేదు. కాని తరువాత దరువాత నిది ప్రదర్శనీయమే యని అందఱును గ్రహించిరి.

నార్వేలో ఆడువారు మగవారి బొమ్మలని ఇబ్సెను అభిప్రాయ మయియుండగా ఇంగ్లాండులో మగవారే ఆడువారి కొండపల్లి బొమ్మలని స్ట్రిండ్‌బర్గ్ అనునతని యభిప్రాయము. ఈ యిరువుర యభిప్రాయములను కలిపి పరిశీలించుచో సృష్టిలో ఆయా యీ దేశములయందు ఆడువారయినను మగవారయినను ఒకరిచేతిలో మఱియొకరు బొమ్మలు కాక తప్పదని తోచితీరును.

ఇబ్సెను 1881 సాలున 'దయ్యములు' అను ఒక నాటకమును రచించెను. ఇది వెనకటి నాటకము లన్నిటికన్న వేరు.

జన్మవలన వచ్చిన సంస్కార మొకటి. పరిసరములవలన గలిగిన ప్రభావము రెండు. ప్రాణహీనములగు పురాతన విశ్వాసములు మూడు. సాంఘికాచారములు నాలుగు. ఇవి మనలో దయ్యములై నివసించు చున్నవనియు, భూమండల మెల్లయు ఇట్టి దయ్యాలకొంప యనియు తోపజేయుచు అతడీనాటకమును రచించెను.

ఈ నాటకమును చూచి పెద్దలందఱును ఇతనిని క్రూరముగా నిందించిరి. ఇట్టి నిందను విను? పుణ్య మింతవఱకే కవికిని గలుగలేదు. "పొంగిన వైతరిణి - బటాకబయలుగా నొనరించిన పాడు పని - ఉన్ముక్త ద్వారమగు కుష్ఠగృహము - బూతులబుంగ - కవితాశవము" అని డెయిలీ టెగ్రాఫు పత్రిక ఈ నాటకమును గుఱించి ప్రధాన వ్యాసము వ్రాసెను. "Unsexed femalse ... muck ferretting dogs - effiminate men and male women - mellowing ghosts" అని యొక్కరిందలి పాత్రములను స్తోత్రమొనరించిరి. కాని పిమ్మట పిమ్మట ఈ తిట్లే దీవనలాయెను.

నేటి విమర్శకులలో వలువురీనాటకవే ఇబ్సెను నాటక చక్రములో శ్రేష్ఠమతమనుచున్నారు. ఈ యెడ మతభేదము లేకపోలేదుగాని విశ్వసాహిత్యమునందిది చాల దొడ్డదని యంగీకరించుటలో మాత్రమే మతభేదము లేదు.

దీనిపిమ్మట నతడు 'సంఘశత్రువులు' అనునొక నాటకము రచించెను. సంఘశ్రేయము కొఱకెవరాత్మదానము కావింతురో సంఘము వారినే హింసించును అను వస్తు విందు ప్రతిపాదితము. దయ్యములు అను నాటకము రచించి ఇబ్సెను ఏ నిందకు పొందెనో ఆ నిందయే యీ నాటకము అక్షరమక్షరమునను పొందుపడియున్నది.

సంఘమునందలి వ్యక్తులను మఱియొకరు ఉద్ధరింపజాలరని కొన్నాళ్ల కతనికి దెలిసెను – 'ఉద్ధరే దాత్మ నాత్మానమ్', "స్త్రీలకు శత్రువు లిరువురు. ఇంటిలోపెట్టి బీగము వేయువారొకరు. సాధనసంపత్తి కలిగింపకయే సంఘ సముద్రమున బడద్రోయువారొకరు. మొదటివారి వలన ఆడువారు బొమ్మలయిపోదురు – హిందూ దేశమునందువలె. రెండవవారి వలన అపవిత్రలగుదురు – కొన్ని పడమటి దేశములందు వలె" అను నభిప్రాయములను ప్రకటించుచు ఇబ్సెను మఱికొన్ని నాటకములు వ్రాసెను.

ఈ యభిప్రాయము లన్నియు దేశదేశాంతరములయందు వ్యాపించి తొలుదొలుత నిందకు భాజనమయినను పిదపబిదప తలదాల్పబడెను. అపుడు సంఘమంతయు 'ఇబ్సెను దానవుడు కాదురా, దైవమ'ని పూజింప మొదలిడెను. అపుడిబ్సెను ఇటలీ విడిచి యింటికి వచ్చెను. ఇంట గెలిచి రచ్చగెలువవలెనను సామెతకు విపరీతముగా నితడు రచ్చగెలిచి యింటగెలిచెను. అపుడు క్రిస్టియానియా నేషనల్ థియేటరులో ఇతని లోహప్రతిమ ప్రతిష్ఠింపబడెను.

**నిగమనము**

ఇటుపిమ్మట ఇబ్సెను రచించిన నాటకములలో మేలుతరములు నాలుగు. లోగడ నాటకములకన్న వీని తెన్ను భిన్నమేకాని 'దయ్యములు' అను నాటకమునందలి భావముయొక్క పరిణామమే యీ నాటకముల యావదభిప్రాయమని మనము సంగ్రహించి చెప్పనగును. ఈ నాలుగింటిలో Borkman అనునదొక నాటకము. అందలి నాయకుడిరువురు ఉవిదలను జూచును. వారిలో పెద్దది ధనవతి. రెండవది సౌందర్యవతి. అతడు రెండవదానిని ప్రేమించెను. కాని అతనికి డబ్బే ప్రాణము. కాన పెద్దదానినే పెండ్లియాడెను. అతడీరీతి అస్వాభావిక మయిన ఆశను తీర్చుకొనదలచి స్వాభావిక-మయిన ప్రేమను హింసింపదలచెను. క్రమక్రమముగా నతని మానవత్వ మంతయు

చచ్చిపోయెను. అసంగతమగు జీవన వైయర్థ్యమును తెలుపుట దీని ఉద్దేశము. ఎవరి అంతరాత్మ చచ్చిపోయెనో వారి జీవితమంతయు వితయని తెలుపుట యీ జాతి నాటకముల వెరసికట్టు అభిప్రాయము.

'చచ్చినవారు లేచినపుడు' అను నాటక మీజాతిలో చివరిది. ఇబ్సెను ప్రతిభయంతయు ఈ నాటకమున కేంద్రీకృతమాయెను. తాను లోగడ సృజించిన ప్రేతములను అతడీనాటకమున ఊఱడించెను. 'అందఱ అంతరాత్మలును చచ్చియున్నవి సరే! చచ్చిన మనము స్త్రీలనుగూడ చంపుచున్నాము. ఈ కళంకము పురుషులు క్షాళణ మొనరించుకొనవలయు ననున దిందొక యంశము. డెబ్బదవయేట నతడీ రూపకము వ్రాసెను.

ఈ రీతిగా డెబ్బదేండ్లొక నిమిషమేని విశ్రాంతి యనుమాట యెఱుగక అతడు జబ్బుపడెను. అతని స్మృతిశక్తి లోపించెను. ఈ నాటకకర్త నొసట చరమదశయందు చిత్తశాంతిని ఆ జగన్నాటకర్త వ్రాసియుండలేదు. ఈరీతిగా అతేండ్లు చివికి చివికి 1909 సాలున నార్వేచలికి వడవడ వడకి సూర్యదర్శనమునకు తపతప కొట్టుకొని - 'వెలుగు, సూర్యుని వెలుగు' అని ఉచ్చరించుచు ఇబ్సెను 23 మే నెలలో ఎల్లలేని వెలుగుటెల్లలో విడియబోయెను.

'దయదయ్యములు' అను నాటకమున ఆస్వాల్డ్ అనువానిచే – వెలుగు, సూర్యుని వెలుగు' అని అనిపించి ఇబ్సెను అతనిని అస్తమింపజేసెను. తుదకు తాను అటులనే అని అస్తమించెను. ఈ విషయైక్య మీతని జీవితమున ఒక చిత్రమైన రహస్యము.

గెటేకూడ 'Light, More Light' అని ప్రాణములు విడుచుచు తన విజ్ఞానతృష్ణకు సీమయు, పరిసీమయు లేదని తెలిపిపోయెను. సాహిత్య రాజ్యమున అతని తావున ప్రతిష్ఠింపదగిన ఇబ్సెను గూడ అతని మాటలనే మఱియొకతీరుగా అనిపోయెను.



# సమాజశ్రేయస్సు - తృతీయ పురుషార్థం

శ్రీ తిరుమల రామచంద్ర

స్త్రీ పురుషులను ఆకర్షించి పరస్పరం సన్నిహితులను చేసే అంతః ప్రవృత్తి కామం. పంచ జ్ఞానేంద్రియాలు ఆత్మసంయుక్తమైన మనస్సుతో కలిసి తమ తమ పనులలో ఆనుకూల్యాన్నిబట్టి ప్రవర్తించడం సామాన్య కామమని, ఇది స్పర్శ విశేష విషయం కావడం వల్ల కలిగే సుఖప్రతీతి విశేష కామమని వాత్స్యాయనుడు నిర్వచించాడు. ఈ కామ ప్రవృత్తి ప్రాణి సామాన్యం:

నిజానికి దీని మూలం సంతానోత్పత్తే. మానవేతర ప్రాణులలో ఋతుకాలా నుగుణంగా కామవాంచ కలగడం, గర్భాధానం, ప్రసవం మొదలయినవి వాటంతట అవే జరిగిపోతాయి. మానవజాతి వికసించనంతవరకు కామ ప్రవృత్తి ప్రకృతి గతమైన సృష్టి కార్య కలాప మాత్రంగానే వ్యవసితమైంది. నేటికీ తక్కిన జీవరాసులలో ఇది అంతః ప్రవృత్తిగానే ఉంది. మానవుడు జీవజాతం నుండి ఉద్బుద్ధం కాగానే, మనస్సనే పదార్థం ఆకాశంలోని చంద్రునిలాగా, వెన్నముద్దలాగ తేలగానే కామ ప్రవృత్తి క్లిష్టంగా పరిణమించింది.

దీనిని నేటి పరిభాషలో 'సెక్స్' అనే వ్యవహరిద్దాం సౌలభ్యం కోసం.

ఈ సెక్స్ మొదటి నుంచీ వ్యష్టి సమస్యగాను, సమష్టి సమస్యగాను చిక్కులు పెడుతూ ఉంది. మానవుడు "ఎమీబా" వంటివాడుకాడు. సంఘజీవి. సంఘమంటే నై కమానవమనే అనుకుందాం. రెండవ వ్యక్తి అనగానే సంఘమన్నమాట. మానవుడు తన వ్యష్టివాంఛలను సమష్టి వాంఛలకు, నియమ నిబంధనలకూ లోనవుతూనే తీర్చుకోక తప్పదు. వ్యక్తి క్షేమానికీ, సంక్షేమానికి, వైరుధ్యం కలుగకుండా ప్రవర్తించడం

అవసరం. కనుక సంతానోత్పత్తే లక్ష్యమైన జీవరాశికీ, మనిషికీ ఈ విషయంలో చాలా భేదం వుంది. కనుకనే ఆహార విహారాలలో జాగ్రత్త అవసరమన్నారు పూర్వులు. తదనుగుణంగానే కామానికి పురుషార్థస్థాయి యిచ్చి జీవితంలోని ప్రధాన సిద్ధులలో ఒక్కటిగా చేసుకున్నారు.

ప్రాచ్యుల లక్ష్యం దాంపత్య జీవితం. దాంపత్య జీవితం పరమార్థం సంఘ శ్రేయస్సే. ఎవరికివారు విశృంఖలత అవలంబిస్తే సంఘం విచ్ఛిన్నం, దుఃఖభాజనం అవుతుంది. "ఆహార నిద్రాభయమైధునాలు, పశువులకు మనుష్యులకు సమానంకదా! వాటి నుండి వేరు చేసేది వివేకమే" కనుక లక్ష్యం ధర్మప్రజ అని, కామసుఖం ఆనుషంగికమని నిర్ణయించుకున్నారు. ప్రజ కోసమే గృహస్థాశ్రమమన్నారు. చతుర్వర్గ సాధనకు కామమే ప్రధానం. "కామిగాక మోక్ష కామిగాడు." కాని ఈ సెక్స్ - కామం - అదుపులో వుండాలి. దీనికి కుమార సంభవగాథ చక్కని ఉదాహరణగా చూపుతారు. పరమేశ్వరుడు మన్మథుణ్ణి దహించి అనంగుడుగా అవతరింపజేశాడు. అంటే సెక్స్‌ను నిగ్రహించడ మన్నమాట. నిజమైన నిగ్రహం తపస్సుతోగాని రాదు. పార్వతి తన సహజ సౌందర్యంతోనే శంకరుణ్ణి వలపింపవచ్చు ననుకుంది. కాని, సాధ్యం కాలేదు... తపస్సు చేసేవరకూ. దేనికైనా పరిష్కారం కావాలంటే తపస్సు అవసరం. తపస్సంటే నిగ్రహం-అదుపు. శకుంతల ముందు రాజునిచూచి మోహంలో మనసు అప్పగించింది. తపస్సుతోగాక తుది కలయిక సిద్ధించలేదు. నిగ్రహంలేక ఉదరపరాయణులైనవారిని ధర్మదూరులని భావించి దేవతలు పరిత్యజిస్తారని శాంతి పర్వంలో భీష్ముడంటాడు. నిగ్రహంవల్ల కలిగే ఫలాలను భారతం అనుశాసన పర్వం "ఇంద్రియ నిరోధం వల్ల, దానం వల్ల, దమంవల్ల మానవుడు కోరినదంతా సంపాదించగలడు" అని తెలిపింది. కామమన్నది ఎంత అనుభవించినా తీరదు. అగ్ని హవిస్సు వేసిన కొద్దీ మండుతూనే ఉంటుందికదా... అంటాడు మనువు.

ఈ నిగ్రహం కోసమే వివాహ వ్యవస్థ ఏర్పడింది. సంఘశ్రేయో దృష్టితో మన పూర్వులు వివాహ్యావస్థను కట్టుదిట్టం చేశారు. ఉత్తమ సంస్కారంగల స్త్రీ అధమ సంస్కారంగల పురుషుని పొరపాటుతో నన్నా పొందితే, వాడితో ఆమెకు వివాహం కావడం శ్రేయస్కర మన్నారు ధర్మశాస్త్రకారులు. ఇది కొంత విడ్డూరంగానే ఉన్నా

విజ్ఞానశాస్త్ర దృష్టితో సరైందేనని తోస్తుంది.

పాశ్చాత్యులలోను దాంపత్యజీవనానికి ప్రాధాన్యం కనిపిస్తున్నా, విశృంఖలత ఉందని చెప్పాలి. దానికి కారణము దేశకాల పరిస్థితులు; ఆచార వ్యవహారాలు; సంస్కృతి సంప్రదాయాలు కావచ్చు. ప్రాచ్య దేశాలలోలాగ స్త్రీ పురుషులు అక్కడ దూరదూరంగా ఉండడానికి వీలులేదు. పారిశ్రామిక నాగరికత మరీ పెరిగిన ప్రాంతమది. ఉభయులకూ సన్నిహితత్వం, కొంత వైశృంఖల్యం తప్పవేమో ! అయినా పెద్దవారు, సంస్కృతి కలవారూ దాంపత్య జీవనాకాంక్షులే. హెన్రీఫోర్డును "మీ దాంపత్య జీవితము . ఇంత సుందరంగాను, సుఫలంగాను ఉండడానికి కారణమేమిటి?" అని ఎవరో అడిగారట. "మరేమీలేదు. వాణిజ్య రంగంలో అనుసరించిన ఫార్ములానే గార్హస్థ్య జీవితంలోను అనుసరిస్తున్నాను. అదేమిటంటే, ఒకే మోడల్‌ను నమ్ముకోడం" అని సమాధాన మిచ్చాడట ఆయన.

కట్టుబాట్లున్న కొద్దీ కుతూహలం పెల్లుబుకడం సామాన్య మానవులకు సహజం, అప్పుడు అతిచారం, వ్యభిచారం చెలరేగుతాయి. అపత్య లోభంలో అతిచరించడం కూడా తగదన్నాడు మనువు. సెక్స్ విజృంభించి, ఉపభోగార్హ అయిన స్త్రీని స్వంత ఆస్తిగా చూచుకొనే తలపురావడంతో స్త్రీని అదుపులో పెట్టుకోడానికి స్త్రీ అన్ని వికారాలకు పుట్టినిల్లు; కామం, క్రోధం, కపటం, ద్రోహభావం పుట్టుకతోనే స్త్రీకి అబ్బే గుణాలు. పిల్లలను కనడం, కన్నవారిని పెంచడం ఇవే స్త్రీ పనులు. గర్భధారణకు స్త్రీలు పుట్టారు. గర్భం చేయడానికి పురుషులు పుట్టారు. కనుక, స్త్రీ ఇతరుల వద్ద సంతానంపొంది తన కులాన్ని సంకరం చేయకుండా ఎన్ని ఉచ్చులు బిగించాలో... పాపభీతితో, అనునయంతో, మర్యాదతో – అన్నీ చెప్పాడు మనువు.

సత్సంతానం, ధర్మకార్యాలు, శుశ్రూష, ఉత్తమమైనరతి, స్వర్గం దారాధీనాలు. కనుక స్త్రీని భద్రపరచుకోవాలి. నీ భార్య పరుల దగ్గరకు పోకుండా చూడడానికి నీవు పరస్త్రీలతో పోవద్దు. పరక్షేత్రంలో విత్తితే పంట క్షేత్రస్వామికిగాని నీకు కాదుకదా! ఆకాశములో బాణము వదలితే ఏమిటి ప్రయోజనం? అట్లాగే పరదారను పొందితే నీకు సంతానము దక్కుతుందా? భర్తతో భార్య, భార్యతో భర్త సంతృప్తిపడిన కులంలో కల్యాణము అవిచ్ఛిన్నంగా ఉంటుంది... ఇదీ మనువు ధోరణి.

ఇంత కట్టుదిట్టాలు, అష్టదిగ్బంధాలు చేయడం స్త్రీ సుఖం కోసమే. నాకేమి సుఖం. సంప్రయోగంలో (మిథున కర్మలో) ఎక్కువ సుఖము కలిగేది ఎవరికి? స్త్రీకే. అనుభూతి కలిగేది ఆమెకే ఎక్కువ - అని తమ నిర్బంధాలను సరిపెట్టుకున్నారు మన పూర్వులు.

ఈ భావానికి కామశాస్త్రకారులు చిలవలు పలవలు అల్లారు.

"సంయోగే యోషితః పుంసాం
కండూతి రపనుద్యతే,
తచ్చాభిమాన సంస్పృష్టం
సుఖమిత్య భిధీయతే" అని.

ఈ పరిశీలన మరొక పాయవేసి, స్త్రీకి భావప్రాప్తి (క్లైమాక్స్) మొదట కలగడం అవసరమనే కొత్త విషయం కనుగొన్నది. ప్రపంచంలో పలువురు స్త్రీలకు భావప్రాప్తి అంటే ఏమో తెలీదని పెక్కు మంది ఆధునిక కామశాస్త్రజ్ఞులు తెలిపారు. గర్భాధారణకు క్లైమాక్సుకు సంబంధం లేదు. కనుక, పురుషుడు తన ఆత్రంలో తన సహాసం ప్రయోగిని మనస్థితి తెలుసుకొనే ఓపికతో ఉండడు. అందువల్ల తన వేగము మందమైపోగా స్త్రీ చెక్కు చెదరకుండా వుండడము చూచి విస్తుపోతాడు. దంపతులిద్దరికీ సమానమైన సుఖం కావాలి. కనుక స్త్రీకి మొదట భావప్రాప్తి కలిగేట్టు ఉపచరించా లంటాడు వాత్స్యాయనుడు.

ఈ వైషమ్యం తొలగించడానికి సెక్స్ విజ్ఞానం నేర్వాలి. సంప్రయోగం జీవి సహజం. ప్రత్యేకంగా విడమరచి చెప్పనక్కరలేదు. జంతువులకు ఎవరు నేర్పుతున్నారు? ఆంబోతుకు నీవే నేర్పావా? - అని వాదించేవారున్నారు. వాటికి నేర్పనక్కరలేదు. అంతః ప్రవృత్తితోనే ప్రజననకర్మ సాగిపోతుంది. మానవునికి మనస్సు అనేది ఒక కొత్త పదార్థం. అది కోతివంటిది. దానిని కట్టివేసి న్పేతేనేగాని నిలకడగా ఉండదు. నేడు అనాది కాలపు పరిస్థితులు ఉన్నాయా? మన దేశంలోనూ పారిశ్రామిక నాగరికత ప్రబలుతున్నది. కార్ఖానాలు, కళాశాలలు స్త్రీ పురుషులతో కిటకిట లాడుతున్నాయి. జీవిత విధానం మారడంతో కొత్త సమస్యలు ఉత్పన్నం కావడం సహజం. తదనుగుణంగా సులభంగా సెక్స్ విజ్ఞానం, సంఘనీతి బోధించడం

ఆవశ్యకం. అప్పుడే గుడ్డిలో మెల్లగా వ్యవస్థ ఏర్పడుతుంది – అనేదే పైవారికి సమాధానం.

ఈ సెక్స్ విజ్ఞానం ప్రాయం పొటమరిస్తున్నప్పుడే అవసరమనడం నిర్వివాదం. ఆ విజ్ఞానం మన ప్రాచీన కామశాస్త్ర గ్రంథాల వల్ల అంతగా కలగడం లేదంటే అసత్యం ఆవంతైనాలేదు. అవి పెడదారి పట్టాయన్నా తప్పులేదు. స్త్రీ విషయైక సాధనం, మగవాని సొంత ఆస్తి – అనే భావం మన సంఘంలో ప్రబలంగా పాతుకున్న రోజులలో, తియ్యని గార్హస్థ్య జీవనం అందని మానిపండైన కాలంలో మన కామశాస్త్ర గ్రంథాలు పుట్టాయి. పవిత్రమైన పరిణయానందాన్ని గురించి, "ప్రజయాహి మనుష్యః పూర్ణః" అని సత్సంతానాన్ని గురించి, వేదాలు చేసిన ఘోష "కాలానికే కారణమైన" రాజుల కొలువు కూటాలకు వినబడలేదు.

రాజరికం స్థిరపడిననాటి దురాచారాలను రాజుల దుష్కామాన్ని సమర్థించడానికి పూనుకున్న మేధావులలో వాత్స్యాయనుడొకడు. తనకు ముందు కామశాస్త్రాన్ని సూత్రించినవారు తొమ్మండుగురు ఆచార్యులు ఉన్నారని వాత్స్యాయనుడు పేర్కొన్నాడు. ఆ మహనీయులలో దత్తకుడనే ఆచార్యుడు పాటలీపుత్రంలోని వేశ్యల కోసం ప్రత్యేకంగా వైశికాధికరణము వ్రాసి లోకసేవ చేశాడట. కూచిమారుడనే మరొక ఆచార్యుడు అసహజంగా కామాన్ని విజృంభింప జేయడానికి కావలసిన మందులు, మాకులు చెప్పి ఔషనిషదాధికరణాన్ని నిర్వచించాడు. కనుక వాత్స్యాయనుడు ఈ రెండు విషయాల జోలికి ఎక్కువగా పోక కొంచెంగా స్పృశించి సామాన్య, కన్యా, భార్యా, పారదారికాధికరణాలను సూత్రించాడు.

పారదారిక మనగానే, మన కామశాస్త్ర గ్రంథాలలో తియ్యని ఆలుమగలు నెయ్యంకన్నా విటవిటీ, చేటచేటీ విషయం హెచ్చుగా ఉండడం సహజమే. ప్రేమ, రాగాతిరేకం చచ్చి కేవలం కళేబర ప్రాయమైన విషయ సుఖం మసలుతూండడంలో వింతలేదు. మొట్టమొదటి మన కామశాస్త్రజ్ఞులు కొందరు సమీచీన కామ విజ్ఞానం అవసరమని గుర్తించినా తర్వాతివారు దానిని శారీర శాస్త్రానుసారంగా వివరించక కామతృష్ణను ఉద్దీప్తం చేయడానికే వినియోగించారు. వాత్స్యాయనుడు గార్హస్థ్య జీవితాన్ని కొంత వరకు చక్కగానే వివరించినా, వ్యభిచారానికి గల కారణాలను

పారదారి కాధికరణంలో చర్చించినా, వేశ్యలను అప్పటి పరిస్థితుల్నిబట్టి పెద్దగా సమర్థించడం, అసహ్య పద్ధతులను తప్పులేదనడం వల్ల అతని వాదం మొగ్గ రాజుల దుశ్చరితాలను బలపరచడంపైనే కాని, ఖిలపరచడంపైన కాదనడం స్పష్టం.

ఆయన పారదారికాధికరణాన్ని నేడు ఆచరణలో పెడితే ఎలాటి ప్రతిఫలం లభిస్తుందో మన మనస్సుకే తెలుసు. వాత్స్యాయనుడు అన్నీ చెప్పి, "వైద్యుడు కుక్క మాంసం రసవీర్య విపాకాలనుకూడా శాస్త్రదృష్టిలో చెబుతాడు. అంతమాత్రాన అది భోజ్యమని కాదు. అలాగే నేను చెడ్డ విషయాలు చెప్పాను. అన్నిటినీ పఠితలు ఆచరించాలనికాదు" అని తెలివితో తప్పుకున్నాడు.

అయినా, ఇవన్నీ చాలవరకు పురుష దృష్టితో వ్రాసినవే. స్త్రీ దృక్పథమేమిటో పూర్తిగా ఆలోచించినవారు చాలతక్కువ. ఉభయుల మనస్తత్వం పూర్తిగా చర్చించి కామశాస్త్ర గ్రంథాలు వ్రాయడం 19వ శతాబ్దిలో ప్రారంభమైనదనవచ్చు; అదీని పడమటిగడ్డన. పాశ్చాత్య కామశాస్త్ర విజ్ఞానానికి 'బూ అలిపినా' అనే అరబ్బు వైజ్ఞానికుడే - వాత్స్యాయన కామసూత్రాలను క్షుణ్ణంగా పరిశీలించిన వాడు - ప్రథముడు అయినా, జీవితంలో కామ ప్రవృత్తికి గల ప్రాధాన్యం సిద్ధాంతంగా ప్రతిపాదించినవాడు ఫ్రాయిడ్. అతడు ఆటవికులవంటి అనాది జాతులతో కలిసి మెలిసి తిరుగుతూ ఎన్నో విషయాలు సేకరించి "టోటం అండ్ టాబూ" అనే గ్రంథం వ్రాశాడు. మనం ఉపాకర్మనాడు ఉదయం "కామోకార్షీత్, మన్యు రకార్షీత్, కామఃకర్తా, నాహంకర్తా, కామః కారయితా, నాహం కారయితా, ఏషతే కామ కామాయ స్వాహా" అని కామమే నన్ను అన్ని పనులూ చేయమంది, అన్నిటికీ అదే మూలం అని జపం చేస్తున్నట్టు, ఫ్రాయిడ్ అన్నిటికి కామప్రవృత్తే కారణమని తల్లిపిల్లకు పాలివ్వడం కూడా కామప్రవృత్తే అని అన్నాడు. పిదప కామ విజ్ఞానానికి నికషంగా డాక్టర్ హెవలాక్ ఎల్లిస్ "సైకాలిజీ ఆఫ్ సెక్స్" అనే ఉద్గ్రంథం వెలువడింది. "టెక్నిక్ ఆఫ్ మేరేజ్"లో వైట్ గేట్ వివాహ వ్యవస్థను చక్కగా చర్చించాడు. ఆంద్రె మోర్వా వ్రాసిన "ఆర్ట్ ఆఫ్ లివింగ్"లోని "ఆర్టు ఆఫ్ మేరేజ్" "ఆర్టు ఆఫ్ హాపీనెస్" ప్రకరణాలు అమూల్యమైనవి. మన పాత పుస్తకాలలోని విపరీత బంధాలవలెగాక మేరీసోప్స్ తన గ్రంథంలో ఆరోగ్య కరమైన విషయాలను శారీర శాస్త్రానుగుణంగా

వర్ణించింది. "సిన్ అండ్ సైన్స్" అతిచార, వ్యభిచార నిర్మూలనానికి ఎంతో ఉపయోగకరం.

ప్రేమ కామాల విలువ తెలియనివారు వాటిని గురించి చౌకగా వ్రాస్తారు. విజ్ఞానశాస్త్రం మూడాకులు ఆరు పూవులుగా వికసిస్తున్న ఈ రోజులలో ప్రాచీన ప్రాచ్య కామశాస్త్ర గ్రంథాలవల్ల కలిగే ప్రయోజనం అత్యల్పం. ఈ కామశాస్త్ర విజ్ఞానాన్ని, ప్రతీచీన సంస్కృతిని జీర్ణించుకున్న పండితులు శారీర శాస్త్రానుగుణంగా ఉత్తమ గ్రంథాలు రచించి సంఘసేవ చేయవలసి ఉంది.

పెండ్లి పెక్కేండ్ల పంట – అంటారు పెద్దలు. ఎంతోకాలం మంతనాలు జరిపి, పొంతనాలు చూశాక కాని పెండ్లిండ్లు చేయరు. మరీ కాపురంలో పొందిక కుదరకపోతే కాలకూటం పుట్టిందన్న మాటే.

ఈ పొందికకు దంపతులలో సెక్స్ వైషమ్యం – కామోప భోగంలో విషమత – లేకపోవడం ప్రధానం. సెక్స్‌ను మించిన హృదయావేగం మరొకటిలేదు. సెక్స్ జీవికి ప్రధానమైన కోరిక అని ఇదివరకే అన్నాము. కామం శరీరస్థితి హేతువు కావడం వల్ల ఆహారం వంటి నిత్యావసర మవుతూ, ధర్మార్థాలకు ఫలభూతమైన పురుషార్థమూ అవుతున్నది–అన్నాడు వాత్స్యాయనుడు. ఈ పురుషార్థం సఫలంకాకపోతే, సంతృప్తి కలుగకపోతే కలిగే ప్రమాదాలు కొల్లలు.

కాపురంలో పొందిక లేకపోవడానికి కారణాలు శారీరకంగాను, మానసికంగాను, స్వభావ సంస్కారాలనుబట్టీ వుంటాయి. ఇవి కాపురం ఆరంభమైనకొన్నాళ్ళకే ఆరంభమై ఇంతింతై, హృదయ నభోమండలంలో అంతై వ్యాపిస్తాయి. పెండ్లి, కాపురం అనగానే దంపతులు ఏవేవో మధుర మధుర భావాలతో స్వప్న వీధులలో విహరిస్తారు. కాపురం పెట్టడంతోనే తమ ఆశలన్నీ నిరాటంకంగా, నిరంతరంగా నెరవేరుతాయనీ ఆడియాసలు పడుతారు. ముఖ్యంగా పురుషుడు తన ఆశలన్నిటినీ పిండి వేయడానికి ఉబలాట పడుతాడు. కాని, స్త్రీ పురుషుడు చూపినంత ఆవేగం చూపదు. దీనితో ఆమె అప్రవర్తకత్వం – చొరవ చూపకపోవడం–గుర్తించడంతో పురుషుడు కొంచెం వెనుతగ్గి భార్య తన వాంఛలను తీర్చలేకపోతున్నది; తాను చూపుతున్న సంరంభం చూపలేకపోతున్నది–అనే అపోహపడతాడు. గార్హస్థ్య జీవితం తొలినాళ్ళలో

పురుషులకు కామవాంఛ హెచ్చుని, పది పన్నెండేళ్ళు కాపురం చేసిన తర్వాత - ప్రారంభకాల పరిస్థితికి విరుద్ధంగా - కామవాంఛ లొచ్చుని శాస్త్రజ్ఞులంటారు. ఈ తొలినాళ్ళలోనే పురుషుడు దురుసుగా ప్రవర్తించడంవల్ల స్త్రీకి వైముఖ్యం ఏర్పడడం - ఆమె మగడంటే ఎంత ప్రేమగలదైనా- సంభవిస్తుంది. కాపురం చాల సున్నితమైంది. హెచ్చులొచ్చులు లేక సమ్మసరిగా ఉంటేనే ఏపుగా పెరుగుతుంది. సమవేగంగా వున్నపుడే సుఖమూ, సంతోషమూను. నాయకుడు చిరవేగుడు, చండవేగుడు అయితే-ఎంతకూ వదలనివాడయితే - స్త్రీలకు అసహ్యం కలుగుతుంది; శీఘ్రవేగుడు, మందవేగుడు అయితే భావప్రాప్తికలుగక ఈసు పుడుతుంది. కనుక ఉభయత్రా సమవేగం అవసరం - అంటాడు వాత్స్యాయనుడు. కామమనేది ప్రకోపించిన పిదప త్వరగా శాంతించదు; మనస్సు స్తిమితం కోల్పోతుంది. ఇలా మరికొన్నిసార్లు జరిగితే కాపురం పొందిక ప్రిదిలిపోతుంది.

కాపురం కలతలపాలు కావడానికి మరొక కారణం స్తబ్ధత- జడత్వం. ఈ స్తబ్ధత సెక్సును గురించి పెద్దవారు చెప్పిన లేనిపోని భయాలవల్ల ముఖ్యంగా స్త్రీలలో ఏర్పడుతుంది. కొత్త శోభనపు పెళ్లికూతుర్ని శోభనపు గదిలో పంపుతు న్నప్పుడు కూడా పక్కింటి పొరిగింటి అమ్మలక్కలు మొగని తాకిడిని చిలవలు పలవలుగా చెప్పి బెదరగొట్టడం నేడూ మన గ్రామాలలో, పట్టణాలలో జరుగుతు న్నదే. ఈ మాటలతో మనసులో చీకట్లు కమ్మినవారు కొన్నేళ్ళు కాపురం చేసినా స్తబ్ధులుగానే ఉంటారు. “భార్య భర్తనే నమ్ముకొని, ఏకచారిణిగా, భర్తపై భారమంతావేసి అతనినే దేవతగా భావించి అనుకూలంగా ప్రవర్తించాలి” అని పదే పదే ఉపదేశామృతం వీనుల పడడంవల్ల నవవధువు బిక్కు బిక్కు మంటూనే భర్త కోరికలు తీర్చినా, మనసిచ్చి మసలదు; తీవ్రత చూపదు; చల్లడి వుంటుంది. దీనితో క్రమంగా భర్త అంటే వెగటు, వైరస్యం పెరిగిపోతాయి ఆమెలో, సంప్ర యోగంలో త్వరగా ద్రవించదు-అంటే మామూలు మాటలలో నడుము సడలించదు; ఒళ్ళుకదలదు. దీనితో ఆమెకు మూర్ఛాపస్మారాదిరోగాలు పుట్టే ప్రమాదం కూడా ఉంది. ఇలాగే పురుషుని స్తబ్ధతను కూడా స్త్రీ ఉపేక్షగాను, ప్రేమరాహిత్యంగాను భావిస్తుంది. దానితో రెచ్చిపోయి, పెడదారి తొక్కడమూ సంభవిస్తుంది. ఈ విధంగా

కామోపభోగంలో వైషమ్యం పోనుపోను ఉభయుల హృదయాల లోను నీలినీడలు పడవేసి వ్యభిచారానికి దిగజారవేయడానికి ప్రధాన కారణమవుతుందన్నా అతిశయోక్తి కాదు.

నిజానికి, ఎంతో మనోవ్యథ, కష్టం తర్వాతగాని వ్యభిచారంలో ప్రవృత్తి ఏర్పడదని మానవజాతి చరిత్రలు పరిశీలిస్తే తెలుస్తుంది. వ్యభిచారమనేదాని నిర్వచనమూ యుగ యుగాలలో మారుతూనే ఉంది. ఒకానొక కాలంలో ఇంటికి విచ్చేసిన అతిథికి గృహస్వామి తన భార్యను సకలోపచారాలకు అప్పగించడం ధర్మం. దానిని కాదన్నవారిని, రాజులను రాజర్షులను, మహర్షులను కూడా – శపించిన గాథలు భారతంలో ఉన్నాయి. నిన్న మొన్నటివరకు ఈ ఆచారం ఎస్కిమోలలో ఉండేదని చరిత్రకారులంటారు. తనకు అపూర్వానందమిస్తున్న వస్తువును అతిథికి అర్పించి ఆనందింప జేద్దామనే సత్సంకల్పమే ఈ ఆచారానికి మూలహేతువు కావచ్చు. బహుపతిత్వం ఒకప్పుడు ఆచారం; ధర్మం. నేడది ఎంతో అపహాస్య భాజనం; అవమానకరం. బహుపత్నీత్వం మొన్నటివరకు శాస్త్ర సమ్మతం; నేడది నేరం. ఏమైనా వివాహమనే వ్యవస్థ ఏర్పడడానికి ముందూ, తర్వాత కూడా అన్ని కాలాలలోను కామోపభోగ విషయంలో ఆర్జవం అత్యవసరమనేది అన్ని దేశాలవారూ గుర్తించిన ధర్మం; అతి పవిత్రమైన ధర్మం; కామ ప్రవృత్తి ఆకలీ దప్పుల వంటి ప్రవృత్తి సామాన్యం కాక తదతీతమైందనడం స్పష్టం గనుక యాదృచ్ఛికంగా సృష్టికి కారణమవుతూ, అనితర సాధ్యమైన ఆనందాన్ని పొందించేది గనుక, స్నేహానికి పరాకాష్ఠ గనుక, తత్సాధనమైన వారిని అదుపులో పెట్టడం, కట్టుబాట్లు సంఘంలో అనాదిగా ఏర్పడడం వల్ల, ఈ విషయంలో అనార్జవం మహాపాతకంగాను, మహాపరాధంగాను భావించారు; వర్ణించారు. పరస్పరం మరణ పర్యంతం వ్యభిచారమనేది తలపెట్టకుండా కాపురం చేయడం స్త్రీపురుషులకు పరమోత్తమమూ, సమానమూ అయిన ధర్మం. కనుక ఉభయులూ ఆర్జవంతో ప్రవర్తించాలి. స్త్రీ భర్తను మీరి పెడదారి తొక్కితే లోకంలో నిందను మోసి, పాపం పొంది, రోగాలతో నవిసి, మరుజన్మలో జిత్తులమారి నక్కై పుడుతుంది – అని మనువు అన్నాడు. అన్ని మతాలలోను ఇలాటి విధి నిషేధాలే ఉన్నాయి. ఏకపత్నీవ్రతానికి, పాతివ్రత్యానికి ప్రాధాన్యమిచ్చే కథలు, గాథలు నేల

నాలుగు చెరుగులా వినిపించేవే. వ్యభిచారం అన్ని మోసాలకన్నా "మహామోసం"గా భావించడంవల్ల వ్యవస్థ మాంచి బిగువుగా ఉండడంవల్ల మనలో సెక్స్ విషయమై అనార్జవం తక్కువే - ముఖ్యంగా స్త్రీలు వ్యభిచరించడమనేది అరుదే. పతిపై అనురాగం, తన పిల్లాజెల్లాపై వాత్సల్యం, వయస్సు మళ్లిపోవడం, అవమానం, కష్టం కలుగుతాయన్న ఆశంక, అందని మానుపండులే అన్న అప్రత్యయం, మన నుంచి మరొకరికి మనఃక్లేశం ఎందుకులే అన్న మంచితనం, గుట్టు బయటపడితే గుంపు నుంచి వెలి అనే గాబరా, భర్తే మరొకరి ద్వారా మభ్యపెట్టించి పరీక్షిస్తున్నాడేమో నన్న విమర్శ, అన్నిటికీ మించి ధర్మాపేక్ష స్త్రీలలో వ్యభిచార వ్యావర్తన కారణాలు - అని వాత్స్యాయనుడన్నాడు.

కాని నేడు కొందరు వ్యభిచారం గురించి భిన్నాభిప్రాయంతో సమర్థించేవారూ ఉన్నారు. మన వివాహ వ్యవస్థ సెక్స్ సిద్ధాంతాలు, నిబంధనలు 'మధ్యతరగతి నాగరికత' పాదులో మొలచినవి. నీతి అనేది ఎప్పటికప్పటికి మారేదిగనుక సహేతుకం కాదు. మానవుని కామప్రవృత్తి అనుభవ వైవిధ్యం లేకపోతే అతృప్తంగానే ఉండి పోతుంది. ఒకే ఒక ఒర్తిపెళ్ళాంతో విసుగెత్తిపోతుంది. కనుక మనస్సంతృప్తికి పలువురు పడతులు అవసరం - అని వీరు వాదిస్తారు.

ఇక స్త్రీలలో సంప్రయోగం చేతనే తృప్తి పొందక సంతానం కోసం - చిట్టిచేతులు తమ పాలిండ్లు పట్టుకొని, పట్టు పెదవులతో పాలుపీల్చే అపూర్వానుభూతి కోసం - కాలు జారేవారు, తమ భర్తలకు ఆధాన సామర్థ్యం తగ్గిందనే భ్రాంతితో పక్కదోవలు చూచేవారూ ఉన్నారు. సంప్రయోగ సుఖానికీ - భావప్రాప్తికీ- సంతాన ప్రాప్తికీ సంబంధం లేదని మొదట్లోనే చర్చించాము. కాని సుశ్రుతుడు భావప్రాప్తి లేనిదే బీజాధానం కలుగదన్నాడు. "నహ్యసత్యాం భాప్రాప్తౌ గర్భసంభవ ఇతి బాభ్రవీయా" (భావప్రాప్తి లేకపోతే గర్భం సంభవించదని బాభ్రవీయులు అంటారు.) అని వాత్స్యాయనుడన్నాడు.

సామాన్య వ్యవహారిక జీవితంలోనే ఆర్జవం అత్యవసరమైనప్పుడు జీవన సహచరులలో ఆర్జవం అతి ముఖ్యమనడం చెప్పనక్కరలేదు. ఏవో తాత్కాలికోద్రేకాలతో అవే నిజమైన కారణాలని భ్రాంతిపడి పెడదారి తొక్కడం పీడలకు కారణం. వాటిని

అదుపులో పెట్టుకొనడంలోనే ఉంది సుఖమంతా. వెలిచవులు తాత్కాలికంగా నిషా కలిగించినా, కొత్త సమస్యలను, చిక్కులను పుట్టించి, గార్హస్థ్య జీవితాన్ని గిట్టించి, మరింత విషాదం కలిగిస్తాయి. వ్యభిచారం చాలావరకు సెక్స్‌లో పొత్తుకుదరక పోవడంవల్లనని కనుగొన్నాము. గనుక ఈ వైషమ్యాన్ని పోనాడి, పొందిక పొందడం సాధ్యమా? సాధ్యమే.

సెక్స్ నేడు పూర్వంలాగ ప్రజనన సాధనంగాను, సుఖోపకరణం గాను ఉండడం మాత్రమేకాక, అంతకన్నా ఎంతో ముందుకే పోయింది. కేవలం విషయ సుఖమే ప్రధానమైతే మానవుడు విచ్చలవిడిగా తిరిగేవాడే. అలాకాక నేడు సెక్స్ బహుళ స్నేహానికి, సాహచర్యానికీ ప్రధాన పీఠంగా పరిణమించింది. ఈ సెక్స్ సవ్యంగా లభించేది గార్హస్థ్యంలోనే.

గార్హస్థ్యం స్నేహ పరాకాష్ఠ; ప్రణయ పరమావధి; సాహచర్య సుఖానికి సీమ అన్నాం కదా: సంప్రయోగం మాత్రమే దాని ప్రధాన ప్రయోజనం కాదు. పూర్వంప్రజ; నేడు ప్రజతోపాటు మైత్రితో విలసితమైన సాహచర్యం. ఈ మైత్రి అరమరలు లేక గడవడానికి ఉభయులూ కొంత త్యాగం చేయవలసి ఉంటుంది. కొంత నిగ్రహం చూపవలసి ఉంటుంది. తిక్కలు తగ్గించుకొని అనుసరణతో మనవలసి ఉంటుంది. ఇద్దరిలో ఎవరికి వైరస్య వైముఖ్యాలు కలిగినా, కారణాలు తెలుసుకొని చక్కదిద్దుకో వడమే జీవిత సౌఖ్యానికి కీలకం. మనసెరిగి మసలుకోవడం తెలిసినవారి సుఖానికి అంతుండదు. పరస్పర ప్రవృత్తులను పరిగణించి సహనం చూపడం ముఖ్యం. సెక్స్ అనేది మన వ్యక్తిత్వానికి వెలిగా ఉండదు. స్వస్థమనస్కుడెవడూ సెక్కు చిక్కులతో బాధపడడు. కనుక సెక్సు చిక్కులకు సహన ప్రేమలను మించిన మందు లేదన్నారు మనస్తత్వవేత్తలు. ఈ సులువెరిగితే, కామవాంఛ చాల సంతోషదాయకమౌతుంది.

స్త్రీ పురుషులలో – దంపతుల మాట – కామ ప్రవృత్తి, వేగం సమానంగా ఉండవు. సులువెరిగి ప్రవర్తిస్తే స్తబ్ధత ఎవరిలో ఉన్నా మంచులాగ కరిగిపోతుంది; వెచ్చదనం విస్తరిస్తుంది. దేనికైనా 'అభ్యాసం కూసు విద్య', "సాధనమున బనులు సమకూరు ధరలోన" అన్నాడు వేమన. కొత్తలో కలిగిన లోపాలను; వైషమ్యాన్ని గ్రహించి సర్దుకొని ప్రవర్తిస్తే, సహజంగా సమకాలంలోనే ఉభయులకూ భావప్రాప్తి

కావడానికి, అసంతృప్తి అంతమైపోవడానికి అవకాశం ఏర్పడుతుంది. స్త్రీల ప్రీతిని గుర్తించి, లక్షణాలను అరసి, అదనెరిగి నమ్మకం కలిగించి, ఆభిముఖ్యం చేకూర్చుకొని ప్రవర్తిస్తే సమాన స్వభావ భావాలు గలవారికి సమాన సుఖం కలుగుతుందన్నాడు వాత్స్యాయనుడు. అట్టి రాగోదయ ప్రక్రియలు అన్ని దేశాలవారూ తెలిపారు. అవి హృదయాలు కలిస్తే తమంతటనే పుట్టుకువస్తాయి. వాటికి క్రమం శ్రమం అంటూ లేవు. అదొక లోకం. "నియతికృత నియమరహితం". ఇది ఫలానా విధంగా చేయాలి, ఇది ఈ రీతి – అనే గిరిగీచే సూత్రాలేవీ లేవు. ఇంగితజ్ఞానం, హృదయావ బోధం, పరస్పర విశ్వాసం ఇవే మూల సూత్రాలు. కనుకనే

"శాస్త్రాణాం విషయ స్తావత్
యా వన్మందరసా నరాః,
రతిచక్రే ప్రవృత్తేతు
నైవ శాస్త్రం నచ క్రమః."

అన్నారు కామ శాస్త్రకారులు. మానవునికి కామరసం ఎక్కనంత వరకే శాస్త్రం, గీస్త్రం. రతిచక్రం ప్రారంభమయితే, శాస్త్రం లేదు, క్రమంలేదు.

ఏవంచ; మనం గ్రహించినది వ్యభిచారాది దుష్టమార్గాల నివారణకు, ఆభిముఖ్యాది సుమార్గ సాధనకు పతిపత్నులు పరస్పరం తమ వైయక్తి కాభ్యాసాలను, విభేదాలను సమీచీన దృష్టితో చూచి సరిదిద్దుకోడం ఉత్తమమని, ఈ విభేదాలను తమ గార్హస్థ్య జీవిత సంబంధంలోని సామాన్యాంశాలుగా వారు భావించాలేగాని, విడదీసే విశేషాంశాలుగా భావించరాదు. వాటిని వారి వారి సంస్కారాలనుబట్టి పెద్దవిగాను పరిగణించవచ్చు. చిన్నవని తోసివేయనూవచ్చు. గార్హస్థ్య జీవితం పరస్పర సంతృప్తి పరిణామమనే దృష్టి కలిగితే – సామాన్య వ్యవహారంలోలాగే – పట్టువిడుపులు అవసరమని అనుభవమే పాఠం చెబుతుంది.

కామ ప్రవృత్తి జీవి సామాన్య సహజ స్వభావమన్నారు; సృజన కారణమన్నారు; గార్హస్థ్యం జోడెడ్లబండి అన్నారు; ఇద్దరూ సరిసమానంగా గృహనిర్వహణ బాధ్యత వహిస్తూ జీవయాత్ర సాగించాలన్నారు; దీనికి లాంఛనంగా వివాహ సమయంలో కాడికూడా నూతన వధూవరుల మెడలపై మోపి, ఇద్దరూ సమానం సుమా అని

పది మంది పెద్దల ఎదుటా రుజువు చేశారు; ఈ సమాన ధర్మాన్నే ఉపనిషత్తులూ "మాతాపూర్వరూపం, పితోత్తర రూపం, ప్రజా సంధిః, ప్రజననం సంధానం" అని భార్యాభర్తలలో ఒకరు ఎక్కువ మరొకరు తక్కువ అనేదేమీలేదు. ఒక నాణెపు రెండు ప్రక్కలే అనీ ఉద్ఘోషించాయి. ధర్మశాస్త్రాలు, శాసనాలు ఇద్దరూ ఒక్కటేనని పదే పదే ప్రకటించాయి. ఇద్దరూ సమానమే అయితే, మరి సెక్స్ ఎందుకింత తీవ్ర సమస్యగా పరిణమించింది? పెనుభూతంగా పలువురికి కనిపిస్తుంది?

దీనికి కారణం పురుషుని స్వార్థచింతేనని, అధికార బలమేనని నిర్ణయించవలసి వస్తుంది. స్త్రీ దేహంలో కొంత వయసు రాగానే కలిగే మార్పులకు విస్తుపోయి, తనంత స్వరూపం అకస్మాత్తుగా కడుపుచించుకొని ఎదుటపడి కేరుమన్నందుకు కారణం తెలీక, అదేదో మాయ, శక్తి అనుకొని స్త్రీకి ప్రాధాన్యమిచ్చిన మాతృలీన సంఘ వ్యవస్థనాటి సంగతి వేరు. స్త్రీ తన సహజ శారీరక పరివర్తనంతో సాలీడులాగ తనచుట్టూ మోహజాలం అల్లుకొని, పురుషులను ఆకర్షించి, దగ్గరచేరిన వారిని బిగువుగా పట్టుకొని గుప్పిట్లో పెట్టుకొనేది. అప్పుడామె దేవత; శక్తి; కాళి; సృష్టిస్థితి లయకారిణి అయింది. కాని పురుషుడు తన కాయబలం గుర్తించి ప్రజనన కర్మలో తనకు ప్రధాన భాగం ఉంది. తనులేనిదే సుఖం, సృష్టి కలుగవు - అని పదిలపరచుకొన్న తరువాత పరిస్థితి తారుమారైంది. మాతృలీన వ్యవస్థ ముక్కచెక్కల యింది. పురుషుడు తన శరీర బలంతో సాధ్యమైనంత మంది ఆడవారిని అదుపులో పెట్టుకోసాగాడు. వారంతా తన ఉపభోగం కోసమేనని నమ్మకం ఏర్పరచుకున్నాడు. తను పురుషుడు, సృష్టికర్త. తను అనుకుంటే అన్నీ చేయగలడు. స్త్రీ తనకు అపూర్వానందం కలిగించి, తనను లాలన, పాలన చేస్తున్నమాట నిజమే. అయినా ఇల్లు కదలి కష్టపడి సంపాదించి తెచ్చేవాడు-అది అనాగరక కాలంలో వేటతో కావచ్చు, తర్వాత కృషి మున్నగువాటితో కావచ్చు - తనే అన్న ఆత్మవిశ్వాసం కలుగగానే స్త్రీని కట్టుదిట్టం చేసుకోడం ప్రారంభించాడు. ఆమె తన ఆస్తి; తనకు ఉపయోగించే గుర్రం, ఎద్దు, ఆవు వంటిది అని నిశ్చయించుకొన్నాడు. సంపాదించే కష్టం కొంచెమైనా లేక తన చుట్టూ అందరిని చాంద్రాయణం చేయించగల స్త్రీ శారీరకంగా పురుషునికంటే శక్తిహీనురాలు కావడంవల్ల క్రమంగా తన అధికారాలు

కోలుపోయి, పాణిగృహీతి, ద్వితీయ, సహధర్మచారిణి అయివున్న ఆమె కేవలం భార్యగా (భరింపబడేదిగా), జాయగా (పిల్లలుకనేదిగా) దిగజారిపోయి, పురుషునికి లొంగవలసి వచ్చింది. ఇక ఆమెను చట్టాల చట్రంలో బిగించివేసే మేధావులకు కొదవా?

"యత్ర నార్యస్తు పూజ్యంతే
 రమంతే తత్ర దేవతా:"

అన్న మను మహాభాగుడే "అస్వతంత్రాః స్త్రియః కార్యాః" అని తెగేసి చెప్పాడు. తోబుట్టువునైనా, తండ్రినైనా, కొడుకునైనా అందంగా ఉంటే సరి ఆడది నోరూర్చుకుంటుంది. కనుక జాగ్రత్తగా ఉండు అని హెచ్చరించాడు. మనకు అనుకూలంగా చెప్పినమాట వినే స్త్రీలను పూజిస్తాము. ఎదురు తిరిగితే ఊరుకుంటామా? కదలనివ్వం. చిన్నప్పుడు తండ్రి పొరుగున, వయసులో మొగుని పక్కన, ముసలిముప్పులో కొడుకు పంచన పడి వుంటుంది. ఉండాలి – అన్నాడు మనువు. నేను సంపాదించి పెడుతున్నాను గదా, నీ కెందుకు శ్రమ। ఇల్లు ఎందుకు కదులుతావు? ఎవరైనా లాక్కోపోతే నాలాగా నిన్ను చూచుకోరు. నా దగ్గరే ఉండు. నాలో సగం నీవు. నీకేం తక్కువ చేశాను. నేను మరొకతెను తెచ్చి పెట్టుకుంటే నీదేం పోయింది? – ఇదీ స్త్రీకి అధికార ప్రాధాన్యం అంతరించిన తర్వాత పురుషునికి గలిగిన చూపు. ఇదే సెక్స్ సమస్యగా, ప్రహేళికగా పరిణమించడానికి ప్రధాన కారణం.

ఒకప్పుడు మానవునికి సంతానమే లక్ష్యం, ఆదర్శం, ప్రయోజనం, పురుషార్థ మూను. తన గుంపు పెరగాలి. తనకు అండగా ఉండేవారు కావాలి. తనేకాదు, తన గుంపులోని వారు ఎవరు తన వంశంలోని ఆడవారికి సంతానం కలిగించినా తనకు సంతానం కలిగించినట్టే, తన బలగం పెరిగినట్టే. దేవర న్యాయంతో కాని, నియోగంతోకాని, మరేవిధంగాగాని సంతుకలగాలి. ఈ భావం ప్రబలంగా ఉన్న ప్పుడు "ఔరసః క్షేత్రజ శ్చైవ రత్తః కృత్రిమ ఏ వచ గూఢోతపన్నో పవిద్ధశ్చ" అని పలువురు పుత్రరత్నాలను పరిగణించి, క్షేత్రజునకు రెండవ స్థానం ఇచ్చిన సంఘంలో క్రమంగా దేవర న్యాయంపై రోత కలిగి అన్న భార్య తల్లి అనే భావం పెంపొందింప

బడింది. శూర్పణఖ ముఖం ముచ్చటగా చూచి, ముక్కు ఎక్కడుందో పసిగట్టి పట్టికొని చక్కగా చెక్కివేసిన లక్ష్మన్న "సీత నగలు ఆనవాలు పట్టగలవా" అని రామన్నయ్య అడిగితే 'అన్నయ్యా నీ తోడు? ఈ దండ కడియాల సంగతి, కుండలాల కథ నాకు తెలీదు, నిత్యం పాదాభివందనం చేసేవాడ్ని గనుక ఈ అందెలు మాత్రం వదినవే" అని పలికాడు వాల్మీకి చెప్పినట్టు. ఎందుకు? అంతవరకు ఇంటికంతా ఉమ్మడిగాఉన్న వధూనిక- తనకోసం ఇంట్లోవున్న అన్నదమ్ములంతా ఈర్ష్యాద్వేషాలతో తన్నుకొని చావడంవల్లనో ఏమో తల్లిలాంటి పెద్దమనిషి అయింది. తనకిక పోటీ లేకపోవడంవల్ల పెద్దన్న తమ్ములను ప్రేమతో చూడదూ మరి? సౌభ్రాత్రం సహస్రదళాలుగా విడగదూ? ఈ సౌభ్రాత్రం ఎంతవరకు వచ్చిందంటే, "పశుపత్ని సుతులు ఋణానుబంధ రూపేణ వస్తారు. పెండ్లాంపోతే మరొక పెండ్లాం వస్తుంది. కొడుకుల్ను ఎంతమందినైనా కనవచ్చు. తమ్ముడు పోతే మరొక తమ్ముడు వస్తాడా?" అని వాల్మీకి రామునివంటి అవతార పురుషునితోనే పలికించేవరకు. పెండ్లాం, పిల్లలు కొత్తగా వచ్చినప్పుడు, తమ్ములు రాలేరూ? అంటే దేవరన్యాయానికి ప్రతికూల ప్రచారం అంత ఎత్తున పెద్ద ఎత్తున అవసరమైందన్న మాట (అయినా, నేటికి ఉత్తరాపథంలోని కొన్ని రాష్ట్రాలలో దేవర న్యాయం–అన్న అంతరించగానే వదినెను పెండ్లాడడమనే ఆచారం- పెద్దకులాలలోనూ పోలేదు) ఈ ప్రచారం కోసం పత్నీస్థానం పశువుకు–ఇంటిలోని గొడ్డుగోదకు–తర్వాతనే అన్నంతగా దిగజారడం ఎందుకో! కామిర్ల రోగికి అంతా పచ్చగానే కనిపించినట్లు పురుషుని చూపుమారడంతో ఆడవారు ఆస్తిగా మారిపోయారనీ, అప్పటి నుంచి సెక్స్ ఏదో గడ్డు సమస్యగా కరుడుగట్టుకొన్నదని స్పష్టం చేయడం కోసమే ఇంతగా వివరించాను ఇదంతా. పురుషుడు బహుదారలను పొంది కూడా సమానుడుగా, దక్షిణ నాయకుడుగా ప్రవర్తించగలడనీ, స్త్రీ మాత్రం సాపత్నికం (సవతిపోరు) కలిగినా, నాయకుడు ఇలాటి అపచారాలు మరొక చోటచేసినా కలుషితంకాక పల్లెత్తుమాట పలుకరాదనే నిర్ణయాలు ఎంత అన్యాయ పూరితమైనవో తెలుపడానికే ఇంతగా చర్చించాను.

మరొక వింతేమిటంటే, మగవాడు కామిని అంటే ప్రలోభ పడడం, పొరపాట నుకోవడంపోయి, స్త్రీ విషావర్తమని నిందిస్తూ, ఆమె కొరకే తిరుగుతూ

కొట్టుకులాడడం. ఇవన్నీ నాగరికత, సభ్యత అనబడేవి ప్రబలిన మధ్యయుగాల తర్వాతనే. అంతకుముందు కామప్రవృత్తి నిషిద్ధమేమీకాదు; సెక్సు సమస్యే కాదు. సెక్స్‌ను సభ్యంగా, సహజంగా చూసిన గాథలు పురాణేతిహాసాలలో ఎన్నో ఉన్నాయి. (రాజరికపు నాగరికత, సంస్కృతి సెక్సును రాజులకు, రాజాశ్రితులకు మినహాగా నిషిద్ధం చేయడంవల్ల లేనిపోని బెదురు పుట్టుకు వచ్చింది.) ఇప్పటిలాగ ప్రజనన నాంగాలను ఉచ్చరించడం పాపమేమీకాదు. బూతుతిట్లుకూడా స్త్రీలు స్వంత ఆస్తి, అన్యాక్రాంతం కాకూడదనే భావంవల్ల పుట్టుకువచ్చినవే. కామప్రవృత్తి నీచమనే భావం తరతరాలుగా మనలో నాటుకుపోవడంవల్ల దాని ఎడ మనకు ఏవగింపు చిన్ననాటి నుండే కలిగే కట్టుదిట్టాలు సంఘంలో ఏర్పడ్డాయి. ఈ ఏవగింపును పాశ్చాత్య నాగరికత మరింత పట్టుబిగించింది. మనం పిల్లలను అటు చూడరాదు, ఇటు చూడరాదు; అటుపోరాదు, ఇటు పోరాదు అని గిరిగీచి పెడతాము. దీనివల్ల వారిలో సెక్స్ అంటే ఏమిటో తెలియకముందే ఏవో దురభిప్రాయాలు భయసంకోచాలు జనిస్తాయి. ఆడపిల్లలలో ఇవి మరీ పాతుకుపోతాయి. వారు గట్టిగా మాట్లాడరాదు; పెదవి విప్పి నవ్వరాదు; కళ్ళెత్తి చూడరాదు; కాలుసాచి నడవరాదు. ఇవి ఉల్లంఘిస్తే, నీవు ఆడది కాదేమే, ఏమిటే నీ మగరాయుడితనం- అని పెద్దల పెత్తనాలు.

నిజానికి పిల్లల ఆటలే వారి భావి జీవితానికి ప్రతిబింబాలు. అప్పుడే, అజ్ఞాతం గానే, సెక్సు పుడుతుంది. అమ్మాట, నాన్నాట, పంతులాట, వారి బాల్యోద్వే గానికి, ఆవేశానికి నిదర్శనాలు. బాల్యంలో బీజప్రాయంగా ఉన్న ఈ సెక్స్ బాల బాలికలకు 12, 13 ఏండ్ల బాల్యయౌవన మధ్యస్థమైన ఈడులోనే శరీరంలో సహజ వికారాలు ముప్పిరిగొనగా, అంగవికరాలవల్ల స్ఫుటం కాదొడుగుతుంది. సెక్సు అప్పటికి పరిస్ఫుటంగా రూపు తీర్చుకొంటుందని అందాం. అదేమిటో వారికి తెలియకముందే వారిని మనం నిరుత్సాహ పరుస్తాం. ఈ దశలోని మనస్తత్వం వ్యక్తులను బట్టి విభేదించవచ్చు. ఈ సమయంలో ఉద్బుద్ధమైన భావాలే వారి పరిణయ జీవితాన్ని పరిణతం చేస్తాయి గనుక, వారి కామప్రవృత్తిని సవ్యమైన మార్గంలో పెట్టవలసిన బాధ్యత అదను ఇప్పుడే. ఇదంతా దాంపత్య జీవిత ఫలాస్వాదనం కోసమే. ఆ సుఖాన్ని మనసారా కోరాలన్నా, సంఘానికి సార్థకంగా ప్రవర్తించాలన్నా సెక్స్

విజ్ఞానం వారికి అవసరం. ఆ వయస్సంధిలో పెడదారిపట్టినవారు జీవితమంతా కాకపోయినా, కొంత భాగమైనా వ్యర్థం, విషాదమయం చేసుకొనే దురవస్థ ఏర్పడుతుంది. సెక్స్ దుర్జ్ఞేయంగాను, గహనంగాను ఉండి కేవలం ఔత్సుక్యంతో దారితప్పేవారూ ఉన్నారు. దీనిక్కూడా విరుగుడు సెక్స్ పరిజ్ఞానం. జ్ఞానం కలిగితే భయం, ఔత్సుక్యం, ఉద్రేకం అదుపులో వుంటాయి. విషయం విడమరిస్తే ఏ చిక్కు ఉండదు. అజ్ఞానం కంటే జ్ఞానం మెరుగుగదా! అజ్ఞానంతో అంధకారంలో పడతారు. జ్ఞానం కలిగి కాలు జారినా మరలా గట్టు ఎక్కగలుగుతారు.

మన ప్రాచీనులకు కూడా సెక్స్ విజ్ఞానం తెలియజేయాలనడం లో విప్రతిపత్తి యేమీలేదు. తన విషయం స్త్రీల విషయం బాగా ఎరిగి, ప్రవర్తించినవాడు సఫలుడౌతాడని వాత్స్యాయనుడన్నాడు:

"స్థిరతా మాత్మనో జ్ఞాత్వా
లింగా నున్మీయ యోషితః.

నరో యోషిత్సు బద్ధ్యతే."

ఈ విజ్ఞానం అరయనివారు పెడదారిపట్టి ఈ విషయం రహస్యం కావడం వల్ల, మనస్సు చంచలం కావడంవల్ల ఎవరు ఎప్పుడు ఏమి చేస్తాడో తెలుసుకోలేము గనుక, ప్రతివాడూ, ఇతర విషయాల జ్ఞానం లేకపోయినా కామ విజ్ఞానానికి సంబంధించిన, రాగవివర్ధనమైన చతుష్షష్టి కళలు తెలుసుకొన్నవాడై మెప్పుపొంది, జీవితం సుఖమయం చేసుకొంటాడని వాత్స్యాయనుడన్నాడు.

"వర్జితో ప్యన్య విజ్ఞానైః
ఏతయా యస్త్వలంకృతః,
స గోష్ఠ్యాం నరనారీణాం
కథా స్వగ్రం విగాహతే."

ఈ జ్ఞానం కోసమే దేవాలయాలపై బూతుబొమ్మలు, పండుగలు, పబ్బాలలో శృంగార చేష్టలు, గర్భాధాన మంత్రాలలో తంతు వివరణమూను. చెప్పకపోతే అబ్బాయికి ఎలా తెలుస్తుంది అని మన మంత్రద్రష్టలు అనాగతాన్ని దర్శించి

"ఆరోహోరుం ఉపబర్హ స్వ బాహుం, పరిష్వజస్వ జాయాగ్ం సుమనస్యమానః" అని స్పష్టంగా సంప్రయోగ ప్రక్రియను ఉపదేశించారు. పూర్వం గురుకులాలలో విద్యార్థి స్నాతకుడు కావడానికి ముందుగా, గురువు స్వయంగా కామపురుషార్థాన్ని ప్రవచించేవాడట.

చిన్ననాడే ఈ విషయం తెలియకపోతే ఉత్తరోత్తరా వారి జీవితం కష్టమయం కాగలదన్నా తప్పులేదు. నేడు పారిశ్రామిక నాగరికత విస్తరిస్తున్నది. వివిధ స్వభావాలవారు, మనస్తత్వాలవారు నిర్బంధంగా ఒకచోట కలసి పనిచేయవలసి వస్తున్నది. అలాటివారిలో సరళత అవసరమౌతుంది. కామప్రవృత్తి అసంతృప్తంగానో, అసహజంగానో ఉన్నవారు తమ తోటివారితోను, కిందివారితోను సహజంగా, సరళంగా ప్రవర్తించక విషమ చిత్తవృత్తి ప్రదర్శించడం కద్దు. ఊరికే శిక్షించి బాధించడమూ కద్దు. అలాటివారు తమ స్వభావాన్ని మృదుపరుచుకొనడానికి చిన్ననాడు సెక్స్ ప్రవృత్తిని సక్రమంగా సంయతం చేసుకొనవలసి ఉంటుంది. అది సెక్స్ విజ్ఞానం లేక సాధ్యంకాదు.

ఈ సందర్భంలో చిన్ననాటి అనుభవాలు ఎలా ఉత్తర జీవితాన్ని ప్రభావితం చేస్తాయో తెలుసుకొనడం అవసరం. సెక్స్ పరిపాకానికి తల్లి ప్రాపు పెద్ద అంతరాయమంటారు సెక్స్ పండితులు. స్త్రీలను అందరినీ తల్లిలాగా గౌరవంతో చూడనేర్చినవాడు భార్యను గూడ పెద్దగా చూచి, జంకుతాడని, దానితో సంప్రయోగ సమయంలో ధ్వజభంగం కలగవచ్చుననీ అంటారు. అలాగే ఆడపిల్లలను హెచ్చుగా తండ్రిలాలన, వారిని సెక్స్ భావాలను అభివృద్ధిపరచనీయక, మగరాయుళ్ళుగా మారుస్తుంది. పెద్దవారయిన తర్వాత ఇలాటివారు ఏదో ఉద్యోగమే ప్రధానంగా భావించి, పనినే పరమార్థమనుకొని గడపడమూ కద్దు. ఇలాటి అధికార దర్పం కోరేవారు మెతక మనుష్యులను పెండ్లాడి వారిపై పెత్తనం చెలాయిస్తారు. ఇలాకాక సెక్స్ విజ్ఞానం ఆకళించుకొని, లోపాలు సవరించుకొని, వివాహితులైన వారిలో సారళ్యం, ప్రేమ సమచిత్తవృత్తి కనిపిస్తాయి. ఈ దృష్టితోను సెక్సును బోధించక తప్పదు.

వ్యభిచారం ప్రణయ జీవితానికి పరశువు వంటిదని ఇదివరకే చర్చించాము.

చారాన్ని అరికట్టడానికి కూడా చిన్ననాడే సెక్స్ విషయాలు తెలుసుకొనడం అవసరం. కాపురంలో పొందిక లేకపోవడమేకాక తక్కినవీ వ్యభిచారానికి కారణాలు కావచ్చు. తప్పులు చేయనివాడు ఉండడు. దోషాలు లేనివాడొక పూర్ణ పురుషుడైన పరమాత్మే అన్న తలపు మనసులో వెలిగితే, పొరపాటున కాలుజారిన వారిని కనికరించడం అన్యాయం కాదని తోస్తుంది. ఇంతకూ పెడదారి తొక్కడం ప్రేమించడమంత సులభం కాదని ఇదివరకే అనుకున్నాము.

సెక్స్ విజ్ఞానం బాల్యంలోనే ఆవశ్యక మనడానికి మరొక బలమైన వాదమూ ఉంది. అది సంతాన నిరోధం. సంతాన నిరోధం, నిష్ఫలమైన సంప్రయోగం భ్రూణహత్యగా నిరసించారు పూర్వులు. కాని, నేడిది శాసన సమ్మతం. ప్రభుత్వమే “తిండి పెట్టలేను మొర్రో– మనస్సులు చిక్కబట్టుకోండి” అని ప్రచారం ప్రారంభించింది. పూర్వపు దృష్టి బహ్వీ ప్రజ అయితే, ఇప్పటి దృష్టి పరిమిత ప్రజ. కుటుంబ నియంత్రణానికి కూడా చిన్ననాటినుండే సెక్స్ విజ్ఞానం కలిగి ఉండడం ఉపయోగకరం. ఋతుకాలంలో సంప్రయోగంవల్ల సంతానప్రాప్తి కలుగుతుందని సామాన్య సుఖప్రాప్తికి ఆ ఋతు కాలం వదలవచ్చునని అన్నారు ప్రాచీనులు, ఆయుర్వేత్తలూనూ, అధునాతనులు కూడా ఈ పద్ధతినే మరికొంత మార్పులో ప్రచారం చేస్తున్నారు.

సంతాన నిరోధ ప్రచారం నేడు ప్రభుత్వమే చేస్తున్నది. ప్రభుత్వ మంటే నిర్బంధం అన్న భావం ప్రజల మనసు నుంచి పోలేదు. చట్టంతో బెదిరించి చేసే సంస్కారాలన్నీ ఎంత మాత్రం సంఘంలో విస్తరించాయో మనకు తెలియనిదికాదు. కనుక సంఘసేవా సంస్థలు ఈ ప్రచారానికి పూనుకోడం శ్రేయోస్కరమనుకుంటాను.

ఇంతటి సమీచీన సెక్స్ పరిజ్ఞానం కలుగడానికి యౌవన ప్రాదుర్భావంతోనే మనసులో భావాలు నాటితే యౌవన వికాసంతో ఉత్తమ కామ పురుషార్థ దృష్టి, ఆరోగ్యచింతా ఏర్పడతాయి.

కాపురంలో పొందిక ఏమిటి? విడాకుల చట్టమే వచ్చింది. ఎప్పుడు బడితే అప్పుడు తెగతెంపులు చేసుకోవచ్చు–అంటారు కొందరు లోకాయతికులు, పారదారికులు. విడాకుల చట్టమే ఎందుకు?

"నష్టే మృతే ప్ర వ్రజితే
క్లీబేచ పతితే పతౌ
పంచ స్వాపత్సు నారీణాం
పతి రన్యో విధీయతే."

అని పరాశరుడు చెప్పే ఉన్నాడు. విధవలు కూడా నియోగం వల్ల ఒక్క కొడుకును కనవచ్చునని మనువన్నాడు. కొన్ని కులాలలో ఓలియిచ్చి మారు మనువు చేసుకొనడం భారతదేశమంతటా ఉంది ఎంతోకాలంగా. కొన్ని వీధి మొదలయిన రూపకోపరూపకాలలో పునర్భువు నాయికగా ఉండడం భరతశాస్త్ర సమ్మతం.

కాని,ప్రణయం స్నేహపరాకాష్ఠ అనుకోటంవల్ల, అలాటి ఆచారం గౌణం అనుకోవడంవల్ల, సంఘవ్యాప్తం కాలేదు. నేడు పాశ్చాత్యులు కూడా విడాకులవల్ల వైవాహిక జీవితం వ్యవస్థితం కాకపోగా కొత్త చిక్కులు తల ఎత్తుతున్నాయంటున్నారు. కనుక విడాకుల చర్చను వదలిపెడదాం.

"భద్రం ప్రేమ సుమానుషస్య కథ మ
ప్యేకం హి త త్ప్రాప్యతే"





# నన్నయ తిక్కనలు - అవతారికల తెన్నులు

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ఇరువురును రెండు మహోన్నత శిఖరములు. మొదటివానిది ఋషి మార్గము. రెండవవానిది రసమార్గము. కాలపరిణామము కవితా పరిణతికి సూచకము. భట్టారకులవారికి సోమయాజులవారికి నడుమ నున్న కాలము రెండు శతాబ్దులకు మించినది. నన్నయ భారత శేషము విరాటాదిగఁ దిక్కన యాంధ్రావళి మోదమునకుఁ దెనుఁగు చేసెను. నన్నయకుమున్ను చెప్పఁదగ్గ తెలుఁగు సాహిత్యము బయలుదేఱ లేదన్నచో, కాళిదాసాది సంస్కృత మహాకవుల రచనలు నన్నయకు ఉపజీవ్యములయ్యెనని చెప్పక తప్పదు. నన్నయకుఁ గాళిదాస ప్రభృతు లనుకార్యులనుటవలనను, తిక్కనసోమయాజికి నన్నయ ఉపజీవ్యుఁ డవుటవలనను వారి వారి స్థానగౌరవములను లాఘవపఱచుటకాదు.

సోమయాజి నన్నయ భారతకృతి సారమును అవతారికను పురోడాశమువలె సేవించిన పుణ్యపురుషుఁడు. నన్నయ భారతావతారిక తీరు తిక్కననాఁటి కొక గడుసు మెఱుఁగుదేఱినది. అట్లే లోపలి రచనయు. రాజ రాజనరేంద్రుడు భారత శ్రవణాసక్తి సందర్భము సర్వము నన్నయ పరోక్షపరిభాషణ ఫణితిలోఁ జెప్పెను. సోమయాజి ప్రత్యక్ష సంభాషణ ఫక్కిలోఁ దన కృతిరచన హరిహరనాథ ప్రసక్తి చెప్పుకొనెను. ఈ ప్రత్యక్ష పరోక్ష కథన విధానములలో నన్నయ తిక్కనల దెవరి మార్గము వారిది. నన్నయ మంగళ శ్లోకానంతరము ఆఱు గద్య పద్యములలో రాజరాజు గుణాకృతి విశేషములు వర్ణించెను. మంత్రి పురోహిత సేనాపతి దండనాయకాది పరీతమగు నిండుఁ గొలువులో సుఖోపవిష్టుఁడై చళుక్యాన్వయాభరణుఁ డు "...నిత్య సత్య వచను మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యుఁజూచి" ఇట్లు పలికెనఁ

ట. "నన్ను నన్నుపార్యుఁ జూచి" అని చెప్పుకొనవలసి యుండియు, అస్మచ్ఛబ్దప్రయోగము అహంతాస్ఫోరక మగునని కాఁబోలు, పరోక్ష పద్ధతిలో నన్నయ వ్రాసికొనిపోయెను. "నేను" శబ్దముతో అంటిముట్టకుండుట పెద్దల భాషణాచారములో నున్నది. "మీ పేరేమి?" అని యడిగినపుడు "రామయ్య యందురు." "కామన్న యందురు" అను వృద్ధ వ్యవహారము క్రమముగా నిపుడిపుడు దూరమగు చున్నది. తురీయాశ్రమస్థులయినవారిలో కొందరు "నేను"నకు బదులుగా "వీఁడు"వాడు కొనుట నేఁడును వినుచున్నాము.

ఆచారౌచిత్యమునకు జీవగఱ్ఱ యనఁదగు నన్నయ కృత్యాదితానై సంతరించుచున్నను చాటుననుండి పరోక్షభాషణము చేయించెను. "అని యానతిచ్చినవిని యక్క వివరుం డిట్లనియె. "–నానారుచి రార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁడయ్యె–" "నన్నుపార్యుఁజూచి యిట్టులనియె" – ఈ తీరున అవతారిక నన్నయ ఆత్మలక్షణమునకు దర్పణము. అట్టి పరోక్ష పద్ధతి ఆధారము చేసికొని యొకరెవరో అవతారికలోఁ గొంతభాగము నారాయణభట్టు వ్రాసియుండునని చమత్కరించినారు. నేఁడు పానుగంటి వారి నాటకములు కొన్నిటికి కూచి నరసింహముగారి నాందీ ప్రస్తావన రచన లున్నవి! ఇది యట్టిది కాదు.

నన్నయనాఁటికిగల పరోక్షకథన విధానము తిక్కననాఁటికి ప్రత్యక్ష కథనముగాఁ బరిణతమైనది – సోమయాజి "పరతత్త్వము గొల్చెద నిష్ట సిద్ధికిన్." "ఒక్క నాఁడిట్లని వితర్కించితి" – "నన్ను నాకర్షించి కొలిపించుకొని" – "ఏనును భక్తిమయంబగు" – "నా పుట్టు కృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి" – నేర్చిన భంగిఁజెప్పి వరణీయుఁ డ నయ్యెద భక్తకోటికిన్" – "మహాకవిత్వ దీక్షావిధినొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్" – ఏవం విధముగా అస్మచ్ఛబ్దము లతో, ఉత్తమ పురుషలతోఁ గృత్యాది గ్రుచ్చియెత్తెను. తెలుగు మీఱిన యానాఁటి కీతీరు అహంకార ద్యోతకము కాదన్నమాట.

నన్నయకు మున్ను సంస్కృత సారస్వతమునకుఁగల విలువ తెలుఁగునకు లేకుండెను. అమరభాషా మర్యాదలు గౌరవించు భట్టారకుఁడు దైవప్రార్థన తద్భాషలోనే రచించి సంతుష్టుఁ డయ్యెను. "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ..." ఇత్యాది.

తిక్కననాఁటికి దేశభాష దేవభాషాసహపీఠమున ఆసీనురాలయ్యెను. "శ్రీ యన గౌరినాఁ బరగు..." ఇత్యాదిగఁ దిక్కన పరతత్త్వ ప్రశంస తెనుఁగుననే జరిగెను. నిర్వచనోత్తర రామాయణమున 'శ్రీరాస్తాం, - ఉండుఁగాక! భారతకృత్యాదిలోఁ దిక్కనయుఁ దనకిశోరదశలోని శ్లోకము "కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం, కిం కాలకూటః కిమువా యశోదా స్తన్యం తవ స్వాదు వద ప్రభోమే" అన్న దానిని సందర్భింపఁజేసెను. "శ్రీవాణీ..." శ్లోకముతో నన్నయ త్రిమూర్తిస్తవము నే యుద్దేశమునఁ జేసెనో, తత్సబ్రహ్మచారియగు నుద్దేశముతోనే తిక్కన "కిమస్థిమాలాం..." శ్లోకముతో హరిహరనాథస్తుతి చేసియుండును. ఇరువురును ఉభయకవి మిత్రులు; ఉత్తమ శ్లోకులు.

సోమయాజి కృత్యాదిలో నొక వైలక్షణ్యము! తాను కలగాంచును. కలలో, తన తండ్రి కొమ్మన కనఁబడి హరిహరనాథునిగూర్చి పరిచయము చేయును. హరిహరుఁడు కృతిపతిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ!" అనును. తిక్కనగారి స్వప్నము సత్యార్థగ్రంధి.

అక్కడ రాజనరేంద్రుఁడు తానై నన్నయను తెనుఁగులో భారతము రచింపవేఁడెను. రాజరాజ అన్నది యింతే:... "భారత బద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్", భారతము తన కంకితముగా నిమ్మని యతఁడు తేలలేదు. హరిహరుఁడో! కృతినర్థించివచ్చితిననెను. వాస్తవమునకు రాజరాజునకుఁ గృతిగ్రహణ కాంక్షయు నుండదా? రచియింపుమనుటలో రచించి నా కంకితము సేయుమను నర్థము ప్రతీయమాన మగుచున్నదా? నన్నయ లోకజ్ఞత అతారికలో బహుముఖముగా గోచరించును.

తిక్కన అవతారికలోని విలక్షణతలలో స్వప్న ప్రసంగ మొకటి. షష్ఠ్యంతములును క్రొత్తలు. సోమయాజి పిదప కొందఱు ప్రబంధ కారులు కలలుగాంచిరి. షష్ఠ్యంతములు సరేసరి. షష్ఠ్యంతములు లేనిచోఁ బ్రబంధమే కాదనునంతటి గాఢ ప్రచారము వానికి వచ్చినది. కృతిపతి వ్యవహారమునఁగాక సంస్కృత కావ్యమున ఈ పద్ధతి యొక మాదిరిది. "శైశవే-భ్యస్త విద్యానాం యౌవనే విషయైషినాం వార్థకే మునివృత్తీనాం... రఘుణామన్వయం వక్ష్యే" - రఘువంశము తెలుఁగు వారి షష్ఠ్యంతము లకు దిగ్దర్శని యైనదనవచ్చును.

సోమయాజి యెత్తు గడలలో షష్ఠ్యంతముల కవిరళ ప్రచారము, స్వప్నసంగతికి విరళ ప్రచారము చేకూరినది.

నన్నయ భారతము రాజరాజునకు వినిపించెను. తిక్కన హరిహర నాథునకు భారత మంకితముచేసెను. "పుట్టుకృతార్థతం బొరసెంబుణ్య చరిత్రుండనైతి"నని జన్మచారితార్థ్యమును తిక్కన లెక్కించుకొనెను. నన్నయ కటులుకాదు "అమలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేద శాస్త్రముల యశేషపారము ముదంబునం బొందను... భారత భారతీ సముద్రము దరియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే!" అను సంశయ మాయన యంతరంగమున నున్నది. రెండున్నర పర్వములకు మాత్రమే పర్యాప్తమైన తన భవిష్యము తొలుతనే తలపోసి కొన్నాడు. "హృదయాహ్లాది విరాటపర్వమట నుద్యోగాదులుం గూడఁగా బదునేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై యొప్పఁ గాఁ దుది ముట్టన్ రచియింపుటొప్పు బుధసంతోషంబు నిండారఁగన్" ఇట్టిది తిక్కనగారి విశ్వాసము. సాధారణముగాఁ గృతికర్త కృత్యారంభమున మంగళ పద్యములు కొన్ని వ్రాసి, కృతిసమాప్తిచేసి, పదపడి కృత్యాదికి మరలవచ్చి మఱికొన్ని చేర్పులు చేయుచుండునేమో! నేఁడు కృత్యాద్యవస్థలు లేవు. నన్నయ కృత్యాది మున్ముందరనే రచించి యుండును. తిక్కన కొంత ముందు, కొంత వెనుక వ్రాసియుండెనేమో!

నన్నయ తన పూర్వవంశీయులను గూర్చికాని, తల్లిదండ్రులను గూర్చికాని యేమియుఁ బ్రసంగింపలేదు. ఆపస్తంబసూత్రుఁడనని, ముద్గల గోత్రుండనని చెప్పుకొనెను. తిక్కన తన తండ్రి గుణవిశేషమును సమగ్రము గాఁ బేర్కొనెను. "తన కులబ్రాహ్మణు" మున్నగు సీసములో నన్నయ నిజవిశేషములు వెల్లడించెను. తిక్కన తండ్రిని గూర్చి యొక సీసము వ్రాసెను. ఇష్టదేవతాభ్యర్థనములో నన్నయది తనివితీరని శ్రద్ధ. "హరి హరా జ గజాననార్కషడాస్య మాతృసరస్వతీ గిరిసుతాదిక దేవతాతతికి" ఒక గ్రుక్కలోఁ బ్రణతిపాఠము చెప్పినాఁడు. విద్వత్సంస్తవ నీయ భవ్యకవితావేశుండు... మున్నుగా భారత ప్రశంస నవీనముగాఁ జేసెనేకాని, ప్రత్యేకించి అజగజాననాదుల స్తుతికిఁ బద్యము వ్రాసినవాఁడు కాలేదు తిక్కన. "విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయ భట్టు దక్షతన్" అని చెప్పిన తిక్కనకు భట్టారకుడొక బ్రహ్మ.

నన్నయ భారతావతారికలోని భూయోధర్మము తిక్కన యవతారికలో నున్నది. రెండును

పుష్పవంతులు. ఒకని కవిత ప్రసన్న కథా కలితము. వేఱొకనిది ఊర్జిత కథోపేతము; ఒకఁడు నానారుచిరార్థ సూక్తినిధి; వేఱొకఁడు నానారసాభ్యుదయోల్లాసి, ఒకఁడు జగద్ధితమునకు భారతము వ్రాసెను: వేఱొకఁడు బుధసంతోషమునకు భారతము వ్రాసెను.

ప్రథమునిది కర్మభావన. ద్వితీయునిది బ్రహ్మభావన. నా దృష్టి కిటులు తోఁచును. "అమల సువర్ణ శృంగఖురమై... భారత బద్ధస్పృహులగు వారికి నెప్పుడు బహుయాగంబుల ఫలంబు పరమార్థమగున్" – నన్నయ విశ్వాసము తాదృశము.

"జనన మరణాదులైన సంసార దురితములకు నగపడకుండగఁ దొలఁగు తెరువుగను వెలుంగు నీకిచ్చితి" మున్నగునవి సోమయాజి బ్రహ్మ భావనకు సూచికలు. పరమార్థతః కర్మబ్రహ్మభావనైక్యము చెప్పఁబడునుగదా! తెలుగు సారస్వతమున నన్నయ తిక్కనల భారతావతారికలు పూర్వోత్తర మీమాంసలకుఁ బ్రతిచ్ఛందములు. భట్టారకులది జైమిన్యంశ. సోమయాజులవారిది ద్వైపాయనాంశ – తెలుఁగు కవులపాలిటికి వారు ధర్మబ్రహ్మ దర్శనకారులు.





# నాటకశాల:నాటకచరిత్ర

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

(అర్ధశతాబ్దం కిందట 'పరిశోధన' పత్రికలో ఈ రచన చేశారు నార్లవారు. ఏ దేశంలోనైనా రంగస్థల వికాసం, నాటక వికాసం అవినాభావమని ఈ వ్యాసం నిరూపిస్తున్నది. ఆంధ్రదేశ ఆధునిక రంగస్థల విమర్శగా ఈ రచనను పరిగణించవచ్చు.) (సం.॥)

"కావ్యేషు నాటకం రమ్యం" అనో, "నాటకాన్తం హి సాహిత్యం" అనో, "నాటకాన్తం కవిత్వం" అనో ఒక ప్రాచీన సూత్రంతో వ్యాసాలు ప్రారంభించడం పరిపాటి. నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము, ఈహామృగము అని రూపకం దశ విధాలని కానీ, శృంగారము, వీరము, కరుణము, అద్భుతము, హాస్యము, భయానకము, బీభత్సము, రౌద్రము అని రసభేదాలు ఎనిమిదని, కానీ, సాత్త్వికము, ఆంగికము, వాచికము, ఆహార్యకము అని అభినయ విభాగాలు నాలుగని కానీ గంభీర చర్చను చేయడం కూడా సంప్రదాయం. ధీరలలిత, ధీరశాంత, ధీరోదాత్త, ధీరోద్ధతులని నాయకుడు చతుర్విధుడని వివరించడమో, స్వీయ, పరకీయ, సామాన్య అని నాయిక

త్రివిధ అని విశదీకరించడమో ఒరవడి. పరిపాటికి భిన్నమైనా, సంప్రదాయాన్ని తప్పించండన్నారు. కాని, విరుద్ధమైనా నేను మాత్రం ఇలాంటి గొప్ప గొప్ప విషయాలను ఎత్తుకోబోవడం లేదు. నా సామాన్య బుద్ధికి తోచిన కొన్ని సామాన్య విషయాలను మాత్రం మీకు మనవి చేస్తాను.

గుర్రం లేనిదే రౌతు లేదు; గృహం లేనిదే గృహస్థు లేదు; పురం లేనిదే అంతః పురం లేదు; జలం లేనిదే జలక్రీడ లేదు. ఇదేవిధంగా రంగస్థలం లేనిదే రూపకం లేదు. ఇది తిరుగులేని సూత్రం; తేటతెల్లమైన సత్యం. అయినా, రంగస్థలం మినహా గానే ఆంధ్రనాటక కళోద్ధరణకై చిరకాలంగా మనం కృషిచేస్తున్నాము.

రంగస్థలం అన్నప్పుడు కేవలం నాటకశాలను ఉద్దేశించడం లేదు. కూచిపూడి భాగవతులకు, ఇతర భాగవతులకు నాటక శాలలు లేవు. ఏ వీధిలోనో ప్రొద్దుకుంకే వేళకు వేసి, ప్రొద్దు పొడిచే వేళకు పీకి పారవేసే పందిరిలో వీరు తమ నాటకాలను ఆడతారు. అయినా, వీరికి నిశ్చయంగా రంగస్థలం వున్నది. నాటకశాలతో నిమిత్తం లేకుండా ఏ వీధిలో కోరితే ఆ వీధిలో నాటకాలను ఆడి చూపగల సౌలభ్యాన్ని కూర్చడమే వీరి రంగస్థలం విశిష్టత.

నాటకశాలతో నిమిత్తం లేని రంగస్థల మొకటి మన దేశంలో ఆవిర్భవించడం ఆ శాలలను కట్టించగల నాథుడు లేకపోయినందు వల్ల కాదు. గుళ్లు కట్టించినవారు, గోపురాలు కట్టించినవారు, సత్రాలు కట్టించినవారు, చలివేంద్రాలు పెట్టించినవారు ఎందరెందరో వున్నారు. అయినప్పుడు, నాటకశాలల అవసరమే ఏర్పడితే, వాటిని కట్టించడానికి కొందరైనా ముందుకు వచ్చేవారు కాదా? నాటకశాలలు కరవైనందుననే వాటితో నిమిత్తం లేని రంగస్థలం రూపొందిందని అనుకోడానికి వీలులేదు. ఇందుకు ఏదో మరొక కారణం వుండాలి.

మన దేశ చరిత్రను కాస్త సూక్ష్మంగా పరిశీలిస్తే, ఈ మరొక కారణమేదో తెలియనే తెలుస్తుంది. బుద్ధ భగవానుని కాలం నాటికే సంస్కృతభాష ప్రజాసామాన్యానికి దూరమైపోయింది. అందువల్లనే ప్రజాసామాన్యానికి తగిన

సందేశం అందించగోరిన బుద్ధ భగవానుడు సంస్కృతం జోలికిపోక, ప్రాకృతంలో తన బోధన చేశాడు. ఆయన కాలం తర్వాత పెక్కుమంది పెక్కు విధాలుగా సంస్కృతాన్ని ప్రచారం చేయడానికి ప్రయత్నించినా, అది రాజస్థానాల భాషగానే మిగిలింది. రాజాస్థానాల వెలుపల దానికి మరెక్కడైనా స్థానం వుంటే అది పండితుల గోష్ఠిలోనే. ఇంతేకాని, చివరికి రాణివాసాలలోనైనా అది ప్రచారంలో వుండేది కాదనే అనుకోవాలి. పాత్రోచిత భాష విషయమై పట్టుదల చూపిన సంస్కృత నాటకకర్తలు రాజుకు సంస్కృతంలో సంభాషణలు పెట్టి, రాణి మాటలకు ప్రాకృతాన్నే వాడుకచేశారు.

ఏమైతేనేమి సంస్కృత భాష, దానితోపాటు సంస్కృత నాటకం, రాజస్థానానికి పరిమితమై, ప్రజాబాహుళ్యానికి దూరమయ్యేసరికి ప్రజా భాషలలో ప్రజానాటకాలు కావలసి వచ్చాయి. మన తెలుగుదేశానికి సంబంధించినంతవరకు ఇట్టి ప్రజా నాటకాలే వీధినాటకాలు.

సాహిత్య రూపాలలో మరేదైనా ప్రజతో సంబంధం లేకుండా వర్ధిల్ల గలదేమోగాని, నాటకం మాత్రం ప్రజలకు దూరం కాలేదు. ప్రజలకు దూరమే అయితే, అది కృత్రిమమైపోతుంది. వికృతమైపోతుంది, దుర్బలమైపోతుంది. జీవచ్ఛవమైపోతుంది. ఏపుగా పెరగాలంటే, అందచందాలు ఉట్టిపడాలంటే, ఔననిపించుకోవాలంటే నాటకం విధిగా ప్రజల మధ్యకు వెళ్ళాలి; వారి జీవితంలో అంతర్భాగమైపోవాలి. ఇదుకోసమే మన నాటకం వీధి నాటకమైంది.

ఇప్పటిమాట ఏమైనప్పటికీ ఇదివరలో పగలు కాస్త విశ్రాంతి తీసుకోవాలంటే వీధిలోని ఏ మర్రిచెట్టుకిందో, రావిచెట్టుకిందో చేరేవారు. రాత్రిపూట భోజనమైనాక కాస్త కాలు సాగాలంటే వీధిలోకే వెళ్లేవారు. తగవు వస్తే వీధికి లాగేవారు; ఆ తగవు తీర్చడానికి వీధిలోనే పంచాయితీ జరిగేది. వీధిలోనే బడిపెట్టి చదువులు చెప్పేవారు; ఆటవిడుపు వస్తే, ఆటలన్నీ వీధిలోనే. పెళ్లిళ్లకు వీధిలోనే మేజువాణీ

చేసేవారు. హంస లేచిపోగానే శవాన్ని వీధిలోనే పెట్టేవారు. వీధిలోకి వెళ్లకుండా ఇంటిపట్టునే పొద్దస్తమానం కూర్చునే మగవాడు ముండమోపికింద జమ. మహా అప్రతిష్ఠాకరమైన పరిస్థితిలో పడిపోవడానికి మన నుడికారం "వీధిముఖం చూడలేక పోవడం". "నా బ్రతుకు బజారులో పెడతావటరా?" అంటే "నలుగురిలో నన్ను అల్లరి పెడతావా?" అని అర్థం. ఒకప్పుడు మన బ్రతుకే ఇంతగా వీధిలోనే గడిచేది కనుకే, వీధి కొన్ని సందర్భాలలో ప్రజలకే పర్యాయ పదమైనందుననే, మన నాటకాలు కూడ వీధినాటకాలైనాయి.

ప్రజల మధ్యకు వెళ్లడానికి మన నాటకం వీధిని రంగస్థలం చేసుకొనగా, ఆ రంగస్థలం మన నాటక స్వరూపాన్ని నిర్ణయించింది. ఆరుబయట, అనేకవేల ప్రజల కోసం నాటకాన్ని వేస్తున్నప్పుడు, పాట వినబడినంత స్ఫుటంగా మాట వినబడదు. హస్తముద్రలు, నృత్యాభినయాలు కనబడినంత స్పష్టంగా ముఖంపై హావభావ విలాసాలు కనబడవు. ఇందువల్ల మాటా పలుకూ కంటె ఎక్కువగా ఆటా పాటా కావాలి. అప్పుడైనా ఏ వొక్కరో ఆడినా, పాడినా అవి అంత స్పష్టంగా, స్ఫుటంగా వుండకపోవచ్చు. ఇందువల్ల ఒకరు పాట యెత్తుకోగానే తక్కిన వారందరు దాన్నే అందుకోవాలి; ఒకరు ఆట మొదలుపెట్టుకోగానే తక్కినవారందరూ హంగుచెయ్యాలి. వీధినాటకంలో ఏయే చేష్టలు వికారమైనవని ఈనాటి నాగరికులు అనుకుంటారో, అవన్నీ ఆ రంగస్థలం స్వభావాన్నిబట్టి అవసరమైనట్టివే. అవే లేకపోతే ఆ నాటకం రక్తికట్టనే కట్టదు.

ఒక్క మన విషయంలోనే కాదు; ఎవరి విషయంలోనైనా, ఏ కాలంలోనైనా రంగస్థలానికీ, నాటక స్వరూపానికీ ఈ అవినాభావ సంబంధం కనబడుతుంది. గ్రీకుల నాటకం ప్రధానంగా మత సంబంధమైంది. మతం వర్గ విభేదాలకు అతీతమైంది కనుక, గ్రీక్ నాటకం ఏదో ఒక వర్గానికికాక, మొత్తం సంఘానికే సంబంధించినట్టిది. ఆబాలగోపాలం నాటకాన్ని చూడాలంటే, అతి విశాలప్రదేశంలో దాన్ని ప్రదర్శించాలి. ఇంతటి సువిశాల ప్రదేశం ఊరుమధ్య దొరకడం కష్టం.

న్యాయంగాకున్నను ఏదో ఒక ఏటవాలు కొండదరిని చూచుకొని, అక్కడ రంగస్థలాన్ని నిర్మించేవారు. కొండ దిగువభాగంలో భగవత్సంప్రీత్యర్థ్యం ఒక "ఆల్టార్" కట్టేవారు. దాని నలుగడల నటగాయకులకు రంగస్థలాన్ని ఏర్పాటు చేసేవారు. కొండ సులాబీ (స్లోప్) ప్రేక్షకస్థానమయ్యేది. ప్రేక్షకులు వేలకొలదిగా వుండేవారు కనుక, అందరికీ కనబడ్డానికి వీలుగా నటులు కాళ్లకు దిమ్మలు ("స్టిల్స్") కట్టుకునేవారు. తాము ముఖంపై ప్రదర్శించే హావభావాలు దూరంగా వున్నవారికి కనబడవు కనుక - కనబడినా, లీలామాత్రంగానే కనుక - ఈ చిక్కును తొలగించడానికి రాగ విద్వేషాలు, సంతోష విచారాలు, ప్రేమవియోగాలు మొదలైన భావాలను వ్యక్తీకరించే పెద్ద పెద్ద ఛద్మముఖాలను ("మాస్క్") తగిలించుకునేవారు. ఎంత గొంతు చించుకున్నా, వేలాది ప్రేక్షకులకు మాట వినబడ్డం కష్టం కనుక, పాటలతోనే నాటకాన్ని నడిపేవారు. అప్పటికీ అందరికీ వినబడని చిక్కు తప్పదని వంతపాటను ("కోరస్")ను కథాక్రమాన్ని తెలియజెప్పడానికి వినియోగించేవారు. ప్రాచీన కాలపు గ్రీక్ నాటకాలన్నీ - ఈశ్చిలస్, సోఫోక్లెస్, యురిపిడిస్, అరిస్టోఫేన్స్ మొదలైన మహా నాటకకర్తలు వ్రాసినవన్నీ - ఈ రంగస్థలంపై, ఈ పద్ధతుల ప్రకారం ప్రదర్శించడానికి అనువైనవే. వేరొక విధంగా ప్రదర్శిస్తే అవి పూర్తిగా రక్తికట్టవు కూడా.

రంగస్థలానికీ, నాటక స్వరూపానికీ అవినాభావ సంబంధం వుంటుందని చెప్పడానికి మన సంస్కృత నాటకాల నుంచి కూడా తార్కాణాలు చూపించవచ్చు. ఒకప్పుడు మన దేశంలో నాటకాలను కొయ్యబొమ్మలతో ఆడిస్తుండేవారట. ఈ బొమ్మలను పాంచాలిక లని అనేవారట. పుత్తళిక లని వీటికి మరొక పేరుకూడా వుండేదట. భాసుని నాటకాలన్నీ ఈ పాంచాలికల రంగస్థలం కోసమే వ్రాయబడినవని కొందరు పెద్ద పెద్ద పండితులే చెబుతున్నారు. తర్వాత వచ్చిన సంస్కృత నాటకాలన్నీ ప్రస్తావనతో ప్రారంభం కాగా, భాసుని నాటకాలు స్థాపనతో ప్రారంభమౌతాయి. స్థాపన కొంత విలక్షణమైనదని భాస నాటకాలను తెనిగించిన వారిలో ఒకరన్నారు. కాని, పాంచాలికల రంగస్థలం కోసం భాస నాటక రచన జరిగిందని గుర్తిస్తే

మాత్రం స్థాపనలో విలక్షణ మేమీ కనబడదు. నిజానికి సూత్రధారుడు పాంచాలికల రంగస్థలం కోసం అవతరించినవాడేమో! గంటి భాగవతులనేవారు ఇటీవలి వరకు మన తెలుగుదేశంలో పాంచాలికలతో నాటకాలను ఆడుతుండేవారట. తమిళనాడులోను, దక్షిణ కెనరాలోను "బొమ్మలాట్టం" పేరుతో ఈ నాటక ప్రదర్శనలు ఈనాటికీ సాగుతున్నాయి. బొమ్మలాట్టంలోని బొమ్మల కాళ్లు, చేతులు వగైరాలకు దారాలు కట్టి, తెరచాటున నిలిచి ఆ దారాలను నేర్పుగా అల్లల్లాడించడం ద్వారా ఆంగికాభినయం చేయిస్తారు. సూత్రధారుడే అటుపిమ్మట నాటకసూత్రాన్ని ధరించి, నటబృందాన్ని ఆడించే సూత్రధారుడైనాడని అనుకోవచ్చుగదా?

భాసుని కాలంనాడు కొయ్యబొమ్మలతో నాటకాలు నడవగా, భవభూతికాలం వచ్చేసరికి తోలుబొమ్మలతో నాటకాలు సాగినవట. అప్పుడు వీటిని "ఛాయా నాటకా"లనే వారట. భవభూతి మహావీర చరిత్ర, సుభటుని దూతాంగద, జయదేవుని ప్రసన్నరాఘవం, రాజశేఖరుని బాలరామాయణం ఇత్యాదులన్నీ తోలుబొమ్మలతో ఆడబడిన నాటకాలే అని పెద్దలు కొందరు చెబుతున్నారు. ఇది నిజమే అయి వుండవచ్చు. మన తెలుగుదేశంలో ఇప్పటికీ తోలుబొమ్మలాడుతున్న వారు రంగనాథ రామాయణాన్ని ఉపయోగిస్తారు. రంగనాథ రామాయణం కావ్యంకాని, నాటకం కాదు. అయినా, అది తోలుబొమ్మలాటకు చాలా చక్కగా ఉపకరిస్తున్నది. దీన్నిబట్టి నాటక లక్షణ సమన్వితమైన కావ్యం ఛాయానాటకరంగంపై రక్తికట్టగలదనడం స్పష్టం. భవభూతి ఉత్తర రామచరిత్ర, మహావీర చరిత్ర మొదలైన వాటిలో కూడా నాటకత్వంకంటె కావ్యత్వమే హెచ్చు. అందువల్ల అవి ప్రత్యేకంగా ఛాయా నాటక రంగస్థలానికే రచించబడినవని అనుకోవడం తప్పు కానేరదు.

ఇంతవరకు నేను మనవి చేసింది యేమంటే – ఒకటి:ప్రజా జీవితక్రమమే రంగస్థల స్వరూపాన్ని నిర్ణయిస్తుంది. రెండు: రంగ స్థలానికీ, నాటక స్వరూపానికి అవినాభావ సంబంధం వుంటుంది. ఈ రెండు విషయాలు సహజంగా మరి రెండు విషయాలకు దారితీస్తాయి. అవి ఏవంటే – ఒకటి:ప్రజాజీవితక్రమం అన్ని

కాలాలలో ఒక విధంగా వుండదు. కనక, ఒక కాలపు రంగస్థలం మరొక కాలానికి తగిపోదు. రెండు: రంగస్థలానుగుణంకాని నాటకం మహానాటకం కానేరదు.

ఈ మధ్యకాలంలో ఎన్ని దండయాత్రలు జరిగినా, ఎంత కల్లోలం చెలరేగినా, ఎన్ని రాజ్యాల స్థాపన జరిగినా, మరెన్ని పతనం చెందినా, క్రీస్తుశకం పదమూడవ శతాబ్దం నుంచి ఇంచుమించు 1850 ప్రాంతాలవరకు మన జీవితంలో ఏ పెద్ద మార్పు లేదు. ఈ ఆరేడు శతాబ్దాలలో మనం ఆస్వాదించిన ఒక కొత్త భావం లేదు; నడిచిన ఒక కొత్తదారి లేదు; కనిపెట్టిన ఒక కొత్త విషయం లేదు. అపాయాన్ని పసికట్టినంతనే తన గుల్లలోకి ముడుచుకుపోయే నత్తవలె మనజాతి తన ఆచారాలలోకి, తన వ్యవహారాలలోకి, తన మడిబట్టలలోకి ముడుచుకుపోయింది. ఆర్థిక, సాంఘిక, పారిశ్రామికాది వ్యవస్థలలో కూడా వీసమంతైనా మార్పురాలేదు. ఇందువల్లనే ఈ ఆరేడు శతాబ్దాలలో మన రంగస్థలంలో ఏవిధమైన మార్పురాలేదు. వీధిలో పాత పందిళ్లు వేస్తూనే పోయారు; పాత నాటకాలు ఆడుతూనే పోయారు; అవి ఆనందాన్ని యిస్తూనే పోయాయి. కాని, పాశ్చాత్య ప్రపంచంతో బలాత్కార సంపర్కం కలిగిన మీదట, మనకు మనస్కరించినా, మనస్కరించకపోయినా దాని సభ్యతలోని గుణాలతోపాటు దోషాలను కూడా తెలుసుకొనవలసి వచ్చిన మీద, మనలో కొంత మార్పు ప్రారంభమైంది. మనలో మార్పుకు నూరింతల వేగంతో మన ఆర్థిక, సాంఘికాది వ్యవస్థలు మార్పు చెందాయి. ఇది జరిగేసరికి మన పాత రంగస్థలం, మన పాత నాటకాలు కొంత వెగటు కలిగించ నారంభించాయి. అయితే, వాటి స్థానంలో కొత్తవాటిని ప్రవేశపెట్టడానికి ప్రయత్నం జరగలేదు. అట్టి ప్రయత్నం చేయవలెనన్న బుద్ధే ఎవ్వరికీ పుట్టలేదు. అంత బాగా వుండడం లేదని అసంతృప్తి చెందుతూ కూడా వీధినాటకాలనే చూస్తూ పోయాము.

ఈ పరిస్థితి 1880 వరకు ఇలాగే వున్నది. ఆ సంవత్సరంలో మన దురదృష్టం కొద్దీ కొన్ని మహారాష్ట్రపు నాటకపు కంపెనీలు మన ప్రాంతాలకు వచ్చాయి. పూనా, సాంగ్లీ కంపెనీలు మద్రాసుకు రాగా, ధార్వాడ కంపెనీ తెలుగు జిల్లాలలో 'టూర్' చేసింది. ఏదో ఒక కొత్తదారిని విధిగా త్రొక్కవలసిన ఘడియలను చేరుకున్న

మన రంగస్థలం ఈ కంపెనీల రాకతో వంకరదారి తొక్కింది. ఆనాటి నుంచి ఈనాటివరకు ఇంకా మనం సవ్యమైన మార్గానికే రాలేకపోతున్నాము.

మహారాష్ట్రపు నాటకపు కంపెనీలు మన ఇండియావే కావచ్చు; హిందీలో ఆడినా, అవి ఆడిన నాటకాలు మన పౌరాణిక గాథలకు సంబంధించినవే కావచ్చు. అయినా, అవి మన ముందుపెట్టిన రంగస్థలం జాతీయమైంది కాదు. దాని దుస్తులు మొఘల్ కత్తు, దాని పాటలు పార్సీకత్తు; దాని తెరలు వగైరా ఇంగ్లీషు కత్తు; వాని నడక ఏ కత్తూ కాదు. ఇంత సంకరమైన రంగస్థలాన్ని ఊహించడమైనా కష్టం. ఏమైతే నేమి కొత్త రంగస్థలమేదో కావాలని, కొత్త నాటకమేదో కావాలని మనకు తెలియకుండానే కూడా ఒక తీవ్రావేదన పడుతున్నప్పుడు, ఆ కొత్త సాధనకు ఏమి చెయ్యాలో, ఎటు వెళ్లాలో తెలియక సందిగ్ధావస్థలో పడినప్పుడు సాంగ్లీ, ధార్వాడ కంపెనీలు వచ్చాయి. తెచ్చింది సంకరపు సరుకైనా దానితో కళ్ళు జిగేలుమనేటట్టు చేశాయి. దానితో మహామేరువు దొరికినట్లు తెలుగుదేశమంతా ఒక్కసారి ఉద్రూతలూగిపోయింది. అటు బళ్ళారి నుంచి, ఇటు బరంపురం వరకు ఎన్నో కొత్త నాటక సంఘాలు బయల్దేరాయి. ధార్వాడ కంపెనీ కోసం వేయబడ్డిన "పెండాల్"ను పీకివెయ్యకముందే దానిలో ఏవైనా నాటకాలను ఆడించాలనే పట్టుదలతో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు శ్రీహర్షుని రత్నావళిని, షేక్సుపియర్ "కామెడీ అఫ్ ఎర్రర్స్"ను చకచకా తర్జుమా చేశారు. అనువాదాల రూపంలోనో; స్వతంత్రంగానో కొత్త నాటకాలు వచ్చేవరకు ఆగలేక కొందరు హిందీలోనే నాటకాలను ఆడనారంభించారు. కొత్త రంగస్థలం అంటే, కొత్త నాటకం అంటే చమ్కీ కోట్లు, ముఖమల్ బూట్లు, పార్సీ మట్లు, వైర్ వర్కులు మాత్రమే అనుకొని ఈ సరుకులు దిగుమతి కోసం బొంబాయికి పరుగులు, ఉరుకులు తీశారు. వీణ, తంబుర, మద్దెల, తాళాలు మొదలైనవన్నీ ఒక మూల పారవేసి, హార్మోనియం, తబలాలకోసం ఎగబడ్డారు. రంగు బనియనులకు, సిల్కు మేజోళ్లకు గిరాకీ ఎక్కువైపోయింది. ఈ సరంజామా, ఈ హంగామా కొత్త రంగస్థలం కాదని, ఇది నాటకం కాదని ఆ

రోజులలో గుర్తించిన మహామహుడొక్కడే ఆయన – మహాకవి శ్రీ గురజాడ అప్పారావు పంతులు.

నడచినదారి సరైనది కాకపోయినా, 1880లో ప్రారంభమైన నూతన రంగస్థలోద్యమం, నూతన నాటకోద్యమం ఎవరో కొందరు వ్యక్తులకు సంబంధించినట్టిది కాదు, అది మన జాతిని జాతినే కదిలించింది. ఇందువల్లనే శ్రీ కందుకూరి వీరేశలింగం, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యులు, శ్రీ కోలాచలం శ్రీనివాసరావు, శ్రీ తిరుపతి వేంకటకవులు, శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీ కాళ్లకూరి నారాయణరావు మొదలైన సుప్రసిద్ధులందరు నాటక రచన విషయమై శ్రద్ధవహించారు; లేదా, నాటక రచన ద్వారా ప్రసిద్ధులైనారు. ఇంతేకాదు. 1880లో ప్రారంభమైంది ఒక మహోద్యమం కనుకనే శ్రీ కొండా వెంకటప్పయ్య, శ్రీ కోపల్లె హనుమంతరావు, శ్రీ టంగుటూరి ప్రకాశం, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, శ్రీ ముట్నూరి కృష్ణారావు, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు మొదలైన ప్రతిభావంతులందరు తమ యౌవనదశలో రంగు పూసుకుని, రంగస్థల మెక్కడం జరిగింది. ఒక జాతిని జాతినే కదిలించివేసిన ఈ మహోద్యమం సక్రమమైన మార్గాన్నే నడిస్తే ఏనాడో తెలుగు నాటకానికి ప్రపంచ నాటక వాఙ్మయంలో స్థానం లభించి వుండేదేమో! "ప్రపంచ నాటక వాఙ్మయంలో తెలుగు నాటకానికి స్థానం" అంటే, ఇదేమీ పోరాని ఆశకు పోవడం కాదు. ఐర్లెండు మన తెలుగుదేశంకంటె పెద్దదా? నార్వే పెద్దదా? ఈ రెండు దేశాలలోను మన వీధి నాటకాలకు మించిన నాటకాలు 1880వ సంవత్సరానికి పూర్వం లేవు. అయినా, ఈ రెండు దేశాల నాటకాలకు ఈనాడు ప్రపంచ నాటక వాఙ్మయంలో స్థానం వున్నది. ఈ దేశాలలోవలె మన తెలుగు దేశంలో కూడా నడవవలసిన పంథాలో నాటకోద్యమం నడిచివుంటే, మన తెలుగు నాటకాలకు కూడా ఐరిష్, నార్వీజియన్ నాటకాలకు లభించిన స్థానమే లభించడానికి అభ్యంతరం ఏమి వుండేది?

1893లో, ప్రభవించిన వెంటనే మన నాటకోద్యమం వక్రమార్గాన పడిపోవడానికి కారణం ఒక జాతి సంస్కృతికి, దాని సంప్రదాయాలకు, దాని ఆర్థిక, సాంఘిక రాజకీయాది వ్యవస్థలకు, ఏదైనా ఒక సమయానికి ఆ వ్యవస్థలు పొందిన పరిణామాలకు, అప్పటికి ఇతర సాహిత్య విభాగాలు వచ్చిన స్థాయికి, క్లుప్తంగా చెప్పాలంటే, ఒక జాతి జీవిత క్రమానికి దాని రంగస్థల స్వరూపం, దాని నాటక స్వరూపం కట్టుబడి వుంటాయని గుర్తించకపోవడమే. దీన్ని గుర్తించగలిగిన ఒక్క మహాకవి – శ్రీ గురజాడ అప్పారావు– ఒక మహానాటకాన్ని – కన్యాశుల్కం – వ్రాయనే వ్రాశాడు. అయితే, ఆయన ప్రతిభ సంపూర్ణ వికాస్తి పొందడానికి తగు వాతావరణం లేకపోయింది. అందువల్లనే ఆయన ఒక్క నాటకంతోనే సరిపుచ్చాడు. ఆ నాటకం కూడా – పదే పదే ప్రయోగం ద్వారా లోపాలను సవరించుకొనడానికి వీలు లేకపోయినందున – కొంతవరకు నిర్మాణ సౌష్ఠవం కొరవడినదై పోయింది.

కొత్త రంగస్థలం లేనిదే కొత్త నాటకం లేదని నేను అనడమే కాదు. ప్రపంచ రంగస్థల చరిత్రకారుడు, ప్రపంచ నాటక చరిత్రకారుడు ప్రొఫెసర్ అలర్డైస్ నికాల్ కూడా ఇదే మాట అంటున్నాడు. "వరల్డ్ డ్రామా" అనే మహోగ్రంథంలో ఆయన ఈ విషయమై చెప్పిన మాటలివి...

"అన్ని కాలాలకు ఒకే విధమైన నాటక సంభాషణ సరిపడనట్లే, అన్ని కాలాలు ఒకే విధమైన రంగస్థలంతో సంతృప్తిపడలేవు. దాదాపు అన్ని సందర్భాలలోనూ ఏదో ఒక కొత్త రంగస్థలం నిర్మాణం తర్వాతే, లేదా నటులకు ప్రేక్షకులకు ఏదో ఒక కొత్త సంబంధం కూర్చబడిన తర్వాతే మహా నాటకకర్తలు తలయెత్తి నారనడం కూడా గమనార్హమైన విషయమే. గ్రీకులకు సంబంధించినంత వరకు డయొనిసస్ రంగస్థలం వారి అభిరుచులకు, వారి అవసరాలకు సరిగా తగిపోయినట్టిది. ఈ రంగస్థల రినైజాన్స్ యుగధర్మానికి ఉపయుక్తమయ్యేది కాదు. గ్రీకు రంగస్థలం ద్వారాగాని, ఎలిజబెతన్ రంగస్థలం ద్వారాగాని, ఇబ్సెన్ తన మహానాటకాలను లోకానికి ప్రసాదించగలిగి వుండేవాడు కాదు. ఇందువల్ల ఏదైనా ఒక జాతిలో

నాటకరచనా ప్రతిభ పూర్తి వికాస్తిని పొందుతుంటే అది తన అవసరాలకు సరిపడిన, అంతవరకు పూర్తిగా వినియోగంలోకి రాని, ఒక కొత్త రంగస్థలాన్ని కల్పించుకొనగలిగిందని మనం సర్వసాధారణంగా తీర్మానించుకోవచ్చు. ఇట్టి తీర్మానం దాదాపు ప్రతిసారి సమంజస మైనదే కాగలదు కూడా".

నా మాటలను మీరు పాటించినా, పాటించకపోయినా, ప్రొఫెసర్ అలర్డైస్ నికాల్ మాటలకైనా విలువనివ్వాలి. విలువనిచ్చి, అ మన జీవితక్రమంలో అవినాభావ సంబంధంగల రంగస్థలాన్ని నిర్మించుకొన లేకపోయినందుననే కొత్త నాటకాలకై, మహానాటకాలకై, మనం చేస్తున్న కృషి నేల విడిచి సాము అయిపోతున్నదని గుర్తించాలి.

"1880 నుంచి ఈనాటివరకు మనకు కొత్త రంగస్థలమే ఏర్పడ లేదంటే, ఈ మధ్యకాలంలో ఎన్ని నాటకాలురాలేదు? ఎన్ని రక్తికట్టలేదు? ఇదంతా ఎలా సాధ్యపడింది?" అని ప్రశ్నించగలవారికి ఒక్కటే నామనవి. మహానాటకం, బొత్తిగా అసమర్థులైనవారి చేతిలో పడితే తప్ప, తప్పక రక్తికడుతుంది. అయితే రక్తికట్టే ప్రతి నాటకం మహానాటకం కాదు. ఇంతే అయితే, ప్రపంచ మొత్తం మీద మహానాటకకర్తలు ఏ పాతికమందో కావడం దేనికి? కొన్ని వందలమందే - కాదు, వేలమందే - అయ్యేవారు.

మన నాటకాలలో చాలా రక్తికట్టినవంటే, అది చాలావరకు నటుల పసవల్లనేకాని, నాటకాల పసవల్ల కాదు. నిజానికి పసతక్కువ నాటకాలే సమర్థుడైన నటునికి అతని ప్రతిభా వికాసానికీ, ప్రాగల్భ్య ప్రదర్శనకు ఎక్కువ అవకాశాలిస్తాయి. ఈ మాట నేనంటే, ఇది మీకు విడ్డూరంగా తోచవచ్చు. ప్రపంచ ప్రసిద్ధ నటశేఖరులలో ఒకడైన స్టానిస్లావస్కీ - ఈయన మాస్కో ఆర్ట్ థియేటర్ సంస్థాపకులిద్దరిలో వొకడు - ఇదే మాట అన్నాడు. "మహానటుడే మెలోడ్రామాను జయప్రదం చెయ్యగలడు. సామాన్య నటుడు మెలోడ్రామాలో నెగ్గుకురాలేడు. దానిలో లేని ఎత్తులను, లోతులను మెలోడ్రామాలో నటుడైనవాడు ఊహాకల్పనచేసి చూపించాలి; దానిలోని పాత్రలకు

లేని జిగిని, పసను అతడే యివ్వాలి. ఇది సామాన్య నటులకు దుస్తరం." స్టానిస్లావస్కీ సర్టిఫికెట్ తర్వాత ఈ విషయమై మరి వాదించవలసిన పనిలేదు కనుక, మరో విషయానికి వెడతాను. గడచిన డెబ్బై సంవత్సరాలలో తెలుగులో వచ్చిన నాటకాలలో చాలాభాగం మెలోడ్రామాలే; ఇవి రక్తి కట్టింది మన మహానటుల ప్రతిభా విశేషాలవల్లనే. శ్రీ ఈమని లక్షణస్వామి, శ్రీ హరిప్రసాదరావు, శ్రీ బళ్ళారి రాఘవ, శ్రీ యడవల్లి సూర్యనారాయణ, శ్రీ వెదురుమూడి శేషగిరిరావు, శ్రీ అల్లూరి రామచంద్రారెడ్డి, శ్రీ ముంజులూరి కృష్ణారావు, శ్రీ దొరస్వామి, శ్రీ పిల్లలమర్రి సుందరరామయ్య, శ్రీ డి.వి.సుబ్బారావు, డాక్టర్ జి.వి.సుబ్బారావు, శ్రీ ఉప్పులూరి సంజీవరావు, శ్రీ పారుపల్లి సుబ్బారావు, శ్రీ స్థానం నరసింహారావు, శ్రీ మాధవపెద్ది వెంకట్రామయ్య - ఇట్టి మహానటులెందరో పోయిన డెబ్బై సంవత్సరాలలో మన తెలుగుదేశంలో తలయెత్తారు.

ఈ మహానటులకు తగు మహానాటకాలను కూర్చడమే తటస్థిస్తే, నటనా కౌశలానికి ప్రతిభకు ఇప్పటికే ఇండియాలో పేరొందిన మన ఆంధ్ర నాటకరంగం ప్రపంచ ప్రఖ్యాతికే వచ్చివుండేది కాదా?

ఇదివరలో మనకు అవసరాలకు, అభిరుచులకు తగు ఒక కొత్త నాటకరంగం లేదంటే, ఇప్పుడు అసలు ఏ రంగస్థలమూ లేదు. ఇప్పటి పరిస్థితులను సమీక్ష చేయడం ప్రారంభిస్తే, ఇంతలో తెమలడం జరగదు. అందువల్ల మరి మూడు ముక్కలతో ముగిస్తాను.

ఆంధ్ర నాటక కళోద్ధరణ జరగాలంటే, ఇందుకు ఆంధ్ర రంగస్థల నిర్మాణం జరగాలి. ఇందుకు వెంటనే జరపవలసిన చర్యలు రెండు. మొదటిది - ఆంధ్ర నాటక పరిణామాలన్నింటిని సమగ్రంగా సమీక్ష చేయగల ఆంధ్ర నాటక చరిత్రను వ్రాయించడం. ఇట్టి చరిత్ర ఇప్పుడు మనం ఎక్కడున్నామో తెలుపుతుంది. దీన్నిబట్టి ముందుకు మనం ఎలా సాగాలో కొంతవరకైనా అర్థమౌతుంది. పోతే, రెండవ

చర్య ఎక్కడో ఒకచోట ఒక నాటకశాలను నిర్మించడం, ఎక్కడో ఒకచోట అనడం దేనికి; బెజవాడలో శంకుస్థాపన చేసి, అంతటితో విడిచివచ్చిన రాఘవ కళామందిరాన్ని పూర్తిచేయించవచ్చు. శంకుస్థాపనల నిర్మాణంతోనే ఆంధ్రరంగస్థల సృష్టి జరగదు గాని, సరైన దారిలో ఒక అడుగు ముందుకు వేయడానికి అది ఊతమిస్తుంది.



# చతుష్షష్టి కళలు
# లేక అరువది నాల్గు విద్యలు

శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి

"ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కళాసుచీ" – అను అగ్ని పురాణ వచనము కావ్యసంసేవనము వలన గల్గెడి ఫలములలో కళా వైచక్షణ్య మును గూడ ప్రధానమని పేర్కొనుచున్నది. కళావిజ్ఞానమును వెలయింప జాలని గ్రంథము మెడకంటగట్టుకొన్న పెద్ద శిలా బంధమనియును ఒక జైన కవి పేర్కొనియున్నాడు. మొత్తముపైని కళాప్రాచుర్యార్థము చెప్పిన అర్థవాదములుగా వీనిని గ్రహింతమనినను శైవాగమములు పాశురములు కామసూత్రములు మున్నగువానియందు సైతము కళావిజ్ఞానమునకు మహత్తరములగు ఫలములను ప్రతిపాదించి యుండుటయేగాక – వీరు వారను భేదములేక మానవులై పుట్టిన ప్రతివారును కళారహస్యముల నెఱింగి యుండవలయు ననియును బోధింపబడియున్నవి. మల్లినాథసూరి మొదలగు ప్రాచీనాంధ్ర పండితు లెల్లరును కళావైచక్షణ్యమును ఆర్జించియుండుట చేతనే సర్వతంత్ర స్వతంత్రాది బిరుదములను పొందగల్గినారు. కాని ఆర్యజనులచేత నింతటి యుత్తమోత్తములుగా పరిగణింపబడిన యీ కళలను గుఱించి నాయెఱింగిన విషయములను కొన్నింటిని, ఒకటి రెండు వ్యాసములలో వివరింపదలచితిని. ప్రకృత మీ వ్యాసమున కళాస్వరూప సంఖ్యాన మనుపేరుతో అతి సంగ్రహరీతిని కళలెన్నియో, వాటి స్వరూప మెట్టిదో విచారింపబడును.

## 1. కళాస్వరూప సంఖ్యానము:

కల్యత ఇతి కళాయని కొందఱు పండితులును, కలయతీతి కళాయని మరికొందఱు పండితులును కళాశబ్దమునకు వ్యుత్పత్తులను నిర్దేశించియున్నారు. మొదటి వ్యుత్పత్తి క్షీరస్వామి ప్రభృతులు సెప్పినది. రెండవది తంత్రకర్తలు నిర్దేశించినది. రెండు విధములగు వ్యుత్పత్తులును, కల శబ్ద సంఖ్యానయోః అను ధాత్వర్థము పైననే ఆధారపడినవి. ఈ రెండును గాక కలయతి లోకజ్ఞతాం గమయతీతి కళా అని మఱొక వ్యుత్పత్తి కూడ నున్నది. ఇయ్యది వాత్స్యాయనాది కామశాస్త్ర ప్రవక్తలు రూపించినది. సావధానముగ పరికించినచో ఇది కళారహస్యములను వెల్లడించునదిగానున్నది. కళ ఏదియైనను సరియే ఎట్టిదైనను సరియే, అందు లోకజ్ఞతను సేకూర్పజాలు విశేషము లుండవలయును. అట్టి విశేష మున్ననే అయ్యది కళ యనదగి యుండును.

కళలు మొత్తముమీద అరువదినాల్గు అను సిద్ధాంతము బహుత్ర ప్రచారముగాంచినది. కాని సంఖ్యాపరిగణనమునందు మాత్రము అభిప్రాయభేదము లేకపోలేదు. అయినను ఆగమములందును తంత్రములందును లెక్కింపబడినరీతి కొంచెమించుమించుగ కామ సూత్రము లందు పేర్కొనబడిన విన్యాసరీతితో సరిపోవుచున్నది. కనుక ప్రస్తుత మిచ్చట కళాస్వరూప సంఖ్యానమునందు వాత్స్యాయనుని కామ సూత్రములనే ఆధారముగా గొనుచున్నాము.

వాత్స్యాయనుని కామసూత్రములందు సాధారణాధికరణమను ప్రథమాధికరణమునందు విన్యాసముద్దేశ ప్రకరణమునందు ఈ క్రిందివి చతుష్షష్టి కళలుగా పేర్కొనబడి యున్నవి. కామసూత్రములందు కేవలము ఈ అరువది నాల్గు కళలనేగాక మరి అరువది నాలుగు కళలు పేర్కొనబడి యున్నవి. కాని అయ్యవి పాంచాల చతుష్షష్టి యను పేర సంప్రయో గాంగములుగా గ్రహింపబడుచున్నవి. కాని లోకజ్ఞతను చేకూర్చునట్టి ప్రధానకళలు ఇవియే. గనుక వానిని వివరించుచున్నాము.

వాత్స్యాయనుడు పేర్కొన్న చతుష్షష్టి కళలు. 1 గీతము, 2. వాద్యము, 3. నృత్యము, 4. ఆలేఖ్యము, 5. విశేషకచ్ఛేద్యము, 6. తండులకుసుమ బలివికారములు, 7. పుష్పాస్తరణము, 8. దశనవసనాంగరాగము, 9. మణిభూమికాకర్మ, 10. శయనరచనము,

11. ఉదకవాద్యము, 12. ఉదకాఘాతము, 13. చిత్రయోగములు, 14. మాల్యగ్రధన వికల్పములు, 15. శేఖరకాపీడక యోజనము, 16. నేపథ్య ప్రయోగములు, 17. కర్ణపత్రభంగములు, 18. గంధయుక్తి, 19. భూషణ యోజనములు, 20. ఐంద్రజాలములు, 21. కౌచుమార యోగములు, 22. హస్తలాఘవము, 23. విచిత్రశాకమాషభక్ష్య వికారక్రియ, 24. పానక రసరాగాసవ యోజనము, 25. సూచీవాస కర్మలు, 26. సూత్రక్రీడలు, 27. వీణాడమరుక వాద్యములు, 28. ప్రహేళికలు, 29. ప్రతిమాలలు, 30. దుర్వాచక యోగములు, 31. పుస్తక వాచనము, 32. నాటకాఖ్యాయికా దర్శనము, 33. కావ్యసమస్యాపూరణములు, 34. పట్టికావాసవేత్ర వికల్పములు 35. తక్షకర్మలు, 36 తక్షణకళ, 37. వాస్తువిద్య, 38. రూప్యరత్న పరీక్ష, 39. ధాతువాదము, 40. మణి రాగాకరజ్ఞానము, 41. వృక్షాయుర్వేదయోగములు, 42. మేషకుక్కుటలావక యుద్ధవిధులు, 43. శుకసారికా ప్రలాపనము, 44. ఉత్సాదన సంవాహన కేశ మర్దన కౌశలము, 45. అక్షరముష్టికా కథనము, 46. మ్లేచ్ఛిత వికల్పములు, 47. దేశభాషా విజ్ఞానము, 48. పుష్పశకటిక, 49. నిమిత్తజ్ఞానము, 50. యంత్రమాతృక, 51. ధారణమాతృక, 52. సంపాఠ్యము, 53. మానసకావ్యక్రియ, 54. అభిదానకోశము, 55. ఛందోజ్ఞానము, 56. క్రియాకల్పము, 57. చలితకయోగములు, 58. వస్త్రగోపనములు, 59. ద్యూతవిశేషములు, 60. ఆకర్షక్రీడ, 61. బాలక్రీడనకములు, 62. వైనయికీ విద్యాజ్ఞానము, 63. వైజయికీ విద్యాజ్ఞానము, 64. వ్యాయామికీ విద్యాజ్ఞానము అని ఈ కళల స్వరూప సంఖ్యానము సూక్ష్మముగా నీ క్రింద చేయబడుచున్నది.

గీతము, వాద్యము, నృత్యము, ఆలేఖ్యమునను నీ నాలుగు కళలును ప్రత్యేకముగా ఆయా శాస్త్రములలో (అనగా క్రమముగా గీతము సంగీత శాస్త్రమునందు, వాద్యము నృత్యము అనునవి భరత శాస్త్రమునందు, ఆలేఖ్యము చిత్రకళాశాస్త్రమునందును విస్తరించి చెప్పబడియున్నవి. అయ్యవి ఇచ్చట వివరించుట చాల దుర్ఘటము. అయినను సంగ్రహము గా స్వరూప ప్రదర్శనము రూపింపబడుచున్నది.

**1. గానము:** గానము చేయునది గనుక గీతము. దీనినే సంగీతమనియు నందురు.

సంగీతము సాధారణముగ స్వరగత మనియును పదగతమనియు లయగతమనియును చిత్తప్రణిధానగత మనియును నాలుగు విధములుగా నుండును. స్వరమేళమున గానము చేయబడునది స్వరగనము లేక స్వరగతము అనబడును. కేవలము లయయొక్క గమనికను మాత్రమే ఆధారముగా గొని గానము చేయబడునది లయగము లేక లయగతము అనబడును. గానమునందే చిత్తము నాయత్తముచేసి ఏకాగ్రతచే లోలోన గానము చేయబడునది, అవధానగము లేక అవధానగతము అనబడుచున్నది.

**2. వాద్యము:** వాయింపబడుచున్నది. గనుక వాద్యము నాబడును. వాద్యము కూడ గీతమువలెనే నాలుగు విధములు. ఘనము అని వితతము అని తతము అని సుషితరము అని. కంచుతాళములు మున్నగు వాటితో వాయింపబడునట్టి వాద్యము ఘన వాద్యము, మద్దెల మొదలగు వానితో వాయింపబడునట్టిది వితతము అనబడును. వీణలు తంబురలు మొదలుగువాని చేత వాయింపబడునట్టిది తతము అనబడును. పిల్లనగ్రోవి మొదలగువానితో వాయింపబడునట్టిది సుషిరమనబడును. వీనినే మరికొందరు క్రమముగా ఘనవాదమ్యు, అనద్ధకవాద్యము, తతవాద్యము, సుషిర వాద్యము అను పేరులతో పేర్కొందురు. మరికొందరీ నాలుగు పేరులును తౌర్యత్రికమునకు (అనగా గీతనృత్యవాదిత్రములకు) సాధారణ నామము లని అందురు.

**3. నాట్యము:** నాట్యము చేయబడునట్టిది గనుక నృత్యమనబడును. అంగహారము(అవయవములను నశాస్త్రీయముగత్రిప్పుట), అభినయము (వాచికాభినయము, ఆహార్యాభినయము, సాత్వికాభినయము మున్నగు నవి) భావము, విభావము, అనుభావము తదనురూపములగు రసములు ఈ అవయవములన్నియు గలసి ప్రవర్తిల్లునది నృత్యమనబడును. ఈ నృత్యము సాధారణముగ నాట్యమనియును అనాట్యమనియు ద్వివిధముగా చెప్పబడును. స్వర్గమర్త్య పాతాళ లోకవాసులలో నెవ్వరి యొక్క వాచికాదులు అనుకరింపబడినను అయ్యది నాట్యమనబడును. అనగా స్వర్గమర్త్యపాతాళ వాసుల ననుకరించి నది నాట్యమని భావము. ఏ తద్భిన్న మైనది (అనగా కేవలము నర్తకునలకును మాత్రమే ఆశ్రయించి యుండునట్టిది) అ నాట్యమనబడును. అయిన శాస్త్రాంతరములందు నృత్యము వేరుగను నాట్యము వేరుగను

పేర్కొనుట నృత్య బేధజ్ఞాపనార్థమే యనియు నెఱుంగునది.

**4. ఆలేఖ్యము:** జీవకళ లుట్టిపడునట్టులుగా పదార్థ స్వరూప స్వభావాదులందు లిఖింపబడును గనుక ఆలేఖ్య మనబడుచున్నది. ఆలేఖ్యమునకే చిత్రకళ యనునది పర్యాయపదము. చిత్రవిద్య ఆరంగములు కలది అనగా ఆరుభేదముల నుండునది యని అర్థము. రూపభేదములు, ప్రమాణములు, భావయోజనము, లావణ్యయోజనము, సాదృశ్యము, వర్ణరచనము, భంగ ప్రదర్శనము అను నీ ఆరును చిత్ర, విద్యాంగములు. గీతము వాద్యము నృత్యము ఆలేఖ్యము అను నీ నాలుగు కళలును పరుల యనురాగము నార్జించుటకును తనకు తాను వినోదించుటకును సాథనములైనవి. కావున నీ కళలు ప్రతివారికి నత్యంతము నావశ్యకము లగుచున్నవి.

**5. విశేషకచ్ఛేద్యము:** ముఖకాంతి విశేషింపజేయునది గనుక విశేషకము అనగా మొగమునందు పెట్టుకొనెడు తిలకము లేక బొట్టు. ఇయ్యది భుజపత్రపు ఆకులు మున్నగు వానిని గత్తిరించి అనేక విధములుగా రచింపబడుచుండును. (అనగా భుజపత్రపు ఆకులు మున్నగువానిని వివిధాకారములు వచ్చునట్లు కత్తిరించి ముఖమునందు అనేక విధముల నతికించు చుందురని భావము. విశేషకము యొక్క ఆకృతులు వచ్చునట్లు ఛేదింవబడునది (అనగా కత్తిరింవబడునది లేక గిల్లబడునది) గనుక విశేషకచ్ఛేద్యమనబడును. వివేషకచ్ఛేద్యముకూడా అర్థాత్తుపత్రచ్ఛేద్యమే కనుక ఇచ్చట పత్రచ్ఛేద్యమేను అనియే చెప్పవలసి యుండెను. అయినను విశేషకములని పేర్కొనుట ఆదరమును గలిగించుట కని ఎఱుంగునది. ఇవి స్త్రీలకు చాల ప్రియములైనవి.

**6. తండుల కుసుమ బలివికారములు:** ఇయ్యది ఆరవ కళ. తండులములనగా బియ్యపు గింజలు. కుసుమములనగా పూవులు బియ్యముతోటి, పూవులతోటి భూతసంతృప్త్యర్థమై పెట్టెడి ముగ్గులు మున్నగు విధానములు తండుల కుసుమబలివికారములు. నూకలు గాకుండ, పొడిపొడిగాకుండ నుండెడి బియ్యపు గింజలు అనేక వర్ణములు గల వానినిగా ఏరితెచ్చి వానితో సరస్వతీ భవనమునందు (అనగా పూజాగృహమునందు) కాని కామదేవభవనమునందు (అనగా పడక

టింటియందు) గాని చలువరాళ్ళు మున్నగు శిలాఫలకములు తాపడము చేసిన కట్టడములందుగాని రచించు రంగవల్లికలును, ఇట్లే వివిధ వర్ణములుగల పూవుల నేరితెచ్చి వానితో శివలింగము, సీతారాములు మున్నగు దేవతల ఆకృతులు వచ్చునట్లుగా తీర్చెడి రంగవల్లికలును తండుల బలివికారములలోనే చేరును. ఇట్లే మాలికలుగా కూర్చుట గూడా మాల్యగ్రథనమునందే అంతర్భూతమైనది. కాని మాల్యగ్రథనము నకును బలివికారములకును కొంచెమంతర్భేదము కలదు. అయ్యది విలాసార్థము కూర్చుటయును, ఇయ్యది భక్తి విశేషముతో రంగవల్లిక దీర్చుటయును కనుక ప్రత్యేకముగ కళయని కూర్పబడినది.

**7. పుష్పాస్తరణము:** పుష్పముల ఆస్తరణములను సిద్ధముచేయుట పుష్పాస్తరణము. నానావిధములగు వర్ణములు గల పూవులను ఏరితెచ్చి సూదిమున్నగు వానితో గ్రుచ్చి చిత్ర చిత్రములగు ఆసనములు (పీఠములు) ఏర్పడునట్లు గ్రుచ్చుట పుష్పాస్తరణ కళలలో చేరినవి. వీనిని దేవపూజా గృహములందు భక్తిపారవశ్యమునకును, పడకటిండ్లయందు అనురాగాతి శయమునకును, విశ్రాంతి ప్రదేశములందు మనోరంజ కత్వమునకును మండపాదులయందు అలంకారమునకును రచించు చుందురు. వీటినే పుష్పకములని గొందరు పల్కెదరు.

**8. దశనవసనాంగరాగము:** దశనము లనగా పండ్లు వసనము లనగా ధరించుకొను వస్త్రములు, అంగములనగా అవయవములు అనగా పెదవులు, గోళ్ళు, ముఖము మున్నగు శరీరాంతర్భాగము లగు అవయవములు. రాగశబ్దము ప్రత్యేకముగా సంబంధించును. కాగా దశనరాగము వసన రాగము అంగ రాగములను రూపము లేర్పడు చున్నవి. ఆకర్షకముగను మనోరంజకముగ నుండునట్లు తాము ధరించెడు వస్త్రములకు రంగులు అద్దించుట చాల ప్రాచీనమగు ఆచారము. ఇట్లే చూచిన మాత్రాననే ఎట్టివారినైనను ఆకర్షింపజాలునట్లు పండ్లకు దాశనమున్నగుదానిని వేసికొనుటయును, అవయవములకు చక్కని కాంతియును తేజస్సును కలుగునట్లు నలుగు పెట్టకొనుటయును కూడ ప్రాచీనములగు ఆచారములే. దశనరాగము, వసనరాగము, అంగరాగము చేసికొను విధానములను బోధించు కళకు దశనవసనాంగ రాగకళ యని మొత్తము పేరు. అయితే ఈ మూడు విధములైన రాగక్రియలయందును రంజనమే అనగా రంగు వేయుటయే

ప్రధాన కార్యము కనుక రంజనవిధియని చెప్పుటయే యుక్తమముగా నున్నది. అయినను దశనవసనాంగరాగః - అని ఇట్లే ప్రత్యేకముగా దశనాదుల గ్రహించుట ఆదరముగలిగించుట కని తెలియదగును. ఏలయందురా? విలాసి జనులకు దశనాది సంస్కారము చాల ప్రియతమమైన కార్యము కదా!

**9. మణిభూమికాకర్మ:** మణులనగా రత్నములు, మరకతమణులు, పుష్యరాగమణులు, పద్మరాగమణులు, ముక్తామణులు, ప్రవాళమణులు అను నీ అయిదు మణులలో (రత్నములలో గల భేదములు) వీటిని క్రమముగా పచ్చలు, పుష్యరాగాలు, పద్మరాగాలు, ముత్యాలు, పగడాలు అనియునందురు. మరకతములు పచ్చనివి, పుష్యరాగాలు తెల్లనివి, పద్మరాగాలు ఎఱ్ఱనివి. ముత్యాలు తెల్లనివి. పగడాలు కావిరంగువి. ఈవిధములగు మణులను తాపడము చేసిన కట్టడములు మణిభూమికలు అని అందురు. (అనగా మణులతోగాని మాయమణులతోగాని తాపడము చేసిన కట్టడములు. వీటికి సంస్కృతమున కుట్టిమములనియు పేరుగలదు.) మణిభూమికలు కట్టెడి పనిని నేర్చు కళ మణిభూమి కాకర్మకళ, మణిభూమికలలో వేసవియందు శయనాసనకాదు లేర్పరచు కొందురు.

**10. శయనరచనము:** శీతకాలము (చలికాలము) వర్షాకాలము (వానాకాలము) ఉష్ణకాలము (వేసవి కాలము) మొదలగు కాలములను అనుసరించియును రాగవిరాగ మధ్యస్థాది దశాభేదములను అనుసరించియును ఆహార విహారములందు గల్గు పరిణామ భేదమును అనుసరించియు శయనీయములను (పడకలను) ఏర్పరచుకొనెడి కళకు శయనరచనము అని పేరు. ఇయ్యది వైద్యకాది శాస్త్రములలో విస్తరించి చెప్పబడినది.

**11. ఉదక వాద్యము:** ఒక పాత్రమునందు నీరునుపోసి దానిపైని చేతులతో మద్దెలను వాయించునట్లు వాయించుట ఉదకవాద్య మనబడును. దీనినే జలతరంగమని కొందరు పల్కుదురు. కాని వాద్యమునందు అవలంబించెడి రీతినిబట్టి భేదిల్లుచున్నయది.

**12. ఉదకాఘాతము:** హస్త యంత్రముల నుండి యొత్తబడిన యుదక ధారలతో కొట్టుట (అనగా చల్లులాడుట) ఉదకాఘాత మనబడును. ఈ రెండును

జలక్రీడయందంతర్భూతములై యున్నవి. అనగా తదవయవములని యర్థము.

**13. చిత్రయోగము:** అనేక విధములగు దౌర్భాగ్యకములు, ఇంద్రియ పతతీకరణములు మున్నగునవి యన్నియును చిత్రయోగములనబడును. ఈర్ష్యచేత పరాభిసంధానముకొఱకై (అనగా ఇతరులను వంచించుట కొరకని భావము) ఇయ్యది అవలంబింపబడుచుండును. అట్టి చిత్రయోగముల యొక్క వివరములు ఔపనిషదికాధికరణమునందు చెప్పబడగలవు. అట్లయినచో నీ చిత్రయోగములు కౌచుమార యోగము లలో చేరినవే కావచ్చునని యందురేమో, కాని ఇయ్యవి కౌచుమార యోగములలో చేరినవి కానేకావు. ఆయన ఈ యోగముల పేర్కొననే లేదు.

**14. మాల్యగ్రథన వికల్పములు:** శిరస్సునందు గాని దేహము నందుగాని ధరించునట్టి పూలదండలకు మాల్యములని పేరు. మాల్యము లను గ్రథనము చేయుట గనుక మాల్యగ్రథనము. మాల్యగ్రథనము నందలి వికల్పములు గనుక మాల్యగ్రథన వికల్పములు. భోగార్థములగు పూవులదండలలో గర్భకము, ప్రభ్రష్టకము, లలామకము, ప్రాలంబము, వైకక్షకము, ఆపీడకము అను మున్నగు భేదములును, పూజార్థములగు వానిలో ముండమాల, అక్షమాల, రుండమాల, మున్నగు భేదములు కలవు. ఇందులో వెనకవైపు జుట్టులో తురుముకొను వానిని గర్భకములనియును, ముందు వైపు కొండిసిగలో ముడుచుకొనువానిని లలామకము లనియును, మెడనుండి క్రిందికి దండవలె వ్రేలుచున్న వానిని ప్రాలంబక మనియును, లేక ఋజులుంబమనియును, యజ్ఞోపవీతమువలె అడ్డముగా ధరింపబడుదానిని వైకక్షకమనియు, సిగకు చుట్టుకొనెడు వానిని ఆపీడకములని, శేఖరములని అందురు. ముండమాలా అక్షమాలాది భేదములు మంత్రశాస్త్ర ప్రసిద్ధములును సువిస్తృతము లగుట చేత ఉదాహరించుట లేదు. ఇట్టి మాల్యములను కూర్చుటలో నవలంబించెడి నేర్పులు మొత్తమున మాల్యగ్రథన వికల్పము లనబడును.

**15. శేఖర కాపీడయోజనము:** శేఖరకము, ఆపీడకములను నీ రెండు శబ్దములును మొత్తముమీద శిరస్సునందు ధరించెడి పుష్ప మాలికలకు పేర్లు. శేఖరకములను, ఆపీడకములను యోజనము చేయునది శేఖరకాపీడయోజనము. ఇదియును పైన పేర్కొన్న మాల్యగ్రథన వికల్పమునందు చేరినదే యైనను యోజనము గ్రథనమునందు

ప్రత్యేకమగు కళయగుటచేత ఇట్లు వేరుగా చెప్పబడినది. శేఖరకము జుట్టుమీదను మాత్రమే అంటుకొని యుండునది. ఆపీడకము జుట్టును మండలాకారముగ కాష్ఠికాయోగమున రాజిల్లునట్టిది. ఒక్కరకపు పువ్వులు గ్రుచ్చుట గ్రథనము, అనేక విధములగు రంగులు గల పూవుల గ్రుచ్చుట యోజనము, మొత్తముమీద వీనిని మరల పేర్కొనుట ఆదరార్థము.

**16. నేపథ్య ప్రయోగములు:** నేపథ్యము లనగా అలంకారములు. అలంకరించుకొనెడి విధానములును అందుగల కౌశలములును తెల్పునవియును నేపథ్య ప్రయోగములే. ఆయా దేశ పరిస్థితుల ననుసరించియును ఆయా కాల పరిస్థితుల ననుసరించియును వస్త్రములు మాల్యములు ఆభరణములు మొదలగువానితో శరీరమునకు ఒక విధమగు శోభ కలుగుటకై ఈ నేపథ్యములను అవలంబించెదరు.

**17. కర్ణపత్ర భంగములు:** ఇవియును అలంకారార్థమైనవియే. దంతములు (అనగా ఏనుగు కొమ్ములు మున్నగునవి) శంఖములు మొదలగువానితో కర్ణాలంకారవిశేషములు రచింపబడి ధరించబడు చుండును. ఇవియే కర్ణపత్రభంగము లనబడును.

**18. గంధయుక్తి:** గంధము అనగా పరిమళము. యుక్తి అనగా పరిమళవంతముగా చేయు నేర్పు. అర్థాత్తు అత్తరువులు పన్నీరులు మున్నగు రూపమున పరిమళ ద్రవ్యములను చేయునట్టి కళకు గంధయుక్తి యనిపేరు. గంధయుక్తిని బోధించునట్టి శాస్త్రములు పూర్వమనేక ముండెడివి. కాని ప్రస్తుతమవి దుర్లభమైనవి. కాని కాళికా పురాణమునందలి 28వ అధ్యాయము ఈ విషయమును విపులపరచు చున్నది. గంధము సాధారణము పదివిధములు. ఇష్టగంధము, అనిష్ట గంధము, మధుర గంధము, ఆమ్ల గంధము, కటు గంధము, నిర్హార గంధము, సంహతగంధము, స్నిగ్ధ గంధము, రూక్ష గంధము, విశద గంధము అవి. కస్తూరి గోరోజనాదుల గంధము ఇష్టగంధము. శవాదుల గంధము అనిష్టగంధము. దీనినే దుర్గంధమనియునందురు. పూవుల యందుండునది మధుర గంధము. ఇదియే మకరందము. ఆమ్లాత కాదులందుండునది ఆమ్లాతక గంధము, మిరియములు శొంఠిమున్నగు వానియందుండునది కటుగంధము. ఇంగువ మొదలగు

వానియందుండునది నిర్హారగంధము, అనేక పరిమళములలో కలిసి కల్కాదులందువలె పరిమళించునట్టిది సంహతగంధము. అప్పుడు కాచినందుచేత గుమగుమలాడు నెయ్యియందు మున్నగు వానియందుండునట్టిది స్నిగ్ధ గంధము. ఆవనూనెమున్నగు వానివలె గాటుగలది రూక్షగంధము. వరియన్నము మొదలగు వానియందలిది విశదగంధము. ఇవి గంధభేదములు. ఇంకను ఇట్టులు గంధములను సిద్ధముచేయు విధానములును అందు చాల గలవు.

**19. భూషణయోజనము:** భూషణము లనగా సొమ్ములు. సొమ్ములు పెట్టుకొను తెఱగులను చెప్పునట్టి కళ భూషణయోజనము. అనగా అలంకార యోగమని యర్థము. ఆ భూషణములు సంయోజ్యములు అసంయోజ్యములు అని ద్వివిధము. కంటెలు మున్నగునవి సంయోజ్యములు. ఇట్టి సంయోజ్యములతో మణిముక్తాదులను చేర్చుట సంయోజ్య యోజన మనబడును. మురుగులు కుండలములు మున్నగునవి అసంయోజ్య యోజనములు. ఈ రెండును నేపథ్యాంగ ములే గాని శరీరమునందలి భూషణయోజనమునకు చేరినవి మాత్రము కావట.

**20. ఐంద్రజాలములు:** ఇంద్రము లనగా కన్నులు మొదలగు ఇంద్రియములు. ఇంద్రియములను జాలము చేయునట్టి (అనగా భ్రమపెట్టు) యోగములు గనుక ఇంద్రజాలములు. ఇంద్రజాలములు చెప్పునట్టి కళలు గనుక ఐంద్రజాలములు. మరి కొందరు ఇంద్రుడనగా ఈశ్వరుడు! ఆయన చేయు జాలము (మాయ) లాంటి జాలమును చేయునవి గనుక ఐంద్రజాలములు అని అందురు. ఐంద్రజాలమును తెల్పునట్టి గ్రంథములు సంస్కృత భాషలో ఉడ్డీశతంత్రము జాలార్ణవము ఇంద్రజాల సంగ్రహము మున్నగునవి చాల కలవు. మొత్తము మీద ఈ కళను తాంత్రికులు ఎక్కువగ వృద్ధిచేసిరి. ఐంద్రజాలముల వలన హఠాత్తుగా సైన్యములు దేవాలయములు మున్నగు నత్యద్భుతములను ప్రదర్శించుటచేత చూపరుల చిత్తములు విస్మయాబ్ధిని తేలియాడును. దాన నహంభావ విస్మాపనము గల్గును. గనుక ఇవి అహంభావ విస్మాపనార్థములగు కళలు అట.

**21. కౌచుమారములు:** కుచుమారుడు కన్పెట్టిన సుభగంకరణాది యోగములు

కౌచుమారము లనబడును. ఇయ్యవి ఉపాయాంతరా సిద్ధములగు వానిని సాధించునట్టి యోగములు.

**22. హస్తలాఘవము:** సమస్త కార్యములందును కాలాతిక్రమణము (జాగు) కలుగకుండ నుండుట కవలంబించు చేతి చులకదనము హస్తలాఘవ మనబడును. ఇది క్రీడార్థముగాని విస్మాపనార్థముగాని పనికి వచ్చునట్టి కళ.

**23. విచిత్రశాక యూషభక్ష్య వికారక్రియాపానక రసరాగాసవ యోజనములు:** మన ఆహారము నాల్గు విధములుగ నున్నది. భక్ష్యము, భోజ్యము, లేహ్యము, పేయము అని. అందు భక్ష్యములు నమిలి తినదగిన వస్తువులు, గారెలు మున్నగునవి. భుజింపదగిన అన్నము, వ్యంజనము, (అనగా కూరలు మున్నగునవి) భోజ్యము. శాకములు మున్నగునవి. వ్యంజనములలో చేరినట్టివి శాకములు పది విధములు 1. మూలములు (వేరులు దుంపలు), 2. పత్రములు (ఆకులు), 3. కరీరములు (కాడలు మున్నగునవి), 4. అగ్రములు (కొనలు), 5. ఫలములు (పండ్లు), 6. కాండములు (కొమ్మలు), 7. ప్రరూఢకములు (మొక్కలు మొదలగునవి), 8. త్వక్కు బెరడు మున్నగునవి, 9. పుష్పములు (పూవులు మొదలగునవి), 10. కంటకములు (ముండ్లు) మున్నగునవి, అవి. ఇందు ముల్లంగి మున్నగు దుంపలు మూలశాకమున జేరినవి. తోటకూరలు మున్నగునవి పత్రశాకములు. కాయలు మున్నగునవి కరీరశాకములు. తుమ్మిదళములు చిగుళ్ళు ఆగ్ర శాకములు. గుమ్మడి పండ్లు మున్నగునవి ఫలశాకములు. యవనాళములు మున్నగునవి కాండశాకములు. చిట్టి మున్నగు మొక్కలు ప్రరూఢ శాకములు. దేవదారు చెక్క మున్నగునవి త్వక్ఛాకములు. అరటిపువ్వు మొదలగునవి పుష్పశాకములు. పనస మున్నగునవి కంటకశాకములు. ఇవి శాకములు. ఇక యూషములు. ఇవియును ద్వివిధము. అగ్ని నిష్పాద్యము (నిప్పుమీద పెట్టి కాచదగినది) తదితరము అని. అందులో అగ్ని నిష్పాద్య మగునది యూషము అనబడును. (అనగాకట్టు) ఇదియును ముద్గము, నిర్వ్యాహకృతము అని రెండు తెరగులు. ఖండ ఖాద్యాదులు భక్ష్య వర్గమున జేరును. విచిత్రములగు విధములతో శాకములు యూషములు భక్ష్యములు ఆ పానకములు మున్నగు వానిని జేయుకళ విచిత్రశాక యూషభక్ష్య వికారక్రియ పానకరస

రాగాసవయోజనమనబడును. అనగ్ని నిష్పాద్యమగు పేయము కూడా ద్వివిధము. సంధాన కృతమని తదితరమని. ఇందు సంధానకృతము కూడ ద్రావితమని, అద్రావితమని ద్వివిధము. బెల్లము, చింతపండు, మున్నగు రసవర్గము నీటితో కలిపి పదునుచేసి ద్రవరూపమున సిద్ధము చేయునట్టిది ద్రావితము. దీనినే పానకమనియు నందురు. ఇక ద్రావకౌషధములతో తాళకము మోచా ఫలము మున్నగు వానిని చేర్చి సిద్ధము చేయునట్టిది అద్రావితము. దీనిని వైద్యపరిభాషలో రసము అని వాడుచుందురు. ఆసవ మనగామద్యము. ఆసవ శబ్దముచేత నిట సంధానము సూచింప బడుచున్నది. ఆ ఆసవము కూడ మృదువుగా మధ్యమముగా తీక్షణముగా సంధానముగ యోజనము చేయుట వలన మృదుమధ్యతీక్షణ సంధాన రూపములు సిద్ధమగుచున్నవి. మరియును ఆసవము, మైరేయమని ఆసవమని, శీధువని ముత్తెరగులనున్నది. అందు పక్వములగు చెరుకు రసముతో సిద్ధము చేసినది శీధువనియును, అపక్వములగు చెరుకు రసములతో (అనగా పచ్చి రసముతో) సిద్ధము చేసినది ఆసవ మనియును, ఆరెపువ్వుబెల్లము ధాన్యామ్లము మొదలగువాని సమ్మేళనమున సిద్ధము చేసినది మైరేయమని చెప్పబడును. రాగశబ్ద మిచ్చట లేహ్యమును సూచించును. అట్లే అన్నాదులు కూడాను. రాగము లేహ్యమును ద్రవమును చూర్ణమును నైలవణామ్లకటుస్వాదముగలదియై కొంచెమంత మధుర రసముగలదియై యొప్పుచుండును. ఈ నాలుగు విధములును ఆస్వాద్యకళయందంతర్భూతములుగా నెంచి శరీర స్థిత్యర్థమై ప్రపంచింపబడినవి.

**24. సూచీవానకర్మలు:** సూచీయనగా సూది. సూదులతో నైన వస్త్రాది సంధానకర్మ అనగా గుడ్డ మొదలగు వానిని కుట్టెడు పని సూచీవాన మనబడును. సూచీవానము ముత్తెరుగులు. సీవనమని, ఊతనము అని, విరచనమని. చొక్కాలు రవికెలు మున్నగు వానిని కుట్టెడు పని సీవన మనబడును. త్రుటితములు అగు (అనగా ముక్కలు ముక్కలుగా పగిలిపోయిన) గుడ్డముక్కలు అదుకుట, కూర్పుతీయుట ఊతన మనబడును. బొంతలు, ఆస్తరణములు మున్నగు వానిని కుట్టుట విరచన మనబడును. ఈ మూడింటిలో విరచనము సుప్రసిద్ధము.

**25. సూత్రక్రీడ:** నాళికాసంచార నాళాదిసూత్రములను అన్యథాగా ప్రదర్శించుటయే సూత్రక్రీడయనబడును. నాళికలనగా గొట్టములు. నాళము లనగా ఆ గొట్టములోకి

దూర్చు దారములు. వాటిని బహిరంగముగ త్రెంపియును కాల్చియును ప్రదర్శించి మరల తెగకుండనుండునట్టుగను, కాలకుండ నున్నట్టులుగను ప్రదర్శించుట. ఇది కేవలము క్రీడార్థమగు కళ.

**26. వీణాడమరుకవాద్యములు:** వీణ, డమరుకము, ఈ రెండు సుప్రసిద్ధమగు వాద్యములు. ఈ రెండును వాధిత్రమునం దంతర్గతము లైనను ఇచ్చట తంత్రీ వాద్యమే ప్రధానము. అందుగూడా వీణావాద్యమే. ఇక డమరుకవాద్య మావశ్యకము కొరకు దుర్విజ్ఞేయము గనుక డమరుకమును మోయించునప్పుడు అక్షరములు స్పష్టముగా ఉచ్చరింప బడుచున్నట్టు లుండును. ఇదియును నొక కళగ పేర్కొనబడినది.

**27. ప్రహేళిక:** ఇవి కావ్యకళలలో చేరినవి. విచిత్రగతులు ప్రహేళనము చేయునవి (అభిప్రాయమును సూచించునవి గనుక ప్రహేళికలనబడును) ప్రహేళిక యొక్క లక్షణములిట్లు వివరింపబడినవి.

*వ్యక్తీకృత మప్యర్థం స్వరూపార్థస్య గోపనాత్*

*యత్ర బాహ్యార్థ సంబంధః కథ్యతే సా ప్రహేళికా*

పైకి ఏదో యొక అసంగతమగునర్థము స్ఫురించునట్లు రచించి నిజమగు అర్థమును దాచి బాహ్యార్థ సంబంధ ముండునట్లు చెప్పబడునట్టిది ప్రహేళిక యనబడును అని. ఒక ఉదాహరణము.

*[illegible]॥ [illegible]॥*

*పణ్యస్త్రీతుసావేశ్యా యోజనాతి సపిండితః*

(వనమునందు పుట్టినది వనమునందే (అనగా నీటియందే) వదలి పెట్టబడినది. వనమునందే ఎప్పుడును వసించుచున్నది. పణమునకు వచ్చునట్టిదే కాని వేశ్యమాత్రము కాదు. దీని నెవ్వడెఱుంగునో వాడే పండితుడు. అని ప్రశ్న, ఓడ అని ప్రత్యుత్తరము) ఈ ప్రహేళికలు క్రీడార్థమును, వాదార్థమును ఉపయోగపడును.

**28. ప్రతిమాల:** ఇదియే అన్త్యాక్షరి యని లోకమున ప్రసిద్ధి నొందినది. ఇదియును

క్రీడార్థమును వాదార్థమును ప్రవర్తిల్లుచుండును. ప్రతి శ్లోకమునకును చిట్టచివరను వచ్చునట్టి అక్షరమును అందుకొని ఆ అక్షరమును తాను జదువ దొరకొను శ్లోకమునకు మొదలవచ్చునట్లు చూచికొని ఒకరిమించ నొకరు చదువుట ప్రతిమాల. మాలయనగా వరుస. ఒక మాలకు బదులుగ జరుపు ప్రతివరుస గనుక ప్రతి మాలయని యర్థము. అన్త్యాక్షరియందు ఈ క్రమమే అవలంబింపబడు చుండును గనుక నదియును ప్రతిమాలయనియే చెప్పబడుచుండును.

**29. దుర్వాచక యోగములు:** శబ్దములనుబట్టి అర్థములనుబట్టి అతి ప్రయాసచేత చదువ వీలగునట్టివి దుర్వాచకములు. దుర్వాచకము యొక్క ప్రయోగములు దుర్వాచకయోగములు. వీటిని వాదార్థమును విలాసార్థమును ప్రవర్తింపజేయుచుందురు. ఉదాహరణము కావ్యాదర్శము నందలి దంష్ట్రాగ్ర్యా, అను శ్లోకము. ఆ శ్లోకమిది

*దంష్ట్రాగ్ర్యాప్రాయో ద్రాల్ క్ష్మామంబ్వస్త*
*స్థాముచ్ఛిక్షేప ధుపద్రేట్ క్షిద్భృత్విక్ స్తుత్యోయుష్మాన్*
*సోవ్యాత్సర్పాత్కేతుః॥*

ఆ శ్లోకమునకర్థమిది – దంష్ట్రఅనగాకోర, దంష్ట్రాగ్రము అనగా మునికోర, దంష్ట్రాగ్ర్యా = మునికోర యొక్క విభవముచేత, ప్రాక్ = పూర్వము,ద్రాల్ = శీఘ్రముగా, క్ష్మాం = భూమిని, ఉచ్ఛిక్షేప = లేవనెత్తునో, దేవధృట్క్షిత్ = అసురనాశకుడైనవాడును, ఋత్విక్స్తుత్యః = ఋత్విజులచేత స్తుతింపదగినవాడును, సర్పాత్కేతుః = గరుడధ్వజుడును, అగు, సః = అ ఆదివరాహమూర్తి, వః = మిమ్మలను, అవ్యాత్ = రక్షించుగాక అని.

**30. పుస్తక వాచనము:** అయా కావ్యములలోగల భరతాది కావ్యగతులును శృంగారాది రసములును ఉట్టిపడునట్టులుగ సంప్రదాయ సిద్ధముగ శ్రావ్యముగ స్వరమధురముగ చదువుట పుస్తక వాచన మనబడును. ఇయ్యది శ్రోతలలో అనురాగము కలిగించుట కొరకు ఆత్మ వినోదము కొరకు ప్రవర్తింప చేయబడును.

**31. నాటకాఖ్యాయికాదర్శనము:** నాటకములు సుప్రసిద్ధములే. ఆఖ్యాయికములు ఇప్పటి నవలలను పోలిన గద్య గ్రంథములు. గద్య పద్యాత్మికములగు కావ్యములందును

నాటక ఫక్కియే చాలా విస్తరింపబడి యుండుటవలనను ఆఖ్యాయికలు గద్య ప్రధానము లగుటను, తత్పరి జ్ఞానము నాటకాఖ్యాయికాదర్శనమను పేర ప్రత్యేక కళగా పేర్కొన బడినది. కావ్యదర్శనము అని సామాన్యముగా పేర్కొనక కావ్య విశేషము లగు నాటకములను గైకొని నాటకాఖ్యాయికా దర్శనమని విశేషముగ పేర్కొనుట వానిపైగల ఆదరమును సూచించుటకు. నాటకమునందు పది భేదములు కలవు. అవి ఇయ్యవి. నాటకము, అంకము, వీధి, ప్రకరణము, ఈహామృగము, డిమము, బాణము, వ్యాయోగము, సమవకారము, ప్రహసనము అను నవి నాటక భేదములు.

**32. కావ్యసమస్యాపూరణము:** సమసింపజేయబడునది గనుక సమస్య. కావ్యమనగా శ్లోకము లేక పద్యము. కావ్యము యొక్క సమస్యలు (అనగా పాదములు) గనుక కావ్యసమ్యలు. ఒక పాదము నొసంగి పూర్తిగా దానిని పూరింపుడని ప్రేక్షకులు అడిగినప్పుడు పూరించుటలు కావ్య సమస్యలు. ఇయ్యవి క్రీడార్ధముగను వాదము కొరకును ప్రవర్తిల్లుచుండును. సమస్య యొక్క స్వరూపము కావ్యాదర్శమున వర్ణింపబడినది. అందు "అశ్వాసంజనయతి రాజముఖ్యమధ్యే" అని సమస్య. ఇది మహాభారతోద్యోగ పర్వమునందు శ్రీకృష్ణుని రాయబార వృత్తాంతమును మనస్సులో నుంచుకొని పూరింపవలసినట్లు ఈయబడి నది. పూరకులు దౌత్యేన ద్విరదపురం - అని తక్కిన మూడు పాదము లను పూర్తిచేసినారు. ఆంధ్ర వాఙ్మయమునందిట్టివి పెక్కులు కలవు.

**33. పట్టికావేత్రవానవికల్పములు:** అల్లికకు ఉపయోగించునట్టి పేములు, వెదుళ్ళు మొదలగు నారగల బెత్తముల జాతిని వేత్రము లందురు. వేత్ర ఖండములతో మంచములుగను, ఆసనములు మున్నగు రూపము నను అల్లెడి ఆకృతులను పట్టికలని అందురు. మంచములు, ఆసనములు మొదలగువాని ఆకృతిని పట్టికలను నేయుటయును అందుగల పనితనములును పట్టికాపత్రవానవికల్పములు. ఇయ్యవి సుప్రసిద్ధము లయినవియే.

**34. తల్కుకర్మలు:** వీటినే కొందరు కుందకర్మలనియును, కుట్టకర్మలనియును నందురు. ఇయ్యవి అపద్రవ్యముల నిమిత్తము ఉపయోగింపబడుచుండును.

ఈయపద్రవ్యముల విషయము కామ శాస్త్రమునందు వివరింపబడును.

**35. తక్షణము:** అనగా చెక్కడపు పని. ఇయ్యది కొయ్యలు మొదలగు వానిని చెక్కెడివారు చేయుపని. పరుండుటకు కూర్చుండుటకు ఇండ్లు కట్టుటకు మున్నగు వాని యందు నుపయోగించుచుందురు.

**36. వాస్తు విద్య:** ఇది ఇండ్లు మొదలగు వానిని కట్టెడు విధానమును తెల్పునట్టి శాస్త్రము. శిల్ప శాస్త్రమునందలి అంతర్భాగము. ఈ శాస్త్రము విషయమున నిప్పటికిని అనేక గ్రంథములు ఉత్తమమైనవి కలవు.

**37. రూప్యరత్న పరీక్ష:** కఱగి మొహరు వేసిన ద్రవ్యము రూప్యము అనబడును. అనగా సవరనులు, రూపాయలు, వరహాలు మున్నగునవి. వజ్రములు మణులు ముత్తెములు మొదలగునవి రత్నములు. రూప్యములు రత్నములు అను వానిలోగల గుణదోషములు (మంచి చెడ్డలు) మూల్యా2 మూల్యములు మున్నగు వానిని ఏర్పరించునట్టి పరీక్షను తెల్పునట్టి విద్య రూప్యరత్న పరీక్ష యనబడును. ఇయ్యది వ్యవహారాంగము కావున అర్ధశాస్త్రాదులందు ప్రత్యేకముగా విస్తరించి ఉదాహరింపబడియున్న యది.

**38. ధాతువాదము:** ధరించునది గనుక ధాతువు. పర్వత ప్రదేశము లందు గనులనుండి పుట్టినట్టి లోహములకు ధాతువులని పేరు. బంగారము వెండి రాగి హరితాళము మణిసిల గైరికాదులు అంజనము కాసీసము సీసము ఇనుము హింగుళము గంధకము అభ్రకము మున్నగునవి యన్నియు ధాతువర్గమున చేరినవేయగును. ఈలాంటి లక్షణముల భూములందు, ఈలాంటి ధాతువర్గము అంతర్గర్భితమై యుండునని క్షేత్రముల యొక్క స్వరూప స్వభావవాదులను బట్టియును, మట్టిరాళ్ళు ఇసుక గులక రత్నములు మున్నగు వానిని బట్టియును ధాతువుల యొక్క పాతన శోధనమేళనాది జ్ఞానమును బోధించునట్టి కళకు ధాతువాదమని పేరు. ఈ కళకు చేరిన గ్రంథభాగములు ఏ కొలదియో వైద్యకాది విషయములందు గన్పట్టునేకాని ప్రత్యేక గ్రంథములు ఇప్పుడు లభించుట అరుదుగా నున్నది. ఇయ్యది ఉత్తమోత్తమ మగు కళ.

**39. మణిరాగాకరజ్ఞానము:** స్ఫటికములు, కెంపులు మున్నగు మణులను

రంజింపజేయునట్టి కళ. దీనివలన అర్థమును భూషణ సంపదయును లభించును. పద్మరాగాది మణులు గల గనులను కన్పెట్టుట అర్థార్థమే కదా!

**40. వృక్షాయుర్వేద యోగములు:** ఈ కళ ప్రస్తుతము మన దేశమున బొత్తుగ నంతరించినది. చిరకాలమున ఆయుష్యమును ఆరోగ్యమును వృద్ధిపరచు విధానములను బోధించునది ఆయుర్వేద మనబడును. వృక్షములకు సంబంధించిన ఆయుర్వేదము వృక్షా యుర్వేదము. వృక్షాయుర్వేదమునందలి యోగములు గనుక వృక్షా యుర్వేద యోగములు. వృక్షాయుర్వేదము నాలుగు భాగములుగ నున్నది. మొదటిది రోపణము. దీనియందు వృక్షములను ఉత్పాదనము చేయునట్టి విధానములుండును. రెండవది పౌష్టికము. ఇది ఉత్పాదిల్లజేసిన వృక్షములకు బలమును తేజమును కూర్చు విధానములను తెల్పును. మూడవది చికిత్సా విభాగము. దీనియందు వృక్షములకు సంబంధించెడి వ్యాధులను, వానిని వారింపదగు మార్గములను అందులకు వలయు చికిత్సలు వివరింపబడును. నాల్గవది చిత్రఖండము. దీనినే దోహదకాండమనియు నందురు. దీనియందు అ కాలములందు దోహదపు బలిమిని వృక్షములను చిత్ర విచిత్రముగా పుష్పింపజేయుట ఫలింపచేయుట మున్నగు విషయములు విస్తరింప బడును. ఇట్లే వృక్షాయుర్వేదము రోపణ పుష్టి చికిత్సా వైచిత్ర్యముల నొప్పారుచుండును. ఈ వృక్షాయుర్వేద యోగములు గృహమునందలి ఉద్యానములను పెంచుకొనెడి నిమిత్తమై నాగరులకు పఠింపవలసి యున్నవి.

**41. మేషకుక్కుట లావక యుద్ధవిధులు:** మేషములనగా పొట్టేళ్లు మున్నగునవి. కుక్కుటములు కోళ్ళు. లావకములనగా లావుక పిట్టలు. మేషములు కుక్కుటములు లావకములు వీని యుద్ధవిధులను తెలుపు కళలు మేష కుక్కుటలావక యుద్ధవిధులనబడును. (అనగా పొట్టేళ్ళ పందెములు, కోడి పందెములు, లావక పందెములు అని భావము) ఇది జీవద్యూత విధానమున జేరును. అనగా బ్రతికిన జంతువులతో చేయునట్టి జూదపు పనులలో చేరును. ఇట్టి జూదములందు ఉపస్థానాదు లగు చతురంగములతో యుద్ధముల నొనర్చుటలు క్రీడార్థమును వాదార్థమును నని ఎరుంగదగును.

**42. శుకశారికా ప్రలాపనము:** శుకములన చిలుకలు. చిలుకలు శారికలు (గోరువంక పిట్టలు) వీనిని మాట్లాడునట్లు చేయుకళ శుకశారికా ప్రలాపనము. శుకములు శారికలు మనుష్యభాషణములు నేర్పబడినవై చాటువాక్యములను పఠించుచుండును. నాయికా నాయకులు పరస్పరము చెప్పిపుచ్చుకొను సందేశములను గొంపోయి వినుచుండును. ఇది ప్రసిద్ధమైన విషయమే.

**43. ఉత్సాదనమునందు సంవాహనమునందు కేశమర్దనము నందు కౌశలము:** ఇదియును ఒక కళయే. మర్దనము రెండు విధములు. పాదముల కొరకైనదొకటి. చేతుల కొరకైన దొకటి. అందులో పాదముల కొరకైన మర్దనము ఉత్సాదన మనబడును. చేతు లతో తలంటుట మున్నగునవి (అనగా అభ్యంగన క్రియలు) కేశమర్దన మనబడును. తక్కిన అవయవములకు జేయు మర్దనము సంవాహనము.

**44. అక్షరముష్టికా కథనము:** కవిత్వముజెప్పు సమయములందు అక్షరములను పిడికిటియందువలె గోపనము జేయునట్టి కళ అక్షరముష్టిక యని పేరు. ఇది సాభాసయని, నిరాభాసయని ద్వివిధము. ఇందు సాభాసయే అక్షరముద్ర యనబడును. ఇట్లు అక్షరముద్ర, రహస్యముల నుపనిమంత్రించుటకును సంగ్రహముగ చెప్పి పంపుటకు మాత్రమే. ఆచార్య రవిదత్తుని చంద్రప్రభావిజయ కావ్యమున ఈ కళ విస్తరింపబడినది. ఆ ప్రకరణము చివఱకు ఈ కళకు ఫలశ్రుతి ఇట్లున్నది – శ్లో॥ గహనప్రసన్న సర్వాం కతిపయ సూత్రామిమా మనంతముఖీం అనధీత్యాక్షరముద్రాం వాదసముద్రం పరిప్లవతే – అని అక్షరముద్రకు ప్రాచీన గ్రంథము నుండి యొక్క యుదాహరణము –

*శ్లో॥ మేవృమి కసింకతువృధమకుం భీమూధసవాసు శత*

*నిధక ఆవ్యాః ఫాచైవై శ్యేఆశ్రా భా ఆకామాపౌమాచైవ* – అని.

ఈ శ్లోకమునందు మొదటి పాదమున మేషము మొదలగు ద్వాదశ రాసులును, ద్వితీయ భాగమున ఆ రాసులకు లగ్నము మొదలు కొనిగల మూర్తి, ధన, సహజ, బాంధవ, సుత, శత్రు, కళత్ర, నిధన, ధర్మ, కర్మ ఆయవ్యయ స్థానములును తక్కిన రెండు మూడు పాదములలో ఫాల్గుణము మొదలుకొని మాసనామములును

సూచింపబడినవి.

సాభాసకు అక్షరముద్రయని పేరున్నట్లే నిరాసాభాసయగు అక్షరముష్టికకు భూతముద్రయని మారు పేరున్నది. అష్టావధానము శతావధానము మొదలగువట్టి యవధాన సమయములందు అవధానము చేయువారు ఒకరొకరితో ముద్రలను పట్టుచు చేయునట్టి అవధాన సంజ్ఞలు భూతముద్రయందు చేరును. ఈ భూతముద్రను గుఱించి శారదాతిలకము మున్నగు వానిలో విస్తరించి వ్రాయబడినది. అయిన సంగ్రహ రూపమిది.

*శ్లో॥ ముష్టిః కిసలయంచైవ భటా చారీ పతాకికా*
*పతాకాంకుశముద్రాశ్చ ముద్రా వర్గేషుసప్తసు*
*అంగుళ్యశ్చాక్షరాణ్యేషాం స్వరాశ్చంగుళిపర్వసు*
*సంయోగాదాక్షరం యుక్తం భూతముద్రాః ప్రకీర్తితాః॥ఇతి*

**45. మ్లేచ్ఛిత వికల్పములు:** మ్లేచ్ఛితములనగా అపశబ్దములు. సుశబ్దములతో కూర్పబడినను ఇతరులకు తెలియరాకుండునట్లుగా అపశబ్దములనే భ్రాంతిని కల్గించి క్లిష్టార్ధము కల్గునట్లుగాను సంధిగ్ధార్ధము కలుగునట్లుగాను మర్మముగా భాషించుటలు మ్లేచ్ఛిత వికల్పములు, మ్లేచ్ఛిత వికల్పముల స్వరూపము గ్రహింపబడినది.

*శ్లో॥ దాదేః క్షాంతస్య కాదేశ్చ స్వరయో రుభయోరపి*
*బిందూష్మణోర్విపర్యాసాత్ దుర్బోధమితి సంజ్ఞితం*

*శ్లో॥ అకౌ ఖగౌ ఘజౌ చైవ చటౌ జణౌ తపౌ సమౌ*
*యశౌ రషౌ లసౌ చేతి మూలదే వేయవిచ్యతే॥*

*శ్లో॥ గ్రహనయన వసుసమేతంషడాననాఖ్యాని సాగరా*
*మునయః జ్వలనాంగంతు కళ్ళంగం దుర్లిఖితం గూఢ లేఖ్యమితి॥*

కాని యిట్టివి మనలో ఇప్పటికిని రామభద్రికలు మూల భద్రికలు కాబాసలు, చాబాసలు మున్నగువాని రూపమున అనంతముగా గలవు.

**46. దేశభాషావిజ్ఞానము:** రహస్యములను చెప్పి పంపుటకును తాము

తెలసికొనుటకును ఆయా దేశీయులతో వ్యవహారము నెరపుకొనుటకును నై ఆయా దేశములందలి భాషలును ఆయా భాషలయందలి లిపి క్రమమును ఎఱింగియుండుట ముఖ్యము. ఇదియే దేశ భాషా విజ్ఞానమని చెప్పబడును.

**47. పుష్పశకటిక:** పూవులను నిమిత్తముగా చేసికొని చేయు శకటిక పుష్ప శకటిక యనబడును. ఇది ఆగమములలో విస్తరింపబడినది.

**48. నిమిత్తజ్ఞానము:** నిమిత్తములనగా శకునములు. నిమిత్త జ్ఞానమనగా ధర్మక్షమాసంకేతనములను వెదకుట. ఇది శుభాశుభా దేశ పరిజ్ఞానమే ఫలముగా గలది. అందు అడిగెడి వానికి గుర్తు కల్గుటకై ఇలాంటి చెహరాగల స్త్రీతో నీకు సంగమము కల్గినది అను మున్నగు కామోపహసితా దేశములు మున్నగునవి ఇందుండును. కాని నిమిత్త జ్ఞానము అనునది ఇచ్చట సామాన్యముగా నిర్దేశింపబడినది. దీనిని గురించి జ్యోతిష శాస్త్రమునందు విస్తరించి సెప్పబడినది.

**49. యంత్రమాతృక:** సజీవములు నిర్జీవములునగు యంత్రములను యానాదికము కొరకు కూర్చుట యంత్రమాతృక యనబడును. ఈ శాస్త్రమును విశ్వకర్మ ప్రత్యేకము రచించెనట.

**50. ధారణమాతృక:** సభాస్థానములందు అవధానముతో ఒక్కమారు విన్న గ్రంథమును ధారణజేయు విధానములను బోధించునట్టి శాస్త్రము ధారణమాతృక యనబడును. ధారణయనునది వాగ్దేవి యొక్క మూర్తి. ఆ మూర్తికి వస్తువు (అనగా పదార్థము) నిఘంటువు ద్రవ్యము లక్షణము హేతువు అనునవి. ఈ యైదవయవము లతోను ధారణదేవి రాజిల్లును. దీనిని గుఱించి మంత్ర శాస్త్రముల యందు చాలనద్భుతములు గలవు.

**51. సంపాఠ్యము:** అనేకులు వాదము కొఱకుగాని వేడుక కొఱకుగాని ఒకటిగా చేరి చదువుట సంపాట్యము. సంపాఠ్యమును చదివెడి రీతులు అనేకముగ గలవు. అందు ఒక విధము ఇది – బహుత్ర ప్రచారముగల యొక గ్రంథ సందర్భమును రెండు జట్లుగా నేర్పడి చదువబూనుకొని అందు ముందొక

జట్టువారుపక్రమించుటయును పిమ్మట రెండవ జట్టువారు దాని నందుకొని అశ్రుతపూర్వమైనను సరియే శ్రుతమునువలె చదువుటయును గలది సంపాఠ్యము. ఇయ్యది ఒక విధము అగు స్వస్తి.

**52. మానసకావ్యక్రియ:** మనస్సునగల్గు కావ్యపు ఆలోచనము - అనగా కావ్యవిషయిక చింత, మానస కావ్యక్రియ యనబడును. ఇది ద్వివిధము. దృశ్యచింతనము, అదృశ్య చింతనము అని. మున్ముందొక్కడు కమలాద్యాకృతులతో తీర్చిన వ్యంజనాక్షరములతో శ్లోకమును రచించుచుపోవును. రెండవవాడు ఆ శ్లోకమునకు మాత్రలు సంధులు విసర్గలను జేర్చుచు పూరించుచు పోవలయును. మొదటి వాని శ్లోక రచనము ముగియునప్పటికి రెండవవాని పూరణమును ముగియ వలయును. ఇది యొక విధమగు దృశ్యచింత, అదృశ్యచింత ఆకాశ పురాణమే!

**53. కావ్యక్రియ:** సంస్కృతము ప్రాకృతము అపభ్రంశము మున్నగు సమస్త భాషలలోను కావ్య రచనము చేయు కళ కావ్యక్రియ యనబడును.

**54. అభిధాన కోశము:** నిఘంటువులను ఉపస్థితి చేయుట అభిధానకోశము. అనగా ఏ వస్తువునకు ఏ దేశ భాషలో ఏమి పేరో ఏ పేరు ఏయే దేశాదులలో ఎట్టెట్టి రీతులతో వ్యవహరింపబడు చుండునో నేర్పియుండు కళకు అభిధానకోశ విజ్ఞానమని పేరు.

**55. ఛందోజ్ఞానము:** పింగళకాది నానాభాషా విషయకములగు ఛందః ప్రస్తారక్రమముల నెఱింగి వలయుచో దానియందు కవిత అల్లగల్గి యుండుట.

**56. క్రియాకల్పము:** ఇయ్యది కావ్యరచనము నందలి యొక విధము. దీనినే కొందరు క్రియాగుప్తాది కావ్య రచనమనియు నందురు. కాని యిది యదికాదు. కేవలము కావ్యాలంకార రచనము మాత్రమే ఇందు వెల్లడి యగుచుండును. ఇట్టివి మన అలంకార శాస్త్రమునందు పెక్కు చిత్రగతులతో నొప్పుచు నేయున్నయవి. కాన నిచ్చట విస్తరింప నైతిని.

**57. ఛలితకయోగములు:** ఛలితమనగా కపటము. కపటముతో కప్పిపుచ్చునట్టి

యోగములు అనగా ఒకవిధముగా నున్న వస్తు రూపమును ఇంకొక విధముగా నున్నట్లు భ్రమగల్గించు యోగములు ఛలితకయోగములు అనబడును. ఇవియును ఇంద్రజాలమునందు చేరినట్టివే.

**58. వస్త్రగోపనములు:** ఏమైనను రహస్య వస్తువులను బట్టతో కప్పియుంచి (అనగా ముళ్ళు ఏవియు లేకుండనని భావము) వీవనలు మున్నగు వానితో ఆ బట్ట తొలగునట్లు ఎంతగ విసరినను తొలగకుండు నట్లు చేయుటయును, పొడుగైన గుడ్డలను నానావిధములుగా చిన్న చిన్న ముక్కలుగా చించి కుట్టుటలు మున్నగునవి లేకుండ అతుకు గానరాకుండ మడచి మామూలు బట్టవలె కనబఱచుటయునుచిన్న చిన్న ముక్కలుగా అయినట్లు పెద్ద పెద్ద గుడ్డలును ప్రదర్శించుటయును మున్నగునవి ఇందనేకములున్నవి.

**59. ద్యూత విశేషములు:** దీనిని గుఱించి సవాలక్ష గ్రంథము గల పెద్ద శాస్త్రమే గలదు. కావున నిట విస్తరింపమానితిని.

**60. ఆకర్షక్రీడ:** ఇదియే పాశక్రీడయనియు ననబడును. పెద్ద పగ్గమును గాని గొలుసులను గాని చేతితో పట్టుకొని కత్తులు మున్నగు వానితో నవసరము లేకుండ త్రెంపుటయును త్రెంపిన వానిని ముడివెట్టుటయును మున్నగునవి ఇందుండును.

**61. బాలక్రీడనకములు:** పిల్లలు ఆటలాడుటకును ప్రలోభము నొందుటకును చేయునట్టి చిత్ర విచిత్రములగు బొమ్మలు బంతులు చెండ్లు విగ్రహములు మున్నగు వాని చేయు విధానములు దీనియందు తెల్పబడును. ఇయ్యవి తంత్ర గ్రంథములయం దిప్పటికిని అనేకముగ గానవచ్చుచున్నవి.

**62. వైనయికీజ్ఞానము:** వినయాచారములను బోధించునట్టి శాస్త్రములు – (అనగా గుఱ్ఱములను అలవఱచునట్టి విధానమును బోధించు అశ్వశిక్షా విధానములు) ఏనుగులను వశపఱచుకొను విధులను బోధించునట్టి గజశిక్షా విధానములు మున్నగువానిని బోధించునట్టి శాస్త్రములు – వైనయికీ విద్య లనబడును. వైనయికీ విద్యలను గూర్చిన విజ్ఞానమును కలిగించుకళ వైనయికీ విజ్ఞాన మనబడును.

**63. వైజయికీ విజ్ఞానము:** విజయమనగా గెల్పు. విజయము నే తీరున

సాధింపవచ్చునో జెప్పెడి సంధి విగ్రహ శాస్త్రములు వైజయికీ విద్యలు. వీనిని గుఱించిన విజ్ఞానమును గలిగించునట్టిది వైజయికీవిజ్ఞాన మనబడును. ఇయ్యది అధర్వణ వేదమునందు విస్తరింపబడియున్నది. వైజయకీయ విద్యలు మొత్తము మీద రెండు విధములుగనున్నవి. మొదటివి దైవ్యములు. రెండవవి సాంగ్రామికములు. మొదటి వానిలో అభిచార హోమాదుల వలన శత్రుమారణముల నొనర్చు విధానములు అర్థాత్తు అపరాజితాలు వివరింపబడును. రెండవ దానిలో యుద్ధము మున్నగు వానియందు శస్త్రాస్త్రాదులచేత బాహాబాహిగ గెల్పుగొనునట్టి విధానములు సూచింపబడుచుండును. ఈ రెండవ రకమునకు చేరినవి మానుష్యములు అనబడును.

**64. వ్యాయామికీ విజ్ఞానము:** వ్యాయామము అనగా శరీర పరిశ్రమము. శరీర పరిశ్రమమే ప్రధానముగాగల విద్యలు – (అనగా వేటాడుట మున్నగునవి) వ్యాయామికీ విద్యలనబడును. ఈ విద్యల గురించిన విజ్ఞానము వ్యాయామికీ విజ్ఞానము.

ఇది చతుష్షష్టి కళల యొక్క సామాన్య రూపము అనగా కళా స్వరూప సంఖ్యానము.

